

చైతన్య భగవద్గీత

# చైతన్య భగవద్గీత



స్వామి సుందర చైతన్యానంద



శ్లో॥ యః శృణోతి చ గీతార్థం
కీర్తయత్యేవ యః పరమ్ ।
శ్రావయేచ్చ పరార్థం వై
స ప్రయాతి పరం పదమ్ ॥

గీతార్థమును శ్రవణం చేసేవాడు, గీతా జ్ఞానమును ప్రవచించేవాడు,
గీతా హృదయాన్ని విప్పి చెప్పేవాడు పరంధామమును పొందుతాడు.





శ్లో॥ భారతామృత సర్వస్వమ్
విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్ ।
గీతా గంగోదకం పీత్వా
పునర్జన్మ న విద్యతే ॥

విష్ణు దేవుని ముఖ కమలము నుండి వెలువడిన శ్రీమద్భగవద్గీత
మహా భారతము యొక్క అమృత మయమైన సర్వస్వము.
గీతా గంగోదకాన్ని పానం చేసిన వారికి పునర్జన్మ ఉండదు.



అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్ ।
అస ది త్యుచ్యతే పార్థ న చ త ప్రేత్య నో ఇహ ॥

*అశ్రద్ధయా-హుతం-దత్తం-తపః-తప్తం-కృతం-చ-యత్* 28
*అసత్-ఇతి-ఉచ్యతే-పార్థ-న-చ-తత్-ప్రేత్య-నో-ఇహ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | తత్ | = | అది |
| అశ్రద్ధయా | = | శ్రద్ధ లేకుండా | అసత్ ఇతి | = | అసత్తు అని |
| హుతం | = | చేయబడిన హోమము | ఉచ్యతే | = | చెప్పబడు చున్నది |
| దత్తం | = | ఇవ్వబడిన దానము | ప్రేత్య | = | పరలోకము నందు |
| తప్తం | = | చేయబడిన | నో | = | ఫలము నివ్వదు |
| తపః | = | తపస్సును | ఇహ చ | = | ఈ లోకము నందు |
| కృతం చ | = | చేయబడిన | న | = | ఫలితము నివ్వదు |
| యత్ | = | ఏది కలదో | | | |

**అర్జునా! శ్రద్ధ లేకుండా చేసే యజ్ఞ, దాన, తపస్సులు 'అసత్' అనే చెప్ప బడుతాయి. అది ఇహానికి ఉపయోగ పడదు. పరానికి పనికి రాదు.**

**వ్యాఖ్య**

యజ్ఞ, దాన, తపస్సులు; స్తుతి, నమస్కారాది కార్యాలు శ్రద్ధాన్వితాలు కనుక వాటిలో ఉన్నది 'సత్' అని గ్రహించాము. శ్రద్ధతో చేసే వన్నీ సద్రూపా లైనపుడు, అశ్రద్ధతో చేసి నపుడు, అవే అసద్రూపాలు అవుతాయి. చివరగా, ఈ శ్లోకంలో పరమేశ్వరుడు అదే చెబుతున్నాడు. అశ్రద్ధతో చేసే యజ్ఞ, దాన, తపస్సులు, స్తుతి నమస్కారాదులు 'అసత్' అని చెప్ప బడతాయి ***(అశ్రద్ధయా కృతమ్ అసత్ ఇతి ఉచ్యతే)***.

'సత్' సన్నిధిలో సాగే వన్నీ సత్కర్మలు. అసద్రూప మైనవి అసత్కర్మలు. సత్కర్మలు మంగళకరము. అసత్కర్మలు అమంగళకరము. సత్కర్మలు మోక్ష ప్రదములు. అసత్కర్మలు బంధహేతువులు. కారణం, అసత్కర్మలు పరమేశ్వరుని పొందడానికి సాధన మార్గాలు కావు. వాటిని శ్రమించి చేసినా ఫలితం ఉండదు. పరమేశ్వరుని మార్గానికి భిన్న మైనవి కనుక మరణానంతరము ఫలం ఉండదు. సాధు పురుషుల చేత నిందింప బడినవి కనుక ఇహ లోకానికి కూడా ఉపకరించవు ***(తత్ ప్రేత్య న, ఇహ చ న)***.

శ్రద్ధను ప్రస్తావిస్తూ అధ్యాయారంభంలో అర్జునుడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా తన బోధను అధ్యాయం నిండా నింపి, రజ స్తమస్సులను, అశ్రద్ధను పరిత్యజించి, సాత్త్విక శ్రద్ధతో యజ్ఞ, దాన, తపస్సులను ఆచరించే వాడు అంతఃకరణ శుద్ధిని పొంది మోక్ష సాధనమైన జ్ఞాననిష్ఠకు అర్హు డవుతాడు అని చెబుతూ శ్రద్ధాత్రయ విభాగ యోగాన్ని భగవానుడు సమాప్తం చేస్తున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు శ్రద్ధాత్రయ విభాగ యోగ మనే పదిహేడవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ అష్టాదశోఽధ్యాయః - పద్దెనిమిదవ అధ్యాయము

## మోక్షసన్న్యాస యోగః - మోక్షసన్న్యాస యోగము

**మహద్భాగ్యం**

గీతా భవనంలో చివరి అంతస్థుకు చేరాము. ఇది పద్దెనిమిదవ అధ్యాయము. సంత్ జ్ఞానదేవ్ మాటల్లో చెప్పాలి అంటే కలశాధ్యాయము. అంటే శిఖరాధ్యాయము అని అర్థము.

గీతా జ్ఞానగంగా ప్రవాహం ఒంపు సొంపులను ఒలక బోస్తూ, పదిలంగా ఒక చోట, పరవళ్ళు త్రొక్కుతూ మరొక చోట, దూసుకుంటూ, తోసుకుంటూ ఇంకొక చోట, అలా అలా అలలతో తేలుతూ తూలుతూ సాగి, సాగరంలో ప్రవేశించే చోట నది విశాలంగా కనిపించి నట్లు, అనంత జ్ఞానామృత సాగరంలో ప్రవేశించే ఈ సంగమ స్థానం వద్ద, గీతా జ్ఞానగంగా స్రోతస్విని డెబ్బై ఎనిమిది శ్లోకాలతో నిండిన విశాలమైన మోక్ష సన్యాస యోగంగా దర్శన మిస్తూ ఉంది.

గీతా జ్ఞాన జల ప్రవాహంలో మునుగుతూ తేలుతూ, శుద్ధి పడుతూ, ముక్తికి సిద్ధ పడుతూ, మనం కూడా ఈ మహా ప్రవాహంతో కలిసి పయనించాం. అనంతానంద పయోధిని దర్శించేందుకు, తరించేందుకు, తద్రూప మయ్యేందుకు పరవశించి పరవళ్ళు త్రొక్కుతున్నాం.

గీతా జ్ఞాన జలాలు ప్రసన్న గంభీరమై, ఎంతో అగాధమై ప్రవహిస్తున్నా, ఆ పవిత్ర జలాలలో ప్రవేశించిన వాడు మునిగి పోయిన దాఖలాలు లేవు. ఈత రాని వాడు కూడా మునగకుండా తేలియాడే పవిత్ర అగాధ ప్రవాహాలు గీతా జ్ఞాన జలాలు.

ఏనాడు ఏ పుణ్యం చేసుకున్నామో! గీతా జ్ఞాన గంగలో మునక వేశాం. ఏయే జన్మలలో ఏయే సుకృతాలు దాచ బడ్డాయో! వాటన్నిటి ఫలితంగా గీతా గంగోదకాన్ని తృప్తి తీరా పానం చేశాం. బాహ్యాభ్యంతరాలలో జ్ఞాన జలంతో దివ్యానందాన్ని అనుభవించాం.

ప్రయాణం చివరి దశకు చేరింది. దశలు తెలియని, దిశలు అర్థం గాని మహర్దశ వైపు ప్రయాణం సాగి పోతోంది. ఇది తిరిగి రాని పోక. ఆగదు ఈ ప్రయాణం దివ్యానంద మహాసాగరంలో ప్రవేశించే దాక.

విశ్వానికి వీడుకోలు పలికే సమయ మిది. జన్మలకు చెల్లు చీటి వ్రాసే కాల మిది. గీతా జ్ఞాన జలాలను పానం చేసిన తరువాత ఇంకెక్కడి జన్మలు? ఎక్కడున్నాయి కర్మలు? ***గీతా గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే*** - గీతా జ్ఞాన గంగాజలాన్ని పానం చేసిన తరువాత జన్మలు ఉండవు. కర్మలు మిగలవు. ఈ భాగ్యానికి అందరమూ నోచుకున్నాం. గీతామాత బిడ్డల మైనందుకు తల వంచి తల్లికి నమస్కరిస్తూ, తల్లి ఒడిలో కడతేరి పోతున్నాం.

**అధ్యాయ అభిధాన ప్రసక్తి**

ఇది పద్దెనిమిదవ అధ్యాయము. మోక్ష సన్యాస యోగము. ఇంతవరకు కర్మఫలాలను విడిచి పెట్టడం చూశాం. సర్వ కర్మలను విడిచి పెట్టడం చూశాం. సర్వ ధర్మాలను విడిచి పెట్టడానికి సిద్ధ పడుతున్న దశలో ఇక విడిచిపెట్ట వలసింది, సన్యసించ వలసింది మోక్షమునే అనే విప్లవాత్మక నినాదంతో ఈ అధ్యాయం మన

ముందు కొచ్చింది. మోక్షాన్ని కూడా విడిచి పెట్టేస్తే, ఇక ఆ తరువాత విడిచి పెట్టే దుండదు. పట్టు కొనేదీ ఉండదు. అందుకే ఇది మోక్ష సన్యాస యోగ మైంది.

అదేమిటి? మోక్షాన్ని ఆశించి కదా భగవద్గీతను ఆశ్రయించాం! మోక్షప్రాప్తి కొరకు కదా గీతను అధ్యయనం చేస్తున్నాం! మరి మోక్షాన్ని సన్యసించడం అంటే మోక్షాన్ని చక్కగా విడిచి పెట్టేయడమే కదా! దానికి భగవద్గీత ఎందుకు? గీత నాశ్రయించక ముందు అందరం చేసింది అదే కదా! అనే సంశయం మీకు కలగ వచ్చు. కలగాలనే అలా అన్నాను. నేను అనడం కాదు. ఆ భావం తోనే ఆదిదేవుడు ఉన్నాడు. ఆ భావాన్నే ఆచార్యదేవుడు భాష్యంలో వినిపించాడు.

మోక్ష మనేది ప్రాప్తించే ఉందా? లేక, ప్రాప్తించ బోతోందా? ప్రాప్తించ బోతోంది అంటే మాత్రం అది మోక్షం కాదు. ఎందుకని? ప్రాప్తించ బోతూ ఉంది కనుక. ఏదైతే ప్రాప్తించ బోతూ ఉందో అది ప్రస్తుతం లేనిది. ఇప్పుడు లేనిది మరు క్షణంలో ప్రాప్తిస్తుంది అంటే, ఆ ప్రాప్తించేది ఏదైనా కాలగత మైనది. పరిచ్ఛిన్నంగా ఉన్నది. కాలగత పరిచ్ఛేదానికి సంబంధించింది ఏదీ మోక్షం అయ్యే అవకాశం లేదు. ఎందుకని? కాలగత మైనది నశించి పోతుంది కనుక. మోక్షం కూడా కాలంలో ప్రాప్తించే దైతే మోక్షము కూడా కాలంలో నశించి పోతుంది. నశించేది మోక్ష మెలా అవుతుంది? అదలా ఉంచండి. ఇంతకీ మీరు కోరేది అలా నశించే ముక్తి నేనా?

కాదు. కానే కాదు. మీకు నిత్య ముక్తి కావాలి. నిత్య మోక్షం కావాలి. ఏ ఉపద్రవాలు తెలియని స్థితికి మీరు చేరి పోవాలి. అదే నిత్యమోక్షము. మరి అలాంటిది కాలంలో ఎలా సంప్రాప్త మవుతుంది? నిత్యమై ఉండేదే నిత్యమోక్షము. నిత్యమై ఉండేది ఇప్పుడు కూడా ఉన్నట్లే కదా! మరి ఉన్న దానిని పొందాలనే ఉబలాటం ఏమిటి? ఇదీ సమస్య.

మోక్షం ఉన్నదే. కాని, ఉన్నట్లు తెలియకుండా ఉంది. ఉన్నా, లేనట్లే అనిపిస్తూ ఉంది. బావుంది. ఇప్పుడు చెప్పండి! మనకు కావలసింది మోక్షమా? మోక్షము ఉన్నదే అని తెలియ చేసే జ్ఞానమా? ఆలోచించండి.

లేని దైతే శ్రమించి కర్మ ద్వారా పొంద వచ్చు. ఉన్న దానిని ప్రయత్నించి పొందే దేముంటుంది? ఉన్నది అని తెలిస్తే సరి పోతుంది. అలా తెలియడమే జ్ఞానము. ఈ పని జ్ఞానం ఒక్కటే చేయ గలదు. మరొక సాధనకు ఇది సాధ్యం కాదు. కనుక మోక్షానికి జ్ఞానమే ఏకైక సాధనము ***(బోధః సాక్షాత్ మోక్షైక సాధనమ్)***.

**బంధమోక్షాలు**

మోక్షము అంటే ముక్తి కదా! దేని నుండి ముక్తి? బంధము నుండి. బంధ మేమిటి? దుఃఖాన్ని కలిగించేది ఏదైనా బంధమే. మరి, ముక్తి? బంధము నుండి విడి పడటమే ముక్తి. మళ్ళీ చిక్కుముడి పడింది.

బంధం ఉంది అంటే మోక్షం లేదు. పరస్పర విరుద్ధమైన బంధమోక్షాలు కలిసి ఎలా ఉంటాయి? చీకటి వెలుగులు ఒకే కాలంలో, ఒకే దేశంలో ఉన్నాయని చెప్పడం ఎంత విడ్డూరమో, బంధమోక్షాలు కలిసి ఉంటాయి అనుకోవడం కూడా అంతే విడ్డూరము.

అలాంటప్పుడు మనం ఎక్కడున్నాం? బంధంలో ఉన్నామా? నిత్యమోక్షంలో ఉన్నామా? ఇది సూటి ప్రశ్న.

మనం మోక్షరూపులు గానే ఉన్నాం. అలా కాదు అనుకుంటే మాత్రం మోక్షాన్ని మనం మరచి పోవచ్చు. ఇక బంధ మేమిటి అంటారా? లేనిదే బంధము. లేకనే ఉన్నట్లు కనిపించేది బంధము. కనుక, బంధము అనేది కల్పితము.



ఉన్న దాని యందు లేని దానిని కల్పించడమే బంధము. నేను కాని దాని యందు నేను అనే భావనే బంధము ***(అనాత్మని అహ మితి మతిః బంధః)***. నేను కాని దాని యందు నేను అనే భావన ఎందుకు కలిగింది? అజ్ఞానం వల్ల కలిగింది ***(అజ్ఞానాత్ప్రాప్తః)***. ఉన్నది ఉన్నట్లు తెలియక పోవడం అజ్ఞానము. అంటే, ఉన్న దానికి సంబంధించిన జ్ఞానము లేక పోవడము అజ్ఞానము.

ఉన్నది ఉన్నట్లు తెలియ నపుడు లేనిది ఉన్నట్లు గోచరించే ప్రమాదం ఉంది. త్రాడు త్రాడుగా తెలియ నపుడు త్రాడులో పాము కనిపించి భయశోకాదులను కలిగించే అవకాశం ఉంది. ఉన్న దానికి సంబంధించిన జ్ఞానం లేనపుడు ఉన్నది ఉన్నట్లు తెలియక పోవడం అజ్ఞాన మైతే, ఉన్న దానిలో లేని దానిని ఆరోపించి చూడటం అధ్యాస అవుతుంది.

***అధ్యాసో నామ అతస్మిన్ తద్బుద్ధిః*** - అది కాని దాని యందు అది అనే బుద్ధి అధ్యాస అని శ్రీ శంకరుల బ్రహ్మసూత్ర భాష్యము.

ఇక్కడే కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఉన్నది ఉన్నట్లు తెలియక పోవడము అగ్రహణము, లేదా అజ్ఞానము. లేనిది ఉన్నట్లు గోచరించడము అన్యథా గ్రహణము, లేదా అధ్యాస. అధ్యాస వల్లనే భయశోకాదులు.

ఇప్పుడు మనకు ఏమి కావాలి? భయశోకాదులు తొలగాలి. దానికి మనం ఏమి చెయ్యాలి? కారణమును తెలుసుకొని దానిని తొలగించుకుంటే కార్యాలైన భయశోకాదులు పోతాయి. బావుంది. ఇంతకీ తొలగ వలసింది అధ్యాసయా? లేక అజ్ఞానమా?

మనకు భయశోకాదులు అధ్యాస వల్ల కలుగు తున్నాయని స్పష్టంగా తెలుస్తూ ఉంది. త్రాడు తెలియక పోవడం అనే అజ్ఞానం వల్ల మనకు భయశోకాలు కలగ లేదు. ఉన్న త్రాటిలో లేని పామును చూడట మనే అధ్యాస వల్లనే మనకు భయశోకాదులు కలిగాయి. అవి పోవాలి అంటే అధ్యాస పోవాలి అనుకుంటాం. అందరూ అలాగే అనుకుంటారు. ఏది పోవాలి, ఏది పోతుంది, ఎలా పోతుంది? - అదంతా ముమ్ముందు తెలుసు కుంటాము. కాని, ఏది పోయినా, ఎలా పోయినా, పోగొట్టే శక్తి మాత్రం ప్రమాణానికే ఉంది. ఒక్క వేదాంత శాస్త్రానికే ఉంది. అలాంటి శాస్త్ర ప్రమాణము అధ్యాసను నివారించే కార్యంలో లేదు. ఇది స్పష్టంగా అర్థం కావాలి అని పదే పదే చెబుతున్నాను ***(అధ్యాస నివారణార్థం న శాస్త్ర పఠనం)***. ఎందుకని? వినండి చెబుతా.

అధ్యాసను తొలగించడము అంటే, నాయనా! అది పాము కాదు అని బోధ చేయడం. పాము అనే భావనను తొలగించడం చేత పాము ఉందనే భ్రాంతి వల్ల ఏర్పడిన భయ శోకాదులు నివర్తింప బడతాయి. అంత మాత్రాన అతని సమస్య తీరిందని చెప్ప లేము.

పాము కాదని అతడు అంగీకరించ వచ్చు. ఆ తరువాత, దానిని నీటిధారగా భావించ వచ్చు. గుడ్డ పీలికగా భావించ వచ్చు. భూమి పగులుగా భావించ వచ్చు. మరో విధంగా కూడా భావించ వచ్చు. అర్థమైందా! కారణాన్ని తొలగించకుండా అవాంతరాలను, ఆరోపితాలను తొలగించి సాధించే దేమీ ఉండదు. కనుక, అధ్యాసను నివారించడం కొరకు శాస్త్రం లేదు. మరి, శాస్త్రం ఎలా ప్రమాణము? ఈ క్రింది వాక్యాన్ని జాగ్రత్తగా అవలోకించండి.

### అధ్యాస నివారణార్థం న శాస్త్ర పఠనం; వస్తు నిర్ధారణార్థం శాస్త్ర పఠనం

'ఆరోపితాన్ని తొలగించేందుకు శాస్త్రం లేదు; అజ్ఞానాన్ని నివారించేందుకు శాస్త్రం ఉంది'. అజ్ఞానము నివారింప బడాలి అంటే జ్ఞానం కలగాలి. దేనికి సంబంధించిన జ్ఞానం? ఉన్న దానికి సంబంధించిన జ్ఞానము.

ఉన్నది త్రాడు. ఇది త్రాడు అనే జ్ఞానం కలిగితే, త్రాడుకు సంబంధించిన అజ్ఞానము నశిస్తుంది. అజ్ఞానము నశించ గానే, అజ్ఞానము వలన ఏర్పడిన అధ్యాస కూడా అదృశ్య మవుతుంది. ఈ విధంగా శాస్త్రము ప్రమాణమై మన ప్రధాన సమస్యను పరిష్కరిస్తూ ఉంది.

బంధము కల్పితము అయితే, బంధము నుండి విడి పడటము కూడా కల్పితమే కదా! బంధము లేని దైనపుడు, లేని దాని నుండి మోక్షాన్ని పొందడ మేమిటి? ఇదే బంధ విముక్తి. బంధ విముక్తి అంటే బంధము నుండి విడి పడటము కాదు. బంధమే లేదని తెలుసు కోవడము. ముక్తి అనేది ప్రత్యేకంగా పొందేది కాదు. నేను నిత్య ముక్తుడను అయ్యే ఉన్నాను అని అర్థం చేసుకోవడం. ఈ విధమైన జ్ఞానంతో పారమార్థిక దృష్టి ఏర్పడితే, ఆ తరువాత బంధము లేదు. ముక్తీ లేదు. బంధము ఉంటేనే ముక్తి. బంధము లేని నీకు ముక్తి ఎలా వస్తుంది? మోక్ష మెలా వస్తుంది? నీవు నిత్యముక్తుడవు. బంధముక్తులకు అతీతుడవు. కనుక నువ్వు ముముక్షువూ కాదు; మోక్షాన్వేషణ లోనూ లేవు.

నువ్వు ముముక్షువు అయితేనే మోక్షాన్ని కోరుతావు. మోక్షాన్ని ఎందుకు కాంక్షిస్తున్నావో తెలుసా? నిన్ను నీవు బద్ధుడిగా భావించు కుంటున్నావు కనుక. నిజంగా నీకు బంధ ముందా? లేదని ఇప్పుడే కదా అర్థం చేసుకున్నాము! మరి, బంధం లేనపుడు ముక్తి మాత్రం ఎలా ఉంటుంది? కనుక నీకు బంధమూ లేదు, ముక్తీ లేదు. బంధముక్తులు రెండిటికీ నీవు అతీతమైన వాడివి.

*బంధ ముక్త్యతీతం పరం సుఖం ।*
*విందతీహ జీవస్తు కేవలః ॥*

'బంధముక్తులకు అతీత మైనది, అనంత మైనది, ఆనంద స్వరూప మైనది అయిన అఖండాత్మను, ఇక్కడే ఇప్పుడే అది కూడా తన స్వరూపము గానే జ్ఞాని తెలుసు కుంటాడు' అని రమణమహర్షి ఉపదేశ సారము.

*న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః ।*
*న ముముక్షుః న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా ॥*

నిరోధము లేదు, ఉత్పత్తి లేదు; బద్ధుడు లేడు, సాధకుడు లేడు; ముముక్షువు లేడు, ముక్తుడు లేడు - ఇదియే పరమార్థ తత్త్వము అన్నది అమృతబిందూపనిషత్తు. ఈ ఉపనిషత్తు మంత్రాన్ని శ్రీ శంకరుల పరమ గురువులైన శ్రీ గౌడపాదాచార్యులు తమ మాండూక్య కారికా భాష్యంలో వ్రాశారు. ఈ మంత్రము గౌడపాదుల కారిక గానే ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందింది.

నీవు మోక్ష రూపుడవు. సత్య జ్ఞానానంద స్వరూపుడవు. నిత్య ముక్తుడవు. బంధము లేని వాడివి. బంధమే తెలియని వాడివి. ఎప్పుడూ బద్ధుడవు కావు. ఇప్పుడూ బద్ధుడవు కావు. మరి బంధ మెందు కొచ్చింది?

**మం॥ మోక్షాపేక్షా సంకల్పో బంధః**

నాకు మోక్షము కావాలి అనే ఆలోచనే బంధము అన్నది నిరాలంబోపనిషత్తు. ముక్తుడవే అయి ఉన్న నీకు బంధ మెలా వస్తుంది? ఎలా ఉంటుంది? ఉంది అనుకుంటే ఉంటుంది. లేదు అనుకుంటే? లేకుండా పోతుంది.

బంధము ఎప్పుడైతే లేదో మోక్షము కూడా లేదు. బంధము లేనిదే అని అర్థమైంది కదా! ఇక బంధ ప్రసక్తి ఎందుకు? వదలి పెట్టేయ్! వదిలేశావా? ఇదే బంధ సన్యాసము. బంధమే లేనపుడు ఇక మోక్ష మెవరికి?





మోక్షమూ లేదు. ఇదే మోక్ష సన్యాసము. ఇదీ యోగమే. మోక్ష సన్యాస యోగము. గీతలో పద్దెనిమిదవ అధ్యాయము.

**ఆఖ్యాయిక**

సుదూరం నడచి అలసి పోయిన ఒక బాటసారి దారిలో కనిపించిన ఒక నదిని సమీపించాడు జలపానం చేయడానికి. దోసిలి లోకి నీళ్ళు తీసుకున్నాడు. అతడు నీటిని పానం చేస్తున్న చోటే నదీ తీరంలో ఒక పెద్ద వృక్షం శాఖోపశాఖలుగా విస్తరించి ఉంది. ఒక కొమ్మ చివర బల్లి ఒకటి ఉంది. ఆ బల్లి ప్రతిబింబము బాటసారి దోసిలి లోని నీటిలో ప్రతిఫలించింది. తీరా నీటిని నోటిలో పోసుకుంటున్న సమయంలో బల్లిని దోసిలిలో అతడు అస్పష్టంగా చూశాడు. ఈ లోగా నీళ్ళు నోటిలో పోసుకోవడం, మ్రింగేయడం జరిగింది. కాని, బల్లి ప్రతిబింబాన్ని బింబము గానే బాటసారి భ్రమించాడు.

ఆ క్షణం నుండి అతడికి దిగులు పట్టుకుంది. బల్లి కడుపులో ఉంది. బ్రతుకు ఏమవుతుందో! ఇదే ఆవేదన. ఇదే ఆలోచన. ఎందరు వైద్యులకు చూపెట్టినా, అతనిలో అలాంటి దోష మేమీ లేదని చెబుతారు. అయినా, అతని మనస్సు శాంతించడం లేదు. రోజు రోజుకి మనిషి కృశించి పోతున్నాడు.

చివరగా, ఒక వైద్యుడు ఇతణ్ణి బాగా పరీక్షించి చూశాడు. ఇతడి సమస్య ఆ వైద్యుడికి అర్థమై పోయింది. నాయనా! నువ్విక బాధ పడకు. నీ అదృష్టం కొద్ది నా చేతిలో పడ్డావు. ఇలాంటి వాటిని ఎన్నిటినో నేను నయం చేశాను. రెండు నెలలు బాధ పడ్డావు. ఒక్క రోజు నిదానించు. నిరీక్షించు. నీ సమస్య పరిష్కరింప బడుతుంది. అని చెప్పి వెళ్ళాడు వైద్యుడు.

మరునాడు చికిత్స ప్రారంభ మైంది. వైద్యుడు తాను తెచ్చిన రసాన్ని రోగి చేత త్రాగించాడు. ఐదు నిముషాలు గడిచింది. అంతే. రోగికి డోకు వచ్చింది. నిమిషం కాగానే మళ్ళీ వమన మైంది. ఇలా ఐదు నిముషాల్లో మూడు నాలుగు సార్లు వాంతి చేసుకోవడం జరిగింది. ఐదవసారి వమనం కాగానే, వైద్యునితో సహా కుటుంబీకు లందరూ 'కక్కేశాడు - వచ్చేసింది' అని చప్పట్లు చరుస్తూ ఆనందంతో గంతు లేశారు. రోగి కళ్ళు తెరిచి చూశాడు. అతడు వాంతి చేసుకున్న వమన పదార్థంలో బల్లి చచ్చిపడి ఉంది.

రోగి హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. వైద్యుణ్ణి అభినందించాడు. పెద్ద గానే సంభావన అందించాడు.

'డాక్టరు గారూ! ఎంతిచ్చినా మీ ఋణం తీర్చుకో లేను. నాకు పునర్జన్మ నిచ్చారు. బ్రతుకుతా నని నేను అనుకోలేదు. అంతా మీ చలువ. ఎందరో వైద్యులు నాకు వైద్యం చేశారు. ఎంతో ఖర్చు చేశాము. ఎవ్వరూ నా రోగాన్ని బాగు చేయలేక పోయారు. మీరు బాగు చేశారు. మీకు ఎలా కృతజ్ఞతలు తెలియ చేయాలో నాకు అర్థం కావడం లేదు' అన్నాడు రోగి.

వైద్యుడు రోగి మాటలకు సంతసించి, 'నాయనా! నీ దురదృష్టం వల్ల బల్లి నీ కడుపు లోకి వెళ్ళింది. నీ అదృష్టం బాగుండి నువ్వు నా చేతిలో పడ్డావు. ఇలాంటి వైద్య చికిత్సలో నేను ఆరితేరిన వాణ్ణి కనుక బల్లిని బయట పడేయ గలిగాను' అన్నాడు వైద్యుడు.

'డాక్టరు గారూ! మీరు ఈ మందు నిన్ననే ఇచ్చి ఉంటే, నా సమస్య ఇరవై నాలుగు గంటల ముందే పరిష్కరింప బడేది కదా?' అని విచిత్రమైన ప్రశ్న వేశాడు రోగి.

వైద్యుడు నవ్వుతూ, 'నాయనా! నేను మాత్రం కావాలని ఆలస్యం చేశానా? అది సామాన్యమైన ఔషధమా!

దానిని తయారు చేయడానికి ఆ మాత్రం సమయం పడుతుంది. అది మూలికా వైద్యం. వేసవి కాలమైతే ఆ మూలికలు (బల్లులు) ఎక్కడ అంటే అక్కడే విరివిగా దొరుకుతాయి. శీతాకాలం కావడం చేత వాటి కోసం అన్వేషించ డానికి సమయం పట్టింది. ఎలాగో దొరికింది. పట్టేశాను. నీ సమస్య పరిష్కృత మైంది' అని చెప్పి వైద్యుడు సంభావన పుచ్చుకొని నిష్క్రమించాడు.

ఇంతకీ రోగికి సమస్య ఉందా? పరిష్కారం అవసరమా? ఉంది అనుకుంటే ఉంది. రెండు నెలల కాలం చెక్కు చెదరకుండా బల్లి కడుపులో కదుల్తూ ఉంటుందా? ఉందనుకునే వారికి ఉంటుంది. ఇదే బంధం.

మరి, బల్లి బంధం నుండి రోగి విడుదల పొందినట్లే కదా! అతనికి బంధ విముక్తి జరిగినట్లే కదా! ఇదే మోక్షము. బంధము ఆరోపితము. స్వకల్పితము. మోక్షము వైద్యుని చాతుర్యము. బల్లిని పట్టుకొచ్చి వమన పదార్థంలో పడేసి, రోగి కడుపులో నుండి పడింది అని చెప్పడం, రోగి శాంతించడము - ఇదే మోక్షము. వాస్తవానికి బంధమూ కల్పితమే. మోక్షమూ కల్పితమే. అంతా రోగి చిత్తము లోనే ఉంది. బంధ మైనా, మోక్ష మైనా చిత్తవృత్తుల లోనే పెనవేసు కుంటుంది. జీవి నిత్యముక్తుడు. బంధమోక్షాలు మనో కల్పితాలు.

మం॥ **చిచ్చైత్య కలితో బంధః తన్ముక్తిః ముక్తి రుచ్యతే ॥**

చిత్తవృత్తులలో తగులు కోవడమే బంధము. వాటి నుండి విముక్తిని పొందడమే మోక్షము అని మహానారాయణోపనిషత్తు.

**పద్దెనిమిదవ అధ్యాయము**

***విముక్తశ్చవిముచ్యతే*** - ఎవడు నిత్య ముక్తుడో, వాడే కల్పిత బంధము నుండి విడిపడి ముక్త డవుతున్నాడు అని ఉపనిషత్తు. ముక్తుడే ముక్త డవుతున్నాడు అని దాని అర్థం. ఈ విషయానికి అద్దం పట్టిన గీతా శాస్త్రము యొక్క తాత్పర్యము పద్దెనిమిదవ అధ్యాయంలో సమాప్తం కావాలి. అంతేకాదు. సమస్త వేదార్థం కూడా ఇదే కనుక, పదిహేనవ అధ్యాయం పీఠికలో మనం చెప్పుకున్నట్లు వేదార్థాన్ని కూడా ఇక్కడ సంపూర్ణము గావించ వలసి ఉంది. ఇదే ప్రధాన విషయంగా ఈ అధ్యాయము ప్రారంభించ బడుతూ ఉంది ***(సర్వస్యైవ గీతా శాస్త్రస్య అర్థః అస్మిన్ అధ్యాయే ఉపసంహృత్య సర్వశ్చ వేదార్థః వక్తవ్య ఇత్యేవ మర్థః అయం అధ్యాయః ఆరభ్యతే).***

సమస్త మైన కర్మలు, నదులు సాగరంలో విలీన మైనట్లు, జ్ఞానము నందే విలీన మౌతాయని గీతాచార్యుడు బోధించాడు *(4 వ అ - 33 వ శ్లో)*. సర్వ భావాలు ఉపసంహరింప బడే ఈ పద్దెనిమిదవ అధ్యాయము పూర్ణ రూపమై విలసిల్లుతూ ఉంది. పద్దెనిమిది సంఖ్య ఆర్ష విజ్ఞానంలో పూర్ణ రూపము. పద్దెనిమిది సంఖ్య ప్రాశస్త్యాన్ని శాస్త్రంలో అనేక చోట్ల మనం చూడ వచ్చు.

వేదాంతము అనబడే ఉపనిషత్తులలో ప్రథమం అని చెప్పబడే ఈశావాస్యోపనిషత్తు పద్దెనిమిది మంత్రా లతో శోభిస్తూ, పద్దెనిమిదవ సంఖ్య వైభవాన్ని చెప్పకనే చెప్పింది.

నాలుగు వేదాలలో దివ్యంగా కీర్తింప బడిన పురుష సూక్తము పద్దెనిమిది మంత్రాలతో శోభిస్తూ ఉంటే, ఆగమ శాస్త్రానుసారం దేవాలయానికి పద్దెనిమిది మెట్లు గోచరిస్తున్నాయి. పద్దెనిమిది మెట్లు ఎక్కితే పరమేశ్వ రుని, లేదా పరమేశ్వరి దర్శన మవుతుంది. అలాగే పద్దెనిమిది సాధన సోపానాలను అధిరోహిస్తే జీవుడు బ్రహ్మానుభూతిని పొందుతున్నాడు అన్నది శాస్త్రం.

***దృశ్యం దేహం చ వాగాది శ్రోత్రాదీంద్రియ పంచకమ్ ,***
***ప్రాణాది పంచకం చైవ తథాన్తః కరణ మేవ చ ॥***





***ముక్తి సాధస్య సోపానాః అష్టాదశ ఇతీరితాః***
***ఏతాన్క్రమేణ చారుహ్య బ్రహ్మభూయాయ కల్పతే ॥***

దృశ్యమైన విషయ ప్రపంచము ఒకటి, దేహము ఒకటి, కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు, ప్రాణాలు ఐదు, అంతఃకరణ మనే మనస్సు ఒకటి - ఈ పద్దెనిమిది ముక్తి సాధన సోపానాలు. వీటిని క్రమంగా దాటిన వాడు తానే బ్రహ్మము అని తెలుసుకుంటాడు. ఈ పద్దెనిమిది సోపానాలు ప్రకృతి, లేదా క్షేత్ర స్వరూపము. దానిని దాటిన వాడు తానే క్షేత్రజ్ఞు డని, పురుషుడని తెలుసు కుంటాడు. అతని వైభవమే పద్దెని మిది మంత్రాలలో పురుష సూక్తంగా కీర్తించ బడింది.

పురుష సూక్తంలో పద్దెనిమిది మంత్రాలతో కీర్తించ బడిన పురుషుడే గీతలో పద్దెనిమిది శ్లోకాలతో స్థితప్రజ్ఞుడుగా కీర్తింప బడ్డాడు.

గీతలో అధ్యాయాలు పద్దెనిమిది అయితే, గీతను తన గర్భమున దాచుకున్న మహాభారతము పద్దెనిమిది పర్వాలతో శోభిస్తూ ఉంది. ఏ కురుక్షేత్ర యుద్ధభూమిలో గీత బోధించ బడిందో, ఆ మహాభారత యుద్ధము పద్దెనిమిది రోజులు నడిచింది. అంతేకాదు, ఆ రణరంగంలో ఇరు వర్గాల లోని అక్షౌహిణులు కూడా పద్దెనిమిదే. అసలు అక్షౌహిణి అనేదే పద్దెనిమిదవ సంఖ్యతో విరాజిల్లుతూ ఉంది.

ఒక అక్షౌహిణి అంటే యుద్ధ రంగమున చతురంగ బలాల సంఖ్య. చతురంగ బలాలు అంటే రథ, గజ, తురగ, పదాతులు. పదాతులు అంటే పదములతో, అంటే సదా కాళ్ళతో నడిచే వాళ్ళు, లేదా కాల్బంట్లు అని అర్థము.

ఒక అక్షౌహిణిలో రథాలు ఇరవై ఒక్క వేల ఎనిమిది వందల డెబ్బై ఉంటాయి. గమ్మత్తు ఏమిటంటే, ఈ మొత్తం అంకెలను కూడితే అది మళ్ళీ పద్దెనిమిది అవుతుంది **(21,870 = 18)**.

రథాల లాగే గజములు, అంటే ఏనుగులు కూడా ఇరవై ఒక్క వేల ఎనిమిది వందల డెబ్బై ఉంటాయి. ఇది కూడా పద్దెనిమిది వస్తుంది.

ఇక ఒక అక్షౌహిణిలో అరవై ఐదు వేల ఆరు వందల పది గుఱ్ఱాలు ఉంటాయి. వాటిని కూడినా పద్దెనిమిదే వస్తుంది **(65,610 = 18)**. ఇక చతురంగ బలాలలో చివరిది పదాతులు, లేదా కాల్బంట్లు. ఒక లక్ష తొమ్మిది వేల మూడు వందల యాభై పదాతు లుంటాయి. ఈ అంకెలను కూడినా పద్దెనిమిదే వస్తుంది **(1,09,350 = 18)**.

***అంబ! త్వా మను సంధధామి*** - అమ్మా! నిన్ను పదే పదే ధ్యానిస్తున్నాను అని ఏ గీతామాతను 'అంబ' అని కీర్తిస్తున్నామో, అట్టి గీతమ్మ పద్దెనిమిది అధ్యాయాలను కలిగి ఉంటే, మహేశ్వరి అయిన అంబ పద్దెనిమిది హస్తాలతో శోభిస్తూ ఉంది.

సృష్టికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణంగా శోభిస్తున్న పరమాత్మ నిమిత్త కారణంగా భగవంతుడని, ఉపాదాన కారణంగా భగవతి అని కీర్తింప బడుతున్నా, వీరి పురాతన వైభవాన్ని నిత్య నూతనంగా వర్ణించి, వివరించి చెప్పే పురాణాలు కూడా పద్దెనిమిది. పురాణాలే కాక ఉప పురాణాలు కూడా పద్దెనిమిది. అసలు మహాభారతానికి 'జయ' అనే పేరు ఉండటానికి కారణం కూడా సాంఖ్య విధి ననుసరించి పద్దెనిమిది సంఖ్యయే.

సంఖ్యా శాస్త్రాన్ని అనుసరించి ('క - ట - ప - యాది - సంజ్ఞా') 'జ' అక్షరానికి సంఖ్యా విలువ ఎనిమిది కాగా, 'య' అక్షరానికి ఒకటి సంఖ్యా విలువ. సంస్కృత అక్షరాలకు సంఖ్యా విలువను కనుగొనిన తరువాత,

సంఖ్యాశాస్త్ర విధిని అనుసరించి, అంకెలను త్రిప్పి పఠించాలి. అది సంఖ్యా విధి. 'జ' అక్షరానికి ఎనిమిది, 'య' అక్షరానికి ఒకటి రావడం చేత రెండిటిని కలిపితే ఎనభై ఒకటి వస్తుంది. దానిని త్రిప్పి చదివితే పద్దెనిమిది అవుతుంది. ఈ విధంగా 'జయ' గ్రంథము అని చెప్పబడే మహాభారత గ్రంథమే పద్దెనిమిది సంఖ్యతో శోభిస్తూ ఉంది. ఇలాంటి పద్దెనిమిది సంఖ్యా వైభవము విలసిల్లే మోక్ష సన్యాస యోగము అనే పద్దెనిమిదవ అధ్యాయము వద్ద ప్రస్తుతం మనం చేతులు జోడించి నిలబడి ఉన్నాం.

**అధ్యాయ సంగతి**

భగవద్గీత లోని పద్దెనిమిది అధ్యాయాలలో శ్లోకపరంగా చూస్తే ఇదే పెద్ద అధ్యాయము. ఈ అధ్యాయ 'సంగతి'ని, అంటే అధ్యాయ విషయాన్ని ప్రత్యేకించి చెప్పుకోవడానికి ఇక్కడ క్రొత్తగా చెప్పేందంటూ ఏమీ లేదు. గడచిన అధ్యాయాలలో చెప్పిన విషయాన్నే సారభూతంగా ఈ అధ్యాయంలో తెలియ చేయడం జరిగింది ***(సర్వేషు అతీతేషు అధ్యాయేషు ఉక్తః అర్థః అస్మిన్ అధ్యాయే అవగమ్యతే ).*** అందుచేత దీనిని సంక్షిప్తగీత అని అంటారు. ఈ అధ్యాయాన్ని ఏకాధ్యాయీ గీత అని కూడా అంటారు. అంటే, గీతా తాత్పర్య మంతా ఈ ఒక్క అధ్యాయం లోనే లభిస్తుంది అని అర్థము. గడచిన అధ్యాయాల లోని విషయము నంతా సంక్షిప్తం చేసి, సింహావలోకన న్యాయము ననుసరించి భగవంతుడు బోధించడం జరిగింది.

**సింహావలోకనము**

ఒక విషయాన్ని ప్రవచించిన తరువాత, దానిని ఉపసంహరించే సమయంలో చెప్పిన విషయా న్నంతా సంక్షేపంగా పునరాలోచన చేయడాన్ని సాధారణంగా 'సింహావలోకనము' అంటారు. ఇది సంకుచితమైన నిర్వచనము. దీనిని ఆంగ్లంలో 'రికాపిచ్యులేషన్' అంటారు. దీనికి, సింహావలోకనానికి భూమ్యాకాశాల కున్నంత అంతరం ఉంది.

సింహావలోకనము అనేది న్యాయము. న్యాయము అంటే, సత్య నిర్ణయము చేయుటకు సహకరించే వాదము అని చెప్పుకో వచ్చు. ఒక విషయాన్ని సమగ్రంగా పరిశీలించి విశ్లేషించడం ద్వారా మనస్సు ఆ విషయాన్ని నిర్ణయించుటకు శక్తిని పొందుతుంది. అలా సత్య నిర్ణయము నందు మనస్సుకు సహకరించేది న్యాయము.

అస్పష్ట మైనది న్యాయము ద్వారా సుస్పష్ట మవుతుంది. వేదాంత శాస్త్రము కేవలము వాదానికి, మేధస్సుకు అంతు చిక్కేది కాదు. ***నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహునా శ్రుతేన -*** కేవలం ప్రవచనాల చేత ఆత్మ పొంద బడేది కాదు. ధారణా శక్తి వల్ల గాని, అనేక విధాల శ్రవణం చేయడం వల్ల గాని ప్రాప్తించదు అని ముండకోపనిషత్తు *( 3 - 2 - 3).*

ప్రవచనాలకు, మేధస్సుకు అందని ఆత్మజ్ఞానము సంప్రదాయము తెలిసిన గురువు ప్రామాణికంగా బోధించి నపుడే అర్థ మవుతుంది. ***నైషా తర్కేణ మతి రాపనేయా ప్రోక్తాన్యే నైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ -*** ప్రేష్ఠా! నాయనా! ఆత్మజ్ఞానము తర్కము చేత పొంద బడదు. ఆత్మసాక్షాత్కారము పొందిన వాడు ఉపదేశించి నపుడే అది అర్థ మవుతుంది అని కఠోపనిషత్తు *(2 - 9).* కేవలం వాదానికి లభ్యం కాని ఆత్మజ్ఞానము, సద్గురువు ప్రామాణికంగా వాదాన్ని తోడు చేసుకొని బోధించి నపుడే అర్థ మవుతుంది. గురుబోధకు వాదం సహకరిస్తుంది. వాదానికి న్యాయాలు ఉపకరిస్తాయి. ఇక్కడే న్యాయానికి న్యాయం చేకూరుతుంది.

**ఉక్తం** అంటే చెప్ప బడింది. **అనుక్తం** అంటే చెప్ప వలసిన విషయంలో కొంత చెప్ప వలసి ఉన్నది. ఈ విషయాలను మదిలో ఉంచుకొని సింహావలోకన సమయంలో బోధకుడు బోధించాలి. అప్పుడే **ఉక్తం** స్ఫూర్తిని నింపుకొని **సూక్తం** అవుతుంది.



దీనిని శాస్త్రంలో 'అనువాద ప్రక్రియ' అంటారు. చెప్ప వలసింది పూర్ణంగా చెప్పడం జరిగిందా? లేక చెప్ప వలసింది ఇంకా ఏదైనా మిగిలి ఉందా? చెప్పిన విషయంలో కూడా స్పష్టత కోసం మరి కొంత చెప్ప వలసినది ఏమైనా ఉందా? ఈ విషయాలన్నీ మనస్సులో మదింపు వేసుకొని బోధను సమాప్తి చేసే సమయంలో అంతవరకు ప్రవచించిన విషయాన్ని సంక్షేపంగా పునః బోధించడము అనువాదము అంటారు. ఈ విధమైన ప్రక్రియను ప్రకాశింప చేసేదే సింహావలోకన న్యాయము.

పద్దెనిమిదవ అధ్యాయము, గడచిన అధ్యాయాలలో ప్రవచించిన విషయాన్నంతా సంక్షేపంగా సింహావలోకన న్యాయ పరిధిలో బోధిస్తుంది అని చెప్పిన విషయం ఇప్పుడు అవగత మైందని భావిస్తాను. మరి కొంత స్పష్టత కోసం దీని అర్థాన్ని కూడా చెప్పుకుందాం.

'సింహావలోకనము' అనగానే ఇందులో మనకు రెండు పదాలు తెలుస్తున్నాయి. ఒకటి 'సింహము'. రెండవది 'అవలోకనము'. అవలోకనము అంటే 'చూచుట' అని అర్థము. సింహావలోకనము అంటే సింహము చూచినట్లు చూడటము అని అర్థము.

గేదె తల వంచుకొని ముందుకు నడుస్తుంది. గుఱ్ఱం తలను పైకెత్తి పరుగు పెడుతుంది. గోమాత తలను ఊపుకుంటూ కదుల్తుంది. కాని, వెనుకకు తిరిగి చూస్తూ నడిచేది సింహము ఒక్కటే. ఇదే సింహావలోకనము. ఈ విషయాన్ని న్యాయముగా నిర్ణయించి, సంప్రదాయ కర్త లైన మహర్షులు బోధనా ప్రక్రియను, లేదా బోధనా విధిని సుగమం చేశారు.

నది ప్రవహిస్తూ ముందుకు సాగినట్లు, విషయాన్ని ప్రసంగిస్తూ ముందుకు సాగే బోధకుడు శ్రోతలను ప్రభావితం చేయ లేడు. ప్రభావితం చేయ లేడు సరి కదా, మనస్సును సందేహాలతో నింపేస్తాడు. తాను బోధించిన విషయము శ్రోతలకు అర్థ మైందా లేదా అనే విషయంలో వక్తకు సందేహం ఉండ కూడదు. ఈ పరిస్థితి తలెత్తకుండా వక్త బోధనా దశ లోనే జాగ్రత్త పడాలి. సింహావలోకన న్యాయాన్ని అనుసరిస్తూ ప్రసంగించాలి.

సింహావలోకనం అనేది విషయ మంతా పూర్తి అయిన తరువాత ప్రయోగించ వలసిన ప్రక్రియ కాదని ఇప్పటికే మీకు అవగతమై ఉంటుందని భావిస్తున్నాను. బోధ పూర్తి అయిన తరువాత సింహావలోకనము ఎలాగూ జరగాలి. కాని, బోధ సాగుతున్న సమయంలో కూడా సమన్వయ ప్రక్రియగా నడుస్తూనే ఉండాలి.

బోధ యొక్క కేంద్ర విషయం ఒక్కటే అయినా, అది అనేక ఉప విషయాలను వివరిస్తూ ముందుకు సాగుతుంది. వాటి మధ్య ఎక్కడెక్కడ అవసరమో అక్కడక్కడ సింహావలోకన న్యాయాన్ని అనుసరిస్తూ శ్రోతకు విషయాన్ని సుగ్రాహ్యం చేస్తూ పోవాలి. ఇది పునరుక్తి కాదు. ఇక్కడ మరొక న్యాయం ముడిపడి ఉంది. అది అర్థ మైతే పునరుక్తి లేదని తెలుస్తుంది. అదే 'స్థూణ ఖనన న్యాయము'. 'స్థూణ' అంటే స్తంభము. 'ఖననము' అంటే పాతి పెట్టడము. ఒక స్తంభమును, అది రాతి దైనా, కొయ్య దైనా, స్తంభమును పాతే టప్పుడు అది గట్టిగా పాతుకున్నదా, లేదా అని తెలుసుకోవడానికి, పాతిన స్తంభాన్ని అటు ఇటు కదిపి చూస్తాము. దృఢంగా పాతుకు పోయి కదలకుండా ఉంటే వదిలేస్తాము. కాస్త కదిలితే, మళ్ళీ దానిని దృఢంగా పాతుకునేలా చేస్తాము. దీనిని 'స్థూణ ఖనన న్యాయము' అంటారు. ఈ న్యాయాన్ని అనుసరించి బోధ మధ్యలో సింహావలోకనము జరుగుతూ ఉండాలి. ఇందులో పునరుక్తి దోషము లేనే లేదు. వేదాంత శాస్త్రము గహన మైనది, గుహ్య మైనది. బోధ విషయంలో వక్త అనుసరించే పద్ధతులే శ్రోత మనస్సులో వెలుగులను ప్రసరింప చేస్తాయి.

**ప్రశ్న బీజము**

త్యాగము, సన్యాసము - ఈ రెండు విషయాల యొక్క యథార్థ స్వరూపాన్ని చెప్ప మని అర్జునుడు

అడగటంతో ఈ చివరి అధ్యాయం ప్రారంభ మవుతూ ఉంది ***( అర్జునః తు సంన్యాస త్యాగ శబ్దార్థయోః ఏవ విశేషం బుభుత్సుః ఉవాచ ).***

త్యాగము అంటే కర్మఫల త్యాగము. సన్యాసము అంటే సర్వ కర్మ త్యాగము. ఈ రెండిటి లోనూ త్యాగ ధర్మమే ఉంది. కాకపోతే, ఒకటి కర్మలను ఆచరిస్తూ ఫలసంగం లేకుండా ఉండటము. రెండవది, కర్మలనే పూర్తిగా త్యజించడము. ఈ రెండు విషయాలు, గీతాబోధ ప్రారంభ మైనప్పటి నుండి శ్రీకృష్ణుడు చెబుతూనే ఉన్నాడు. అర్జునుడు అడుగుతూనే ఉన్నాడు.

***యోగస్థః కురు కర్మాణి*** - అర్జునా! యోగస్థుడవై కర్మల నాచరించు *(2 వ అ - 47 వ శ్లో)* అన్నాడు భగవంతుడు. ఇది కర్మఫల త్యాగము.

***సర్వ కర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ!*** - సర్వ కర్మలను మనస్సుతో సన్యసించి, ఏదీ చెయ్యకుండా సుఖంగా ఉండు *(5 వ అ - 13 వ శ్లో)* అని బోధించాడు. ఇది కర్మసన్యాసము.

ఇంతకీ, చేయ వలసినది కర్మ త్యాగమా? కర్మఫల త్యాగమా? కర్మసన్యాసమా? లేక కర్మలలో సన్యాసమా? ఈ ప్రశ్న ప్రారంభం నుండి అర్జునుని మనస్సును కలత పెడుతూనే ఉంది. ఆ మాట అర్జునుడు అనేశాడు కూడా.

కృష్ణా! కర్మల కంటే జ్ఞానమే శ్రేష్ఠము అనేది నీ అభిప్రాయ మైతే, భయంకరమైన యుద్ధకర్మ లోకి నన్ను ఎందుకు దించుతున్నావు? జ్ఞానం శ్రేష్ఠము అంటావు. కర్మను ఆచరించు అంటావు. ఒక దానిని శ్రేష్ఠంగా స్తుతిస్తావు. మరొక దానిని ఆచరించ మంటావు. కలగాపులగం చేసి నీ మాటలతో నా బుద్ధిని కలవర పెడుతున్నావు అన్నాడు అర్జునుడు *(3 వ అ - 2 వ శ్లో)*.

దీనికి సమాధానంగా నాలుగు, ఐదు అధ్యాయాలను భగవానుడు ప్రవచించిన తరువాత, అర్జునుడు మళ్ళీ అదే ప్రశ్నను కొద్దిగా మార్పు చేసి అడిగాడు. కృష్ణా! కర్మ సన్యాసాన్ని గూర్చి చెబుతావు. మళ్ళీ కర్మయోగాన్ని గూర్చి చెబుతావు. ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరమో ఆ ఒక్క దానినే నా కోసం నిశ్చితంగా చెప్పు అని అడిగాడు *(5వ అ - 1 వ శ్లో)*.

ఈ ప్రశ్నకు సమాధానం చెబుతూ ఆ రెండూ వేరుగా లేవు. ఒక్కటే. అవి వేరని పిల్లలు చెబుతారు. పండితులు చెప్పరు. ఈ రెండిటిలో ఏ ఒక్క దానిని ఆచరించినా, రెండిటి యొక్క ఫలం పొందినట్లే అవుతుంది అన్నాడు భగవంతుడు *(5 వ అ - 4 వ శ్లో)*.

***శ్రద్ధావా న్భజతే యో మాం***
***స మే యుక్త తమో మతః*** - ఎవడైతే శ్రద్ధావంతుడై నన్నే సేవిస్తాడో అట్టి యోగి మిక్కిలి శ్రేష్ఠుడు అని నా అభిప్రాయము అన్నాడు భగవంతుడు *(6 వ అ - 47 వ శ్లో)*. ఇది కర్మఫల త్యాగము.

***ఉదారాః సర్వ ఏవైతే***
***జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్*** - అందరూ శ్రేష్ఠులే అయినా, జ్ఞాని సాక్షాత్తు నేనే అని నా అభిప్రాయం అని బోధించాడు *(7 వ అ - 18 వ శ్లో)*. ఇది మళ్ళీ కర్మసన్యాసము.

ఇక్కడ మళ్ళీ ఏదో కలవరం ఆరంభ మైంది. పూర్వం నిష్ఠాద్వయమైన కర్మయోగ, కర్మసన్యాసాలలో ఏది శ్రేష్ఠము? అని ప్రశ్నిస్తూ వచ్చిన అర్జునుడు, పన్నెండవ అధ్యాయారంభంలో కాస్త మార్గాన్ని మార్చి, అదే తరతమ భేదాన్ని అంతరంగ సాధనల మధ్య లేవనెత్తి, సగుణోపాసన శ్రేష్ఠమా, నిర్గుణోపాసన శ్రేష్ఠమా? అని ప్రశ్నించాడు. అంటే, మూడవ అధ్యాయమైన కర్మయోగం నుండి ఏ సందేహా న్నైతే శ్రీకృష్ణుని ముందుంచి



అర్జునుడు ప్రశ్నిస్తున్నాడో, దానినే పన్నెండవ అధ్యాయంలో మరొక కోణంలో, అంటే ఉపాసనా కోణంలో ప్రశ్నించాడు. ప్రశ్నించే పద్ధతులు, ప్రశ్నించే విధానాలు మారుతూ ఉన్నాయే గాని, ప్రశ్న మారడం లేదు. అదే ప్రశ్న.

ప్రస్తుతం గీతా ప్రవచనం చివరి ఘట్టానికి చేరింది. ఈ దశలో కూడా పదాలను మార్చి అదే ప్రశ్నను అర్జునుడు మళ్ళీ సంధిస్తున్నాడు. కాని, పూర్వం ప్రశ్నించిన విధానానికి, ప్రస్తుతం ప్రశ్నిస్తున్న పద్ధతికి ఏదో తేడా ఉందని పరిశీలిస్తే అర్థ మవుతుంది.

'కృష్ణా! కర్మయోగ మేమిటి? కర్మసన్యాస మేమిటి?' లేదా, 'కృష్ణా! కర్మయోగ, కర్మసన్యాసాలలో ఏది శ్రేష్ఠము?' అని ఇలా ప్రశ్నిస్తూ వచ్చిన అర్జునుడు, ప్రస్తుతం ప్రశ్న బీజం అదే అయినా, త్యాగ సన్యాసాలను, వాటి తత్త్వాలను వేరు వేరుగా తెలుసుకోవాలని భావించి ప్రశ్నిస్తున్నాడు. మహాద్భుతమైన ఈ గీతా శాస్త్రంలో ప్రథమ శ్రోత అయిన అర్జునుని చివరి ప్రశ్న ఇదే కావడం చేత, స్పష్టత కోసం సూటిగా ప్రశ్నిస్తున్నాడు. ***తత్త్వ మిచ్ఛామి వేదితుమ్*** - 'వాటి తత్త్వాన్ని, అంటే యథార్థ స్వరూపాన్ని తెలుసుకోవడానికి ఇష్ట పడుతున్నా!' అని సూటి గానే అర్థించాడు. ఆ మాటల్లో వినయ, జిజ్ఞాసలతో పాటు ఆదర భావం కూడా తొంగి చూస్తోంది. ఇది పద్దెనిమిదవ అధ్యాయానికి ప్రశ్న బీజం.

గీతాశాస్త్రాన్ని సంపూర్ణంగా సింహావలోకనం చేస్తూ గీతాసారాన్ని పునః బోధించడానికి భగవంతునికి అనువు గానే అర్జునుని ప్రశ్న ఉంది. ఉపదేశానికి, అసమానుడైన ఆదిగురువు ఉద్యమిస్తున్నాడు. అర్జునుని నిమిత్తంగా చేసుకొని గీతామృతాన్ని మనందరి చేత గుటగుట త్రాగించ డానికి గోవిందుడు ఉద్యుక్తు డవుతున్నాడు.

ఆత్మబంధువులారా! చైతన్య భగవద్గీతా రచన చివరి దశకు చేరింది. రెండు వేల పుటల వ్యాఖ్యాన గ్రంథము పద్దెనిమిది వందల పుటలలో, పదిహేడు అధ్యాయాలను పూర్తి చేసుకొని 'సమాప్తం' అనే దశకు చేరుకుంటూ ఉంది. ఇప్పటి వరకు నడచిన వ్యాఖ్యను అవలోకిస్తే, ఇది నేనే వ్రాశానా? లేక, సాధారణమైన వెదురు ముక్కను వేణువుగా మలచుకొని విశ్వమోహన రాగాలను ఆలపించిన వాసుదేవ మూర్తి, ఈ వ్యాఖ్యానాన్ని ఓపికగా కూర్చుని వ్రాయగల నని భావించి, ఆయన పాదాలనే నమ్ముకున్న నన్ను ఇలా కరుణించాడా? అని నాలో నేను ఏదో అవు తున్నాను. మాట లన్నీ కాగితాల మడతలలో చేరి పోయాయేమో, మౌనాన్ని మాత్రమే నాకు మిగిల్చి నన్ను మూగవాణ్ణి చేశాయి. పదిహేడు అధ్యాయాలు అద్భుతంగా, అమోఘంగా పూర్తి అయ్యాయి. ఇంతవరకు కురిపించిన కరుణామృతాన్ని ఈ అధ్యాయం ముగిసి, గ్రంథం సమాప్త మయ్యే వరకు అలాగే నాపై వర్షింప చేయమని శ్రీవాసుదేవ భగవానుని త్రికరణ శుద్ధిగా హృదయంతో ప్రార్థిస్తూ, అష్టాదశాధ్యాయ వ్యాఖ్యానానికి కలం కదిలిస్తూ, ముందుగా నవనీత చోరునికి అత్యంత ప్రియమైన ఒక వెన్నముద్దను నివేదించు కొని, ఆరగించ మని అభ్యర్థించి, ప్రార్థించి, ఆ తరువాత మోక్షసన్యాస యోగము యొక్క వ్యాఖ్యానాన్ని ప్రసాదంగా భక్తులకు అందిస్తాను.

***బ్రతుకు నిచ్చిన నీ దివ్య భావ మెరిగి***
***మనసులో రాగాల జల్లు కురిసి***
***పలికెదను నోరార లోలోన తేనె లూరి***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

**అర్జున ఉవాచ :**

సంన్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ పృథ క్కేశినిషూదన ॥ 1

***సంన్యాసస్య-మహాబాహో-తత్త్వం-ఇచ్ఛామి-వేదితుం***
***త్యాగస్య-చ-హృషీకేశ-పృథక్-కేశినిషూదన***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = | గొప్ప బాహువులు గలవాడా! | తత్త్వం | = | తత్త్వమును |
| హృషీకేశ | = | కృష్ణా! | పృథక్ | = | వేర్వేరుగ |
| కేశినిషూదన | = | కేశియను రాక్షసుని సంహరించిన వాడా! | వేదితుం | = | తెలిసికొనుటకు |
| సంన్యాసస్య | = | సన్యాసము యొక్క | ఇచ్ఛామి | = | కోరుచున్నాను |
| త్యాగస్య చ | = | త్యాగము యొక్క | | | |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కృష్ణా! సన్యాసము యొక్క స్వరూపాన్ని, అలాగే త్యాగము యొక్క స్వరూపాన్ని వేరు వేరుగా తెలుసుకోవా లనుకుంటున్నా!**

**వ్యాఖ్య**

ఈ ప్రపంచం విచిత్ర మైంది. అంతకన్నా విచిత్ర మైంది మానవ జీవితము. అందరము ప్రపంచం లోకి వచ్చిన వాళ్ళమే. ప్రపంచంలో ఉన్న వాళ్ళమే. ఈ ప్రపంచం ఏమిటో మనకు తెలియదు. మనం ఎక్కడ నుండి ఈ ప్రపంచం లోకి వచ్చామో, ఎందు కొచ్చామో ఒక పట్టున తెలిసి రాదు.

ప్రపంచం లోకి ప్రవేశించడ మనే ప్రథమ ఆగమనమే అర్థం కాలేదు కనుక, ఇక ప్రపంచంలో ఉన్నంత కాలం సాగే ప్రస్థాన మంతా అగమ్య గోచరం గానే ఉంటుంది. ఎక్కడి కెక్కడికో వెళ్తాం. ఏదేదో చేస్తాం. ఏదో చెయ్యాలని వెళ్తాం. మరొకటి చేసి వస్తాం. చూసి రావాలనే వెళ్ళినా కాల్చి వచ్చే వాళ్ళూ ఉంటారు. కాల్చాలని వెళ్ళ లేదు. కాని, కాలంలో అన్నీ అలా తగల బడుతూ ఉంటాయి.

అర్జునుడు కురుక్షేత్రంలో ప్రవేశించాడు. ఏదో చెయ్యాలని ఉద్యమ స్ఫూర్తితో ప్రవేశించాడు. చేసే పనిని చూచే ప్రయత్నంలో ఉభయ సేనల మధ్య నిలిచాడు. అంతే. నీరసించి పోయాడు. చెయ్య వలసింది, చెయ్య దగింది కళ్ళ ముందే ఉన్నా, దానిని విడిచి పెట్టి మనస్సులో ఉన్న దానిని చూచే కార్యంలో నిమగ్న మయ్యాడు. అంతా తారుమారైంది. అస్తవ్యస్తమై పోయింది.

నామరూపాలతో కూడిన ప్రపంచం కళ్ళ ముందు ఉంది. కురుక్షేత్రంలో అర్జునుని నిర్వాక మంతా దాని తోనే ముడిపడి ఉంది. కురుక్షేత్రానికి రాక ముందు కూడా మనస్సు నంతా అదే ఆవరించి ఉండింది. తీరా ప్రవేశించిన తరువాత ఎందుకో, దాని ప్రాధాన్యత సన్నగిల్లింది. ఒక దశలో అది అంత ప్రధాన మైనది కాదేమో అనిపించింది. మరొక దశలో అప్రధానమై పోయింది.

అప్రధానమైన దానిని అర్థం చేసుకున్నా, దానితో సమర్థవంత మైన సంబంధాన్ని కొనసాగించినా సాధించే దంటూ ఏమీ ఉండదు అనేది కూడా మనస్సులో ఏదో ఓ మూల దాగి ఉంది. ఈ దృశ్యా లన్నిటి వెనుక అదృశ్యంగా ఉన్న ఏదో ఒక దాని వైపు అస్పష్టంగా మనస్సు చలిస్తోంది. ఆ వైపే చరిస్తోంది. ఇది దరి



ఎక్కడో తెలియని ప్రయాణము. దారి ఎటో అర్థం కాని ప్రయాణము. అంతా అయోమయం. ఇన్ని అయోమయాలు, అస్పష్టాల మధ్య అదృష్టం కొద్ది నడిపించే వాడు నరుడికి తోడుగా ఉన్నాడు. అతడే కేశవుడు. వైపరీత్యాల నుండి దారి మళ్ళించి దరి చేర్చే కైవర్తకుడు ***(కైవర్తకః కేశవః).***

సంవాదము చోటు చేసుకుంది. నామరూపాల తోనే చర్చ ఆరంభ మైనా, చర్చా విషయం మరో వైపుకు దారి తీసింది. అనిత్యమైన నామరూపాల నుండి వెను దిరిగి ఆ నామరూపాల వెనుక దాగి ఉన్న సత్యం వైపు అర్జునుని దృష్టి మళ్ళింది. మళ్ళిన తరువాత అర్థమైంది అది అంత సులభంగా అర్థ మయ్యేది కాదని, పరమ గుహ్య మని, రహస్యాల లోకి రహస్యమైన దని, ఇంద్రియ మనస్సులకు గోచరం కాని విషయ మని. అలాంటి రహస్య మైన విషయం బోధనా విషయ మైంది. కనుకనే, ఆ రహస్య జ్ఞానము ఉపనిషత్తు అయింది. దానినే బోధించడం జరిగింది. అదే గీత. భగవద్గీత. నారాయణుడు నరుడికి చేసిన బోధ.

మరొక విచిత్ర మేమిటంటే, వినిపించింది గీత అయినా అది మనకు 'గీతలు'గా విన పడింది. బహువచనంగా వినిపిస్తోంది. ***ఇతి శ్రీమద్భగవ ద్గీతాసు ఉపనిషత్సు*** - పైగా అది ఒక ఉపనిషత్తు కాదు. అందుకే, ఉపనిషత్తులు (***ఉపనిషత్సు***), అంటూ బహువచనంగా చెప్ప బడింది. అంటే, అనేక ఉపనిషత్తులు ఒక చోట సమాగమ మయ్యాయి. ఎక్కడ? ఆ సమాగమ స్థాన మేది? అదే భగవద్గీత. కాని, మళ్ళీ ఇక్కడ ఒక ఆసక్తికర మైన విషయం దాగి ఉంది. అనేక మైన ఉపనిషత్తులు గీతలో సమాగమం కాగానే, ఏకమైన గీత కూడా బహు వచనంతో భాసిస్తోంది. ***శ్రీమద్భగవద్గీతాసు*** - 'భగవంతుని గీతలు'గా బహువచనంలో వినిపించడం జరిగింది. అనేక శాస్త్రాలు, నదులు సాగరంలో ప్రవేశించినట్లు గీతలో ప్రవేశించాయి. ప్రతి శ్లోకము ఒక ఉపనిషత్తై ప్రకాశిస్తోంది. అందుచేత భగవద్గీతలు, ఉపనిషత్తులు ***(భగవద్గీతాసు ఉపనిషత్సు)*** అంటూ బహువచనంలో వినిపిస్తున్నాయి. ఈ కారణం చేత భగవద్గీత సర్వశాస్త్ర సారభూత మైంది ***(సర్వశాస్త్రమయీ గీతా).*** అందుచేత, గీతాబోధ అసమాన వైభవంతో అనన్య సామాన్యంగా సాగింది.

గీతలో ఎన్నో సత్యాలు బోధింప బడ్డాయి. ఊహాపోహలకు అతీతంగా, ఎన్నో మహిమాన్విత మైన విషయాలు ముచ్చటించ బడ్డాయి. బోధ సమస్తమూ సర్వాశ్చర్య మయంగా సాగింది. సమాప్త దశకు చేరింది. విన్న దెంతో! కాని, విన్న దంతా మళ్ళీ సారభూతంగా ఆలకించాలని అర్జునుడు అభిప్రాయ పడ్డాడేమో! సన్యాసము యొక్క, త్యాగము యొక్క యథార్థ స్వరూపాన్ని విడివిడిగా చెప్పమని అర్థించాడు. ఇంతవరకు తాను విన్న దంతా అదే. గీతార్థ మంతా ఆ రెండిటి లోనే ఉంది. గీతకు మూల గ్రంథాలైన ఉపనిషత్తులలో కూడా అదే సారభూతమైన విషయము.

***త్యాగే నైకే అమృతత్వ మానశుః*** - ఒక్క త్యాగము వల్లనే అమృతత్వము, లేదా మోక్షము సిద్ధిస్తుంది అని ఉపనిషత్తు. ఇది ఫలత్యాగము.

***సంన్యాస యోగాత్ యతయః శుద్ధ సత్త్వాః*** - సన్యాస యోగము చేతనే యతులు శుద్ధసత్త్వులై పరబ్రహ్మమును పొందుతారు అని కైవల్య శ్రుతి. ఇది సన్యాసము.

ఫలత్యాగము, సన్యాసము అనే రెండు విషయాలనే ప్రధానంగా ప్రస్తావిస్తూ అటు మూలాలైన ఉపనిషత్తులు, ఇటు ఉపనిషత్సార మైన భగవద్గీత, రెండూ ఏక కంఠంతో ప్రవచించాయి.

మరి, ఈ సన్యాస త్యాగ శబ్దాలు ఘట పటాల వలె భిన్నములా? భిన్న జాతీయ అర్థవంతములా? లేక, బ్రాహ్మణ పరివ్రాజక శబ్దాల వలె ఏకజాతీయ అర్థముతో, ఏకవాక్యతగా ఉన్నవా?

ఘటము వేరు, పటము వేరు. కుండ వస్త్రము కాదు. వస్త్రము కుండ కాదు. అలా ఫలత్యాగము, కర్మసన్యాసము, రెండు వేరా? లేక, బ్రాహ్మణుడు సన్యసించి పరివ్రాజకు డైనట్లు ఒకే విషయానికి సంబంధించిన రెండు రూపాలా?

కర్మయోగము, కర్మసన్యాసము భిన్న జాతీయాలు కావు. ఫలత్యాగము, లేదా కర్మయోగము ఉపాయ మైతే, కర్మసన్యాసము, లేదా జ్ఞానయోగము ఉపేయము. ఫలత్యాగమును హేతువుగా కలిగిన జ్ఞానయోగము, లేదా జ్ఞాననిష్ఠ సాక్షాత్తు మోక్ష సాధనం. బ్రాహ్మణుడు పరివ్రాజకు డైనట్లు, కర్మయోగ నిష్ఠ జ్ఞానయోగ నిష్ఠలో కలిసి, అఖండ చైతన్యం వైపు సాగి విలీనమై పోతుంది. ఉపనది జీవనదిలో కలిసి సాగరంలో విలీన మైనట్లు, ఫలత్యాగము జ్ఞానము వైపు చరించి, ఆ తరువాత ఏకంగా అఖండ చైతన్యంలో విలీనం కావడం జరుగుతోంది.

కృష్ణా! హృషీకేశా! సన్యాసము యొక్క యథార్థ స్వరూపాన్ని తెలుసుకోవాలని అభిలషిస్తున్నాను ***(సంన్యాసస్య తత్త్వం వేదితుమ్ ఇచ్ఛామి).*** 'హే మహాబాహో! కేశిసూదనా! త్యాగము యొక్క యథార్థ స్వరూపాన్ని కూడా తెలుసుకోవాలని ఇష్ట పడుతున్నాను ***(త్యాగస్య తత్త్వం వేదితుమ్ ఇచ్ఛామి).*** ఈ రెండిటిని వేరు వేరుగా ***(పృథక్)*** తెలుసుకోవా లనుకుంటున్నాను.' ఇదీ, అర్జునుని ప్రశ్న. అధ్యాయ ప్రారంభానికి ప్రశ్న బీజము. భగవద్గీతలో పార్థుని చివరి ప్రశ్న.

***సర్వ కర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్*** - మనస్సును నియమించి కర్మఫలాలను విడిచి పెట్టమని ఫలత్యాగాన్ని ప్రబోధించిన భగవంతుడు *(12 వ అ - 11 వ శ్లో; 18 వ అ - 2 వ శ్లో)*, ***సంన్యాస యోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి*** - సన్యాస యోగ యుక్తుడవై చివరకు నన్నే పొందుతావు *(9 వ అ - 28 వ శ్లో)* అని అన్నాడు. కనుక, సన్యాసము యొక్క యథార్థ స్వరూపమును, త్యాగము యొక్క యథార్థ స్వరూపమును వేర్వేరుగా తెలుసుకోవాలని, అది కూడా వాటి యథార్థ స్వరూపాన్ని (తత్త్వాన్ని) తెలుసుకోవాలని ప్రశ్నించాడు అర్జునుడు.

తత్త్వము అంటే యథార్థ స్వరూపము. ***తస్య భావః తత్త్వమ్*** - అంటే దాని యొక్క ధర్మమే తత్త్వము. యథార్థ స్వరూపము ***(యథాత్మ్యమ్).***

పదిహేడవ అధ్యాయంలో త్రివిధములైన శ్రద్ధను వివరించడం జరిగింది. అలాగే ఆహార, యజ్ఞ, దాన, తపస్సులను అనుష్ఠించే వారిని కూడా వారి వారి శ్రద్ధను బట్టి మూడు విధాలుగా అర్థం చేసుకున్నాం. మరి ఫలత్యాగ, కర్మసన్యాసాలకు కూడా ఈ త్రివిధము ఉందా? ఉంటే, దానిని కూడా తెలుసుకుందా మని అభిలషించా డేమో, మొత్తానికి సమస్త గీతా శాస్త్రాన్ని సింహావలోకనంగా దర్శించుటకు అనుకూలంగా ప్రశ్నించాడు అర్జునుడు.

## సంబోధనమే సర్వసిద్ధి మంత్రం

చివరి ప్రశ్నను సంధిస్తున్న పార్థుడు తన ప్రశ్నలో పరమేశ్వరుని మూడు విధాలుగా సంబోధించాడు. ***హృషీకేశా! కేశినిషూదనా! మహాబాహో!*** అని పిలుస్తున్నాడు. భగవానుని ఒకే చోట మూడు విధాల సంబోధించ వలసిన అవసరం ఉందా? ఉండబట్టే అలా సంబోధించి ఉంటాడు. అవసరం లేకుండా సంబోధిస్తే, అది అనర్థమే కదా! భగవద్గీతలో అనర్థాలకు, అసందర్భాలకు అవకాశం లేదు.

***'కేశినిషూదనా!'*** అనేది శ్రీకృష్ణునికి పేరు. కేశి అనే అశ్వరూప రాక్షసుని వధించడం చేత శ్రీకృష్ణునికి కేశి అనే పేరు కలిగింది. కేశి అనే పేరు గల అసురుణ్ణి వధించిన వాడు ***(కేశి నామానం అసురం హతవాన్ ఇతి).***



బాలకృష్ణుడు గోకులంలో పెరుగుతు న్నప్పుడు, కంసభూపతి బాలకృష్ణుని వధించ మని కేశి అనే అశ్వరూప రాక్షసుణ్ణి పంపాడు. బాలకృష్ణుడు కేశి రాక్షసుని వధించాడు. అందుచేత, శ్రీకృష్ణుడు కేశినిషూదను డని కీర్తింప బడ్డాడు.

పదహారవ అధ్యాయంలో మనము చూచిన అసుర గుణాలకు ప్రతినిధియే ఈ కేశి అనే అసురుడు. అసుర ప్రవృత్తి అంతం కానిదే దైవ లక్షణాలు ఏర్పడవు. భగవంతుని అనుగ్రహం ద్వారా మన లోని అసుర గుణాలను అంతం చేసుకోవాలి. ఇది కర్మయోగం వల్ల సాధ్య పడుతుంది. ఇదే కర్మయోగ నిష్ఠ. అర్జునుడు ప్రశ్నించిన త్యాగానికి సంబంధించిన విషయం. కనుక పరమేశ్వరుని కృప చేత మనస్సు లోని అసుర ప్రవృత్తిని అంతం చేసుకొని అంతఃకరణ శుద్ధిని పొంది, జ్ఞాననిష్ఠకు సిద్ధిని పొంద గలము.

కేశినిషూదనా! అని సంబోధిస్తూనే, ***హృషీకేశా!*** అని కూడా సంబోధించడం జరిగింది. హృషీకేశుడు అంటే ఇంద్రియాలకు ప్రభువు. హృషీకాణి అంటే ఇంద్రియాలు. వాటికి ప్రభువు కనుక భగవంతుడు హృషీకేశుడు ***(హృషీకాణి ఇంద్రియాణి తేషాం ఈశః హృషీకేశః).*** అంటే, ఇంద్రియాలు, మనస్సు వాటి వాటి వ్యాపారాలలో వ్యవహరించ డానికి శక్తి నిచ్చే దాత తానే. ఇంద్రియ మనస్సులు ఆయన వశం లోనే ఉంటాయి కనుక ఆయన హృషీకేశుడు ***(ఇంద్రియాణి యస్య వశే వర్తన్తే).*** ఇంద్రియాలు ఇంద్రియ విషయాల నుండి అన్ని విధాల నిగ్రహింపబడి నపుడే జ్ఞానము సుస్థిరంగా ఉంటుంది అని రెండవ అధ్యాయం స్థితప్రజ్ఞ లక్షణాలలో చెప్పడం జరిగింది *(2 వ అ - 68 వ శ్లో)*. ఇది జ్ఞానయోగ నిష్ఠ. అర్జునుడు ప్రశ్నించిన త్యాగానికి సంబంధించిన విషయం.

హృషీకేశుడు అంటే మరొక అందమైన అర్థం కూడా ఉంది. కేశ అంటే కిరణములు అని అర్థం ***(కేశా రశ్మయః).*** కిరణాలు సూర్యచంద్రుల నుండి కదుల్తాయి. పరమాత్మ సూర్యుని రూపంలో ఉండి ఆయన కిరణాల ద్వారా మానవాళిని నిద్ర లేపి కార్యోన్ముఖుల్ని చేస్తాడు. అలాగే చంద్రునిలో ఉండి, శీతల శశి కిరణాల ద్వారా సర్వ జీవులను చల్లగా నిద్ర పుచ్చుతాడు. ఈ విధంగా సూర్యచంద్రుల రూపాలలో ఉంటూ తన కిరణాల ద్వారా జీవులకు సుఖాన్ని పంచి పెడుతూ ఉన్నందున ఆయన హృషీకేశుడు ***(యస్య వా సూర్య రూపస్య చంద్ర రూపస్య జగత్ప్రీతికరా హృష్టాః కేశా రశ్మయః సః హృషీకేశః).***

సూర్యుని ప్రకాశం వల్ల మనం కార్య రంగంలో ప్రవర్తిస్తాము. ఇది ప్రవృత్తి. కర్మమార్గము. చంద్రుని ప్రకాశం వల్ల మనం కార్యాల నుండి విరమించి నిద్రిస్తాము. అంతర్ముఖుల మవుతాము. ఇది నివృత్తి. జ్ఞానమార్గము. సన్యాసము. సూర్యోదయంతో కర్మలలో ప్రవేశించిన మనం, సూర్యాస్తమయం అయ్యే సరికి కర్మల నుండి విరమిస్తాము. చంద్రోదయంతో సర్వ కర్మల నుండి విడిపడి విశ్రమిస్తాము. ఈ రెండూ సూర్యచంద్రుల రూపంలో ఉన్న పరమేశ్వరుని వల్లనే సిద్ధిస్తున్నాయి.

అలాగే పరమేశ్వరుని అనుగ్రహం చేత ప్రవృత్తిలో చరించి అంతఃకరణ శుద్ధిని పొందిన మనం, నివృత్తిలో విశ్రమించి, లేదా సన్యసించి తద్రూపుల మవుతాము. ఈ రెండు వేరు వేరుగా లేవు. ఈ రెండు మార్గాలు శ్రేష్ఠములే. గొప్పవియే. రెండు పరమేశ్వరుని రూపాలే. అందుచేత భగవంతుణ్ణి హృషీకేశా! కేశినిషూదనా! అని సరిపెట్టుకోకుండా, ***మహాబాహో!*** అని కూడా పిలిచాడు పార్థుడు.

ఇంతవరకు భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునుని మహాబాహో! అని అనేక చోట్ల సంబోధిస్తూ వచ్చాడు. ఇక్కడే ప్రథమంగా అర్జునుడు శ్రీకృష్ణుని మహాబాహో! అని అనడం జరిగింది. తనను శ్రీకృష్ణుడు ఏ అర్థంతో 'మహాబాహో!' అని పిలిచాడో, అదే భావంతో అర్జునుడు పరమేశ్వరుని సంబోధించి ఉంటాడని నేను అనుకోను.

ఇక్కడ కర్మయోగ, జ్ఞానయోగాలను పరమేశ్వరునికి రెండు భుజాలుగా అర్జునుడు దర్శిస్తున్నా డని నాకు అనిపిస్తోంది. భగవాన్! మహాబాహు వైన నీ కరుణ మాపై ఉంటే మేము కూడా కర్మయోగము నందు సిద్ధి ద్వారా జ్ఞానయోగ ప్రాప్తికి యోగ్యుల మవుతాము అని భావిస్తూ అర్జునుడు అలా సంబోధించి ఉండ వచ్చు.

*సన్యాస, త్యాగ శబ్దాలను సుస్పష్టం చేయడానికి గీతాచార్యుడు నోరు విప్పాడు.*

**శ్రీ భగవానువాచ :**

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః ॥ 2

*కామ్యానాం-కర్మణాం-న్యాసం-సంన్యాసం-కవయః-విదుః*
*సర్వకర్మఫలత్యాగం-ప్రాహుః-త్యాగం-విచక్షణాః*

| | | | |
|---|---|---|---|
| కవయః | = జ్ఞానులు | విదుః | = తెలుసుకున్నారు |
| కామ్యానాం | = కామ్యమైన | విచక్షణాః | = వివేకవంతులు |
| కర్మణాం | = కర్మల యొక్క | సర్వకర్మఫలత్యాగం | = సకల కర్మల యొక్క ఫలమును త్యజించుటను |
| న్యాసం | = విడుచుటను | త్యాగం | = త్యాగము అని |
| సంన్యాసం | = సన్యాస మని | ప్రాహుః | = చెబుతారు |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! కామ్య కర్మలను త్యజించుట సన్యాస మని కొందరు పండితులు చెబుతారు. సర్వ కర్మల ఫలములను త్యజించుట త్యాగ మని మరి కొందరు వివేకులు చెబుతారు.**

**వ్యాఖ్య**

గడచిన అధ్యాయాలలో సన్యాస, త్యాగ శబ్దములు అక్కడక్కడ వినిపించాయి. వాటిని గూర్చి చెప్పడం జరిగింది. అయినప్పటికీ వాటి విషయంలో ఒక స్పష్టత ఏర్పడని కారణం చేత, సన్యాస, త్యాగాలను వేరు వేరుగా, విస్పష్టంగా తెలుసుకోవాలని భావించి, సన్యాసము, త్యాగము - ఆ రెండిటి యొక్క యథార్థ స్వరూపాన్ని వేరువేరుగా చెప్పుమని అర్జునుడు ప్రశ్నించడం చేత భగవంతుడు విస్పష్టార్థ నిమిత్తమై ఆ రెండిటి తత్త్వాన్ని నిర్వచిస్తున్నాడు.

వేదములో చెప్పబడిన అగ్నిహోత్రాది కర్మలు మొదలు అశ్వమేధ, పుత్రకామేష్టి యాగముల వరకు ఏయే కామ్యకర్మలు ఉన్నవో వాటి నన్నిటినీ పరిత్యజించడము సన్యాస శబ్దార్థము. ఏవయితే అనుష్ఠించ డానికి ఉన్నవో (అనుష్ఠేయములు) వాటిని అనుష్ఠించక పోవడము సన్యాస శబ్దార్థ మని కొందరు పండితుల అభిప్రాయము ***(అనుష్ఠేయత్వేన ప్రాప్తస్య అననుష్ఠానం)***.

పుత్ర కామేష్టి యాగము ఉందనుకోండి. అది అనుష్ఠించ దగినదే అయినా, అధిక సంతానం గల వారికి దాని అవసరం లేదు. కనుక ఆచరించినా, ఆచరించక పోయినా దోషం లేదు.

కామ్యకర్మలను త్యజించడము సన్యాసము. అదలా ఉంచితే, తనకు విహితము లైన నిత్య నైమిత్తిక కర్మల ఫలములను త్యజించుట త్యాగ శబ్దార్థము. అంటే, విహిత కర్మ త్యాగంతో ప్రత్యవాయ దోషం ప్రాప్తిస్తుంది కనుక, ఆశ్రమ విహితమైన నిత్య నైమిత్తికాది కర్మలను ఆచరిస్తూ కామ్య కర్మములను త్యజించడము





సన్యాస మని, తనకు శాస్త్రవిధి ననుసరించి ప్రాప్త మౌతున్న నిత్య నైమిత్తిక కర్మల ఫలములను త్యజించ డము త్యాగమని పండితులు అభిప్రాయ పడుతున్నారు ***(తం ప్రాహుః త్యాగ శబ్దార్థం విచక్షణాః పండితాః)***.

కామ్యకర్మలను త్యజించడం అనినా, కర్మఫలమును త్యజించడ మనినా, పరిశీలించి చూస్తే రెండిటి అర్థం ఒక్కటి గానే అగుపిస్తుంది. ఎందుకంటే, సన్యాస, త్యాగ శబ్దాలకు త్యజించడము ఒక్కటే ప్రధానంగా అర్థ మవుతోంది ***(సర్వథాఽపి త్యాగమాత్రం సంన్యాస త్యాగ శబ్దయో ఏకః అర్థః)***.

మరి, నిత్య నైమిత్తిక కర్మలకు ఫలం ఎక్కడా చెప్పబడ లేదు కదా! అనేది ఒక సందేహం. ప్రతి రోజు సంధ్యావందనాది నిత్య కర్మానుష్ఠానం సాగుతోంది. వివాహ మైతే, అగ్నిహోత్రాది నిత్యకర్మ కూడా ఉంటుంది. ఇవన్నీ నిత్యకర్మలు.

అనుదినము సాగే నిత్యకర్మలే కాకుండా సందర్భాను సారంగా సంప్రాప్త మయ్యేవి నైమిత్తికాలు. పితృ దేవతల కొరకు ఆచరించే కర్మలు, గ్రహణ కాలాలలో ఆచరించే కర్మలు, శ్రాద్ధ కర్మలు, సంక్రాంతి మొదలైన పర్వ దినాలలో అర్పించే పితృ తర్పణాలు మొదలైన వన్నీ నైమిత్తికాలు. ఈ విధమైన నిత్య నైమిత్తికాది కర్మలకు సంబంధించి ప్రాప్త మయ్యే ఫలాలను త్యజించడము త్యాగమని కొందరు పండితుల అభిప్రాయము. ఇక్కడ నిత్య నైమిత్తికాదులకు ఫలం ఉందా అనే ప్రశ్న తలెత్తుతుంది. ఫలమే లేనపుడు త్యాగ మేమిటి? అనేది సందేహం. ఇదెలా ఉందంటే, గొడ్రాలు స్త్రీ బిడ్డను త్యాగం చేసినట్లే ఉంది ***(యథా వంధ్యాయాః పుత్ర త్యాగః)***. వంధ్యకు సంతానమే ఉండదు కదా! ఆవిడ బిడ్డ నెలా త్యాగం చేస్తుంది? నిత్య నైమిత్తికాది కర్మలకు ఫలమే లేనపుడు, ప్రాప్తించని ఫలాన్ని త్యాగం చేసే దేముంటుంది?

ఈ సంశయానికి అవకాశం లేదు. నిత్య నైమిత్తికాదులకు కూడా ఫలం ఉందని ప్రస్తుత అధ్యాయం లోనే భగవంతుడు చెబుతాడు *(12 వ శ్లో)*. సన్యాసులకు మాత్రమే కర్మఫల సంబంధం ఉండదని చెబుతాడు. అదంతా ఆ సందర్భములో చర్చిస్తాము.

*కర్మల విషయంలో మరి కొన్ని అభిప్రాయాలను తెలుపుతున్నాడు.*

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః ।
యజ్ఞదాన తపఃకర్మ న త్యాజ్య మితి చాపరే ॥ 3

*త్యాజ్యం-దోషవత్-ఇతి-ఏకే-కర్మ-ప్రాహుః-మనీషిణః*
*యజ్ఞదానతపఃకర్మ-న-త్యాజ్యం-ఇతి-చ-అపరే*

| | | | |
|---|---|---|---|
| ఏకే | = కొందరు | అపరే | = మరి కొందరు |
| మనీషిణః | = వివేకవంతులు | యజ్ఞదానతపఃకర్మ | = యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మము |
| కర్మ | = కర్మను | | |
| దోషవత్ | = దోషము వలెను | న త్యాజ్యం ఇతి చ | = విడువగూడ దని |
| త్యాజ్యం ఇతి | = విడువదగిన దని | ప్రాహుః | = చెప్పిరి |

**అర్జునా! కర్మ దోష పూరిత మైంది కనుక విడిచి పెట్టాల్సిందే అంటారు కొందరు వివేకులు. మరి కొందరు పండితు లేమో యజ్ఞ దాన తపస్సులను విడిచిపెట్ట కూడదు అంటారు.**

**వ్యాఖ్య**

కర్మ చేయ దగింది కాదు, విడువ దగింది అని కొందరి అభిప్రాయము ***(త్యాజ్యం త్యక్తవ్యం కర్మ)***.

కర్మను ఎందుకు వదలాలి? కర్మ బంధహేతువు కనుక సమస్త కర్మము విడువ దగినదే అని వారి అభిప్రాయము. ఇది సాంఖ్య దృష్టి గల వారి అభిప్రాయము. కర్మలో దోష మెలా ఉంది? కర్మ బంధహేతువు కనుక దోష యుతము ***(బంధ హేతుత్వాత్).***

పరమేశ్వరుని నియమాలను, నియతిని అనుసరించి మన కర్మలకు ఫలితాలు అందుతూ ఉంటాయి. మనం ఆచరించే కర్మకు ఫలితము ఆ కర్మ స్వభావమును బట్టే ఉంటుంది. దాని కన్నా అన్యమైన ఫలాన్ని ఆశిస్తే మిగిలేది నిరాశే. ఇదే కర్మ దోషము.

కర్మను బట్టే ఫలము. కర్మ పరిమితంగా ఉంటే ఫలం కూడా పరిమితం గానే ఉంటుంది. అంతే గాని, పరిమిత కర్మకు అనంత ఫలం వచ్చే అవకాశం లేదు.

ఏ కర్మ కూడా మరొక కర్మ కాలేదు. ఏ ప్రయత్నమూ మరొక ప్రయత్నము కాలేదు. ఏ కర్మకు ఆ ఫలితమే వస్తుంది కనుక, అనేక మైన కర్మలను ఆచరించడము వల్ల అనేక ఫలాలను పొందగల మేమో గాని, అనంత ఫలాన్ని మాత్రం పొంద లేము.

మనిషి అనంతానందాన్ని ఆశిస్తున్నాడు. అంతమయ్యే దోష గుణం గల కర్మ అనంత సుఖాన్ని ప్రసాదించ లేదు. కనుక కర్మ అనేది త్యాజ్యము ***(త్యక్తవ్యం)***. అంటే త్యజించ దగింది అని కొందరి అభిప్రాయము. కర్మల ద్వారా పొందే ఫలాలతో అనంతం కావాలని ఆశించడము ఎవరి కైనా, ఎప్పుడైనా నిరాశనే దించుతుంది. కనుక, కర్మ అజ్ఞానులకు సంబంధించింది అన్నారు భాష్యకారులు ***(అవిద్వ ద్విషయం కర్మ :*** *- 66 వ శ్లో).* అజ్ఞానమే బంధము. కనుక అజ్ఞాన జనితమైన కర్మ బంధ హేతువుగా తెలుస్తూ ఉంది. ఎప్పుడైతే కర్మ బంధానికి కారణ మైందో, అది ముక్తికి కారణ మెలా మవుతుంది? ఈ విషయాన్నే బృహదారణ్య కోపనిష ద్భాష్యంలో ఆచార్యుల వారు నిర్ధారణ చేశారు.

***యదేవ ప్రవృత్తి కారణం తదేవ నివృత్తి కారణం న భవతి !*** - ఏదైతే బంధానికి కారణ మైందో, అది మోక్షానికి కారణం కాలేదు అన్నారు. కనుక, కర్మ దోషయుతమై ఉంది కాబట్టి అది త్యాజ్యము.

కొందరు ఈ అభిప్రాయంతో ఏకీభవించడం లేదు. దేహమును ధరించిన వాడు కర్మలను పూర్తిగా విడవడం సాధ్యం కాదని భగవంతుడే చెప్పి ఉన్నాడు *(11 వ శ్లో).*

అద్వయాత్మను కర్మ ద్వారా పొందే అవకాశం లేదు. వస్తువు సిద్ధించి ఉన్నదే గాని, లేకుండా నూతనంగా పుట్టు కొచ్చేది కాదు. వస్తువు అనంతంగా, అద్వయంగా శోభించే టప్పుడు, అనంతాత్మను విచారం ద్వారా పొంద వలసిందే గాని కర్మ ద్వారా పొంద లేము ***(వస్తు సిద్ధి విచారేణ).***

పొందబడే ఏ జ్ఞాన మైనా పొందే వ్యక్తి యొక్క అర్హత మీద ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో ఆత్మజ్ఞానం విలక్షణంగా లేదు. ఆత్మజ్ఞానమును పొందడ మనేది కేవలం విచారం మీదనే ఆధార పడి ఉంది అని తెలుసుకున్నాం. విచారించేది మనస్సు. అట్టి మనస్సు, లేదా బుద్ధి ఆత్మవిచారానికి యోగ్యతను కలిగి ఉండాలి. యోగ్యత అనేది చిత్తశుద్ధి. చిత్తశుద్ధి ఉంటేనే విచారంలో వస్తుసిద్ధి ప్రాప్తిస్తుంది.

చిత్తశుద్ధి రావాలి అంటే కర్మోపాసనలను ఈశ్వర బుద్ధితో ఆచరించాలి. మనో మాలిన్యం నిర్మూలించ బడాలి. అంటే, యజ్ఞ, దాన, తపస్సులను ఆచరించాలే గాని త్యజించ కూడదు. దోషయుతం కనుక, కర్మలను సంపూర్ణంగా త్యజించాలి అని కొందరు అభిప్రాయ పడుతూ ఉంటే, చిత్తశుద్ధి హేతువు లైన యజ్ఞ, దాన, తపస్సులను త్యజించ కూడదని మరి కొందరు అభిప్రాయ పడుతున్నారు ***(యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చ అపరే).***





*ఇలా పండితుల నుండి భిన్నాభిప్రాయాలు వ్యక్త మవుతూ ఉంటే, పరమేశ్వరుడు తన నిశ్చితాభిప్రాయ మేమిటో తెలియ జేస్తున్నాడు.*

**నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సమ్ప్రకీర్తితః ॥** 4

***నిశ్చయం-శృణు-మే-తత్ర-త్యాగే-భరతసత్తమ***
***త్యాగః-హి-పురుషవ్యాఘ్ర-త్రివిధః-సంప్రకీర్తితః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతసత్తమ | = | అర్జునా! | శృణు | = | విను |
| తత్ర | = | ఆ | పురుషవ్యాఘ్ర | = | అర్జునా! |
| త్యాగే | = | త్యాగ విషయము నందు | త్యాగః | = | త్యాగము |
| మే | = | నా యొక్క | త్రివిధః | = | మూడు విధములుగ |
| నిశ్చయం | = | నిర్ణయమును | సంప్రకీర్తితః హి | = | చెప్పబడింది కదా! |

**అర్జునా! త్యాగం విషయంలో నా నిశ్చయం విను. పురుష శ్రేష్ఠా! త్యాగము మూడు విధాలుగా చెప్పబడింది కదా!**

## వ్యాఖ్య

సన్యాసములో త్యాగ గుణమే ప్రధానమై ఉండటం చేత, సన్యాస మంటే కామ్యకర్మ త్యాగ మని కొందరు, సర్వకర్మ ఫల త్యాగమే సన్యాస మని మరి కొందరు, దోషయుత మైన కర్మను త్యజించడమే సన్యాస మని ఇంక కొందరు, కామ్య నిషిద్ధ కర్మ త్యాగమే సన్యాస మని మరి కొందరు - ఇలా పండితులు వారి వారి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. అర్జునుడు అడిగిన ప్రశ్నకు విషయమైన త్యాగ శబ్దార్థ మైన సన్యాసము నందు భగవంతుడు తన నిశ్చితాభిప్రాయమును చెబుతున్నాడు.

అర్జునా! కర్మసన్యాస, కర్మఫల త్యాగాలలో ఇమిడి యున్న త్యాగం విషయంలో ***( తత్ర త్యాగే త్యాగ సంన్యాస వికల్పే యథా దర్శితే)*** నా నిశ్చయాన్ని విను ***(మే నిశ్చయం శృణు)*** అంటున్నాడు భగవంతుడు.

***త్యాగః హి*** - త్యాగ, సన్యాస శబ్దాల చేత ఏ అర్థము చెప్ప దగినదో అది ఒక్కటే అనే అభిప్రాయంతో 'త్యాగః హి' అని అంటున్నాడు. ఈ విధమైన త్యాగము గుణ భేదం చేత మూడు విధాలు ***(త్రివిధః తామసాది ప్రకారైః)***. ఇది శాస్త్ర సంప్రదాయము ***(సంప్రకీర్తితః శాస్త్రేషు సమ్యక్ కథితః)***. మూడు విధాలుగా తెలియ బడుతున్న ఈ త్యాగము ఆత్మజ్ఞానం లేని వాడు, అవివేకి, కర్మాధికారి అయిన కర్మిష్ఠునికి మాత్రమే సంభవ మవుతుంది. ఆత్మజ్ఞానం కల వానికి ఇది సంభవించదు. అందుచేత ఈ తత్త్వమును తెలుసుకోవడము అందరికీ సాధ్యము కాదు ***( ఇతి అయం అర్థః దుర్ జ్ఞానః తస్మాత్ అత్ర తత్త్వం న అన్యః వక్తుం సమర్థః )***. దీనిని గ్రహించడము చాలా కష్టము కనుక దీనిని చెప్పడానికి నా కన్నా మరొకడు సమర్థుడు కాడు. కనుక, అర్జునా! ఈ విషయంలో, ఇది పరమార్థమైన శాస్త్రానికి సంబంధించిన విషయం కావడం చేత, ఈశ్వరుడ నైన నా నిశ్చయాన్ని ఆలకించు ***( తస్మాత్ నిశ్చయం పరమార్థ శాస్త్రార్థ విషయమ్ అధ్యవసాయం ఐశ్వరం శృణు )*** అంటున్నాడు భగవంతుడు. విను ***(శృణు)*** అని ప్రత్యేకంగా భగవంతుడు చెబుతున్నా డంటే శ్రవణంలో అవధానం అవసర మని సూచించడము జరుగుతూ ఉంది. విషయం ఏకోన్ముఖంగా సాగే టప్పుడు విషయం

సుగ్రాహ్య మవుతూ ఉంటుంది. అలా కాకుండా, భిన్నాభిప్రాయాలు గోచరించే చోట అవధానం అధికంగా ఉండాలి.

ప్రమాణ విషయము నందు పరమేశ్వరుడు తన నిశ్చయాన్ని చెబుతూ ఉన్నందున, శ్రోతను సావధానంగా ఉంచడానికి ***భరతసత్తమ! పురుషవ్యాఘ్ర!*** అని అర్జునుని సంబోధించాడు భగవంతుడు. సంప్రదాయ ప్రవర్తకులైన భరత వంశీయులలో శ్రేష్ఠుడు కావడం చేత అర్జునుణ్ణి 'భరతసత్తమ!' అని సంబోధించాడు ***(భరత సత్తమ భరతానాం సాధుతమ ).***

*భగవంతుని నిశ్చయ మేమిటో చెబుతున్నాడు.*

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥** 5

***యజ్ఞదానతపఃకర్మ-న-త్యాజ్యం-కార్యం-ఏవ-తత్***
***యజ్ఞః-దానం-తపః-చ-ఏవ-పావనాని-మనీషిణాం***

| | | | |
|---|---|---|---|
| యజ్ఞ దాన తపః కర్మ | = యజ్ఞము, దానము, తపస్సు అనే కర్మ | యజ్ఞః | = యజ్ఞము |
| న త్యాజ్యం | = విడువ దగినది కాదు | దానం | = దానము |
| తత్ | = అది | తపః చ ఏవ | = తపస్సు |
| కార్యం ఏవ | = చేయ దగిందే | మనీషిణాం | = వివేకవంతులకు |
| | | పావనాని | = పవిత్ర మైనవి |

**అర్జునా! యజ్ఞము, దానము, తపస్సు అనేవి చేయ దగినవే కాని విడువ దగినవి కావు. యజ్ఞ, దాన, తపస్సులు బుద్ధిమంతుల్ని పవిత్రం చేస్తాయి.**

### వ్యాఖ్య

కర్మలు అజ్ఞాన జనితములు; జ్ఞాన ప్రతిబంధకాలు; కనుక, కర్మలను సమూలంగా త్యజించాలి అని కొందరు వెలిబుచ్చిన అభిప్రాయాలను మనం చూశాం. కాని, భగవంతుడు తన నిశ్చయాన్ని వినిపిస్తూ, యజ్ఞ, దాన, తపః, కర్మలను త్యజించ కూడదు అంటున్నాడు. పైగా వాటిని ఆచరించి తీరాలి అంటున్నాడు. ఇలా ఎందుకు అంటున్నాడంటే, యజ్ఞ, దాన, తపస్సులు వివేకవంతులకు పవిత్రతను చేకూర్చుతాయి అని చెబుతున్నాడు.

అంతఃకరణ శుద్ధి లేనిదే ఆత్మజ్ఞానము సిద్ధించదు అని ఇప్పటికే తెలుసుకున్నాం. యజ్ఞ, దాన, తపస్సులు అంతఃకరణను ఎలా శుద్ధి చేస్తాయో పూర్వాధ్యాయాలలో కూడా చెప్పుకున్నాం. అలాంటి పవిత్ర కార్యాలను త్యజించ వలసిన అవసర మేముంది? అందుచేత, వాటిని విడిచి పెట్టకూడదు అని అంటున్నాడు ***(న త్యాజ్యమ్ న త్యక్తవ్యం ).*** అంతటితో ఆగ లేదు. వాటిని చేసి తీరాలి అంటున్నాడు ***(కార్యం కరణీయమ్ ఏవ తత్ ).***

ఇక్కడ యజ్ఞములు అంటే వేద పరమైన శ్రౌత యజ్ఞాలే కాదు; స్మార్త యజ్ఞాలు కూడా అన్వయింప బడతాయి. ఈశ్వరారాధనార్థం చేసే స్మార్త కర్మ లన్నీ యజ్ఞాలే అవుతాయి. పూజ, ధ్యాన, సంకీర్తన, జపాదు లన్నీ యజ్ఞాలే. ఇవన్నీ సాధకుని మనస్సును శుద్ధి చేస్తాయి.

యజ్ఞ, దాన, తపస్సులు, వాటిని ఆచరించే వారందరికీ చిత్తశుద్ధిని కలిగిస్తాయా? చెప్పలేము. అందుచేతనే, వివేకవంతుల బుద్ధిని శుద్ధి చేస్తాయి అన్నాడు. వారే మనీషులు. మనీషులు అంటే ఫలాసక్తి లేని వారు అని అర్థము. అట్టి వారిని, అంటే కర్మఫలాల యందు ఆసక్తి లేక, కేవలం మోక్షార్థమే పవిత్ర కార్యాలను ఆచరించే వారిని; అంతఃకరణ శుద్ధ్యర్థమే నిర్వర్తించే వారిని యజ్ఞాది కర్మలు పవిత్రుల్ని చేస్తాయి. అంతఃకరణ శుద్ధిని ప్రసాదిస్తాయి ***( పావనాని విశుద్ధి కరాణి మనీషిణాం ఫలానభి సంధీనామ్ ).***



మోక్షం ఎవరి కైతే పురుషార్థం కాదో, వారి దృష్టి పరమేశ్వరునిపై ఉండదు. తమ కార్యాలు సిద్ధించడానికి మనుషుల్ని ఎలాగైతే వినియోగించు కుంటారో, అలాగే భగవంతుణ్ణి కూడా అర్థ కామాల ప్రయోజనార్థం వినియోగించు కుంటారు. వారు యజ్ఞ, దాన, తపస్సులు ఆచరించినా, అవి విషయ ప్రయోజనార్థం ఉంటాయే గాని భగవత్ప్రీత్యర్థం ఉండవు. వారి సాధనలలో విషయం ఈశ్వరుడు కాడు. విషయాల కొరకు ఈశ్వరుడు. ఇదే పెద్ద తేడా.

కనుక, కర్మయోగ, కర్మసన్యాసాలలో పరమేశ్వరుడే ధ్యేయమై ఉండటం చేత, విషయాసక్తి, కర్మ ఫలాసక్తి లేని వారి కర్మలకు ఫలితంగా చిత్తశుద్ధి ప్రాప్తిస్తుంది. యజ్ఞ, దాన, తపస్సులు చేసే వారందరికీ చిత్తశుద్ధి ఏర్పడే టట్లైతే, రావణ, హిరణ్యకశిపాదులకు చిత్తశుద్ధి ప్రాప్తించి ఉండేది. ఎవ్వరైతే పరమ పురుషార్థమైన మోక్షమునే కాంక్షించి యజ్ఞాది త్రివిధ కర్మలను ఆచరిస్తారో, వారే అంతఃకరణ శుద్ధిని పొందుతారు ***(పావనాని మనీషిణామ్).*** ఈశ్వరుని విడిచి మరొక దానిని ఆశించే వారిని అవి శుద్ధి చేయ లేవు. కారణం, వారి దృష్టి చిత్తశుద్ధిపై లేదు కనుక.

శ్రౌత, స్మార్త, యజ్ఞాలే గాక దానము కూడా బుద్ధిని శుద్ధి చేస్తుంది. ధనాన్ని అనేక విధాలుగా సంపాదిస్తాము. తెలిసో, తెలియకో ధనం అన్యాయార్జితంగా ఉంటుంది. దేహం శుద్ధి పడటానికి స్నానం చేస్తాము. బుద్ధి శుద్ధి పడటానికి ధ్యానం చేస్తాము. విత్తము శుద్ధి పడటానికి ఏమి చేయగలం? దాన మొక్కటే చేయ గలము. దానం వల్ల ధనం శుద్ధి పడుతుంది. దేశకాలాదులను అనుసరిస్తూ, ఈశ్వరార్పణ బుద్ధితో పాత్రోచిత దానం చేస్తే అట్టి పవిత్రమైన దాన కార్యము అంతఃకరణమును పవిత్రం చేస్తుంది.

యజ్ఞ దానాలు మోక్షార్థం చేసి నపుడు చిత్తశుద్ధికి ఎలా సహకరించాయో, అలాగే తపస్సు కూడా కల్మషాలను పోగొట్టి బుద్ధిని పవిత్రం చేస్తుంది.

***తపోభిః క్షీణ పాపానాం శాంతానాం వీత రాగిణామ్***
***ముముక్షూణాం అపేక్ష్యోయం ఆత్మబోధో విధీయతే***

తపస్సు చేత మనస్సు లోని పాపాలను పోగొట్టుకున్న వాళ్ళు, రాగద్వేషాల నుండి విడి పడిన ప్రసన్న చిత్తులైన ముముక్షువులకు పరమ పురుషార్థ సిద్ధి అయిన మోక్షమునకు ఆశించ దగిన ఆత్మజ్ఞానము బోధింప బడుతూ ఉంది అన్నారు ఆత్మబోధ గ్రంథంలో శ్రీ ఆదిశంకరాచార్య స్వామి.

***తపో హి స్వాధ్యాయః -*** స్వాధ్యాయము కూడా తపస్సే అన్నది శాస్త్రము. స్వాధ్యాయము జ్ఞాన ప్రధానం కనుక బుద్ధి శుద్ధి పడుతుంది.

*కనుక, కర్తవ్యా లైన యజ్ఞ, దాన, తపస్సుల విషయంలో భగవంతుడు తన నిశ్చయాన్ని విశదం చేస్తున్నాడు.*

**ఏతా న్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యా నీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్ ॥** 6

***ఏతాని-అపి-తు-కర్మాణి-సంగం-త్యక్త్వా-ఫలాని-చ***

***కర్తవ్యాని-ఇతి-మే-పార్థ-నిశ్చితం-మతం-ఉత్తమం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | కర్తవ్యాని ఇతి | = | చేయ దగినవి అని |
| ఏతాని | = | ఈ | మే | = | నా యొక్క |
| కర్మాణి అపి తు | = | కర్మలను కూడ | నిశ్చితం | = | నిశ్చితమైన |
| సంగం | = | ఆసక్తిని | ఉత్తమం | = | ఉత్తమమైన |
| ఫలాని చ | = | ఫలమును | మతం | = | అభిప్రాయము |
| త్యక్త్వా | = | విడిచి | | | |

**అర్జునా! యజ్ఞ, దాన, తపస్సులు చేయ దగినవి అనేదే నా అభిప్రాయం కూడా. కాకపోతే, ఆసక్తిని, ఫలాపేక్షను విడిచి పెట్టాలి.**

**వ్యాఖ్య**

యజ్ఞ, దాన, తపస్సులను విడిచి పెట్టకూడదు. తప్పక ఆచరించాలి. బుద్ధిమంతులైన వారిని, ముముక్షువు లైన వారిని అవి పావనం చేస్తాయి అని పూర్వ శ్లోకంలో బోధించిన భగవానుడు, వాటిని ఎలా ఆచరించాలో ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు. అంతే కాదు. ముముక్షువులు కాని వారికి అవి ఎలా చిత్తశుద్ధిని కలిగించ లేవో కూడా పరోక్షంగా స్పష్టం చేస్తున్నాడు. కర్మల విషయంలో తన నిశ్చయాన్ని చెబుతానని నాల్గవ శ్లోకంలో ఆరంభించిన ప్రసంగాన్ని ప్రస్తుత శ్లోకంతో సమాప్తం చేస్తున్నాడు. ***నిశ్చయం శృణు*** అని నాల్గవ శ్లోకంలో 'నా నిశ్చయం విను' అన్నాడు. 'ఇది నిశ్చిత మైన, ఉత్తమ మైన నా అభిప్రాయము' అని ప్రస్తుత శ్లోకంలో నిశ్చయాన్ని పునరుద్ఘాటి స్తున్నాడు ***( మే నిశ్చితం మత ముత్తమమ్ ).***

అర్జునా! యజ్ఞ, దాన, తపః కర్మలు సంగత్వమును విడిచి ***( సంగం త్యక్త్వా )*** ఫలాకాంక్షను త్యజించి ***(ఫలాని త్యక్త్వా)*** చేయ దగినవి ***( కర్తవ్యాని ).*** ఇది ఉత్తమ మైన నా నిశ్చితాభిప్రాయము అంటున్నాడు.

కర్మలు చెడ్డవీ కావు, మంచివీ కావు. ఉద్దేశ్యాన్ని బట్టి రూపం దాల్చుతాయి. ఏ భావనతో చేస్తామో దానిని బట్టి ఫలం ఉంటుంది. ఏవైతే ముముక్షువునకు చిత్తశుద్ధిని కలిగిస్తున్నాయో, అవే కర్మలు కర్మసంగంతో, ఫల సంగంతో ఆచరించే వారికి బంధహేతువు లవుతున్నాయి ***( సా సంగస్య ఫలార్థినః బన్ధహేతవః ఏతానపి కర్మాణి ముముక్షోః కర్తవ్యాని ఇతి ).***

ఈ విషయంలో కొందరికి అభ్యంతరాలు ఉంటాయి. ఎందుకంటే, ఇది చాలా సూక్ష్మమైన విషయం. నీరు శుద్ధి కార్యానికి ఉపకరిస్తుంది కదా! అది ఎవరి దేహమున ఉన్న మాలిన్యా న్నయినా పోగొడుతుంది. ఇతడు ముముక్షువు, అతడు మొద్దు, ఇది ఎద్దు అని చూస్తుందా! శుద్ధి కార్యానికి ఉపకరించే నీరు ఎవరి నైనా, దేని నైనా శుద్ధి చేస్తుంది. మరి, యజ్ఞ, దాన, తపస్సులు అంతఃకరణ శుద్ధికి ఉపకరించే టప్పుడు, కర్మసంగం ఉంటే ఏమి? ఫలాభిసంధి ఉంటే ఏమి? వాటి కార్యాలను అవి చెయ్యాలి కదా? చిత్తశుద్ధికి, ఫలాభి సంధికి సంబంధ మేమిటి? అనే శంక కొందరిలో ఉంటుంది. ఇది చాలా ఆసక్తికరమైన విషయము.

యజ్ఞ, దానాది పవిత్ర కర్మలను కామ్యకర్మలుగా ఆచరించినా, అవి ధర్మరూపాలే కనుక శుద్ధిని కలిగిస్తాయి. కాకపోతే, ఆ శుద్ధి ఫలము దేనిని ఉద్దేశించి మనం యజ్ఞాది కర్మల్ని ఆచరించామో, ఆ కర్మఫల భోగానికి ఉపకరిస్తుందే గాని, జ్ఞానానికి ఉపకరించదు. ఇది అసలు విషయం.



కర్మ చేసిం దెవరో అతడికే కర్మఫలం అందాలి. ఏ భావనతో కర్మ చేస్తాడో తత్సంబంధమైన ఫలమే అందాలి. అర్థకామాలు, లేదా ధర్మానికి సంబంధించిన భావనను బుద్ధిలో ఉంచుకొని, వాటి నిమిత్తము యజ్ఞ, దాన, తపః కర్మలు ఆచరిస్తే , వాటి ఫలితంగా పుణ్యాన్ని పొందుతాడేమో గాని, మోక్షార్థం అంతఃకరణ శుద్ధిని ఎలా పొందుతాడు? అసలు మోక్ష భావనే అతనికి లేదు కదా! యజ్ఞాది కర్మల వల్ల చిత్తశుద్ధి కలిగినా, అది భోగార్థమే గాని మోక్షార్థము ఉపకరించదు అనేది సశాస్త్రీయమైన అవగాహన. భావన ఒకటై నపుడు అనుభవము మరొకటి ఎలా అవుతుంది? మతిని బట్టే కదా గతి? ఈ విషయాన్ని వార్తికాకారులైన సురేశ్వరులు ఒక అందమైన శ్లోకంలో ఉదాహరణంగా చెబుతారు.

***కామ్యేఽ పి శుద్ధిరస్త్యేవ భోగ సిద్ధ్యర్థ మేవ సా ।***
***వి డ్వరాహాది దేహేన నహ్యైన్ద్రం భుజ్యతే ఫలమ్ ॥***

కామ్య కర్మ యందు కూడా శుద్ధి కలుగుతుంది. ఆ శుద్ధి భోగసిద్ధి కొరకే. ఊరపంది శరీరముతో ఇంద్రలోక భోగాలను అనుభవించడం సాధ్య పడుతుందా? అన్నారు.

**కర్తవ్యాలు**

యజ్ఞ, దాన, తపః కర్మలు ముముక్షువులను పావనం చేస్తాయి కనుక అవి కర్తవ్యాలు. అంటే చేయ దగినవి ***( కర్తవ్యాని అనుష్ఠేయాని ).*** ఇవి త్యజించ దగినవి కావు. ఆచరించ దగినవి. ఆచరించ గలిగే అదృష్టాన్ని భగవంతుడు మనకు ప్రసాదించి ఉన్నందున అవశ్యం ఆచరించ దగినవి.

యజ్ఞము పవిత్ర కర్మే కావచ్చు. దానం పవిత్ర కర్మే కావచ్చు. తపస్సు కూడా పవిత్రమే కావచ్చు. ఆరోగ్యం లేకపోతే యజ్ఞము చేయగలమా? ధనం లేకపోతే దానం చేయగలమా? కళ్ళు లేకపోతే స్వాధ్యాయం చేసే దెలా? మూగవాడు సంకీర్తన చేయగలడా? చేతులు లేకుండా పుట్టిన వాడు రామకోటి వ్రాయ గలడా? ఇలా ఎందరు లేరు ఈ ప్రపంచంలో? దురదృష్టాలు విలయ తాండవం చేస్తున్న ప్రపంచంలో కర్తవ్యాలు నిర్వహించే భాగ్యం కలగడం భగవంతుని కృప కాదా? భగవత్కృప ఉన్నా, చేయకుండా ఉండటమా? చెయ్యవలసినవి, చెయ్య దగినవి చేయ నపుడు, ఆ తరువాత ఏమి చేయాలని? చెయ్య కూడనివి చెయ్యాలనా? అలా చేసే కదా జన్మ లన్నీ వృథా అయ్యాయి!

కనుక, కర్తవ్యాలను తప్పక ఆచరించాలి ***( కర్తవ్యాని కర్మాణి కరణీయాని ).*** కర్మసంగం లేకుండా, ఫలసంగం లేకుండా ఆచరిస్తే, అవి చిత్తశుద్ధిని కలిగించి ముక్తి మార్గాన్ని సుగమం చేస్తాయి. యజ్ఞ, దాన, తపస్సులు కర్తవ్యాలు. వాటిని ఫలసంగం లేకుండా, కర్మసంగం లేకుండా ఆచరించాలి. ఇది పరమేశ్వరుని ఉత్తమ మైన, నిశ్చయ మైన అభిప్రాయము; కాదు ఆజ్ఞ.

*కనుక, యజ్ఞ, తపో, దానాది కర్మలను అజ్ఞానులు త్యజించ కూడదు. ఒకవేళ త్యజిస్తే, అది తామస త్యాగ మవుతుంది.*

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥ 7

***నియతస్య-తు-సంన్యాసః-కర్మణః-న-ఉపపద్యతే***

***మోహాత్-తస్య-పరిత్యాగః-తామసః-పరికీర్తితః***

నియతస్య తు = విధియుక్త మైన

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మణః | = | కర్మ యొక్క | తస్య | = | దాని యొక్క |
| సంన్యాసః | = | పరిత్యాగము | పరిత్యాగః | = | విడచుట |
| న ఉపపద్యతే | = | తగదు | తామసః | = | తామస మని |
| మోహాత్ | = | మోహము వలన | పరికీర్తితః | = | చెప్పబడింది |

**అర్జునా! నిత్య కర్మను విడిచి పెట్టడం మంచిది కాదు. ఎవరైనా అజ్ఞానము వలన విడిచి పెడితే అది తామస త్యాగము అవుతుంది.**

## వ్యాఖ్య

### నియత కర్మాచరణము

నియత కర్మలను త్యజించ కూడదు. నియత కర్మ అంటే విధియుక్త మైన కర్మ. విహిత కర్మ. శాస్త్ర విహిత కర్మ. నిత్య నైమిత్తికాది రూపమై, అవశ్యం ఆచరించ దగిన కర్మ. అట్టి నియత కర్మ యొక్క పరిత్యాగము ***(నియతస్య కర్మణః సంన్యాసః)*** సరి యైనది కాదు. యుక్తం కాదు ***(న ఉపపద్యతే)***. త్యజించ వలసింది నిషిద్ధ కర్మలనే గాని నియత కర్మలను కాదు.

పూర్వ వాసనలు ఒక వైపు, ప్రస్తుత విషయాకర్షణలు మరొక వైపు మానవుని ప్రేరేపిస్తూ కర్మ సుడి గుండం లోకి దించుతూ ఉంటాయి. ఏది యుక్తం, ఏది అయుక్తం అనేది కర్మల విషయంలో నిర్ణయించుకొని, నిర్ధారించుకొని ఆచరించడం అందరికీ సాధ్యం కాదు. బాల్యంలో బిడ్డకు యుక్తమైన ఆహారాన్ని తల్లి అందించి నట్లు, కర్మల విషయంలో శాస్త్రమాత యుక్తమైన నియత కర్మలను విధించి మన బ్రతుకులను ఉద్ధరిస్తూ ఉంది. బాల్యంలో తల్లి పెట్టింది ఎలా ఆరగించామో, అలాగే శాస్త్రం చెప్పినట్లు, విధి యుక్త కర్మలను ఆచరించాలి.

శ్రుతిమాత శాస్త్రోక్తంగా, ప్రత్యక్షంగా, స్పష్టంగా నియత కర్మ విధిని తెలియ చేస్తూ ఉంటే, ప్రకృతి మాత పరోక్షంగా కర్మ విధులను నియమిస్తూ ఉంటుంది. ప్రకృతి నిర్ణయాలు శాస్త్ర విహితం గానే ఉంటాయి. కాకపోతే, వాటిలో మన ఇష్టాయిష్టాలు మిళిత మైనపుడే విషమిస్తాయి.

మనిషి నిత్యము ఆచరించే కర్మలలో భోజన, స్నానాదులు కూడా ఉన్నాయి. 'నువ్వు భోం చెయ్యి' అని ఒకరు చెప్ప నవసరం లేదు. తన ఆకలే తాను ఆరగించేటట్లు చేస్తుంది. తిన మని మనిషికి చెప్ప నవసరం లేదు. తినకుండా తానే ఉండ లేడు. స్నానం చేయకుండా మనుగడను సాగించ లేడు. ఇలాంటివి నిత్య కర్మలే. నిత్యము ఆచరించే కర్మలే. వీటిని ప్రత్యేకించి శాస్త్రము చెప్ప నవసరం లేదు.

భుజించడానికి శాస్త్రము అవసరం లేదు. ఏది భుజించాలి? అనేది చెప్పడానికి శాస్త్రం కావాలి. ఆకలి మనిషికి ఉంది. జంతువుకూ ఉంది. మాంసము బాహ్యంలో ఆహారంగా కనిపిస్తూ ఉంది. ***కలంజం న భక్షయేత్*** - నువ్వు మాంసాన్ని భుజించ కూడదు అని శాస్త్రము మనిషికే చెబుతుంది. జంతువుకు చెప్పదు. కనుక ప్రకృతి నిర్ణయించే కార్యాలలో కూడా శాస్త్ర ప్రమేయం ఉండి తీరాలి. శాస్త్రము నరులకే గాని వానరులకు కాదు.

***శ్రుతయో యత్ర వర్తన్తే తత్ర వర్తన్తి వై నరాః,***
***మతయో యత్ర వర్తన్తే తత్ర వర్తన్తి వానరాః॥***

శ్రుతులు చెప్పినట్లు ప్రవర్తించే వారు నరులు. మతులు చెప్పినట్లు వర్తించే వారు వానరులు అని కూడా శాస్త్రమే చెప్పింది.



***చలనాత్మకం కర్మ*** - కర్మ చలించే స్వభావం కలది అని స్థూల నిర్వచనము. మనలో ఏ విధమైన చలనాలు జరిగినా అవన్నీ కర్మలే. కొన్ని మన అధీనంలో ఉంటాయి. కర్మలు మనవే అయినా, కొన్ని మన అధీనంలో ఉండవు.

శ్వాసించడం కర్మ కాదా? శ్వాస క్రియ కర్మే. కాని, మన ప్రయత్నం లేకుండా సాగి పోతోంది. రోజుకు ఇరవై ఒక్క వేల ఆరువందల సార్లు నాసికాలు శ్వాసిస్తూ ఉన్నా, ఆ అలసటను మనం అనుభవించడం లేదు. అవి మన కర్మలే అయినా, మన ప్రమేయం లేకుండా సాగి పోతున్నాయి. శ్వాసలు కూడా ప్రయత్నంతో చేయ వలసిన పరిస్థితే ఉంటే, మన జీవిత మంతా మరో పని లేకుండా శ్వాసించ డానికే సరి పోయేది. ఆ పని దయామయు డైన పరమేశ్వరుడు తన అమృత హస్తాల లోకి తీసుకోవడం వల్ల మన చేతులు వేరే పనులలో నిమగ్న మయ్యాయి. మన చిత్తాలు వేరే విషయాలలో లగ్న మయ్యాయి. కాని, మన ప్రమేయం లేకుండా శ్వాసక్రియ సాగి పోతున్నా, దుర్గంధముతో వాయువు వీచి నపుడు, మనం ప్రయత్నించి శ్వాసించడం ఆపు తున్నాము. అది ప్రాణ నిరోధమే. కాని, నీలో ప్రాణక్రియ, లేదా శ్వాసక్రియ నీ ప్రమేయం లేకుండానే సాగు తున్నా, నీకు పరమేశ్వరుడు ప్రాణం ప్రసాదించి నందుకు ప్రాణాన్ని యామించి, నియమించి, నిరోధించి, విధి యుక్తంగా నీవు ప్రాణాయామం చేయాలి అని శాస్త్రం చెబుతుంది. ప్రాణాయామము పవిత్రమైన సాధన. అందుచేత ***ప్రాణాయామే వినియోగః*** అని పూజలో కూడా చెబుతున్నాం. చేస్తున్నాం. ప్రాణాయామము ఆరోగ్య ప్రదమే గాక, ఆనంద దాయకము, ఆధ్యాత్మిక ప్రగతి సోపానము కూడా.

ఇలా కొన్ని కర్మలు ప్రకృతి నిర్ణయాలుగా ఉన్నా, శాస్త్ర ప్రవేశంతో విహితంగా, యుక్తంగా తీర్చబడు తున్నాయి. కొద్దిగా మన ప్రమేయం కూడా ఉంది. ఆ విషయంలో కూడా శాస్త్రము మనకు హితం చెబుతూనే ఉంది.

శ్వాసక్రియ అయితే మన ప్రమేయం కొద్దిగా ఉందనేది అర్థ మవుతూ ఉంది. జీర్ణక్రియ విషయాని కొస్తే, అక్కడ మన ప్రమేయమే లేదు. జీర్ణక్రియ మనదే. ఎవరి జీర్ణక్రియ వారిదే. ఎవరు భుజించిన ఆహారము వారి లోనే జీర్ణ మవుతూ ఉంది.

కాని, ఎవరి జీర్ణక్రియ అయినా, వారి ప్రమేయం లేకుండా సాగి పోతూ ఉంది. ఏది జీర్ణ మైందో తెలియదు. ఏది జీర్ణం కాలేదో తెలియదు. ఆహారం ఎలా రక్తంగా మారుతూ ఉందో శాస్త్రజ్ఞులకే అంతు పట్టడం లేదు. ఇదంతా పరమేశ్వరుని కృపతో సాగి పోతోంది. మన ప్రమేయం లేని చోట భగవంతుని అదృశ్య హస్తం పని చేస్తోంది. అక్కడ నేను ప్రవేశించలేక పోయినా, అక్కడ ప్రవేశించి పచనం చేస్తున్న పరమేశ్వరుని పవిత్ర హస్తాలను నేను గౌరవించాలి. ఆరాధించాలి. పవిత్రంగా పూజించాలి. అపవిత్రమైన మద్య మాంసాదులను అక్కడ ఉంచడం ధర్మం కాదు అని శాస్త్రమాత చెబుతోంది. నాకు భగవంతుడు బుద్ధిని ప్రసాదించింది శాస్త్రమాత విహిత వచనాలను ధిక్కరించడానికా? కానే కాదు. అందుచేత విహిత కర్మలను, నియత కర్మలను పరిత్యజించ కూడదు ***( నియతస్య కర్మణః పరిత్యాగః న ఉపపద్యతే )***.

### తామస త్యాగము

శుద్ధి అనేది ఎక్కడ అవసరం? ఎవరికి అవసరం? ఎక్కడ అశుద్ధం ఉంటుందో, మలినం ఉంటుందో, అక్కడే శుద్ధి కార్యం జరగాలి. ఎవరిలో అపవిత్రత చోటు చేసుకుంటుందో అక్కడే పవిత్ర కార్యాలు సాగాలి. చీకటి ఉన్న చోటే వెలుగు కావాలి. రావాలి. మరి పవిత్రత అవసరమైన చోట పరిత్యాగము సమంజస మేనా? అలా ఎవరైనా పరిత్యజిస్తే, వారికి యుక్తాయుక్తాలు తెలిసి రావడం లేదని భావం. అదే మోహ మంటే. మోహవశులై,

విహిత విహీనులై చరించే వారు చేసే పరిత్యాగము సాత్త్విక మైనది కాదు. అందులో వైగుణ్యమే కాని సాద్గుణ్యము లేదు. అలాంటి మోహ ప్రేరిత త్యాగాన్ని తామస త్యాగము అంటున్నాడు భగవంతుడు (**మోహాత్ అజ్ఞానాత్ పరి త్యాగః తామసః పరికీర్తితః**).

కర్మను విడిచిన ప్రతి వ్యక్తి త్యాగి కాడు. వాస్తవం చెప్పాలంటే, త్యాగి కర్మలను త్యజించడు. కర్మలను విడిచి పెట్టడు. కర్మలే అతణ్ణి విడిచి పెట్టి దూరంగా వెళ్తాయి. వాడిన పూలు తమంతట తాము రాలి పోయినట్లు, త్యాగి నుండి కర్మలు దూర మవుతాయి.

త్యాగ బుద్ధి లేక పోయినా త్యాగం చేయడ మనేది తామస కార్యము. మోహ జనితము. అజ్ఞానము వలన ప్రాప్తము. అజ్ఞానం చేత కలుషిత మైన వ్యక్తి, రాగద్వేషాల చేత మలిన పడిన చిత్తము శుద్ధి కర్మల చేత పవిత్రం కావాలి. అపవిత్రమైన వానికే పవిత్రత యొక్క అవసరం ఉంది (**అజ్ఞస్య పావనత్వస్య ఇష్టత్వాత్**). అవసరం ఒక వైపు ఉండినా, మరో వైపు ఆచరణమును త్యజించడం ఏమిటి? అడుసు ఎందుకు త్రొక్కావు? అని అడగడం లేదు. కాళ్ళు ఎందుకు శుభ్రం చేసుకోవు? అనేదే ప్రశ్న. ఇదంతా అజ్ఞానము. మోహము. మోహంతో చేసే త్యాగము కనుక ఇది తామస త్యాగము. మోహము అంటే తమస్సే కాబట్టి (**మోహః చ తమః ఇతి**).

ఇక రాజస త్యాగాన్ని గూర్చి చెబుతున్నాడు.

**దుఃఖ మి త్యేవ యత్కర్మ కాయక్లేశ భయా త్త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥** 8

*దుఃఖం-ఇతి-ఏవ-యత్-కర్మ-కాయక్లేశభయాత్-త్యజేత్*
*సః-కృత్వా-రాజసం-త్యాగం-న-ఏవ-త్యాగఫలం-లభేత్*

| | | | |
|---|---|---|---|
| కాయక్లేశభయాత్ | = శరీరాయాస భీతి వలన | రాజసం | = రాజసమైన |
| దుఃఖం ఇతి ఏవ | = శోకదాయక మైనదే యని | త్యాగం | = త్యాగమును |
| యత్ | = ఏ | కృత్వా | = ఆచరించి |
| కర్మ | = కర్మమును | త్యాగఫలం | = త్యాగ ఫలమును |
| త్యజేత్ | = త్యజిస్తున్నాడో | న లభేత్ ఏవ | = పొందనే పొందడు |
| సః | = వాడు | | |

**అర్జునా! ఎవడు శరీరానికి కష్ట మని, దుఃఖం కలుగు తుందని భయపడి కర్మను విడిచి పెడతాడో ఆ త్యాగము రాజస త్యాగము. అతడు త్యాగ ఫలమును పొంద లేదు.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో తామస త్యాగిని చూశాం. అతని త్యాగం వెనుక అజ్ఞానము ఉంది. కనుక తెలియక, తెలివి లేక త్యాగం చేసిన వాడు తామస త్యాగి. అతని త్యాగము తామస త్యాగము.

ఇప్పుడు అష్టమ శ్లోకంలో కష్టాలను ఆరబోస్తూ, నిష్ఠూరంగా ప్రవేశిస్తున్న వ్యక్తి రాజస త్యాగి. ఇతనిది రాజస త్యాగము. తామసత్యాగి తెలియక, అజ్ఞానం చేత త్యాగం చేస్తాడు. రాజస త్యాగి తెలిసే త్యాగం చేస్తాడు. అదే వారిద్దరి మధ్య తేడా.

తెలిసి ఎందుకు త్యాగం చేస్తాడు? ఏం చెప్పగలం! సహస్ర దురదృష్టాలు, అనంతకోటి దరిద్రాలు. ఇతడు కష్టాలకు జడిసి కర్మల్ని త్యాగం చేస్తాడు. ఈయన కూడా త్యాగే, రాజస త్యాగి. రోగం ఉందని తెలిసి,



ఔషధం యొక్క అవసరాన్ని కూడా గుర్తించి, మందు చేదు కనుక పుచ్చుకోను అని ఔషధాన్ని త్యాగం చేసే వాడు ఎలాంటి వాడో, ఈ రాజస త్యాగి కూడా అలాంటి వాడే.

ఈ కర్మ చేయడం కష్టము. దుఃఖప్రదము. దీనిని చెయ్య లేము. ఇది మన వల్ల కాదు. దీని వల్ల ఇటు దేహానికి కష్టము, అటు ఇంద్రియాలకు కష్టము. ఇంత కష్టపడి చేయడం దేనికి? వదిలేయడం మంచిది కదా! సులభ మైంది చేసుకుంటే సరి పోతుంది కదా! ఇలా సరిపెట్టు కుంటాడు. ఈయనే రాజస త్యాగి.

**త్యాగ హేతువు**

ఈ కర్మ చేయడం కష్టం (**దుఃఖ మిత్యేవ**) అని కర్మను వదిలేస్తాడు. బావుంది. ఇంతకీ కష్టం ఎవరికి? దేహానికి. శరీరానికి కష్టం అనే భయంతో కర్మను త్యాగం చేయడం రాజస త్యాగము (**కాయ క్లేశ భయాత్, శరీర దుఃఖ భయాత్ త్యజేత్ పరిత్యజేత్**). శరీరానికి కష్ట మైతే తనకే కష్టము అనే భావన కలిగిన వాడు రాజస త్యాగి. తానే శరీర మనే భావన, అంటే దేహాత్మ భావన దృఢంగా కలిగిన వాడు. శరీరాన్ని ప్రాణం కన్నా ఎక్కువగా ప్రేమించే వాడు. దేహం ఉండబట్టే కదా ప్రాణం ఉంది అనే దౌర్భాగ్యపు ఆలోచనతో ఉండే వాడు. కనుక, రాజస త్యాగి కాయ క్లేశానికి భీతి చెంది కర్మల్ని త్యజిస్తాడు. ఆధ్యాత్మిక సాధనలు కర్తవ్యాలు అని తెలుసు. తెలిసినా చేయడు. ఎందుకని? మీరే అడగండి. చక్కగా సమాధానం చెబుతాడు. చేతలు ఉండవన్న మాటే గాని మాటలకు కరువే లేదు, కొదవే లేదు.

అయ్యా! పూజ చేయ రెందుకని? అని అడిగా మనుకోండి. 'చెయ్యాలనే ఉంటుందండీ! కాని, ఎక్కువ సేపు కూర్చోలేను. ఎవరో చేయి పట్టి లేపినట్లే ఉంటుంది' అంటాడు.

మరి, ధ్యానం చేయ వచ్చు కదా? అని అడిగితే, 'పూజ కన్నా ధ్యానం మేలే ననుకోండీ. కాని అదేమిటో అర్థం కాదు. ధ్యానానికి కూర్చుంటే చాలు, నిద్ర పిలిచినట్లే వస్తుంది' అంటాడు.

పోనీ, గ్రంథాలు పఠించ వచ్చు కదా! 'నిజమే, మీరు చెప్పింది వాస్తవమే. ఇంతెందుకు? నా బీరువా నిండా పుస్తకాలే. పుస్తకా లైతే ఉన్నాయి గానీ, మస్తకమే ఎందుకో పని చేయదు. చదవా లంటేనే అదోలా ఉంటుంది. బాల్యం నుండి నా ఖర్మ ఇంతే. ఇంకేం చదువుతాను లెండి! అందుకే మా పిల్లలకు చెబుతూ ఉంటాను. వెధవల్లారా! మీరైనా చదివి బాగు పడండ్రా అని.' ఇదీ విషయం. వెధవ సలహా ఒకటి.

**కష్టాలే కాంతులు**

కష్ట పడితేనే ఏదైనా వస్తుంది. ఎవరు ఏది సాధించినా కష్టపడే సాధించారు. కష్ట పడకుంటే ఏదీ రాదు; నిద్ర కూడా. పగటి పూట శ్రమించిన వాడే రాత్రి పూట హాయిగా విశ్రమిస్తాడు. నిద్ర పోతాడు. పడకపై పడుకొని నిద్ర పట్టక కష్టపడే వారందరూ పగటి పూట శ్రమించని వారే. శ్రమిస్తేనే దేని నైనా సాధించ గలం.

**సాధనమున పనులు సమకూరు ధర లోన** అన్న వేమన, తింటూ ఉంటే ఒక దశలో వేప తీయగా మారుతుంది అంటాడు. అదలా ఉంచండి గానీ, **శ్రేయాంసి బహు విఘ్నాని** - శ్రేయస్సును కలిగించే కర్మలకు అవరోధాలు అధికం గానే ఉంటాయి అనేది మాత్రం వాస్తవం. మందు చేదుగా ఉన్నా ఆరోగ్యాన్ని ప్రసాదించి నట్లు, ముందు కష్టంగా ఉన్నా, తరువాత సుఖాన్ని పంచే లక్షణం విధాయక కర్మలకు ఉంటుంది. ఈ విషయానికి సంబంధించిన చర్చ కూడా ఈ అధ్యాయం లోనే ముమ్మందు రాబోతుంది. అప్పుడు విశదంగా వివరిస్తాను. ఏది ఏమైనా సుఖాలు కష్టాల నుండే పుట్టు కొస్తాయి అనేది అక్షర సత్యం. 'వ్యసనం నుండే వ్యవస్థ పుట్టు కొస్తుంది' అనే ఒకానొక రాజకీయ సిద్ధాంతానికి, ఈ సత్యానికి సంబంధం లేదు. పైగా, వైరుధ్యం ఉంది అని సవినయంగా మనవి చేస్తున్నా.

**న సుఖాత్ లభతే సుఖమ్ -** సుఖా లెప్పుడూ సుఖాల నుండి రావు. కష్టాల నుండే వస్తాయి. దుఃఖాల నుండే పుడుతాయి. విషాదాలే వికాసాలకు బాటను నిర్మిస్తాయి. వెతలే బ్రతుకు బాటలో దివిటీలుగా వెలుగుతాయి.

పద్మాలు పద్మాల నుండి పుట్టవు. పంకం నుండి పుడుతాయి. పంకజాలై పరిమళాలతో పరిఢ విల్లుతాయి. జీవితంలో శ్రమించి అర్థం చేసుకో వలసిన సత్యం ఒకటుంది. అసలు కష్ట మనేదే ప్రపంచంలో లేదు. భరించ లేనివే బాధలుగా తెలుస్తాయి. కష్టా లున్నాయని, కష్టా లొచ్చాయని కలత చెందకుండా, నలత పడకుండా, సహనంతో సమయాలను నెట్ట గలిగితే, విషాలు విరుగు డవుతాయి. అమృతాలు ఆవిర్భవిస్తాయి.

వేకువ జామున నిద్ర లేవడ మంటే చాలా మందికి దుర్భరంగా ఉంటుంది. అదొక్కటి తప్ప మరే దైనా చెప్పండి అన్న వారిని నేనే చాలా మందిని చూశాను. కాని, నా అనుభవం అందరికీ తెలిసిందే అయినా, తెలియని వారితో పంచుకుంటున్నాను. బ్రహ్మ ముహూర్తంలో నిద్ర లేవడంలో ఉండే తృప్తిని మరొక సమయంలో ఇంతవరకు నేను అనుభవించ లేదు. ఈ వాక్యాలను కూడా ఉదయం మూడు గంటల సమయం లోనే వ్రాస్తున్నాను. అందుకే అంటున్నాను. కష్టాలు ప్రత్యేకంగా లేవు. పిలిస్తే మాత్రం తప్పకుండా వస్తాయి అని. కష్టాలు, భయాలు అంటూ బ్రతుకుల్ని బుగ్గిపాలు చేసుకో కూడదు. కెరటాల మధ్యే కడలి స్నానం చేయాలి. వేదనల మధ్యే సాధనలు సాగాలి. అప్పుడే రాజస త్యాగాలు ఆగుతాయి. సాత్త్విక త్యాగాలు తరువాత శ్లోకం లాగా కదుల్తాయి.

**బ్రతుకంతా రోదన ఆయె**
**సాధన సాగే క్షణమేది?**
**వెలుగు లన్నీ వెతలాయె**
**వేదన తీరే దారేది?**
**పరుగిడు కాలం ఆగదు**
**సాధన తెలిసి సాగాలి**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

ఇక సాత్త్విక త్యాగాన్ని వివరిస్తున్నాడు.

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ 9

**కార్యం-ఇతి-ఏవ-యత్-కర్మ-నియతం-క్రియతే-అర్జున**
**సంగం-త్యక్త్వా-ఫలం-చ-ఏవ-సః-త్యాగః-సాత్త్వికః-మతః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | సంగం | = | అభిమానమును |
| నియతం | = | నియతమైన | ఫలం ఏవ చ | = | ఫలమును కూడా |
| యత్ | = | ఏ | త్యక్త్వా | = | విడిచి |
| కర్మ | = | కర్మము | క్రియతే | = | ఆచరించ బడుతుందో |
| కార్యం ఇతి ఏవ | = | చేయవలసినదియే నని | సః | = | అట్టి |
| త్యాగః | = | త్యాగము | మతః | = | నిర్ణయము |
| సాత్త్వికః | = | సాత్త్విక మైనది యని | | | |



**అర్జునా! విహిత కర్మ చేయ దగిందే నని తెలుసుకొని, అభిమానాన్ని, కర్మఫలాన్ని త్యజించి ఆచరిస్తే అది సాత్త్విక త్యాగ మవుతుంది.**

**వ్యాఖ్య**

**దైవ నియతి - ధర్మ నిరతి**

కర్మ చేయ దగింది. చేయ వలసినది ***( కార్యం కర్తవ్యమ్ ఇతి ).*** ఇది శాస్త్ర విధి లాగా కనిపిస్తుంది. శాసనం లాగా అనిపిస్తుంది. విశ్వ యంత్రాంగంలో తన స్థాన మెక్కడో మనిషికి అవగత మైతే, ఇంతవరకు శాస్త్ర విధిగా అనిపించింది ఇప్పుడు విధ్యుక్త ధర్మంగా కనిపిస్తుంది. ఇది అవగాహన వల్ల ఏర్పడుతుంది. అవగాహన చిగురించడం చేత విశ్వ యంత్రాంగం లోని నియతిని భగ్నం చేసే కార్యాలు తాను ఆచరించ కూడనివి అని అర్థం చేసుకుంటాడు. వాటిని నిషిద్ధ కర్మలుగా గుర్తించి త్యజిస్తాడు. అలా త్యజించడం వ్యక్తి ప్రయోజనం కొరకై చేసినట్లు కనిపించదు. విశ్వ ప్రయోజనానికి చేసినట్లు కనిపిస్తుంది. కాని, బాగా ఆలోచిస్తే వ్యక్తి ప్రయోజనం విశ్వ ప్రయోజనం పైనే ఆధారపడి ఉంది అని తెలుస్తుంది. వ్యక్తి మనస్సులో స్పష్టత వచ్చినపుడు విశ్వంలో నియతి, నియతి రూపంలో నియంత ఎలా ఉన్నది అర్థ మవుతుంది. అంతవరకు కార్యాలను కర్తవ్యాలుగా ***(కర్మాణి కర్తవ్యాని )*** ఆచరించాలి. అది ఒక వైఖరిగా, కర్మ వైఖరిగా ప్రారంభంలో గోచరించినా, ఒక దశలో అది సహజమై, కర్తవ్యంగా, ధర్మంగా అర్థ మవుతుంది.

కార్యం ఎప్పుడైతే చేయ వలసిందై ఉందో, అలాంటి చేయ దగిన కర్మను చేయ వలసిందే గాని త్యజించ డానికి వీలు లేదు. కర్మత్యాగం మన చేతిలో లేక పోయినా, ఫలత్యాగం మన చేతిలో ఉంటుంది. కర్మను ఫలాసక్తితో చేయ వచ్చు. లేదా ఫలాకాంక్ష లేకుండ కూడా చేయ వచ్చు.

చేయ వలసిన కర్మను ***( కార్యం కర్మ ),*** అనగా కర్తవ్యమును కర్మసంగం లేకుండా ***( సంగం త్యక్త్వా ),*** ఫలాసక్తి లేకుండా ***( ఫలం త్యక్త్వా )*** చేయడము సాత్త్విక త్యాగము అనబడుతుంది ***( స త్యాగః సాత్త్వికో మతః )*** అని తన నిశ్చయాన్ని భగవంతుడు తెలియ చేస్తున్నాడు.

నేను చేస్తున్నాను ***( అహం కరోమి )*** అనే అహంకారంతో కర్మను ఆచరించి నపుడు అది నా కర్మ అవుతుంది. ఇదే సంగము, కర్మసంగము. చేయ వలసిన కర్మ ఉండే టప్పుడు, అది నా కర్తవ్య మైనపుడు, ఈశ్వర శాసనంగా అది నాకు ప్రాప్తించి నపుడు, దానిని ఆచరించడానికి అవసరమైన సాధనా లన్నీ సమకూర్చ బడినపుడు, వీటన్నిటిలో ఉన్న నియతి రూపంలో నియంత అయిన పరమేశ్వరుడే శోభించే టప్పుడు, ఇక నా కర్మ ఎక్క డుంది? నేనే చేసే దేముంటుంది? ధర్మాన్ని, కర్తవ్యాన్ని ఆచరిస్తున్నాను. అంతే. విశ్వ యంత్రంలో నా స్థానంలో నేను ఉండి, నా కర్తవ్యాన్ని నేను నిర్వహిస్తున్నాను. అది కూడా నేనుగా చేయడం లేదు. ఈశ్వరుని సేవకుని లాగా చేస్తున్నాను ***( ఈశ్వర భృత్యవత్ అహం కరోమి ).*** ఈ భావనతో కర్తవ్యాన్ని ఆచరించడం వల్ల కర్మసంగము త్యాగం చేయ బడుతుంది.

భృత్యుడు కర్మ చేసే వాడే గాని కర్మసంగము లేని వాడు; ఫలసంగమూ లేని వాడు. స్వామి అనుగ్రహించిన దానిని ప్రసాదంగా స్వీకరించే వాడు భృత్యుడు. యదృచ్ఛా లాభ సంతుష్టుడు. కనుక చేయ దగిన కార్యమును కర్తవ్యముగా, ధర్మముగా నిర్వర్తించే వాడు విధ్యుక్త కర్మలనే ఈశ్వర శాసనంగా భావించి ఆచరిస్తాడు. శాస్త్ర విధిని అనుసరించి ఆచరిస్తాడు కనుక రాగద్వేషాల నుండి విడిపడి ఉంటాడు.

**శ్రుతి స్మృతిభ్యాం సుజనో నియమ్యతే** - సత్పురుషుడు శ్రుతి, స్మృతి నియమానుసారం వర్తిస్తున్నాడు అన్నది శాస్త్రం. కనుక కామ్యకర్మల నుండి విడిపడి నిత్య నైమిత్తిక కర్మలను సంగమును, ఫలమును త్యాగం చేసి ఆచరించే వాడు అంతఃకరణ శుద్ధిని పొందు తున్నాడు.

నిత్య కర్మలకు శాస్త్రము ఎక్కడా ఫలాన్ని చెప్పక పోయినా, భగవ ద్వచనాను సారం నిత్య కర్మలకు కూడా ఫలము కల దని ముందు శ్లోకాల లోనే చెప్పుకున్నాం. అదే అంతఃకరణ శుద్ధి. కాని విధ్యుక్త కర్మలను, కర్మసంగం లేకుండా, ఫలసంగం లేకుండా ఆచరించే భక్తుడు, లేదా కర్మయోగి చిత్తశుద్ధిని కూడా కాంక్షించడు. శాస్త్ర విధి ననుసరించి కర్మలను ఆచరిస్తాడు. శాస్త్ర రూపములో ఉన్నది పరమేశ్వరుడే కనుక, ఈశ్వర శాసనంగా స్వీకరించి ఆచరిస్తాడు. ఇదే శ్రద్ధ. ఇది సాత్త్విక శ్రద్ధ కావడం చేత, అతని సంగ త్యాగము, ఫలత్యాగము సాత్త్విక త్యాగంగా చెప్ప బడ్డాయి ***(స త్యాగః సాత్త్వికో మతః)***.

**సంశయ నివృత్తి**

***కర్మ పరిత్యాగః త్రివిధో మతః*** - కర్మ త్యాగము మూడు విధాలు అని నిర్దేశించిన విషయాన్ని కదా భగవంతుడు వివరిస్తున్నాడు ***(త్యాగః త్రివిధః సంప్రకీర్తితః హి: 18 వ అ - 4 వ శ్లో)***! మరి తామస, రాజస త్యాగముల యందు కర్మ త్యాగమును చెప్పి, మూడవది అయిన సాత్త్విక త్యాగము నందు కర్మను త్యజించ డము గాకుండా, సంగ త్యాగమును, ఫలత్యాగమును చెప్పడం ఎలా సమంజసం? అనేది శంక. అది ఎలా అసమంజసమో చెప్పి శంకను స్థిర పరచడానికి ఒక ఉదాహరణము కూడా ఉంది. వినండి.

'***త్రయో బ్రాహ్మణాః ఆగతాః*** - ముగ్గురు బ్రాహ్మణులు వచ్చారు. ***త్రయో బ్రాహ్మణాః భోజయితవ్యాః*** - ముగ్గురు బ్రాహ్మణులు భోజనం చేయడానికి వచ్చారు. ***తత్ర షడంగ విదౌ ద్వౌ*** - ఆ ముగ్గురిలో ఇద్దరు షడంగాలు తెలిసిన వాళ్ళు. ***క్షత్రియః తృతీయః ఇతి తద్వత్*** - మూడవ వాడు మాత్రము క్షత్రియుడు' అన్నట్లుంది. ముగ్గురు బ్రాహ్మణులు భోజనార్థం వచ్చారు అన్నపుడు మూడవ వాడు క్షత్రియు డెలా అవుతాడు?

అలాగే, కర్మ త్యాగము మూడు విధాలు అని చెప్పి, అజ్ఞానము చేత కర్మను త్యజించడము తామస త్యాగ మని, శరీర కష్టానికి భయపడి కర్మను త్యజించడము రాజస త్యాగమని చెప్పి, సాత్త్విక త్యాగము దగ్గరకు వచ్చే సరికి అసలు కర్మ త్యాగము అనేదే లేదని, విహిత కర్మలను తప్పక చెయ్యాలని, అది కూడా కర్మసంగమును, ఫలసంగమును విడిచి పెట్టి చేయాలి అనడం, ముగ్గురు బ్రాహ్మణులలో మూడవ వాడు క్షత్రియుడు అని చెప్పినట్లు లేదా? అనేది పూర్వ పక్షము.

***న ఏవ దోషః*** - అలా చెప్పడంలో దోషం లేదు. కారణం, రెండిటి లోను - కర్మత్యాగము లోను, ఫలత్యాగము లోను త్యాగమే సామాన్య ధర్మంగా ఉంది కనుక. వాస్తవానికి త్యాగ మంటే కర్మత్యాగం కాదు. ఫలత్యాగమే త్యాగము. ఎందుకంటే, నేను ముందే చెప్పినట్లు కర్మ అనివార్యం కనుక, కర్మత్యాగం మన చేతిలో లేదు. ఫలత్యాగమే మన చేతిలో ఉంది. ప్రారబ్ధం చేతిలో కీలుబొమ్మలై వర్తించే మనకు, కర్మ అధీనంలో ఎలా ఉంటుంది? ఈ సందర్భంలో జాగ్రత్తగా అర్థం చేసుకోవలసిన విషయ మేమిటంటే, నాల్గవ శ్లోకంలో తన నిశ్చయాన్ని చెప్పడానికి పరమేశ్వరుడు ఆరంభించి నపుడు ***త్యాగః త్రివిధః*** - త్యాగము మూడు విధాలు అంటూ సన్యాసమును, లేదా త్యాగమును చర్చనీయాంశముగా పేర్కొన్నాడే గాని కర్మసన్యాసము అనే దానిని ఎక్కడా చర్చనీయాంశంగా స్వీకరించ లేదు.

*సాత్త్విక త్యాగి అయిన అంతఃకరణ శుద్ధి గల ప్రసన్నునికి ఆత్మనిష్ఠ ఎలా కలుగుతూ ఉందో చెబుతున్నాడు.*



**న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।** 10
**త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥**

***న-ద్వేష్టి-అకుశలం-కర్మ-కుశలే-న-అనుషజ్జతే***
***త్యాగీ-సత్త్వసమావిష్టః-మేధావీ-ఛిన్నసంశయః***

సత్త్వ సమావిష్టః = సత్త్వగుణ సమేతుడు
మేధావీ = జ్ఞానవంతుడు
ఛిన్న సంశయః = సంశయ రహితుడు
త్యాగీ = త్యాగశీలుడు
అకుశలం = బంధ హేతువైన
కర్మ = కర్మమును
న ద్వేష్టి = ద్వేషింపడు
కుశలే = సత్కర్మ యందు
న అనుషజ్జతే = ఆసక్తిని పొందడు

**అర్జునా! సత్త్వగుణం కల వాడు, మేధావి, సంశయ రహితుడు, త్యాగశీలుడు బంధహేతు వైన కర్మలను ఎన్నడూ ద్వేషించడు. సత్కర్మల యందు ఆసక్తి చూపడు.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో మనం చూచినట్లు కర్మసంగాన్ని, ఫలసంగాన్ని త్యజించి, నిత్యకర్మల చేత సంస్కరింప బడిన సాత్త్విక త్యాగి యొక్క బుద్ధి శుద్ధి పడుతుంది. అలా శుద్ధి పడిన బుద్ధి విశుద్ధమై, ప్రసన్న మవుతుంది. మల దోషము నుండి విడిపడి నందున విశుద్ధ మైతే, సంస్కరింప బడినందున ప్రసన్న మైందని భావము. అట్టి బుద్ధి ఆత్మసాక్షాత్కారానికి సమర్థ మవుతుంది ***(విశుద్ధం ప్రసన్నం ఆత్మావలోకన క్షమం భవతి)***. ఈ విధమైన ఆత్మనిష్ఠ ఎలా ప్రాప్తిస్తుందో ప్రస్తుత శ్లోకంలో స్పష్టం చేస్తున్నాడు. ఎవడైతే కర్మసంగమును, ఫలసంగమును విడిచి పెట్టి, నిత్యకర్మానుష్ఠానం వల్ల బుద్ధిని శుద్ధి చేసుకుంటాడో అతడే త్యాగి, సత్త్వ సమావిష్టుడు.

**సత్త్వసమావిష్టుడు**

మనస్సులో రజ స్తమస్సులను, వాటి కార్యాలకు సంబంధించిన సంస్కారమును దూరం చేసుకొని, కేవలం నిత్యానిత్య వస్తు వివేక జ్ఞానానికి ఉపకరించే సత్త్వగుణముతో బుద్ధిని పరిపాకం చేసుకుని, అట్టి బుద్ధితో కూడి యున్న వాడు సత్త్వసమావిష్టుడు. ఆత్మానాత్మ జ్ఞాన హేతువైన సత్త్వముతో సమాయుక్తుడు అని అర్థము ***(సత్త్వసమావిష్టః - యదా సత్త్వేన ఆత్మానాత్మ వివేక విజ్ఞాన హేతునా సమావిష్టః సంవ్యాప్తః సంయుక్తః ఇత్యేతత్)***. అందుచేత సత్త్వసమావిష్టుడు మేధావి అవుతాడు.

**మేధావి**

మేధావి అంటే స్థిరమైన బుద్ధి కల వాడు. ప్రబోధ సమయము నందే తాను బ్రహ్మ మనే బ్రహ్మాత్మ జ్ఞానమును పొందిన వాడు. ఆత్మజ్ఞాన రూపమైన బుద్ధిని, లేదా ప్రజ్ఞను మేధ అంటారు. మేధా రూపమైన బుద్ధి బలంతో శోభించే వాడు మేధావి ***(మేధయా ఆత్మజ్ఞాన లక్షణయా ప్రజ్ఞయా సంయుక్తః)***.

మేధావి అంటే, బహుగ్రంథ ధారణ సామర్థ్యం కల వాడు అని కూడా అర్థము. బుద్ధి లోని ఈ ధారణా శక్తియే బుద్ధి బలం. అదే బుద్ధి లోని తేజస్సు. వాస్తవం చెప్పాలంటే అదే బ్రహ్మ తేజస్సు. పరమాత్మ తేజము. ఈ సత్యాన్ని ***తేజ స్తేజస్వినా మహమ్*** అని గీత విజ్ఞాన యోగంలో భగవంతుడు ప్రబోధించాడు. మేధావి అయినందున సంశయ రహితుడు అవుతాడు. మనస్సులో సంశయాలనే సంకటాలను దూరం చేసుకున్న వాడు అవుతాడు.

### ఛిన్న సంశయుడు

ఆత్మ సంబంధమైన సుస్థిర జ్ఞానము కల వాడు మేధావి అన్నప్పుడు, అట్టి మేధావి ఆత్మజ్ఞానంతో ప్రకాశిస్తూ ఉంటాడు కనుక, అతని బుద్ధిలో అజ్ఞాన జనితమైన సంశయాలు ఎలా ఉంటాయి? అందుచేత అతడు ఛిన్న సంశయుడు. అవిద్యాకృత సంశయాల నుండి విడిపడిన వాడు (***అవిద్యాకృతః సంశయః ఛిన్నః ఛిన్న సంశయః***).

అజ్ఞాన కృతమైన సంశయాలు ఛిన్న మయ్యాయి అంటున్నాడు. అలా ఛిన్నమైన సంశయాలు ఏ అజ్ఞానానికి సంబంధించినవి? మోక్షానికి సాక్షాత్తు సాధనము కర్మమా? ఉపాసనమా? జ్ఞానమా? యోగమా? జ్ఞానకర్మ సముచ్చయమా? అలాగే, జీవబ్రహ్మలు భిన్నులా? లేక అభిన్నులా? సత్యము ద్వైతమా? లేక అద్వైతమా? జగత్తు సత్యమా? లేక మిథ్యయా? మోక్షము ధ్యాన గమ్యమా? లేక జ్ఞాన గమ్యమా? ఇవన్నీ సంశయాలే.

ఒక్క మాటలో చెప్పాలంటే, ప్రమేయగత సంశయము, ప్రమాణగత సంశయము అనే ప్రధాన సంశయాలు మనస్సు నుండి తొలగి పోయిన మేధావి ఛిన్నసంశయుడు. సంశయ విచ్ఛిన్నము అనేది జ్ఞాన లక్షణము. పరమాత్మ సాక్షాత్కారము తోనే శోభించే లక్షణము.

***భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యన్తే సర్వ సంశయాః***
***క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥***

పరమాత్మ సాక్షాత్కారముతో అజ్ఞాన ముడి విడి పోతుంది. సందేహా లన్నీ పటాపంచ లవుతాయి. కర్మ లన్నీ నశించి పోతాయి అని ముండకోపనిషత్తు *(2 - 2 - 9)*.

సర్వ జ్ఞానము ప్రాప్తించిన వారికే సంశయాలు సంపూర్ణంగా నశిస్తాయి. అంటే, ఏ విషయం లోను సంశయాలు లేకుండా ఉండాలి. అన్ని విషయాలు తెలిసి ఉండాలి. ప్రతి విషయము ప్రత్యక్షంగా దర్శనీయమై ఉండాలి. అలాంటి వాడే ఛిన్న సంశయుడు.

***కరతలామలక వత్ సర్వం సాక్షాత్కృత వతః క్వాపి నాస్తీతి ఛిన్నసంశయః*** - అరచేతిలో అమలకం లాగా సమస్తము ఎవరికి సాక్షాత్కృతమై ఉంటుందో అతడు ఛిన్న సంశయుడు.

ఛిన్న సంశయుడైన మేధావి సత్త్వసమావిష్టుడు కావడం చేత, విషయ ప్రపంచం అతనిపై ప్రభావాన్ని చూప లేదు. అలాగే కర్మల ప్రభావం కూడా అతనిపై ఉండదు. కారణం, అతడు రాగద్వేషాల నుండి విడిపడి పోయాడు. కనుకనే సత్త్వ సమావిష్టుడు.

సత్కర్మ యందు సంతసించడం, ఆసక్తిని కలిగి ఉండటం, అసత్కర్మ యందు, అంటే బంధ హేతు వైన కర్మ యందు ద్వేషాన్ని కలిగి ఉండటం - సాధారణంగా మానవ స్వభావం కర్మల విషయంలో ఇలా ఉండటం మనం చూస్తూ ఉంటాము. కాని, సత్త్వ సమావిష్టుడు కర్మల విషయంలో దానికి భిన్నంగా వ్యవహరిస్తాడు.

అకుశలమైన కర్మను ద్వేషించడు. అకుశల కర్మ అంటే కామ్యకర్మ, అశోభన కర్మ అని అర్థము (***అకుశలం అశోభనమ్ కామ్యం కర్మ***). కామ్యకర్మ జన్మను ప్రసాదించి సంసార కారణ మవుతూ ఉందని దానిని ద్వేషించడు (***న ద్వేష్టి***).

అలాగే నిత్యకర్మ అంతఃకరణ శుద్ధిని కలిగించి జ్ఞాననిష్ఠకు హేతువు అవుతూ ఉందని కుశలకర్మ యందు, శోభన కర్మ యందు ఆసక్తిని పెంచుకోడు. నిరాసక్తుడై ఉంటాడు (***న అనుషజ్జతే***).



అనుకూలాలను, ప్రతికూలాలను కర్మలలో చూడటం లేదు అంటే, అతడు ప్రియాప్రియాలకు అతీతుడై ఉన్నాడు. అతనికి ఆత్మ ఒక్కటే ప్రియవస్తువై ఉంది. అతడు విధి నిషేధాలకు అతీతుడు. కృతకృత్యుడు కావడం చేత కర్తృత్వ, భోక్తృత్వాది అభిమాన రహితుడు.

త్యాగిని గూర్చి తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.

**న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః ।** 11
**యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే ॥**

***న-హి-దేహభృతా-శక్యం-త్యక్తుం-కర్మాణి-అశేషతః***
***యః-తు-కర్మఫలత్యాగీ-సః-త్యాగీ-ఇతి-అభిధీయతే***

| | | | |
|---|---|---|---|
| దేహభృతా | = శరీరధారికి | యః తు | = ఎవడైతే |
| అశేషతః | = సంపూర్ణముగ | కర్మఫల త్యాగీ | = కర్మఫలములను విడుచు చున్నాడో |
| కర్మాణి | = కర్మలను | సః | = వాడు |
| త్యక్తుం | = విడుచుటకు | త్యాగీ ఇతి | = త్యాగి యని |
| న శక్యం హి | = సాధ్యము గాదు | అభిధీయతే | = చెప్పబడు చున్నాడు |

**అర్జునా! దేహమును ధరించిన వాడు కర్మలను సంపూర్ణంగా విడవడం సాధ్యం కాదు. కర్మఫలాన్ని ఎవడు విడిచి పెడతాడో వాడే త్యాగి.**

### వ్యాఖ్య

దేహమును ధరించిన వానిని దేహభృత్ అంటారు. అంటే, దేహమే ఆత్మ అనే దేహాత్మ భావము కలిగిన వాడు, లేదా దేహాభిమానము కల వాడు దేహభృత్ (***దేహాత్మ అభిమాన వాన్ దేహభృత్ ఇతి ఉచ్యతే***). ఇతడు అవివేకి.

వివేకవంతుడు తాను దేహము అని భావించడు. వివేకము, అంటే ఆత్మానాత్మ వివేకము. అట్టి వివేకము కల వివేకి, ఆత్మే తాను, దేహము తాను కాదనే వివేక జనిత జ్ఞానం కల వాడు కనుక అతడు దేహభృత్ కాడు. ఆత్మ పుట్టేది కాదు, చచ్చేదీ కాదు అనే జ్ఞానము కలిగిన వాడు *(2 వ అ - 21 వ శ్లో)* కావడం చేత అతడు కర్తృత్వాభిమానము లేని వాడై ఉంటాడు. అతడు దేహమును కలిగి ఉన్నా, తాను దేహము అనే భావం లేకుండా ఉంటాడు. అలాంటి వానికే సర్వ కర్మ సన్యాసం సాధ్య పడుతుంది కాని దేహభృత్తుకు సాధ్యం కాదు. దేహాభిమాన రహితుడై, పరమార్థ దర్శనం చేయ గలిగిన వానికే కర్మసన్యాసం శక్య మవుతుంది (***పరమార్థ దర్శి నైవ అదేహ భృతా దేహాత్మ భావ రహితేన అశేష కర్మసంన్యాసః శక్యతే కర్తుమ్***).

కాని, దేహభృత్తు 'నేనే కర్తను' అనే కర్తృత్వాభిమానంతో ఉంటాడు కనుక, అతడికి సర్వకర్మ సన్యాసము సాధ్యము కాదు. అలాంటి వాడు విహిత కర్మాచరణం చేస్తూ కర్మఫల త్యాగమును అలవరచుకోవాలి. కనుక, ఆత్మజ్ఞానం లేని ఏ అవివేకి, నిత్యకర్మలను ఆచరిస్తూ ఫలాభిసంధిని త్యజిస్తాడో, అతడు కర్మలను ఆచరించినా, ఫలత్యాగము చేయడం చేత త్యాగి అని చెప్ప బడ్డాడు (***నిత్యాని కర్మాణి కుర్వన్ కర్మఫలత్యాగీ త్యాగీ ఇత్యభి ధీయతే***).

కనుక త్యాగి అంటే, విషయాలను త్యజించిన వాడు అని కాదు. కర్మలను త్యజించిన వాడు అని కూడా

కాదు. కర్మఫలాలను త్యాగం చేసిన వాడు అని అర్థం. కర్మలను విడిచి పెట్టిన వాడు కర్మలను విడిచిన వాడు అవుతాడే గాని మనస్సు లోని ఫలాశను విడిచి పెట్టిన వాడు కాడు.

నిత్య కర్మలను ఆచరిస్తూ, కర్మఫలాలను త్యాగం చేయడం చేత, త్యాగికి కర్మల యందు ద్వేషమూ ఉండదు. రాగమూ ఉండదు. వీటిని నేను త్యజించాను అనే భావన కూడా ఉండదు. రాగద్వేషాలను త్యజించి కర్మల యందు శుద్ధి పడటమే గాక, ఏ త్యాగ గుణం చేత ఆ రెండిటిని త్యజించడం జరిగిందో, ఆ త్యాగ గుణం చేతనే నేను త్యజించాను అనే భావాన్ని కూడా త్యజించిన వాడు త్యాగి అవుతాడు. సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను అధిగమిస్తాడు.

***ఉభేసత్యానృతేత్యక్త్వా యేన త్యజసి తత్త్యజ*** - సత్యాసత్యాలను త్యజించి, దేని చేత వాటిని త్యజించడము జరిగిందో, దానిని కూడా త్యజించు అన్నది ఉపనిషత్తు (***యేన త్యజసి తత్ త్యజ***). త్యజించాను అనే భావనను త్యజించడమే నిజమైన త్యాగము అని ఉపనిషత్ అభిప్రాయ పడింది.

*ఇక, సర్వకర్మ పరిత్యాగము యొక్క ప్రయోజనాన్ని చెబుతున్నాడు.*

**అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।**
**భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్ ॥** **12**

***అనిష్టం-ఇష్టం-మిశ్రం-చ-త్రివిధం-కర్మణః-ఫలం***
***భవతి-అత్యాగినాం-ప్రేత్య-న-తు-సంన్యాసినాం-క్వచిత్***

| | | | |
|---|---|---|---|
| అనిష్టం | = ఇష్టము కానిది | అత్యాగినాం | = త్యాగులు కాని వారికి |
| ఇష్టం | = ఇష్ట మైనది | ప్రేత్య | = మరణానంతరము |
| మిశ్రం చ | = మిశ్రమ మైనది | భవతి | = కలుగుతుంది |
| త్రివిధం | = మూడు విధములైన | సంన్యాసినాం తు | = సన్యాసులకు |
| కర్మణః | = కర్మలకు | క్వచిత్ | = ఎప్పుడును |
| ఫలం | = ఫలము | న భవతి | = కలుగదు |

**ఇష్టము, అనిష్టము, మిశ్రమము అనే మూడు విధాలైన కర్మఫలము త్యాగులు కాని వారికి మరణానంతరము కలుగుతుంది. సన్యాసులకు ఎప్పుడూ కలగదు.**

**వ్యాఖ్య**

న్యాసము అంటే త్యాగము. సన్యాసము అంటే సరియైన త్యాగము (***సమ్యక్ న్యాసః ఇతి సంన్యాసః***). ఫల త్యాగములో గాని, కర్మత్యాగములో గాని త్యాగమే ప్రధానంగా ఉంది కనుక, ఏది సన్యాసము చేత పొంద బడుతుందో అదే కర్మయోగము చేత కూడా పొంద బడుతుంది అని మనం పూర్వమే చెప్పుకొని ఉన్నాము (*5వ అ - 5 వ శ్లో*).

ఆత్మజ్ఞానం లేకుండా, నిత్య కర్మలను ఆచరిస్తూ, ఫలత్యాగము చేసే వాడు కర్మయోగి. ఆత్మజ్ఞానియై, దేహాభిమానం లేని వాడై, కర్మల నాచరించినా, తనను అకర్తగా భావించే వాడు సర్వ కర్మ సన్యాసి.

ఇరువురిలో కూడా త్యాగము ప్రధానంగా తెలుస్తూ ఉంది. అదే న్యాసము. కర్మయోగిలో న్యాస ముంది. జ్ఞానిలో సన్యాస ముంది. కనుక, జ్ఞానిది పరమార్థ సన్యాసము. ముఖ్య సన్యాసము. అలా చూచి నపుడు



ఆత్మజ్ఞానం లేని కర్మయోగిది గౌణ సన్యాసము. కర్మఫల త్యాగము ఇరువురికీ సమానంగా ఉన్నా, ఒకటి ముఖ్యము, మరొకటి గౌణము అని ఎలా చెప్ప బడుతోంది? అందుచేత, మరొక విశేషము చెప్ప వలసి ఉంది. ఫలత్యాగము సన్యాస మని ఎలా చెప్ప బడుతుంది? అది ప్రస్తుత శ్లోకంలో విస్పష్ట మవుతుంది.

**ఫలత్రయము**

జీవుల కర్మఫలాలు మూడు విధాలుగా ఉంటాయి. ఈ ఫలాలే మరణానంతరము జన్మలను నిర్ణయిస్తాయి. అంటే, సర్వకర్మ ఫలత్యాగము చేయని కర్మిష్ఠులు ఆచరించే పుణ్య పాప కర్మలకు దేహ త్యాగానంతరము ప్రాప్తించే ఫలాలు అని అర్థము.

మొదటిది అనిష్ట ఫలం. అది నరకము కావచ్చు. లేదా జంతు జన్మ కావచ్చు. ఈ ఫలాన్ని ఎవ్వరూ ఇష్ట పడరు కనుక ఇది అనిష్టం. ఇష్ట పడనిది, కష్ట మైనది ఎందుకు ప్రాప్తిస్తుంది అంటే, దీనికి సంబంధించిన కారణ మైన కర్మను పూర్వం ఇష్టంతో ఆచరించారు కనుక. అధర్మ కార్యాలకు, పాప కర్మలకు ఫలితంగా అనిష్ట ఫలం మరణానంతరం లభిస్తుంది (***అనిష్టం నరక తిర్యగాది లక్షణం***).

రెండవది ఇష్టఫలం. దేవతల రూపాన్ని పొందే స్వర్గం. ధర్మకార్యాలను, ఇష్టాపూర్త పుణ్య కర్మలను ఆచరించిన దానికి ఫలమే ఇష్టఫలం. ఎవరికీ కష్టం కానిది. సుఖ రూప మైనది. దుఃఖ రహిత మైనది (***ఇష్టం దేవాది లక్షణం***).

మూడవది మిశ్రమ ఫలం. ఇష్టానిష్టములు కలిసిన ఫలం. అంటే ధర్మాధర్మాల వలన ప్రాప్తించిన పుణ్య పాప ఫలాలు. పుణ్యం ఇష్టఫలం. పాపం అనిష్ట ఫలం. ఈ రెండూ ప్రాప్తించడానికి ఈ రెండిటికి సంబంధించిన ధర్మాధర్మ కార్యాలను, పుణ్యపాప కర్మలను పూర్వం ఆచరించడమే కారణము. దీని ఫలితంగా శుభాశుభాలను, సుకృత దుష్కృతాలను కలిసి ఒకే దేహంలో అనుభవించ డానికి మానవ జన్మము ఫలంగా ప్రాప్తిస్తుంది (***మిశ్రమ్ ఇష్టా నిష్ట సంయుక్తం మనుష్య లక్షణం చ***).

**ఫల రూపము**

అసలు ఫలము అంటే ఏమిటి? దాని స్వభావ స్వరూపా లేమిటి? ఫల నిర్వచన మేమిటి? వినండి. ఏ ఫలమైనా అల్పమే, స్వల్పమే గాని అనంతము కాదు. ఇది ముందుగా అర్థం కావాలి. దీనినే సంస్కృతంలో **ఫల్గు** అంటారు. ఫల్గు అంటే స్వల్పం. స్వల్ప మైంది ఏదైనా పరిమితమే కనుక ఒక కాలంలో అగుపించి మరొక కాలంలో అదృశ్య మవుతుంది. అదే ఫల మంటే. కనుక ఫల నిర్వచనములో రెండే విషయాలు ఉన్నాయి. అవే ఫలం అల్పం, ఫలం అదర్శనం (***ఫల్గుతయా లయం అదర్శనం గచ్ఛతీతి ఫలం ఇతి ఫల నిర్వచనమ్ !***).

క్షణక్షణానికి మారే లక్షణం కర్మకు ఉంది. కర్మలో ఏ లక్షణము ఉందో, ఫలంలో అదే లక్షణం ఉంటుంది. మిశ్రమ కర్మ ఫలంగా ప్రాప్తించేది మానవ జన్మ కనుక క్షణక్షణం మానవులలో అనియత స్వభావాన్ని స్పష్టంగా చూడ వచ్చు.

నిన్న ఉన్నట్లు నేడు ఉండరు. మొన్న తిన్నట్లు రేపు తినరు. నేడు చేసేది నిన్న చెయ్యలేదు. ఉదయం ఒక లాగా ఉంటారు. సాయంత్రం మరోలా ఉంటారు. ఎవరు ఎప్పుడు ఎలా ఉంటారో ఎవరికీ అర్థం కాదు. ఒకరు అర్థం కాకపోతే వచ్చే నష్టం పెద్దగా లేక పోవచ్చు. కాని, తమకు తామే అర్థం కారు. ఇదొక విచిత్రం. ఫలాల ప్రతిరూపం.

పైగా, నే నెప్పుడు ఎలా ఉంటానో, ఎప్పుడు ఏం చేస్తానో నాకే తెలియదండీ! అనేది కొసమెరుపు. ఒక

వికృతపు విరుపు. ఇలా ఎందుకు జరుగుతుందో తెలుసా? ప్రారబ్ధాలు ప్రత్యక్షాలు కావు కనుక. వెనుక అదృశ్యంగా ఉండి, మనుషుల్ని ముందుకు నెట్టే ప్రారబ్ధాన్ని చూసే సందర్భం, ఆపే అవకాశం మనిషికి లేదు కనుక.

ఈ ఫలాలన్నీ త్యాగులు కాని వారికే ప్రాప్తిస్తాయి. జ్ఞానులు కాని వారికే లభిస్తాయి. అంతే గాని, ఫలత్యాగం చేసిన వారికి ప్రాప్తించవు. సర్వకర్మ సన్యాసులకు సంభవించవు (*న తు సంన్యాసినాం క్వచిత్*). తాను అకర్త అని భావించే సర్వకర్మ సన్యాసికి కర్మఫలం ఎలా అందుతుంది? నిజమే. అంతవరకు బాగుంది. మరి, కర్మయోగి, గౌణ సన్యాసి విషయ మేమిటి? కర్మయోగి కూడా త్యాగియే కనుక చిత్తశుద్ధి ద్వారా తాను కూడా ఒక దశలో తప్పక సర్వ కర్మ సన్యాసి అవుతాడు. అలా కావాలి అనేదే భగవంతుని అభిమతం.

*సర్వకర్మ సన్యాసం జ్ఞానికే గాని అజ్ఞానికి కాదు. అదే చెబుతున్నాడు.*

**పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।**
**సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥** **13**

***పంచ-ఏతాని-మహాబాహో-కారణాని-నిబోధ-మే***
***సాంఖ్యే-కృతాంతే-ప్రోక్తాని-సిద్ధయే-సర్వకర్మణాం***

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా! | ఏతాని | = ఈ |
| సర్వకర్మణాం | = సర్వకర్మల యొక్క | పంచ | = అయిదైన |
| సిద్ధయే | = సిద్ధి కొరకు | కారణాని | = కారణములను |
| సాంఖ్యే | = జ్ఞాన సంబంధమైన | మే | = నా వలన |
| కృతాంతే | = సిద్ధాంతము నందు | నిబోధ | = తెలుసుకో! |
| ప్రోక్తాని | = చెప్పబడిన | | |

**అర్జునా! కర్మలు సిద్ధించడానికి వేదాంతము నందు అయిదు కారణాలు చెప్ప బడ్డాయి. అవి నీకు చెబుతా. విను.**

**వ్యాఖ్య**

పరమార్థమును దర్శించిన సన్యాసులకే సర్వ కర్మ సన్యాసము సాధ్యము అని తెలుసుకున్నాం. సర్వ కర్మ సన్యాసులు కావడం చేత వారికి ఇష్టానిష్ట మిశ్రమ రూప త్రివిధ కర్మఫలము సంభవించదు అని కూడా తెలుసుకున్నాం.

దేహధారులైన వారికి సర్వకర్మ సన్యాసము శక్యము కాదు. దానికి హేతు వేమిటి? కర్మకు కారణాలైన అధిష్ఠాన పంచకము నందు తాదాత్మ్యాభిమానమే. ఈ విషయాన్ని వరుసగా నాలుగు శ్లోకాలలో చెబుతున్నాడు. సర్వ కర్మలు సిద్ధించడానికి ఐదు కారణాలు ఉన్నాయని చెబుతూ ఉన్నాడు. ఏవైతే కర్మసిద్ధికి కారణాలుగా చెప్పబడు తున్నాయో అవే ఆత్మస్వరూప మని, స్వస్వరూప మని భావించడం చేత అజ్ఞానికి సర్వకర్మ సన్యాసము సాధ్య పడటం లేదు.

కర్మ లన్నీ సుఖార్థమే ఉన్నాయి. కాని సుఖ మనేది స్వరూప విషయమే గాని, స్వరూపము నందు ఆరోపించ బడిన మిథ్యా సంబంధ మైనది కాదు. కర్మసిద్ధికి కారణాలైన ఐదు విషయాలు అవిద్య చేత ఆత్మ యందు



ఆరోపించబడి ఉన్నవి కనుక, ఆరోపితాలకు ఆధారమై, అధిష్ఠానమై, అకర్తగా శోభిస్తున్న ఆత్మే తానని తెలుసుకొని ఉన్నందున, ఆత్మజ్ఞాని యైన సన్యాసికి సర్వ కర్మ సన్యాసము సాధ్య మవుతూ ఉంది.

కర్మ వైదిక మైనా, లౌకిక మైనా, దానిని ఆచరించ డానికి, ఫలమును పొందటానికి, ప్రస్తుతం చెప్ప బోయే ఇవి (*ఏతాని*) ఐదు కారణాలుగా చెప్ప బడ్డాయి (*పంచ ఏతాని కారణాని*). అర్జునా! ఇవి నా నుండి తెలుసుకో (*నిబోధ*) అంటున్నాడు. అర్థం చేసుకో మంటున్నాడు.

'నిబోధ' - అర్థం చేసుకో! అనడంలో లోతైన భావ ముంది. ఇక్కడ విషయం మారిందని తెలియ చేయడానికి 'నిబోధ' - అర్థం చేసుకో అంటున్నాడు. అంతేగాక, దీనిని అర్థం చేసుకో అని చెప్పడంలో 'ఆ అయిదు విషయాల మధ్య ఉన్న అంతరాన్ని తెలుసుకోవాలే గాని, వాటిపై మనస్సును నిలపకూడదు' అనేది కూడా అంతరార్థం.

తెలుసుకో దగిన కర్మసిద్ధి హేతువు లైన ఈ అయిదు కారణాలు ఏ శాస్త్రంలో ప్రతిపాదించ బడ్డాయో ఆ శాస్త్రమును సాంఖ్యము (*సాంఖ్యే*) అంటారు. సాంఖ్యము అంటే వేదాంతము. **కృతాన్తే** అనేది దానికి పర్యాయ పదము.

కృతము అంటే కర్మ అని అర్థము (***కృత మితి కర్మ ఉచ్యతే***). దానికి పరిసమాప్తి ఎక్కడో, అంటే ఈ కర్మ ఎక్కడ అంతమును పొందుతుందో, విలీన మవుతుందో అది కృతాంతము (***తస్య అంతః కృతస్య పరి సమాప్తిః యత్ర స కృతాంతః***). అదే సాంఖ్యము. పరిశుద్ధమైన ఆత్మతత్త్వ విజ్ఞానము. అదే వేదాంతము. వేదాంతము నందు కర్మ సిద్ధికి హేతువులుగా చెప్ప బడుతున్న ఐదు కారణాలను వివరిస్తున్నాడు. కర్మ లన్నీ తిరిగి అకర్త యైన ఆత్మ యందే విలీన మౌతున్నాయి.

*ఆ ఐదు కారణాలను వివరిస్తున్నాడు.*

**అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**
**వివిధాశ్చ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్ ॥** **14**

***అధిష్ఠానం-తథా-కర్తా-కరణం-చ-పృథగ్విధం***
***వివిధాః-చ-పృథక్-చేష్టాః-దైవం-చ-ఏవ-అత్ర-పంచమం***

| | | | |
|---|---|---|---|
| అధిష్ఠానం | = దేహమును | పృథక్ | = వేర్వేరైన |
| తథా | = అలాగే | చేష్టాః చ | = క్రియలు |
| కర్తా | = కర్తయు | అత్ర | = వీని యందు |
| పృథగ్విధం | = వివిధములైన | దైవం చ ఏవ | = దైవమును |
| కరణం చ | = ఇంద్రియములను | పంచమం | = అయిదవ కారణము |
| వివిధాః | = నానా విధములైన | | |

**అర్జునా! శరీరము, కర్త, ఇంద్రియాలు, వివిధ ప్రాణ చేష్టలు, ఐదవది దైవము - ఈ ఐదు కర్మ కారణాలు.**

**వ్యాఖ్య**

సర్వ కర్మలకు కారణములైన ఐదు విషయాలను చెబుతున్నాడు. అవి (1) అధిష్ఠానము (2) కర్త (3)కరణము (4) ప్రాణ చేష్టలు (5) దైవము. కర్మలు సిద్ధించడానికి ఈ ఐదు కారణములు.

**(1) అధిష్ఠానము**

అధిష్ఠానము అంటే ఆధారము, లేదా ఆశ్రయము అని అర్థము. కర్మ హేతువు లైన వాటన్నిటికి అధిష్ఠానము, అంటే ఆశ్రయ స్థానమై ఉన్నందున శరీరము అధిష్ఠానము. ఏ కర్మ అయినా ఇక్కడ నుండే ప్రారంభం కావాలి. ఏ కర్మ అయినా ఇక్కడే సిద్ధించాలి. అందుచేత దీనిని భోగాయతనం అని కూడా అంటారు. ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖ, జ్ఞానాదులు అభివ్యక్తం కావడానికి ఆశ్రయ మైనది కావడం చేత శరీరము అధిష్ఠానము ***(అధిష్ఠానం ఆశ్రయం శరీరం)***.

**(2) కర్త**

ఉపాధి లక్షణంతో, అవిద్యా కల్పితమైన భోక్తయే కర్త ***(తథా కర్తా ఉపాధి లక్షణః అవిద్యా కల్పితో భోక్తా)***. కర్త అంటే అహంకారము ***(అహం కర్తా అహంకారః)***. అంతఃకరణ రూప చైతన్యము. చిదాభాస చైతన్యము. బుద్ధి యందు చైతన్యము యొక్క ప్రతిబింబము పడుట వలన 'నేను' అనే అహం వృత్తి పుడుతుంది. అదే అహంకారము. జీవ స్వరూపము ***(చిచ్ఛాయా ఉ వేశతో బుద్ధౌ భానం అహం కృతిః)***.

**(3) కరణం**

శబ్దాదుల జ్ఞానం కలగడానికి సాధనా లైన శ్రోత్రాది ఇంద్రియాలు కరణం అని చెప్ప బడ్డాయి. శ్రోత్రాది పంచ జ్ఞానేంద్రియాలు, త్వగాది పంచ కర్మేంద్రియాలు, మనోబుద్ధులు వెరసి పన్నెండు ఇంద్రియాలు కరణాలు.

విషయ జ్ఞానాన్ని పొందడానికి, తిరిగి కర్మలు ఆచరించడానికి శరీరాన్ని ఆశ్రయంగా పొంది ప్రవర్తించే ఇంద్రియాలే కరణాలు. సంకల్పించే మనస్సు, నిశ్చయించే బుద్ధి కూడా అంతఃకరణాలే కనుక, ఈ పన్నెండు ఇంద్రియాలు కరణాలు ***(కరణం చ నానా ప్రకారం ద్వాదశ సంఖ్యం)***.

**(4) ప్రాణ చేష్టలు**

వివిధములైన ప్రాణచేష్టలు నాల్గవది. అంటే, వాయు సంబంధమైన ప్రాణాపానాది దశవిధ వాయువులు ***(వివిధాః చ పృథక్ చేష్టాః వాయవీయాః ప్రాణా పానాదయః)***.

**(5) దైవము**

చక్షురాది ఇంద్రియ వ్యాపారాలకు అధిష్ఠాన దేవతా రూపంలో ఉన్న దైవాలు అధిష్ఠావ దేవతలు. ఈ అయిదింటిని అధిష్ఠానాది పంచకము అంటారు. ఈ ఐదే సర్వ కర్మలకు హేతుభూతమై ఉన్నాయి.

*మానవుడు త్రికరణములతో, అంటే వాఙ్మనః కాయములతో చేసే ఏ కర్మ కైనా ఈ ఐదే కారణ మని చెబుతున్నాడు.*

**శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః ।**
**న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః ॥** 15

***శరీరవాఙ్మనోభిః-యత్-కర్మ-ప్రారభతే-నరః***
***న్యాయ్యం-వా-విపరీతం-వా-పంచ-ఏతే-తస్య-హేతవః***

న్యాయ్యం వా = న్యాయబద్ధముగ గాని
విపరీతం వా = అన్యాయముగ గాని
శరీర వాఙ్మనోభిః = శరీరము, వాక్కు మనస్సుల చేత
యత్ = ఏ
కర్మ = కర్మను
నరః = నరుడు



ప్రారభతే = ప్రారంభిస్తున్నాడో
తస్య = ఆ కర్మమునకు
ఏతే = ఈ
పంచ = అయిదును
హేతవః = కారణములు

**అర్జునా! మనోవాక్కాయాల చేత మనిషి ఆరంభించే కర్మ, అది న్యాయ సమ్మత మైనా, దానికి విపరీత మైనా, దానికి ఈ ఐదు కారణాలుగా ఉంటాయి.**

**వ్యాఖ్య**

**సాధనాలు - కారణాలు**

మానవులు ఆచరించే కర్మలు కాయకం, వాచికం, మానసం అని త్రివిధములుగా ఉంటాయి. న్యాయమైన కార్యమైనా, లేక దానికి విపరీతమైన దైనా; శాస్త్ర విహితమై ధర్మ సమ్మతమైన కార్యమైనా, లేక అశాస్త్రీయంగా అధర్మ యుతమైన కార్యమైనా - అది ఈ మూడిటిలో ఏదో ఒకటై ఉంటుంది.

మనిషి చేసే కర్మ కాయకం, వాచికం, మానసం అని మూడు విధాలు. దేహం ద్వారా చేసే కర్మ కాయకం. వాక్కు ద్వారా చేసే కర్మ వాచికం. మనస్సు ద్వారా చేసే కర్మ మానసం. ఈ విధమైన కర్మలకు - అవి ధర్మ యుతాలైనా, లేక ధర్మానికి భిన్నమైన వైనా, పూర్వ శ్లోకంలో మనం చూచిన ఐదు విషయాలే కారణాలుగా ఉన్నాయి ***(పంచ ఏతే యథోక్తాః తస్య సర్వస్య ఏవ కర్మణః హేతవః కారణాని)***.

మానవులు ఏ కార్యం చేసినా శరీరము, వాక్కు, మనస్సు అనే మూడింటి సహాయం తోనే చేయాలి. అది న్యాయ మైనది కావచ్చు. లేదా దానికి అన్య మైనది, అంటే విపరీతమైన దైనా కావచ్చు. ఏదైనా, ఈ మూడిటితో కలిసే చేయాలి. వీటిలో ఒకటి ప్రధానంగా ఉండి, మిగిలిన రెండు అముఖ్యంగా ఉండ వచ్చు. ఎలా ఉన్నా, ఈ మూడిటి ద్వారానే ఏ కార్యమైనా ఆరంభించ బడాలి. ***ప్రవృత్తిః వాగ్బుద్ధి శరీరారంభః*** అని గౌతమ మహర్షి న్యాయ దర్శనంలో సూత్రీకరించాడు.

ఒక వ్యక్తిని స్తుతించడము, లేదా నిందించడము వాక్కుతో చేసే కర్మ. ఆ కర్మను చేయాలి అని ఆలోచించడము మానసకర్మ. ఒకరిని కొట్టడము, లేదా ఒకరికి పెట్టడము కాయక కర్మ. ఇతరులను గూర్చి చెడుగా ఆలోచించడము మానసకర్మ అయితే, నిందించడము వాచక కర్మ కాగా, శారీరకంగా బాధించడము కాయక కర్మగా స్థూలంగా వ్యక్త మవుతుంది. ఇలా ప్రతి విషయంలో ఈ మూడు ప్రధానం గానో అప్రధానం గానో కలిసే ఉంటాయి.

శరీరము, వాక్కు, మనస్సు అనే ఈ మూడిటి చేత మానవుడు కర్మను ఆచరించినా, అలా ఆచరింప బడిన ఏ కర్మ కైనా పూర్వ శ్లోకంలో మనం చూచిన అధిష్ఠానాది ఐదు విషయాలు కారణాలుగా ఉన్నాయి. సాధనాలు మూడే అయినా, కారణాలు ఐదుగా తెలుస్తూ ఉన్నాయి.

**ఆత్మ అకర్త**

ఇక్కడ ప్రధానంగా ఒక్క విషయాన్ని మనం బుద్ధిలో స్థిర పరచుకోవాలి. దేహము, వాక్కు, మనస్సు ఈ మూడిటి చేతనే కర్మలు సాగుతున్నాయి. కార్య నిర్వహణములో ఈ మూడే కనిపిస్తున్నాయి. వీటిలో ఆత్మ ఎక్కడైనా కర్తగా కనిపిస్తూ ఉందా? లేదు. కాని, త్రివిధ కర్మల విషయంలో ఆత్మ గోచరించక పోయినా, ఆత్మ ఉందా, లేదా?

ఇంధనము లేకుండా ఇంజను నడుస్తుందా? ఆత్మ స్ఫూర్తి లేకుండా శరీర వాఙ్మనస్సులు ప్రవర్తించ

గలవా? మరి, ఈ మూడు కర్మలను నిర్వర్తించడానికి స్ఫూర్తి నిచ్చిన ఆత్మ ఈ మూడు విధాలైన కార్యాలలో ప్రత్యక్షంగా లేదు. అలాగని ఆత్మ లేనిది అని అన గలమా?

ఆత్మ ఉంది. ఎలా ఉంది? అకర్తగా ఉంది. మూడు విధాలైన కర్మలతో సంబంధం లేకుండా విలక్షణంగా ఉంది. కర్మలను శరీరము, వాక్కు, మనస్సు - ఈ మూడే నిర్వర్తిస్తున్నాయి.

***యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి*** - ఏది మనస్సుతో ఆలోచించ బడుతూ ఉందో, అదే వాక్కు చేత చెప్ప బడుతూ ఉంది. అదే శరీరం చేత చేయ బడుతూ ఉంది. ఆత్మ అకర్తగా ఉంది. సాధనాలలో ఆత్మ యొక్క ప్రమేయాన్ని ఊహించలేక పోతున్నాము. పోనీ, కారణాలలో అయినా ఆత్మ ఉందా? అదీ లేదు.

అధిష్ఠానం మొదలైన ఐదు విషయాలే కారణాలుగా తెలుస్తున్నాయి. ఆ అయిదింటిలో ఆత్మ లేదు. అధిష్ఠానము, కర్త, కరణము, ప్రాణచేష్టలు, దైవము - ఈ ఐదు మాత్రమే కారణాలుగా తెలుస్తున్నాయి కాని ఆత్మ ఎక్కడా కారణంగా తెలియడం లేదు.

అధిష్ఠానాది ఏ ఐదు విషయాలు కారణాలుగా తెలుస్తున్నాయో, ఆ ఐదిటిలో ఏ ఒక్కటి లోపించినా కార్య నిర్వహణము జరగటం సాధ్యం కాదు.

**కర్త మిథ్య**

కర్మ త్రివిధము లైనా, అది న్యాయమైనా తద్విపరీత మైనా, ఇంతకీ కర్త ఎవరు? ఆత్మ అకర్త అని తేలి పోయింది. పోనీ కర్మకి ఐదు కారణాలు చెబుతున్నారు కదా, ఈ ఐదు కారణాలలో కర్త ఎవరు? చెప్ప లేము.

అధిష్ఠానంగా చెప్ప బడుతున్న శరీరమును కర్త అని చెప్ప గలమా? నిజమే ***శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్*** అని కాళిదాస మహాకవి చెప్పినట్లు, ఏది సాధించాలన్నా శరీరం సాధనంగా ఉంది అనే సత్యాన్ని నిరాకరించ లేము. అలాగని, శరీరాన్ని కర్తగా ధ్రువీకరించ గలమా? శరీరమే గనుక కర్త అయితే, ఇక శవం నుండి కర్తృత్వాన్ని ఎప్పుడూ తొలగించ లేము. అయినా, కర్తృత్వము శవానికి అంటకట్టడం ఊహ కందని విషయము కదా!

శరీరము చేతనంగా ఉండినా, బుద్ధిలో గనుక చేతనత్వము లేకపోతే, శరీరము ద్వారా కర్మలు సాగవు. బుద్ధి చేతనత్వంతో పని చేస్తూ ఉండినా, కరణాలైన ఇంద్రియాలు, కార్యమైన దేహము లేకపోతే కర్మ సాధ్యం కాదు. అలాగని, ప్రాణశక్తి లేకుండా, దేహేంద్రియ మనస్సులు పని చేయ గలవా? పని చేయ లేవు.

మరి, ఈ అయిదింటిలో కర్త ఎవరు? కర్త అనేది ఏకవచనం కదా! కర్త అనే వాడు ఒకడే ఉంటాడు గాని ఐదు మంది కర్తలు ఎలా ఉంటారు? పోనీ, కారణాలుగా తెలుస్తూ ఉన్న అధిష్ఠానాది విషయాలు ఐదూ కలిసి కర్త అంటారా? అదే వాస్తవ మైతే, కర్త కర్మను నిర్వహించే టపుడు, అట్టి కర్మకు ఫలం కూడా ఉంటుంది కదా! ఆ ఫలాన్ని అనుభవించే భోక్త ఎవరు? ఐదూ కలిసి అనుభవిస్తాయి అంటారా? కర్మాచరణములో భాగస్వామి యైన నేత్రేంద్రియము ఫలప్రాప్తి సమయంలో లేదనుకోండి అప్పుడు ఆ ఫల భాగము ఎవరి కందాలి?

అంధుడు దొంగతనం చేయ గలడా? చేయ లేడు. మరి దొంగతనం చేసే సమయంలో చూచే కదా చేశాడు? నిజమే. దొంగకు కళ్ళు ఉన్నాయి. దొంగతనం చేసిన తరువాత ప్రమాదంలో కళ్ళు పోయాయి. కర్మ ఫలప్రాప్తి సమయంలో దొంగ అంధుడుగా ఉన్నాడు. మరి ఐదు మంది కర్తలకు ఫలం అందాలి కదా? ఇప్పుడు లేని నేత్రేంద్రియానికి ఫలం అందే దెలా? ఒకవేళ, కళ్ళు ఉండినా, పన్నెండు ఇంద్రియాలకు ఫలాన్ని ఎలా పంచాలి? పంచే వారెవరు?



దీనిని బట్టి మనకు ఏమి అర్థ మవుతూ ఉంది? శరీరాది ఐదు విషయాలు కారణాలుగా ఉన్నాయే గాని, వీటిలో ఏ ఒక్కటీ కర్త కాదు. ఇవి పరస్పరాధీనంగా ఉండటం చేత ఏదీ స్వయంగా కర్త కాలేదు. పైగా అన్నీ జడాలే. ఒకటి మరొక దానిపై ఆధారపడి ఉంది అంటే అది మిథ్యాభూతము అని పూర్వాధ్యాయాలలో చెప్పుకొనే ఉన్నాం. కనుక ఆత్మ అకర్త. కర్త మిథ్య. ఈ సత్యాన్ని మనస్సుకు పట్టించ డానికే ప్రస్తుత శ్లోకము.

*ఇది అర్థం కాక పోవడం చేత, అకర్త అయిన ఆత్మను కర్తగా చూస్తారు. చదవండి.*

**తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।** 16
**పశ్య త్యకృత బుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః ॥**

***తత్ర-ఏవం-సతి-కర్తారం-ఆత్మానం-కేవలం-తు-యః***
***పశ్యతి-అకృత బుద్ధిత్వాత్-న-సః-పశ్యతి-దుర్మతిః***

| | | | |
|---|---|---|---|
| తత్ర | = ఆ విషయమున | యః | = ఎవడు |
| ఏవం సతి | = ఇలా వుండగ | పశ్యతి | = గాంచు చున్నాడో |
| కేవలం | = కేవలము | సః | = ఆ |
| ఆత్మానం తు | = ఆత్మనే | దుర్మతిః | = అజ్ఞాని |
| కర్తారం | = కర్తగా | న పశ్యతి | = చూడలేకున్నాడు |
| అకృతబుద్ధిత్వాత్ | = అశుద్ధ బుద్ధి గలవా డగుట చేత | | |

**అర్జునా! కర్మ విషయం ఇలా ఉంటే, బుద్ధి సంస్కరింప బడని వాడు ఆత్మను కర్తగా చూస్తున్నాడు. వివేకం లేని అతడు సత్యాన్ని దర్శించ లేక పోతున్నాడు.**

**వ్యాఖ్య**

కర్మ విషయం ఈ విధంగా ఉంటే ***(తత్ర ఏవం సతి)*** - అంటే పూర్వ శ్లోకంలో మనం చూచినట్లు కర్మకు అధిష్ఠానాది ఐదు కారణాలు ఉన్నట్లు తెలుస్తూ ఉంటే - ఆ విషయాన్ని విడిచి పెట్టి, అసంగము, అకర్త అయిన ఆత్మను కర్తగా ఎవడైతే భావిస్తూ ఉంటాడో ***( కేవలం ఆత్మానం కర్తారం పశ్యతి )*** వాడు దుర్మతి ***(దుర్మతిః )***. ఎవని బుద్ధి కలుషితమై ఉందో, సంస్కరింప బడకుండా ఉందో అతడే దుర్మతి ***( అకృత బుద్ధిత్వాత్ )***. బుద్ధి అసంస్కృతమై ఉన్నందున, అతడు సత్యాన్ని దర్శించ లేక పోతున్నాడు. అటు కర్మ విషయాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాడు. ఇటు ఆత్మ స్వరూపాన్ని గ్రహించ లేక పోతున్నాడు.

ఉన్నది ఉన్నట్లుగా తెలియ నపుడు, ఆ ఉన్నది మరొకటిగా తెలిసే అవకాశం ఉంది. ఉన్న దానిలో లేని దానిని ఆరోపించే పరిస్థితిని కూడా నిరాకరించ లేము ***(రజ్జుసర్పవత్)***. ఒకటి ఆరోపించ బడింది అంటే, అలా ఆరోపించడానికి, మరొకటి సిద్ధంగా ఉన్నప్పుడే అది సాధ్య పడుతుంది. రజ్జువు ఉన్నది కనుకనే దానిలో సర్పాన్ని ఆరోపించడం జరిగింది. అసలు రజ్జువే లేకపోతే, సర్పాన్ని ఆరోపించే ప్రశ్నే తలెత్తదు.

రజ్జువు ఉన్నంత మాత్రాన ఆరోపించడము జరగదు. ఉన్న రజ్జువు మనకు తెలియక పోతే సర్పాన్ని రజ్జువులో ఆరోపించ గలమా? కనుక వస్తువు ఉంది. అలా ఉన్నట్లు తెలుస్తూ కూడా ఉంది. కాకపోతే, ఉన్నది ఉన్నట్లుగా తెలియడం లేదు.

వస్తువు తెలుస్తూ, దాని యథార్థ జ్ఞానము కూడా మనకు కలిగితే, ఆరోపానికి అవకాశము లేదు. వస్తువు తెలుస్తూ, ఆ వస్తువు మరొక వస్తువుగా అర్థ మైనపుడే ఆరోపము జరుగుతుంది.

**ఆత్మా అస్తి** - ఆత్మ ఉంది. ఆత్మ ఏమిటి? ఎవరు? నువ్వే ఆత్మ. నువ్వు ఉన్నావు (**త్వమసి**). నువ్వు సదా ఉన్నావు అనే జ్ఞానం నీకు ఉంది (**అహం సదా అస్మి**). నేను ఎప్పుడూ ఉన్నాను అనే జ్ఞానం అందరికీ ఉంది. ఆ ఉన్న దేదో అది ఆత్మే. ప్రతి వాడూ ఆత్మస్వరూపుడే.

తాను ఉన్నట్లు ప్రతి మనిషికి తెలుసు. కాని, ఆత్మగా ఉన్నట్లు తెలియదు. ఈ సత్యము అర్థమైతే, ఆత్మ అసంగము కనుక తానూ అసంగుడే అవుతాడు. దేనికీ అంటని వాడుగా శోభిస్తాడు. తాను ఉండి, తాను ఆత్మ అనే జ్ఞానం లేనపుడు, నేను కర్తను, నేను భోక్తను, నేను సంసారిని అని భావించడం జరుగుతూ ఉంటుంది. ఆత్మ యందు అనాత్మను ఆరోపించడం జరుగుతుంది.

**తత్ర** - కర్మ విషయము నందు కూడా కర్మకు అధిష్ఠానాది ఐదు కారణాలు తెలుస్తూ ఉంటే, బుద్ధి హీనుడు ఆత్మను కర్తగా చూస్తున్నాడు. అసంగమైన ఆత్మకు కర్తృత్వాన్ని ఆపాదిస్తున్నాడు.

ఆత్మకు కర్తృత్వము ఉండే టట్లయితే, ఆత్మ కర్త అని నిశ్చయించే టట్లైతే, ఆత్మ ఉన్న చోట కర్మ వ్యవహారము నడుస్తూ ఉండాలి. ఆత్మ ఎప్పుడూ ఉండేదే కనుక, సుషుప్తిలో, అంటే గాఢనిద్రలో కూడా ఆత్మ ఉంది. మరి ఆత్మ నిద్రలో కూడా ఉండే టప్పుడు, అక్కడ కార్యాలు ఎలా నిరోధించ బడ్డాయి?

సుషుప్తిలో ఆత్మ తన స్వరూపంలో ఉంది (**స్వ మపీతో భవతి**). కాని కర్తృత్వము లేదు. కర్మ లేదు. దీనిని బట్టి కర్మ గాని, కర్తృత్వాదులు గాని అన్య ధర్మాలే గాని ఆత్మ ధర్మాలు కావని తెలుస్తూ ఉంది.

కర్తృత్వాదులు దేని ధర్మాలో అది సుషుప్తిలో లేదు. కనుక, కర్తృత్వాదులు సుషుప్తిలో గోచరించడం లేదు. అంతమాత్రాన ఆత్మ లేకుండా లేదు. కర్త ఆదమరచి గాఢంగా నిద్రించినా, స్వతస్సిద్ధమై, స్వప్రకాశ మైన ఆత్మ మాత్రం నిద్రించకుండా మేలుకొనే ఉంది. నిత్య జాగరణ లోనే ఉంది. తాను నిద్రించకుండా, నిద్రించే వాటిని ప్రకాశింప చేస్తూ ఉంది (**అసుప్తః సుప్తా నభిచాక శీతి, ఏష సుప్తేషు జాగర్తి**). కనుక కర్తృత్వ మనేది అన్య ధర్మమే గాని ఆత్మధర్మము కాదు. అన్య ధర్మాన్ని ఆత్మ యందు ఆరోపించడం బుద్ధి హీనత. అట్టి బుద్ధిహీనుణ్ణి 'దుర్మతి' అంటున్నాడు భగవంతుడు.

ఎవరి బుద్ధి అయితే సంస్కరింప బడలేదో అతడు దుర్మతి, లేదా దుర్బుద్ధి. దుర్మతి అలా ఎందుకు చూస్తున్నాడు? అకర్త యైన ఆత్మను కర్తగా ఎందుకు చూస్తున్నాడు? బుద్ధి సంస్కరింప బడని కారణం చేత అలా చూస్తున్నాడు. ఆచార్యుడు ఉపదేశించే వేదాంత జ్ఞానము చేత సంస్కరింప బడని బుద్ధి కల వాడు దుర్మతి (**వేదాంత ఆచార్యోపదేశ న్యాయైః అకృత బుద్ధిత్వాత్, అసంస్కృత బుద్ధిత్వాత్**). ఈ కారణం చేత అసంగమైన ఆత్మకు కర్మసంగాన్ని కల్పిస్తున్నాడు. కేవలాత్మకు కర్తృత్వాన్ని ఆపాదిస్తున్నాడు. వీడు చూస్తున్నా చూడని వాడే (**పశ్యన్నపి చ న పశ్యతి**). కనిపిస్తూ ఉండినా, కనిపించే దానిని మరొక విధంగా చూచే వాడు దుర్మతి.

ఆకాశంలో ఒకే చంద్రుడు ప్రకాశిస్తున్నా, నేత్ర దోషం కల వాడికి అనేక చంద్రులు కనిపిస్తూ ఉంటారు (**యథా తైమరికః అనేకం చంద్రం**). అంతమాత్రాన ఆకాశంలో అనేక చంద్రులు లేరు.

నేత్ర దోషం లేక పోయినా, మనస్సులో స్పష్టత లేని వాడు మనస్సు లోని అస్పష్ట విషయాన్నే ఇంద్రియాల ద్వారా చూస్తాడు. ఆకాశంలో చంద్రుడు నిశ్చలంగా ఉంటాడు. మేఘాలు పరుగులు పెడుతూ ఉంటాయి. కాని, బుద్ధిలో స్పష్టత లేని అజ్ఞాని, మేఘాల పరుగును చంద్రునికి ఆపాదించి, 'చంద్రుడు మేఘాల లోకి పోతున్నాడు, వస్తున్నాడు' అని మాట్లాడుతుంటాడు. ఇదంతా ఆరోపమే (**యథా వా అభ్రేషు ధావత్సు చంద్రం ధావన్తం**). దుర్మతి కల్పించిన కర్తృత్వమే గాని ఆత్మకు కర్తృత్వం లేదు.



దుర్మతిని గూర్చి విన్నారు కదా! ఇక సుమతిని గూర్చి వినండి.

యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే ।
హత్వాపి స ఇమాన్ లోకా న్న హన్తి న నిబధ్యతే ॥ 17

*యస్య-న-అహంకృతః-భావః-బుద్ధిః-యస్య-న-లిప్యతే*
*హత్వా-అపి-సః-ఇమాన్-లోకాన్-న-హంతి-న-నిబధ్యతే*

| | | |
|---|---|---|
| యస్య | = | ఎవనికి |
| అహంకృతః | = | నేనే కర్త యనెడి |
| భావః | = | భావము |
| న | = | లేదో |
| యస్య | = | ఎవని యొక్క |
| బుద్ధిః | = | బుద్ధి |
| న లిప్యతే | = | అంటదో |
| సః | = | వాడు |
| ఇమాన్ | = | ఈ |
| లోకాన్ | = | లోకము నందు |
| హత్వా అపి | = | చంపినను |
| న హంతి | = | చంపినవాడు కాడు |
| న నిబధ్యతే | = | బద్ధుడును కాడు |

**అర్జునా! నేను కర్తను అనే భావం లేని వాడు, కర్మఫలమునకు అంటని బుద్ధి కల వాడు లోకంలో చంపినా చంపిన వాడు కాడు. అతడు దేని చేతను బద్ధుడు కాడు.**

**వ్యాఖ్య**

**అనిష్ట మిష్టం మిశ్రం చ** - అంటూ పన్నెండవ శ్లోకములో మూడు విధాలైన కర్మఫలాలు త్యాగులు కాని వారికి మరణానంతరము కలుగుతాయి అని చెప్పి, శ్లోకం యొక్క నాల్గవ పాదంలో **న తు సంన్యాసినాం క్వచిత్** - సన్యాసులకు ఎప్పుడూ కలగవు అని చెప్పడం జరిగింది. త్రివిధ కర్మఫలాలను పదమూడవ శ్లోకం నుండి వరుసగా నాలుగు శ్లోకాలలో వివరించిన పరమేశ్వరుడు, చివరి పాదంలో సన్యాసులకు కలగవు అని చెప్పిన విషయాన్ని ప్రస్తుత శ్లోకంలో వ్యాఖ్యానిస్తున్నాడు.

**అసంగాత్మ**

ఆత్మ అసంగము. అసంగాత్మకు దేహ, ఇంద్రియ, మనోబుద్ధులతో ఏ విధమైన సంబంధము లేదు. ఈ సత్యము అర్థం కాని వాడు దుర్మతి. అర్థమైన వాడు సుమతి. అధిష్ఠానాది ఐదు విషయాలు కర్మ కారణా లుగా తెలుస్తూ ఉండినా, అధిష్ఠానాది ధర్మాలను ఆత్మ యందు ఆరోపించి తానే కర్త అని భావించు వాడు దుర్మతి. దేహేంద్రియాలు వికారయుతా లని, వాటికి సత్తా స్ఫురణలను కలిగించేది ఆత్మే యని, ఆత్మ ఎప్పుడు అసంగం గానే ఉందని, ఆకాశం లాగా నిర్లిప్తమై ఉందని, అట్టి ఆత్మ తానే అని తెలిసి అసంగాత్మగా, అకర్తగా శోభిల్లే వాడు సుమతి. 'ఆత్మ లేకుండా కర్త లేడు. కాని, ఆత్మ కర్త కాదు; అకర్తే' అనే జ్ఞానం కల వాడు సుమతి. ఆత్మలో కర్తృత్వము లేదు.

అహం భావన అన్నా, కర్తృత్వ భావన అన్నా ఒక్కటే. ఆత్మలో అహం భావన లేదు. అహం భావనకు ఆధారమైన చైతన్యమే ఆత్మ. కనుక ఆత్మలో కర్తృత్వం లేదు. ఆత్మ అకర్త.

ఆత్మను ఈ విధంగా తెలుసుకున్న సుమతి తాను కూడా అకర్తే అనే భావంతో ఉన్నందున, కర్మల చేత అంట బడడు. అతని బుద్ధిలో కర్మ లేపము ఉండదు (**బుద్ధిః అన్తఃకరణం యస్య ఆత్మనః ఉపాధిభూతా న లిప్యతే సః సుమతిః సః పశ్యతి**). అతడే సుమతి. అతడు సర్వత్ర ఆత్మనే దర్శిస్తాడు.

**అభోక్తాత్మ**

ఆత్మ కర్త కాదు, అకర్త అని తెలిసిన వాడు ఆత్మలో కర్తృత్వ భావన, అంటే అహం భావన లేదని తెలుసు కుంటాడు. ఎవరికి కర్తృత్వ భావన ఉంటుందో, వారికే భోక్తృత్వ భావన ఉంటుంది. ఆత్మ కర్త కాదు అని తెలిసిన సుమతికి, ఆత్మ భోక్త కూడా కాదని తెలుసు. కర్తృత్వ బుద్ధి లేని ఆత్మ యందు భోక్తృత్వ బుద్ధి ఉండే అవకాశమే లేదు. అందుచేత, ఆత్మ కర్తృత్వ, భోక్తృత్వముల చేత అంట బడదు కనుక ఆకాశం లాగా *(యథా నభః)* అసంగమై ఉంటుంది. నిర్లిప్తమై ఉంటుంది. ఇట్టి ఆత్మజ్ఞానము కల వాడు వధించినా కూడా వధించని వాడే *(హత్వాఽపి న హన్తి న నిబధ్యతే)*. కారణం, ఏ కర్మ కూడా అతనిని బంధించ లేదు కనుక. జ్ఞాని నిజంగా చంపుతాడని దాని అర్థం కాదు. అతడు ఏమి చేసినా చేయని వాడే అని అర్థము. సాక్షీమాత్రుడు అని భావము. అతడు చేసినా, చేయక పోయినా ఆత్మరూపుడు కనుక, సదా ముక్తుడే. జీవన్ముక్తుడే.

ప్రస్తుతము మనం అధ్యయనం చేస్తున్న ఈ శ్లోకము వరాహ ఉపనిషత్తు మంత్రమునకు ప్రతిరూపంగా ఉంది. ఈ శ్లోకంలో 'సుమతి'గా చెప్పబడ్డ వాడు ఉపనిషత్తులో జీవన్ముక్తుడుగా కీర్తింప బడ్డాడు. శ్లోక, మంత్రాల ప్రథమ పాదములలో మార్పు లేనే లేదు.

*యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।*
*కుర్వతోఽ కుర్వతో వాఽపి స జీవన్ముక్త ఉచ్యతే ॥*

ఎవరికి అహం భావన లేదో, ఎవరి బుద్ధి నిర్లిప్తమై ఉందో, అతడు కర్మ చేసినా జీవన్ముక్తుడే. కర్మ చేయక పోయినా జీవన్ముక్తుడే అని వరాహోపనిషత్తు *( 4 - 25 )*. గీత ఉపనిషత్తుల సారం అనడానికి ఇవి నిదర్శనాలు.

*ఇక, కర్మ ప్రవృత్తికి కారణాలను వివరిస్తున్నాడు.*

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥** 18

*జ్ఞానం-జ్ఞేయం-పరిజ్ఞాతా-త్రివిధా-కర్మచోదనా*
*కరణం-కర్మ-కర్తా-ఇతి-త్రివిధః-కర్మసంగ్రహః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మచోదనా | = కర్మవిధి | | కర్మసంగ్రహః | = | కర్మ యొక్క సంగ్రహము |
| జ్ఞానం | = జ్ఞానము | | కరణం | = | సాధనము |
| జ్ఞేయం | = జ్ఞేయము | | కర్మ | = | కార్యము |
| పరిజ్ఞాతా | = తెలుసుకొను వాడు | | కర్తా | = | చేయువాడును |
| ఇతి | = అని | | ఇతి | = | అని |
| త్రివిధా | = మూడు విధములు | | త్రివిధః | = | మూడు విధములు |

**అర్జునా! జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత - ఈ మూడు కర్మ ప్రవృత్తికి కారణాలు. అలాగే కరణము, కర్మ, కర్త - ఈ మూడు క్రియా సంబంధములు.**

**వ్యాఖ్య**

కర్మాచరణము నందు ప్రధానంగా రెండు విషయాలు ఉన్నాయి. మొదటిది కర్మ చోదనము. రెండవది కర్మ సంగ్రహము. కర్మవిధిని ఆవిష్కరించే దానిని చోదనము అంటారు. అదే కర్మ చోదనము. అంటే, కర్మ



ప్రవృత్తికి కారణము. అంటే, కర్మను ప్రవర్తింప చేసేది. అదే కర్మచోదనము *(చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వచనమ్)*. ప్రవర్తకమే చోదన శబ్దార్థము.

జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత - ఈ మూడు కర్మచోదనము. ఏ విషయానికి సంబంధించిన జ్ఞాన మైనా దేని చేత అయితే తెలియ బడుతుందో అది జ్ఞానము *(జ్ఞాయతే అనేన ఇతి జ్ఞానమ్)*.

ఏ కర్మ చేయాలన్నా దానికి సంబంధించిన జ్ఞానం ముందుగా మనకు ఉండాలి. దీనినే జ్ఞానము అంటారు. మనకు ఏది కావాలో అది ముందుగా తెలిస్తే, ఆ తరువాత దానిని పొందేందుకు మనం కర్మను ఆచరిస్తాము. ముందు జ్ఞానము. తరువాత కర్మ. గీత ముఖపత్రమే అది కదా! ముందు జ్ఞానరూపంగా కృష్ణుడు. వెనుక క్రియా రూపంగా అర్జునుడు.

మనకు ఏమి కావాలో తెలియ నపుడు దానిని పొందే ప్రయత్నం చేసే దెలా? కనుక ముందు కర్మ చోదనము. తరువాత కర్మ సంగ్రహము. కర్మాచరణమునకు జ్ఞానము అంతరంగ రూపము. కర్మ బాహ్య రూపము.

జ్ఞానము ద్వారా పొంద బడేది జ్ఞేయము. జ్ఞేయమును జ్ఞానము ద్వారా గ్రహించే వాడు జ్ఞాత. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత - ఈ మూడు ఉంటేనే కర్మ ప్రవర్తక మౌతుంది కనుక, ఇవి కర్మ చోదనము అనబడ్డాయి. ఇవి ఉంటేనే కర్మవిధి.

ఆ తరువాత కర్మసంగ్రహము. ఇవి కర్మాచరణమునకు ఆశ్రయాలు. కర్మ ప్రవృత్తికి కర్మచోదనము కారణము. కర్మ భోగానికి ఈ కర్మసంగ్రహము కారణము. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత కర్మచోదన మైతే, కరణం, కర్మ, కర్త కర్మసంగ్రహ మనిపించు కుంటాయి.

పద్నాల్గవ శ్లోకంలో **పంచైతాని** అని చెప్పబడిన కర్మ కారణాలలో అధిష్ఠానాన్ని కరణం లోను, దైవమును కర్త లోను కలిపితే, ఆ తరువాత కర్త, కరణము, కర్మ - ఈ మూడే ఉంటాయి. వాటినే కర్మసంగ్రహముగా ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు చెబుతున్నాడు.

అలాగే కర్మచోదనములో తెలియ బడేది జ్ఞేయ మైతే, తెలియ చేసేది జ్ఞానము. తెలుసుకొనే జ్ఞాత అవిద్యోపాధిక జీవుడు. ఈ విధంగా కర్మాచరణము నందు కర్మచోదనము జ్ఞానరూపం గాను, కర్మసంగ్రహము క్రియారూపం గాను తెలుస్తూ ఉన్నాయి.

*జ్ఞానము, కర్మ, కర్తల గుణ భేదాన్ని ప్రవచిస్తున్నాడు.*

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి ॥** 19

*జ్ఞానం-కర్మ-చ-కర్తా-చ-త్రిధా-ఏవ-గుణభేదతః*
*ప్రోచ్యతే-గుణసంఖ్యానే-యథావత్-శృణు-తాని-అపి*

| | | | |
|---|---|---|---|
| గుణసంఖ్యానే | = గుణాలను ప్రతిపాదించే సాంఖ్యశాస్త్రము నందు | త్రిధా ఏవ | = మూడు విధములు గనే |
| జ్ఞానం | = జ్ఞానము | ప్రోచ్యతే | = చెప్పబడు చున్నది |
| కర్మ చ | = కర్మమును | తాని అపి | = వానిని కూడా |
| కర్తా చ | = కర్తయును | యథావత్ | = యథార్థముగ |
| గుణభేదతః | = గుణభేదము ననుసరించి | శృణు | = ఆలకించు! |

**అర్జునా! జ్ఞానము, కర్మ , కర్త అనేవి గుణ భేదాన్ని బట్టి మూడు విధాలని సాంఖ్యము చెప్పింది. అది కూడా యథార్థంగా విను.**

**వ్యాఖ్య**

కర్మల విషయంలో, జ్ఞాత - జ్ఞేయము - జ్ఞానములను కర్మలను ప్రవర్తింప చేసే కర్మచోదనముగా; కర్మతో ప్రత్యక్ష సంబంధం కలిగిన కరణం - కర్మ - కర్తలను కర్మ సంగ్రహముగా పూర్వ శ్లోకంలో చూశాం. కర్మ సిద్ధికి హేతువులుగా చెప్ప బడిన ఈ ఆరింటిని కలిపి విషయ ప్రధానంగా మూడు చేయడం జరిగింది. గుణ భేదాన్ని బట్టి జ్ఞానము, కర్మ, కర్త అని మూడు విధాలుగా విభజించి చెప్పింది కపిలుని సాంఖ్య శాస్త్రము. దానిని కూడా వినిపిస్తున్నాడు భగవంతుడు.

**సాంఖ్యము - గుణ విభాగము**

ప్రస్తుత శ్లోకంలో జ్ఞానము - కర్మ - కర్త, ఈ మూడు విషయాలనే భగవానుడు సారభూతంగా ప్రస్తావించడం జరిగింది. పూర్వం మనం చెప్పుకొనిన కర్మసిద్ధి హేతువులైన ఆరింటిలో జ్ఞేయము జ్ఞానంలో కలిసి పోయింది. కరణము కర్మ లోను, జ్ఞాత కర్త లోను కలిసి పోవడం జరిగింది. తత్ఫలితంగా జ్ఞేయము - కరణము - జ్ఞాత అవ్యక్తమై, అదృశ్యమై, జ్ఞానము - కర్మ - కర్త మనకు చర్చనీయాంశ మైనవి ( ***త్రిధా ఏవ ప్రోచ్యతే కథ్యతే***). ఈ విషయము గుణములను ప్రతిపాదించే సాంఖ్య శాస్త్రము నందు చెప్ప బడింది. ఈ సాంఖ్యము భగవద్గీతలో చెప్పబడిన సాంఖ్యము కాదు. షడ్దర్శనాలలో ఒకటైన సాంఖ్యము. కపిల మహర్షి ప్రతిపాదించిన గుణ ప్రధానమైన సాంఖ్య శాస్త్రము.

కపిల మహర్షి సాంఖ్య సిద్ధాంత కర్త. బ్రహ్మదేవుని పుత్రుడు అని చెబుతారు. కాని, భాగవతంలో దేవహూతి కర్దముల పుత్రుడుగా చెప్ప బడ్డాడు. తల్లి యైన దేవహూతికి తత్త్వోపదేశం చేసి, ఆమెకు ముక్తిని ప్రసాదించిన మహితాత్ముడు. కపిలుడు తన తల్లికి ముక్తిని ప్రసాదించిన ప్రదేశమునే 'మాతృగయ' అంటారు. రామాయణంలో కూడా సగర పుత్రుల విషయము నందు కపిలుని ప్రస్తావన ఉంది. సాంఖ్య సిద్ధాంత కర్త అయిన కపిలుడు ఆ కపిలుడు కాదని శ్రీ శంకరుల లాంటి పెద్దలు అభిప్రాయ పడ్డారు.

సాంఖ్యులు అద్వైతులు కారు. ద్వైతులు. పారమార్థికంగా అద్వయ బ్రహ్మ నిర్దేశము నందు సాంఖ్య, వేదాంతములకు సిద్ధాంత పరంగా భేద మున్నప్పటికీ, కపిలుని 'గుణ సంఖ్యాన శాస్త్రం' గుణాల విషయంలో, భోక్త విషయంలో ప్రామాణికమే. అది వేదాంతులకు కూడా అంగీకారమే. కనుక, కపిలుని 'గుణ సంఖ్యాన శాస్త్రము'ను వేదాంతులు గ్రహించారు. ఆ విషయంలో సాంఖ్య, వేదాంతములకు విరోధము లేదు ( ***తస్మాత్ కాపిల శాస్త్ర మపి ఉపాదీయతే ఇతి న విరోధః*** ). మహాసిద్ధుడైన కపిల ముని భగవదంశ సంభూతు డని చెబుతారు. సిద్ధులలో కపిలముని నేనే *(10 వ అ - 26 వ శ్లో)* అని గీతాచార్యుడే చెప్పడం చేత, కపిలుడు ఎంతటి గొప్ప వాడో ఊహించ వచ్చు. మరొక ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే, విష్ణుసహస్ర నామంలో భగవంతుడికి **మహర్షిః కపిలాచార్యః** అనేది ఒక పేరు. సవిశేషణ ఏకనామం *(531 నామం)*. గుణాలను, గుణ వ్యాపారాలకు సంబంధించిన విషయాలను ప్రామాణికంగా నిరూపించడంలో కపిలుని సాంఖ్యము సమున్నత మైన స్థానాన్ని సముపార్జించు కున్నది. ప్రస్తుతం మనం చూడ బోతున్న జ్ఞానము - కర్మ - కర్తలను కూడా గుణ భేదాన్ని అనుసరించి త్రివిధము లుగా నిర్ణయించి నిరూపించడం జరుగుతూ ఉంది.

*ప్రథమంగా జ్ఞానమును గూర్చి చెబుతున్నాడు. గుణ భేదాన్ని బట్టి మూడు విధాలైన జ్ఞానములలో మొదటి దైన సాత్త్విక జ్ఞానమును గూర్చి చెబుతున్నాడు.*





**సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥** 20

***సర్వభూతేషు-యేన-ఏకం-భావం-అవ్యయం-ఈక్షతే***
***అవిభక్తం-విభక్తేషు-తత్-జ్ఞానం-విద్ధి-సాత్త్వికం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| విభక్తేషు | = | విభక్తములైన | యేన | = | ఏ జ్ఞానము చేత |
| సర్వభూతేషు | = | సర్వభూతముల యందును | ఈక్షతే | = | గాంచుచున్నాడో |
| అవిభక్తం | = | విభక్తము కానట్టి | తత్ | = | ఆ |
| అవ్యయం | = | నశించ నట్టి | జ్ఞానం | = | జ్ఞానము |
| ఏకం | = | ఏకమైన | సాత్త్వికం | = | సాత్త్విక జ్ఞాన మని |
| భావం | = | భావమును | విద్ధి | = | తెలుసుకో! |

**అర్జునా! భిన్నము లైన సర్వ ప్రాణుల యందు అఖండమై, నాశ రహితమైన, ఏకమైన ఆత్మ భావమును జ్ఞానంతో ఎవడు చూస్తున్నాడో, అతని జ్ఞానము సాత్త్విక జ్ఞానము.**

**వ్యాఖ్య**

జ్ఞాన, కర్మ, కర్తలు మూడు విధాలని ప్రవచించి, మళ్ళీ ఆ మూడింటి గుణ భేదాలను వివరించడం జరుగుతుంది. జ్ఞానము త్రివిధము అని చెబుతూ, ప్రథమంగా సాత్త్విక జ్ఞానమును వివరిస్తున్నాడు.

**సాత్త్విక జ్ఞానము**

వేరు వేరుగా కనిపిస్తున్న సర్వ భూతముల యందు ***(విభక్తేషు)*** ఏకమైన వస్తువును ***(అవిభక్తం)***, నాశ రహితంగా ***(అవ్యయం)*** ఉన్న దానిని చూచే జ్ఞానము ***(ఈక్షతే జ్ఞానమ్)*** సాత్త్వికము ***(సాత్త్వికమ్ విద్ధి)*** అని తెలుసుకోమంటున్నాడు.

ఇక్కడ భావ శబ్దం వస్తువును తెలుపుతుంది. ఏకమైన ఆత్మ వస్తువును బోధిస్తుంది ***(ఏకం భావం వస్తు, ఏకమ్ ఆత్మవస్తు ఇత్యర్థః )***. భిన్న రూపాలైన దేహాదులలో ఏ భావ రూపమైన ఆత్మ ఏకంగా, అభిన్నంగా, అఖండంగా భావింప బడుతూ ఉందో, అట్టి ఆత్మ అవ్యయము ***(అవ్యయమ్)***. అంటే, దేహాలు నశించినా, నశించకుండా ఏదైతే ఉందో అది అవ్యయము. అదే నాశ రహితమైన ఆత్మ.

ఒక వస్తువు నాశమును పొందాలి అంటే, దాని స్వభావ స్వరూపాలలో నైనా పరివర్తన జరగాలి. అంటే పరిణామం ఏర్పడాలి. లేదా, దానిలో కొన్ని ధర్మాలైనా మార్పు చెందాలి. అప్పుడే అది వ్యయ మవుతుంది. అలాంటి ఉభయ పరిణామాలు తెలియనిది, లేనిది అవ్యయము. అట్టిది ఆత్మ ఒక్కటే గాని, మరొకటి కాదు. అట్టి ఆత్మను సాక్షాత్కరించుకొనే జ్ఞానము సాత్త్విక మైనది.

భూతములు అంటే పుట్టినవి అని అర్థము. జనన ధర్మము కలవి. ప్రభవములు ***(భవన్తి)***. పుట్టినవి ఏవైనా నశించక తప్పదు. దేహా లన్నీ పుట్టినవే. ఒక దేహము మరొక దేహము కాదు. దేహా లన్నీ నశించి పోయేవే.

కుండలు అన్నీ పుట్టినవే. ప్రతి కుండకు ఉత్పత్తి ఉంది. ఉత్పన్న మైనవి ఏవైనా నశించి తీరుతాయి.

కుండలు అనేకము లున్నాయి. అన్నీ మట్టికుండలే. కుండ లన్నిటిలో ఆకాశం ఉంది. ఒక కుండ మరొక కుండ కన్నా భిన్నంగా ఉంది. కాని, ఒక కుండ లోని ఆకాశము మరొక కుండ లోని ఆకాశం కన్నా భిన్నంగా ఉందా? కుండలు వేరైనా కుండలలో ఉన్న ఆకాశం ఒక్కటే ***(అవిభక్తం విభక్తేషు)***.

శరీరా లన్నీ వేరు వేరుగా ఉన్నాయి. ఒక శరీరం మరొక శరీరం కాదు. అన్ని శరీరాలకు పుట్టుక ఉంది. అన్ని శరీరాలకు వినాశము ఉంది. కాని, శరీరా లన్నిటిలో, కుండలలో ఆకాశం లాగా ఏ ఆత్మ చైతన్యం ఉందో, అది అన్ని శరీరాల లోను ఉంది. ఉంది కనుకనే, శరీరా లన్నీ చలిస్తున్నాయి. మరి, దేహాలలో ఉన్న ఆత్మకు దేహం ఉందా? లేదు. ఉంటే అదీ నశించేదే. ఆత్మ అవ్యయంగా ఉంది. అంటే, తనకు శరీరం లేకుండా శరీరా లన్నిటిలో భాసిస్తూ ఉంది ***(అశరీరం శరీరేషు)***.

దేహాలు అనేకంగా ఉంటాయి. ఆత్మ ఏకము. దేహాలకు పుట్టుక ఉంది. ఆత్మకు పుట్టుక లేదు. దేహాలు నశిస్తాయి. ఆత్మ నశించదు. దేహాలు విభక్తాలు. ఆత్మ అవిభక్తము. దేహాలు ఎప్పుడూ ఉండవు. ఆత్మ సదా ఉంటుంది. ఆకాశం లాగా నిరంతరం ఉంటుంది ***(వ్యోమవత్ నిరంతరం ఇత్యర్థః)***. ఈ విధమైన అద్వయాత్మను దర్శించే జ్ఞానము సాత్త్విక జ్ఞానము ***(తత్ జ్ఞానం అద్వైతాత్మ దర్శనమ్. సాత్త్వికం సమ్యగ్దర్శనం విద్ధి)***. అద్వైత దర్శనమే సాత్త్విక మైన సమ్యగ్దర్శనము. ద్వైత దర్శనా లన్నీ భేద దర్శనాలే కనుక, వాటిని రాజసములు, లేదా తామసములుగా గుర్తించాలి. అవి సంసారాన్ని సాక్షాత్తు నివృత్తి చేయడానికి సమర్థ మైనవి కావు ***(యాని ద్వైత దర్శనాని అసమ్య గ్భూతాని రాజసాని తామసాని చేతి న సంసారో చ్ఛిత్తయే భవన్తి !)***. 'సాక్షాత్' అనే పదాన్ని వాడటం భాష్యకారు లైన శ్రీ శంకరుల విశాల హృదయానికి అద్దం పడుతుంది. సాక్షాత్తు సమర్థం కావు అంటే, 'పరంపరయా' కావచ్చు అనేది ధ్వనిస్తోంది. అంటే, శుద్ధి ద్వారా ప్రాప్త మని భావం. ద్వైత చీకట్లలో మనిషి లేని వాటిని తట్టుకొని పడుతూ ఉంటాడు. అద్వైత వెలుగులో మేలుకుంటే, తట్టుకోవ డానికి, ముట్టుకోవ డానికి, పట్టుకోవ డానికి రెండవ వస్తువే ఉండదు. అంతా తానే. తన స్వరూపమే. అద్వయమైన ఆత్మ స్వరూపమే.

**వస్తు వొక్కటే వెలుగు ఒక్కటే**
**చూచే కళ్ళు రెండున్నాయి**
**సత్య మొక్కటే జ్ఞాన మొక్కటే**
**దృగ్దృశ్యములు రెండైనాయి**
**ఎన్ని ఉన్నా కల ఒక్కటే**
**మేలుకొంటే తానొక్కడే**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

ఇక రాజస జ్ఞానాన్ని చెబుతున్నాడు.

**పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావా న్పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ ॥** 21

**పృథక్త్వేన-తు-యత్-జ్ఞానం-నానాభావాన్-పృథగ్విధాన్**
**వేత్తి-సర్వేషు-భూతేషు-తత్-జ్ఞానం-విద్ధి-రాజసం**





సర్వేషు = సమస్తమైన
భూతేషు = భూతముల యందు
పృథగ్విధాన్ = వేరు వేరు విధములు గానున్న
నానాభావాన్ = వివిధ భావములు గల వానిని
యత్ = ఏ
జ్ఞానం = జ్ఞానము
పృథక్త్వేన తు = వేర్వేరుగా నుండు వానినిగ
వేత్తి = తెలిసికొను చున్నదో
తత్ = ఆ
జ్ఞానం = జ్ఞానమును
రాజసం = రాజస జ్ఞానముగ
విద్ధి = తెలుసుకో

**అర్జునా! సర్వ భూతముల యందు, భేద భావం చేత వేరు వేరుగా ఉన్న ఆత్మను, భేద రూపంతో ఎవడు తెలుసు కుంటున్నాడో, అతని జ్ఞానము రాజస జ్ఞానము.**

**వ్యాఖ్య**

శరీరాలు వేరు వేరుగా తెలుస్తూ ఉన్నా, అన్ని శరీరాలలో ఆత్మ అభిన్నంగా, అఖండంగా శోభిస్తూ ఉంది అనే జ్ఞానము సాత్త్విక జ్ఞానము. అలా కాకుండా, శరీరాలు వేరు వేరుగా ఉన్నట్లే, ఆ శరీరాల లోని ఆత్మ కూడా వేరు వేరుగా, భిన్నత్వంతో ఉంది ***(పృథక్త్వేన భేదేన)*** అనే జ్ఞానము రాజస జ్ఞానము. సాత్త్వికము అద్వైతమును దర్శిస్తూ ఉంటే రాజసము ద్వైతమును పెనవేసుకొని ఉంది.

ఒక్కొక్క దేహానికి ఒక్కొక్క ఆత్మ ఉందనేది రాజస జ్ఞానము. రాజస జ్ఞానము కల వారు కుండలు ఎలా వేరు వేరుగా ఉన్నవో, కుండల లోని ఆకాశము కూడా అలా వేరు వేరుగా ఉందని భావించే వారు.

దేహాలు వేరు వేరుగా ఉన్నాయి. అలాగే ఆత్మ కూడా వేరు వేరుగా ఉంది. దేహాలు ఎన్ని ఉన్నాయో ఆత్మలు అన్ని ఉన్నాయి. ప్రతి దేహము మరొక దేహంతో ఎలా విడి పడి ఉందో, ప్రతి ఆత్మ మరొక ఆత్మతో అలా విడి పడి ఉంది అని రాజస జ్ఞానము కల వారు భావిస్తారు.

ఎంత చెట్టుకు అంత గాలి అని పెద్దలు చెప్పినట్లు, ప్రతి బుద్ధికి దానికి తగిన తర్కం దాని కుంటుంది. అశాస్త్రీయంగా ఆత్మ భిన్నత్వాన్ని ప్రతిపాదించే ద్వైతులు రాజస జ్ఞానంతో దానిని హేతుబద్ధం చేయాలని ప్రయత్నిస్తారు.

నేను ఆకలితో ఉన్నాను. నా స్నేహితుడు కూడా ఆకలితో ఉన్నాడు. నేను భోం చేశాను. నా స్నేహితుడు భోం చేయ లేదు. నా ఆకలి తీరింది. మరి, అతడు ఆకలి తోనే ఉన్నాడు కదా! అందరిలో ఉండే ఆత్మ ఒక్కటే అయితే, అఖండమే అయితే, నా ఆకలి ఎప్పుడైతే తీరిందో, నా స్నేహితుడి ఆకలి కూడా తీరాలి కదా! నేను నీళ్ళు త్రాగితే నా దాహం తీరింది కనుక, నీవు నీళ్ళు త్రాగకున్నా నీ దప్పిక తీరాలి కదా! అప్పుడే ఇద్దరిలో ఒకే ఆత్మ ఉందనేది సత్య మవుతుంది కదా! అనేది వారి వాదన.

ఆకలిదప్పులు ప్రాణ ధర్మములు అనేది కూడా అర్థం గాని ప్రబుద్ధులకు ఏమి చెప్పగలం? ఎవడు అలసి పోయాడో వాడు నిద్రిస్తాడు గాని, ఒకడు నిద్రించాడని అందరూ నిద్రిస్తారా? అలసి పోయేది దేహం. దేహ ధర్మాన్ని ఆత్మ యందు ఆరోపించడం చేత ఈ భేద జ్ఞానము, అంటే ద్వైత జ్ఞానము ఏర్పడుతూ ఉంది. ఈ జ్ఞానము రాజస జ్ఞానము. వీరికి ద్వైతమే సత్యము. భేదమే జ్ఞానము.

ఈ భేదజ్ఞానము ఎంత వరకైనా విస్తరిస్తుంది. ఇదొక పెద్ద భ్రాంతి. ద్వైత భ్రాంతి. వాస్తవంగా చెప్పాలంటే ఇది జ్ఞానమే కాదు. జ్ఞానమును 'ప్రమ' అంటారు. ఇది ప్రమ కాదు, భ్రమ. భ్రాంతి. భ్రమతో కూడిన ఈ రాజస జ్ఞానానికి అడుగడుగునా భేద దర్శనమే. అణువణువున ద్వైత దర్శనమే. ఈ ద్వైత భ్రమ ఒక విధంగా ఉండదు. దీనిని కుదించి, మదింపు వేసి **పంచభ్రమలు** అన్నది శాస్త్రం. ఇదే భేద పంచకము.

జీవుడు వేరు, ఈశ్వరుడు వేరు (జీవేశ్వర భేదం). ఒక జీవుడు మరొక జీవుని కన్నా వేరైన వాడు కనుక జీవు లందరూ వేరువేరుగా ఉన్నారు (జీవజీవ భేదం). ఒక వ్యక్తి కుర్చీలో కూర్చుని ఉన్నాడు. కుర్చీ వేరు, కూర్చున్న వ్యక్తి వేరు. కుర్చీ జడం. కూర్చున్న వాడు జీవుడు (జీవ జడ భేదం). కుర్చీలో కూర్చున్న వ్యక్తి వార్తాపత్రిక చదువు తున్నాడు. కుర్చీ ఎలా జడమో, పత్రిక కూడా అలా జడమే. పత్రిక కుర్చీ కాదు, కుర్చీ పత్రిక కాదు (జడజడ భేదం). అలాగే జడ ప్రకృతి కన్నా ఈశ్వరుడు అన్యమైన వాడు కనుక జడము వేరు ఈశ్వరుడు వేరు (ఈశ్వర జడ భేదం). ఇది భేద పంచకము. పంచభ్రమ స్వరూపము.

ఈ భేదమే బంధానికి కారణము. భేదమే బంధము. అభేదమే మోక్షము. ద్వైతము భ్రాంతి. అద్వైతము శాంతి.

రాజస జ్ఞానంతో భేద దర్శనం చేసే వారికి ప్రకృతి దర్శనమే గాని, పురుష దర్శనం ఉండదు. క్షేత్ర అవగాహనే గాని క్షేత్రజ్ఞ జ్ఞానము ఉండదు. మాయా దర్శనమే గాని మహేశ్వర దర్శనము జరగదు. రాజస జ్ఞానము గల వ్యక్తులు ఎవరిని చూచినా వారి లోని గుణ దోషాలను దర్శిస్తారే గాని ఆత్మను దర్శించ లేరు కనుక, గుణ భేదాల వల్ల వారికి ద్వైతానుభవం కలుగుతుందే గాని అద్వైతానుభూతి కలిగే అవకాశమే లేదు.

ఇక్కడ ఒక్క విషయాన్ని అర్థం చేసుకోవాలి. ఏ జ్ఞానం వేరు వేరుగా ఆత్మను తెలుసుకుంటూ ఉందో ***(యద్ జ్ఞానం పృథక్త్వేన వేత్తి)*** అది రాజస జ్ఞానము అని శ్లోకంలో ఉంది. అంటే, 'జ్ఞానము తెలుసుకుంటూ ఉంది' అనే అర్థం ధ్వనిస్తుంది. అలా గ్రహీస్తే జ్ఞానానికి కర్తృత్వాన్ని ఆపాదించినట్లు అవుతుంది. జ్ఞానము తెలుసుకుంటుంది అంటే జ్ఞానము కర్త అవుతుంది. కనుక, జ్ఞానము తెలుసు కుంటుంది అంటే జ్ఞానము కల వాడు తెలుసు కుంటున్నాడు అని అర్థం. కర్త జ్ఞానము చేత గ్రహిస్తున్నాడు అని తాత్పర్యము ***(జ్ఞానేన వేత్తి ఇతి అన్వయః)***.

ఇక తామస జ్ఞానాన్ని వివరిస్తున్నాడు.

**యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్ ।**
**అతత్త్వార్థవ దల్పం చ త త్తామస ముదాహృతమ్ ॥** 22

***యత్-తు-కృత్స్నవత్-ఏకస్మిన్-కార్యే-సక్తం-అహైతుకం***
***అతత్త్వార్థవత్-అల్పం-చ-తత్-తామసం-ఉదాహృతం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ తు | = | ఏదైతే | అతత్త్వార్థవత్ | = | యథార్థము కానిది |
| ఏకస్మిన్ | = | ఏకమైన | అల్పం చ | = | స్వల్ప మైనది |
| కార్యే | = | కార్యము నందు | తత్ | = | అది |
| కృత్స్నవత్ | = | సంపూర్ణము నందు వలె | తామసం | = | తామస జ్ఞానముగ |
| సక్తం | = | ఆసక్త మైనది | ఉదాహృతం | = | చెప్పబడింది |
| అహైతుకం | = | హేతువు గానిది | | | |

**హేతువు లేనిది, తత్త్వము కానిది, అల్ప మైనది, సమస్తము ఒకే దాని యందు ఒదిగి ఉన్నట్లు భావించే జ్ఞానము తామస జ్ఞానము.**

**వ్యాఖ్య**

సాత్త్విక జ్ఞానమును, రాజస జ్ఞానమును వివరించిన గీతాచార్యుడు, చివరగా తామసాన్ని వివరిస్తున్నాడు.





ఆ రెండిటి కన్నా తామసము విలక్షణ మైనది అని విశదం చేయడానికి **తు** పద ప్రయోగం చేసి, సాత్త్విక జ్ఞానానికి, రాజస జ్ఞానానికి భిన్నంగా తామసాన్ని చూపిస్తున్నాడు. సాత్త్విక జ్ఞానము, రాజస జ్ఞానము అని పూర్వ శ్లోకాలలో తెలిపిన భగవానుడు, ప్రస్తుత శ్లోకంలో తామస జ్ఞానము అనకుండా, తామసము అనడం ప్రయోగామే నని చెప్పాలి. తామస గుణంలో జ్ఞానం ఉంటే కదా తామస జ్ఞానం అనడానికి! కనుక దానిని జ్ఞానముగా పరమేశ్వరుడు అంగీకరించడం లేదు. అందుచేత తామస జ్ఞానము అనకుండా, తామసము అని సరి పెట్టేశాడు ***(తత్ తామస ముదాహృతమ్)***.

సాత్త్విక జ్ఞానము పారమార్థిక మైనది. అది పూర్ణ దృష్టి. ఆత్మదృష్టి. సమస్తమును ఒకే వస్తువుగా, ఆత్మగా దర్శించే సమదృష్టి.

రాజస జ్ఞానము వ్యావహారిక మైనది. అది పాక్షిక దృష్టి. గుణదృష్టి. భేదభావ దృష్టి. ద్వైత దృష్టి. అనేకాత్మ దృష్టి.

తామస జ్ఞానము సంకుచిత మైనది. అది శూన్యదృష్టి. అల్పమునే సమస్తముగా భావించే నికృష్ట దృష్టి. దేహాత్మ దృష్టి. అజ్ఞాన దృష్టి.

అగాధ మైన సాగరాన్ని ఏకంగా, అఖండంగా దర్శించే సుజ్ఞానము సాత్త్విక జ్ఞానము. అలల మధ్య భేదాన్ని దర్శించి, భిన్నంగా వ్యవహరించే వ్యావహారిక జ్ఞానము రాజస జ్ఞానము. ఒక అలనే సాగరంగా భావించే సంకుచిత మైన అజ్ఞానము తామసము. తామసము అహైతుకము, అతత్త్వము, అల్ప ఫలదాయకము.

**అహైతుకమ్**

తమోగుణము జ్ఞానరహిత మైనది. పైగా, అజ్ఞానంతో కూడింది కనుక హేతుబద్ధంగా ఉండదు. దేహమే ఆత్మ, ప్రతిమే దేవుడు అని తామసులు వాదిస్తూ ఉంటారు ***(కృత్స్నవత్ సమస్తవత్, ఏకస్మిన్ కార్యే దేహే బహిః వా , సక్తమ్ ఏతా వానేవ ఆత్మా ఈశ్వరోవా న అతః పరమ్ అస్తీతి)***. దేహానికి మించి ఆత్మ లేదు. బాహ్యంలో విగ్రహాన్ని మించి దేవుడు లేడు. ఇదీ, వారి వాదము.

దేహమే తాను. దేహమే ఆత్మ అని చార్వాకుల లాగా వాదిస్తూ ఉంటారు. **స్వప్న మహా మద్రాక్షం -** నేను కల గన్నాను అని అతడే అంటాడు. మరి, నీవు దేహమే అయితే, 'నేను కల గన్నాను' అని ఎలా చెబుతావు? కలను చూచింది దేహమా? దేహము నిద్రిస్తూ, శ్వాసిస్తున్న శవం లాగా అక్కడే పడి ఉంది కదా! అలాంటి దేహం స్వప్నాన్ని ఎలా దర్శిస్తుంది?

ఈ విధమైన హేతువు లేని విషయాన్నే తామసులు ప్రతిపాదిస్తూ ఉంటారు. కనుక, వారి వాదము అహేతుకము. యుక్తి రహితము. న్యాయ వర్జితము ***(అహేతుకం హేతు వర్జితం నిర్యుక్తికమ్)***.

**అతత్త్వము**

తత్త్వము అంటే యథార్థ మైనది. అదే తత్త్వార్థము. యథార్థము. అట్టి తత్త్వార్థము ఏ జ్ఞానానికి విషయంగా ఉంటుందో, అంటే ఏ జ్ఞానం చేత తత్త్వార్థము గ్రహింప బడుతుందో, అదే తత్త్వము, లేదా తత్త్వవంతము. అలా తత్త్వము కానిది అతత్త్వము. తత్త్వవంతము కానిది అతత్త్వవంతము ***(న తత్త్వార్థవత్ అతత్త్వార్థవత్)***. ఎందుకని అతత్త్వము అంటే, అహేతుక మైనది కనుకనే అతత్త్వము అనేది సుస్పష్టమైన హేతువు.

**అల్ప ఫలం**

ఆత్మను దేహానికి పరిమితం చేసి అల్పంగా ఊహించడం చేత, ఈశ్వరుణ్ణి బాహ్యంలో ప్రతిమకు

పరిమితం చేసి స్వల్పంగా భావించడం చేత, విషయమే అల్ప ప్రధానం కలది అయింది. అల్పమైన విషయానికి అల్ప ఫలం ఉంటుందే గాని అనంతమైన ఫలం ఎలా ప్రాప్తిస్తుంది? అందుచేత ఇది అల్ప ఫలమైనది. తామసులైన వారికి ఈ విధమైన జ్ఞానము ఉంటుంది (***తామసానాం హి ప్రాణినామ్ అవివేకినాం ఈదృశం జ్ఞానం దృశ్యతే***).

*త్రివిధ జ్ఞానములను ఉపదేశించిన భగవానుడు త్రివిధ కర్మలను తెలియ చేస్తున్నాడు.*

నియతం సంగరహిత మరాగద్వేషత: కృతమ్ ।
అఫల ప్రేప్సునా కర్మ య త్త త్సాత్త్విక ముచ్యతే ॥ 23

***నియతం-సంగరహితం-అరాగద్వేషతః-కృతం***
***అఫలప్రేప్సునా-కర్మ-యత్-తత్-సాత్త్వికం-ఉచ్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = | ఏ | అఫల ప్రేప్సునా | = | ఫలా పేక్ష లేని వాని చేత |
| కర్మ | = | కర్మము | కృతం | = | చేయబడినదో |
| సంగరహితం | = | సంగత్వము లేనిది | తత్ | = | అది |
| నియతం | = | నియమిత మైనది | సాత్త్వికం | = | సాత్త్విక మని |
| అరాగద్వేషతః | = | రాగద్వేషములు లేకుండునది | ఉచ్యతే | = | చెప్పబడు చున్నది |

**ఫలాసక్తి లేకుండా, సంగత్వము లేకుండా, రాగద్వేష రహితంగా ఆచరింపబడే నిత్యకర్మ సాత్త్విక మని చెప్ప బడింది.**

**వ్యాఖ్య**

గుణ భేదాన్ని బట్టి మూడు రకాలైన కర్మలను వివరిస్తూ, ముందుగా సాత్త్విక కర్మను గూర్చి చెబుతున్నాడు.

నియత కర్మలు అంటే నిత్య కర్మలు అని అర్థము (***నియతం నిత్యం***). నిత్య నైమిత్తికాది కర్మలను నియత కర్మలు అంటారు. సంగత్వము లేకుండా (***సంగ రహితం***), రాగద్వేషాల చేత ప్రేరేపించ బడకుండా (***అరాగ ద్వేషతః***), ఫలాసక్తి లేకుండా (***అఫల ప్రేప్సునా***) నిత్య కర్మ ఏదైతే చేయ బడుతుందో (***యత్ కర్మ కృతమ్***) అది సాత్త్విక కర్మగా చెప్ప బడుతుంది (***తత్ సాత్త్విక ముచ్యతే***).

**సంగ రహితము**

కర్మాచరణమునకు ముందు కర్మాసక్తి ఉంటుంది. జ్ఞాన స్పృహ లేకుండా కర్మ స్పృహ కలగదు. 'ఇది నాకు కావాలి' అనే స్పృహ మనస్సులో ఏర్పడుతుంది. ఆ తరువాత 'ఇది నేను చేయాలి' అనే ఆసక్తి కలుగుతుంది.

ఇది ఉపాదేయము, అంటే పొంద దగినది. ఇది హేయము అంటే పొంద దగనిది. ఈ భావాలు మనిషిలో ఉంటాయి. ఇవే ఆశలకు, నిరాశలకు కారణాలు అవుతూ ఉంటాయి. ఏవి ఉపాదేయాలని మనము భావిస్తామో, వాటిని పొందాలి అనుకుంటాము. దీనినే ఆసక్తి అంటారు. ఇదే సంగం. కర్మసంగం. అటువంటి ఆసక్తి లేకుండా, కర్మసంగం లేకుండా ఆచరింపబడే కర్మ సంగరహిత మైనది. అంటే ఆసక్తి లేనిది. కర్తవ్యంగా ఆచరించ దగినది (***సంగరహితమ్ ఆసక్తి వర్జితమ్***).





కర్మాసక్తి కర్తృత్వాభిమానాన్ని కలిగిస్తుంది. అహంకారాన్ని కదిలిస్తుంది. 'నాకు కావాలి' అనే ఆసక్తి ఉంది కనుక, 'నేను చేయాలి' అనే అహంభావన ఏర్పడుతుంది. కర్మాసక్తి జీవులను కర్మఫలంతో ముడి వేసి కర్మ చక్రానికి బంధిస్తుంది.

ఫలాపేక్ష లేకుండా, కర్తృత్వాభిమానమును త్యజించి, నిత్య నైమిత్తికాది కర్మలను కర్తవ్యాలుగా స్వీకరించి, ఆత్మ లాభార్థము ఆచరించడములో కర్మసంగము ఉండదు కనుక అది సాత్త్విక కర్మ అవుతుంది.

ఇక్కడ మరొక విషయాన్ని జ్ఞాపక ముంచుకోవాలి. ఆసక్తి దోషం కాదు. ఆసక్తిలో దోషం లేదు. మనకు దేనిపై ఆసక్తి ఉంది? అనే దానిని బట్టి ఆసక్తి యుక్తమా, అయుక్తమా అనేది నిర్ణయించ బడుతుంది.

ప్రపంచము మీద ఆసక్తి పెరిగితే అది బంధ హేతు వవుతుంది. అదే ఆసక్తి పరమేశ్వరునిపై పెరిగితే అది ముక్తి సాధక మవుతుంది. సాత్త్విక కర్మ వ్యావహారిక కర్మల యందు ఆసక్తి లేకుండా ఉంటుందే గాని, పారమార్థిక విషయము నందు అత్యాసక్తితో ఉంటుంది. ప్రపంచముపై విరాగమును పెంచుకుంటూనే, పరమాత్మపై విశేష మైన రాగాన్ని దించు కుంటుంది. బంధ హేతువులపై విరక్తి , మోక్ష హేతువుపై ఆసక్తి కలగడం కూడా సాత్త్విక కర్మ లక్షణమే.

***బంధ మనుకొంటిని అనుబంధమంతా***
***రక్త సంబంధము కూడా విరక్తి దించె***
***ఆసక్తితో నిన్ను చేరితి విముక్తి కొరకు***
***నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*** అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

**రాగద్వేష వియుక్తము**

ఇష్టాయిష్టాల చేత ప్రేరేపించబడి ఆచరింపబడే కర్మలు రాగద్వేష యుతాలు. అందుకు భిన్నంగా, అంటే రాగద్వేషాల చేత ప్రేరేపించ బడకుండా, రాగద్వేషాల నుండి విడిపడిన కర్మలు అరాగ ద్వేషయుతాలు (***అరాగ ద్వేషతః కృతమ్***).

కర్తవ్యాలే ప్రధానంగా చేసుకొని కర్మాచరణము చేసే సాత్త్వికులు సంగరహితులై ఉంటారు. ఇష్టాయిష్టాలను కాకుండా, ధర్మాధర్మాలను దృష్టిలో పెట్టుకొని కర్మలను ఆచరిస్తూ ఉంటారు. అలాంటి వారి కర్మలు శాస్త్ర చోదితాలు, శాస్త్రోక్తాలై ఉంటాయి. వారి కర్మలు ఇష్టాయిష్టాలపై, అంటే రాగద్వేషాలపై ఆధారపడి ఉండవు.

మరి, ఇష్టం లేనపుడు కర్మాచరణము ఎలా జరుగుతుంది? అనే సందేహము కలగ వచ్చు. ఏది తనకు ఇష్టమో అది ధర్మంతో విభేదించే టప్పుడు, అలాంటిది సాత్త్విక కర్మ కాదు కనుక, దానిని అభిలషించడు. అలాగే, శాస్త్ర ప్రతిపాదిత విషయంతో, అంటే శాస్త్రము నిషేధించిన విషయాన్ని తాను అభిలషించే టప్పుడు వ్యక్తిలో ఘర్షణ ఏర్పడుతుంది. కాని, ఇలాంటి రాగద్వేషాలకు అవకాశం లేని కర్మ ఏదయితే ఉందో అది సాత్త్విక కర్మ అవుతుంది.

**అఫల ప్రేప్సువు**

సంగ రహితంగా, రాగద్వేష రహితంగా ఆచరింపబడే కర్మలో ఫలాసక్తి ఉండే అవకాశం లేనందున, ఫలాభిసంధి లేకుండా ఆచరించే కర్త యొక్క కర్మ సాత్త్విక కర్మ అవుతుంది. ఫలము నందు ఆపేక్ష కల వాడు ఫలప్రేప్సువు. అలా కర్మ ఫలాపేక్ష లేకుండా, ఏది ప్రాప్తించినా ప్రసాదంగా స్వీకరించే కర్త చేత చేయబడే కర్మ సాత్త్విక కర్మ. అట్టి కర్మను ఆచరించే నిష్కామ కర్మయోగి అఫల ప్రేప్సువు.

చేయ దగిన నిత్యకర్మను ఫలాపేక్ష లేకుండా, కర్మసంగం లేకుండా, రాగద్వేషాలకు అతీతంగా ఆచరించడము; కర్మ యొక్క ఫలము ఎలా వచ్చినా దానిని ప్రసాదముగా స్వీకరించడము, చేయ దగిన కర్మను చేయగలిగా ననే తృప్తి, పొంద దగినదే ప్రాప్తించింది అనే సంతృప్తి సాత్త్విక కర్మను ఆచరించే వారిలో దివ్యంగా శోభిస్తూ ఉంటుంది.

తాను ఆచరించే కార్యాల వెనుక ఫలాపేక్ష లేదు అంటే, స్వర్గప్రాప్తి కామన కూడా లేదని భావము. ఇక్కడ సాత్త్విక కర్మ లాచరించే వాడు ముముక్షువు కావడం చేత కేవలం అంతఃకరణ శుద్ధ్యర్థమే కర్మాచరణము ఉంటుంది. కనుక, కర్మసంగమునకు అవకాశ ముండదు. అలాగే ఈశ్వర ప్రీత్యర్థం ఆచరిస్తాడు కనుక రాగద్వేషాలు తలెత్తవు. ఇట్టి కర్మ సాత్త్విక కర్మ.

*ఇక రాజస కర్మను గూర్చి చెబుతున్నాడు.*

**యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥** 24

***యత్-తు-కామేప్సునా-కర్మ-సాహంకారేణ వా పునః***
***క్రియతే-బహులాయాసం-తత్-రాజసం-ఉదాహృతం***

| | | | |
|---|---|---|---|
| యత్ | = ఏ | బహులాయాసం | = విశేష ప్రయాసతో |
| కర్మ తు | = కర్మము | క్రియతే | = చేయబడు చున్నదో |
| కామేప్సునా | = కోరికలు గల వాని చేత | తత్ | = ఆ కర్మము |
| సాహంకారేణ వా పునః | = అహంకారము గల వాని చేత గాని | రాజసం | = రాజస కర్మముగ |
| | | ఉదాహృతం | = చెప్పబడింది |

**అర్జునా! కోరికలు గల అహంకారి చేత అధికమైన ఆయాసముతో చేయబడే కర్మ రాజస కర్మ.**

**వ్యాఖ్య**

ఫలాకాంక్ష లేకుండా, రాగద్వేష రహితంగా, అహంకారం లేకుండా ఆచరింప బడేది సాత్త్విక కర్మ అయితే, ఫలాకాంక్ష గల వాని చేత, అహంకారముతో కూడిన వాని చేత, వ్యయ ప్రయాసలతో, ఆయాస పూరితంగా ఆచరింపబడే కర్మ రాజస కర్మ అవుతుంది. సాత్త్వికుడు నిరహంకారియై, ఫలాసక్తి లేకుండా ఆచరిస్తే, రాజసుడు అహంకారియై, ఫలాసక్తితో ఆచరిస్తాడు. అలాంటి వాని చేత ఆచరింపబడే కర్మను రాజస కర్మ మని చెబుతారు (***కామేప్సునా, సాహంకారేణ, బహులాయాసం యత్కర్మ క్రియతే తద్రాజసమ్***). పూర్వ శ్లోకంలో మనం చెప్పుకొనిన సాత్త్విక కర్మకు పూర్తిగా విరుద్ధమై ఉండటం చేత, దీనిని సాత్త్విక కర్మ నుండి వేరు చేయడానికి **తు** శబ్దం ప్రయోగించడం జరిగింది.

**కామేప్సునా కామ్యత ఇతి కామః -** ఫలమును పొందాలి అనే కోరిక చేత (**కామేప్సునా**) ఆచరింప బడే కర్మ రాజస కర్మ అవుతుంది. ఈ కర్మ వెనుక కర్మి ఆశించే ఫల మేమిటి? ఏదైనా కావచ్చు. తన సుఖాన్ని వాంఛించి కావచ్చు. తన వారి సుఖాన్ని అభిలషించి కావచ్చు. లేదా, స్వర్గ సుఖాలపై వ్యామోహంతో పరలోక సుఖాన్ని ఆశించి కావచ్చు. వీటిలో ఏదైనా, లేదా కొన్ని అయినా, లేదా అన్నీ అయినా, వాటిలో అనిత్యమైన లౌకిక సుఖాభిలాష ఉందే గాని పారమార్థిక చింతనము మాత్రము లేదు. ఇహ పర సుఖాలను అభిలషించేది రాగము. దాని నుండి విడి పడితేనే విరాగము. విరాగము కల వాడే విరాగి. విరాగి యొక్క భావమే వైరాగ్యము



(***విగతః రాగః విరాగః విరాగస్య భావః వైరాగ్యమ్***). వైరాగ్యము అంటే ఇహ పర లోక భోగముల యందు కోరిక లేకుండా ఉండటము అని అర్థము (***ఇహ స్వర్గ భోగేషు ఇచ్ఛా రాహిత్యం***). ఈ విధమైన వైరాగ్యము వివేకము నుండి పుడుతుంది. నిత్యానిత్య వస్తు వివేకము వలన కలుగుతుంది.

రాజస కర్మలలో వివేక వైరాగ్యాలకు స్థానమే లేదు. అవి కామయుతాలు. అహంకార పూరితాలు. నేను ఈ కర్మను చేస్తున్నాను; నేనే చేస్తున్నాను; నేనే చేయ గలను అనే అభిమాన ఆడంబరాలతో కూడిన అహంకార పూరితమైన కర్మ రాజస కర్మ.

అంతే కాదు. కర్త చేత చాలా శ్రమతో చేయ బడేది. వ్యయ ప్రయాసలు, అధిక శ్రమలతో కూడి ఉండేది. అదే రాజస కర్మ (***క్రియతే బహులాయాసం కర్త్రా మహతా ఆయాసేన నిర్వర్త్యతే తత్ కర్మ రాజసమ్ ఉదాహృతమ్***).

బహులాయాసంతో నిర్వర్తించ బడే ఈ కర్మల వెనుక అహంకారము బలంగా ఉంటుంది. దాని ప్రభావమే బహుళాయాసము. రాజస కర్త పరుల ముందు తన దర్పాన్ని ప్రదర్శించుకొనే ప్రయత్నంలో యజ్ఞ యాగాది కర్మలను నిర్వర్తిస్తాడు. వేష, అలంకరణాదుల చేత పదుగురిలో తాను ప్రకాశించాలి. అందరూ తనను గుర్తించాలి. గౌరవించాలి. 'ఎంత గొప్ప కార్యాన్ని నిర్వహించాడండీ!' అని వేనోళ్ళ పొగడాలి. అతడు రాగానే అందరూ లేచి నిలబడాలి. నమస్కరించాలి. తన కంటూ ఒక సముచితాసనం ఉండాలి. ఇదంతా ఆడంబర ప్రదర్శనమే. అంతా బహుళాయాసమే. తమ మీద తమకు గౌరవం లేని వాళ్ళే ఇలాంటి ప్రదర్శనల కొరకు పాటు పడుతుంటారు.

**ఎవరో మెచ్చాలని భావిస్తే**
**అక్కడే ఘర్షణ ఆరంభము**
**ఒకరిని మరొకరు నచ్చకపోతే**
**నచ్చని మనసే నొచ్చుకొను**
**నీకు నీవుగా తృప్తిపడాలి**
**అదియే జీవన సౌందర్యము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

*ఇక తామస కర్మను వివరిస్తున్నాడు.*

**అనుబన్ధం క్షయం హింసా మనవేక్ష్య చ పౌరుషమ్ ।**
**మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే ॥** 25

***అనుబంధం-క్షయం-హింసాం-అనవేక్ష్య-చ-పౌరుషం***
***మోహాత్-ఆరభ్యతే-కర్మ-యత్-తత్-తామసం-ఉచ్యతే***

| | | | |
|---|---|---|---|
| అనుబంధం | = వెంటబడి వచ్చేది | పౌరుషం చ | = సామర్థ్యమును |
| క్షయం | = హానియును | అనవేక్ష్య | = గ్రహించక |
| హింసాం | = హింసయును | మోహాత్ | = అవివేకము వలన |

| | | |
|---|---|---|
| యత్ | = | ఏ |
| కర్మ | = | కర్మము |
| ఆరభ్యతే | = | ఆరంభింప బడుతూ ఉందో |
| తత్ | = | అది |
| తామసం | = | తామస కర్మ మని |
| ఉచ్యతే | = | చెప్పు బడుతుంది |

**అర్జునా! తరువాత కలిగే పరిణామాన్ని, నష్టాన్ని, హింసను, ముఖ్యంగా తన సామర్థ్యాన్ని చూసుకోకుండా ఏ కర్మ ప్రారంభించ బడుతుందో అది తామస కర్మ.**

### వ్యాఖ్య

కోరి వినాశాన్ని కొని తెచ్చుకునే బుద్ధి ప్రమాదకర మైనది. ప్రయత్నాలు ఏవైనా ప్రమోదాన్ని కలిగించాలే గాని ప్రమాదాన్ని సృష్టించ కూడదు. లాభ దాయకంగా ఉండాలే గాని నష్ట దాయకంగా ఉండ కూడదు. మనకు నష్టము కలిగినా పరులకు మేలు జరిగితే, ఆ కర్మ జన హితంగా గుర్తించ బడుతుంది. ఆత్మకు ప్రియంగా ఉంటుంది. అటు జన శ్రేయస్సుకు బదులు జన క్షోభకు కారణ మవుతూ, ఇటు వ్యక్తి హితాన్ని కూడా దెబ్బ తీసే కర్మ అజ్ఞానంతో కూడింది. దానినే తామస కర్మ అంటారు. అది అవివేకం వల్ల ***(మోహాత్)*** ఆరంభ మవుతుంది. తమోగుణం చేత ఆచరింప బడుతుంది. అందుచేత, దానిని తామస కర్మ అన్నారు ***(మోహాత్ అవివేకాత్ ఆరభ్యతే కర్మ యత్ తామసం తమో నిర్వృత్తమ్ ఉచ్యతే)***. అనుబంధమును, క్షయమును, హింసను, పౌరుషమును దృష్టిలో ఉంచుకోకుండా ఆచరించే కర్మ తామసము. తమోగుణ ప్రధానము.

**అనుబంధము**

తరువాత ఉండ బోయేది, లేదా ప్రాప్తించ బోయే దానిని అనుబంధము అంటారు. ఒకటి జరిగిన తరువాత, దాని ప్రభావంగా రూపు దాల్చేది అనుబంధము. కర్మాచరణము అనంతరము ఏర్పడే పరిణామము అనుబంధము ***(అనుబంధం పశ్చాత్ భావి యత్ వస్తు సః అనుబంధః ఉచ్యతే)***.

కర్మ జరగడానికి అనేక కారణాలు ఉంటాయి. అవి ఏవైనా కావచ్చు. వాటిలో ప్రారబ్ధం కూడా ఒకటి కావచ్చు. కాని, మనం చేసే కర్మ యొక్క అనుబంధము ఎలా ఉంటుంది అని పూర్వాపరాలు ఆలోచించకుండా చేయబడే కర్మ తామస కర్మ అవుతుంది. కర్మలను ప్రేరేపించే కారణాలు ఎంత బలీయంగా ఉన్నా, వాటిని మదింపు వేసుకొని ఆచరించ డానికే భగవంతుడు మనిషికి బుద్ధిని ప్రసాదించాడు. బుద్ధి ఉండి ప్రయోజనం లేదు. అది పని చేయాలి. వివేకంతో ఆలోచించాలి. వివేకము లేని బుద్ధిలో అవివేకం ఉంటుంది. అవివేకమే మోహము. బుద్ధి మోహంలో మగ్నమై నపుడు కార్యాచరణకు సరియైన నిర్ణయాలు జరగవు. చేయ కూడనివి చేయడము, చేయ వలసినవి త్యజించడము జరుగుతుంది. ఆచరణ మైతే పూర్తి అవుతుంది. కాని, దాని అనుబంధము కొన సాగుతుంది. అనేక కష్టాలను, నష్టాలను పంచుతూ ముందుకు సాగుతుంది.

'అలా చేయకుండా ఉండ వలసింది. పరిగా ఆలోచించలేక పోయాను. అలా మాట్లాడకుండా ఉండ వలసింది. ఏమిటో! నా రోజులు బాగా లేవు' అనే మాటలు లోకంలో తరచు వినపడుతూ ఉంటాయి. రోజులు బాగ లేవు అని ఈ రోజు మాట్లాడు తున్నాం. కాని, ఈ రోజు బాగలేక పోవడము అనేది అనుబంధము మాత్రమే. ఆచరించిన రోజే బాగ లేని రోజు. దాని ఫలితంగా ఈ రోజు కూడా అశుభమే ప్రాప్తించింది.

అన్నీ తెలిసి చేయడానికి మనం సర్వజ్ఞులం కాము. కాని, చేసేది ఏదైనా, అది సముచిత మైనదా, కాదా అని ఆలోచించే అవకాశం లేని వాళ్ళము మాత్రం కాము. అవకాశం ఉండి ఏమి ప్రయోజనం? వినియోగించు కొనే నేర్పు, ఓర్పు ఉండాలి. దానిని పౌరుషము అంటారు. అదే పురుషాకారము. ఆత్మ సామర్థ్యము.



**పౌరుషము**

యాత్ర సుఖంగా, క్షేమంగా, శుభప్రదంగా సాగాలి అంటే యాత్రికుడు యాత్రకు ముందే దానికి సంబంధించిన విషయా లన్నీ ఆలోచిస్తాడు. ఆర్థికంగా పుష్కల మేనా? ఆరోగ్యము అనుకూల మేనా? ప్రతిబంధకాలు ఏ ముంటాయి? వాటిని ఎలా అధిగమించాలి? తనకు హాని కలిగే పరిస్థితులు ఏమైనా ఉన్నాయా? తన ప్రయాణం ఇతరులకి దుఃఖాన్ని కలిగిస్తుందా? ఇవన్నీ ఆలోచించిన తరువాతే యాత్రను ప్రారంభిస్తాడు.

జీవన యాత్రలో కూడా ప్రతిది అలా మదింపు వేసుకో గలగాలి. అప్పుడే అనుబంధము అనుదిన ప్రతిబంధకము కాకుండా ఉంటుంది. దీనినే సంస్కృతములో 'పౌరుషము' అంటారు. అంటే పురుషాకారము. పురుష సామర్థ్యము. 'నేను ఈ కార్యాన్ని చక్కగా చేయ గలుగుతాను' అనే ఆత్మస్థైర్యము ***(పౌరుషం పురుషాకారం. శక్నోమి ఇదం కర్మ సమాపయితుమ్ ఇత్యేవమ్ ఆత్మ సామర్థ్యమ్)***. ఈ విధంగా తన శక్తి సామర్థ్యాలను పరీక్షించుకోకుండా ఆచరించే కర్మ తామస కర్మ అవుతుంది. అవివేకంతో కూడినది అవుతుంది. అలాంటి అజ్ఞాన జనిత కార్యానికి అనుబంధం అశుభంగా ఉంటుంది. దుర్భరంగా ఉంటుంది.

అశక్తు డైన వాడు అసలు ఆరంభించడు. శక్తి కల వాడే ఆరంభిస్తాడు. శక్తి ఉందా, లేదా అనేది కాకుండా ఆ శక్తి సమర్థవంత మైన దేనా? అనేదే ముఖ్యం. శక్తిలో సామర్థ్యం ఉంటే అంతా శుభమే. అలా కాకుండా చాలని శక్తి, సరిపోని సామర్థ్యం ఉంటే, అప్పుడు అనుబంధం ఎలా ఉంటుంది? అనుదిన ప్రతిబంధకం గానే ఉంటుంది. చాలని శక్తి ఉండటం దోషం కాదు. సరిపోని సామర్థ్యం ఉండటం శాపం కాదు. శక్తి చాలదని, సరిపోదని గుర్తించ లేక పోవడమే దురదృష్టం. ఇలాంటి పరిస్థితుల లోనే అనుబంధం ప్రగతికి ప్రతిబంధక మవుతుంది. దీనికి ప్రధాన కారణం తమోగుణం. తమో గుణం వల్ల ఏర్పడిన అవివేకము, లేదా మోహము.

కురు సామ్రాజ్యంలో దుర్యోధనుడు ఒక వెలుగు వెలిగాడు. కాని తన పౌరుషాన్ని మదింపు వేసుకో లేని కారణంగా కురుక్షేత్రంలో కాలు మోపాడు. ఏం జరిగింది? అనుబంధాన్ని అవలోకించ లేక అశ్రువులు రాల్చాడు. సంజయుడి ముందు సంతాపంతో రోదించాడు. మడుగులో తల దాచుకో వలసిన పరిస్థితిని అనుబంధం కల్పించింది. పౌరుషం లేక గాంధారీ నందనుడు ఇలా అయ్యాడా? కాదు. తన పౌరుషాన్ని తాను అంచనా వేయలేక అలా అయ్యాడు. కారణం? మోహం మభ్య పెట్టింది. తమస్సు కప్పేసింది. తేజస్సు కనుమరు గైంది.

అనుబంధాలు అనుసరిస్తూనే ఉంటాయి. దీనికి సంబంధించిన అవగాహన కార్యారంభం లోనే ఉండాలి. ఆకులు పట్టుకోవడము అనునయమే. చేతులు కాలడం లోనే దారుణం జరిగి పోతుంది. మడుగులో దాగిన దుర్యోధనుని బయటికి ఈడ్చే ప్రయత్నంలో ధర్మరాజు పౌరుషాన్నే ప్రథమంగా ప్రశ్నించాడు.

***కృతే తత్ పౌరుషం యాతం ?*** - దుర్యోధనా! ఏమైంది నీ పౌరుషం? అని ప్రశ్నించాడు. అంటే, దుర్యోధనుడు పౌరుషం లేని వాడు అని కాదు. తన పౌరుషం సరి పోదని తెలియని వాడు. మోహగ్రస్తుడు.

దుర్యోధనుని వద్ద అస్త్ర శస్త్రా లున్నాయి. ఎందరో వీరులు తన వైపు నిలబడి పోరాడటానికి సిద్ధంగా ఉన్నారు. భీష్మ, ద్రోణ, కర్ణాదుల వద్ద భయంకరమైన అస్త్ర శస్త్రా లున్నాయి. కాని, భీకరమైన కురుక్షేత్ర రణ రంగంలో అసమాన పరాక్రమవంతు లైన పాండు సుతులను ఎదుర్కొని పోరాడటానికి అవి సరిపోతాయా? వారితో సరి తూగే సామర్థ్యం తన సేనకు ఉందా? ఈ విషయంలో దుర్యోధనుడు ఊహించడానికి శక్తి హీను డయ్యాడు. తాను కార్యారంభంలో ఊహించ లేని పౌరుషాన్ని అనుబంధంలో అజాత శత్రువు ప్రశ్నించాడు.

***కృతే కుతా స్తతా యాతా?*** - దుర్యోధనా! నీ అస్త్రవిద్యా వైభవం అంతా ఎక్కడ చచ్చింది? అని ధర్మరాజు అనుబంధంలో ప్రశ్నించాడు. ధర్మరాజు సంధించిన వాగ్బాణాలు దుర్యోధనుని గుండెల్ని ముక్కలు

చేశాయి. అభిమానాన్ని అంగుళం అంగుళం రేకుల్ని వొలిచినట్లు తొలిచేశాయి. అభిమానం చచ్చి పోయింది. పౌరుషం చావు దెబ్బ తినింది. అనుబంధం ప్రాణాల్ని పీల్చేసింది.

**వన మేవ గమిష్యామి వసానో మృగ చర్మణీ ।**
**న హి మే నిర్జన స్యాస్తి జీవితేఽ దృస్పృహో విభో ॥**

'ధర్మరాజా! అందరినీ పోగొట్టు కున్నాను. నాకు జీవితేచ్ఛ నశించింది. రాజ్య కాంక్ష లేదు. స్వర్గ స్పృహ లేదు. ఎవరి కోసం రాజ్య భోగాలను కాంక్షించానో వారందరూ రణావనిలో పండుటాకు ల్లాగా రాలి పోయారు. నేను మృగచర్మం ధరించి అడవులకు పోతాను. మునివృత్తిని స్వీకరించి మోక్షార్థినై జీవిస్తాను' అంటూ ఇంకా ఎంతో, ఎంతెంతో మాట్లాడాడు గాంధారీ నందనుడు.

ఉత్తర గోగ్రహణంలో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, కృపుడు, దుశ్శాసనుడు, శకుని, అశ్వత్థామ, వికర్ణుడు, చిత్రసేనుడు - ఇంత మంది యోధులతో కలిసి విరాట నగరాన్ని దుర్యోధనుడు ముట్టడించి నపుడు ఒక్క అర్జునుని చేతిలో అందరూ పరాభవించ బడ్డారు కదా! ఒక్క అర్జునుణ్ణే ఎదిరించ లేని యోధులు, పంచ పాండవులను, ఏడు అక్షౌహిణుల సేనను ఎదిరించి పోరాడ గలరా? పౌరుషాన్ని, అనుబంధాన్ని అర్థం చేసుకోలేక పోవడమే దుర్యోధనుని దుర్గతికి కారణము.

అనుబంధం ప్రమాద భరితంగా మారిన తరువాత దుర్యోధనుడు ఏ మాటలు పలుకు తున్నాడో, యుద్ధం ఆరంభం కాక ముందు అర్జునుడు అవే మాటలు పలికాడు.

**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ -** కృష్ణా! నాకు విజయంపై ఆశ లేదు. రాజ్యకాంక్ష లేదు. సుఖాభిలాష లేదు.

**స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవా! -** కృష్ణా! తన వాళ్ళను చంపుకొని ఎవరైనా ఎలా సుఖపడ గలరు? అని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించాడు. అవే మాటలు దుర్యోధనుడు పలికాడు. నా వాళ్ళందరూ పోయిన తరువాత రాజ్యం నా కెందుకు అంటాడు. ఈ బుద్ధి ఆరంభంలో ఏమైంది? అదే ప్రస్తుత శ్లోకంలో మనం చూస్తున్న పౌరుషము. అది లేని కారణంగా బ్రతుకు ముక్కలై పోయింది. దానినే ఈ శ్లోకంలో అనుబంధంగా మనం అర్థం చేసుకుంటున్నాం.

అనుబంధం మొదలుకొని పౌరుషం దాకా కలిగే పరిణామాలను, ప్రభావాలను ఊహించకుండా (**ఇతి ఏతాని అనుబంధాదీని అనపేక్ష్య పౌరుషాన్తాని**) మోహంతో, అవివేకంతో ఆరంభించ బడే కర్మ తామస కర్మ అవుతుంది (**మోహాత్ ఆరభ్యతే కర్మ యత్ తామసం ఉచ్యతే**). అనుబంధం మొదలు పౌరుషం దాకా తామస కర్మకు సంభవించే దుష్పరిణామా లేమిటి? అశుభా లేమిటి? చెబుతున్నాడు. అవే క్షయం - **హింసాం.**

**క్షయ హింసలు**

అనుబంధాన్ని ఆలోచించకుండా, పౌరుషాన్ని ఊహించకుండా ఆరంభించే తామస కర్మకు ప్రాప్తించే పరిణామాలు దుఃఖ భూయిష్టంగా ఉంటాయి. అవే క్షయ హింసలు అనే ద్వంద్వం.

క్షయము అంటే నష్టము. తామస కర్మ శుభ ఫలితాన్ని ఇవ్వదు కనుక, దానిని ఆచరించడం వల్ల రెండు నష్టాలు కలుగుతాయి. ఒకటి శక్తి క్షయము, రెండు ధన క్షయము (**క్షయం యస్మిన్ క్రియమాణే శక్తి క్షయః అర్థక్షయః వా స్యాత్ తం క్షయమ్**). ఈ రెండూ అనుబంధంగా తామస కర్మకు ప్రాప్తించిన ఫలాలు. కర్మకు భవిష్యత్తులో ప్రాప్తించే అవస్థలు. వీటిని ఊహించి కర్మను ఆరంభించాలి. అలా ఊహించడము తామసులకు సాధ్యం కాదు. కనుక, అనుబంధంగా ప్రాప్తించే దుష్ఫలితాలను అనుభవించ వలసి వస్తుంది.



ఆలోచన లేకుండా, ముందు వెనుకలు చూడకుండా, తామస ప్రవృత్తితో కర్మారంభం చేసిన కారణంగా ఈ రెండు దుష్ఫలితాలను దుర్యోధనుడు అనుభవించాడు. ప్రియ మిత్రుడైన కర్ణునితో సహ ఎందరినో పోగొట్టు కున్నాడు. రాజ్యాన్ని పోగొట్టు కున్నాడు (**అర్థ క్షయః**). చివరికి తానే అశక్తుడై నశించి పోయాడు (**శక్తిక్షయః**). ఇదంతా క్షయం. ఇక రెండవది హింస.

హింస అంటే బాధ. బాధ అనేది ఎవరి దైనా బాధే. ఎవరి కైనా బాధే. తనదీ బాధే. పరులదీ బాధే. కాని, ప్రస్తుతం ఈ సందర్భంలో హింస అంటే పరులకు, లేదా ప్రాణులకు తన వల్ల కలిగే దుఃఖము (**హింసాం ప్రాణి పీడామ్**). తాను ఆచరించే కార్యాల వల్ల పరులకు హాని కలగకుండా ఉండాలి. పరులను బాధ పెట్టే కార్యాన్ని ఆచరించే అర్హత ఎవ్వరికీ లేదు. అందుకే **హింసాం న కుర్యాత్ -** హింసను చేయ కూడదు అన్నది ధర్మ శాస్త్రం. **అహింసా పరమో ధర్మః -** అహింసయే ఉత్కృష్టమైన ధర్మం అని అభివర్ణించింది వేదం. ఇదే మహాభారత సారము. తమోగుణ ప్రేరితుడై, అవివేకంతో దుర్యోధనుడు ఆరంభించిన తామస కర్మకు ఎందరు బలై పోయారు! ఎన్ని మంగళసూత్రాలు తెగి పోయాయి! ఎన్ని కుటుంబాలు రోదించాయి! ఒక్క మనిషి సుఖ పడటానికి అంత మారణహోమం జరగాలా? ఇవన్నీ ముందే ఆలోచించి ఉంటే, దుర్యోధనుడు కురుక్షేత్రంలో కాలు పెడతాడా? కాలు పెట్టడ మేమిటి! కదనరంగంలో దుర్యోధనుడు రెచ్చి పోయిన తీరు చూస్తే తమస్సు అతని బుద్ధిని ఎంతగా మూసేసిందో అర్థ మవుతుంది. తమోగుణంలో ఉండే వాడు ముందు వెనుకలు ఆలోచించడు. తాను ఎంత దారుణాని కైనా వెనుకాడడు. నేను ఇతరులను హింసిస్తున్నాను కదా! ఇతరులు ఇలాగే నన్ను హింసిస్తే నేను సహించ గలనా? అని ఆలోచించడు. తమోగుణము ఆలోచించే అవకాశా న్నివ్వదు.

**ఏది నచ్చదో ఇతరులు చేసిన**
**అది ఇతరులకు చెయ్యబోకు**
**ఇతరులు ఏది చేసిన సుఖమో**
**అది ఇతరులకు చేసి చూపు**
**బాగు తెలిసి బ్రతుకుటయే**
**మహాభారతములో సారము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

*త్రివిధ జ్ఞానాలను, త్రివిధ కర్మలను వివరించిన గీతాచార్యుడు ఇక ఇప్పుడు, త్రివిధ కర్తలను తెలియ చేస్తాడు. చదవండి.*

**ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః ।**
**సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥** 26

**ముక్తసంగః-అనహంవాదీ-ధృత్యుత్సాహ సమన్వితః**
**సిద్ధ్యసిద్ధ్యోః-నిర్వికారః-కర్తా-సాత్త్వికః-ఉచ్యతే**

| | | |
|---|---|---|
| ముక్తసంగః | = | సంగత్వము నుండి విడిపడిన వాడు |
| అనహంవాదీ | = | అహంకార రహితుడు |
| ధృత్యుత్సాహ సమన్వితః | = | ధైర్యము తోను ఉత్సాహము తోను కూడిన వాడు |

సిద్ధ్యసిద్ధ్యోః = కార్యము సిద్ధించినను, సిద్ధించక పోయినను
నిర్వికారః = వికారము చెందనివాడు నగు
కర్తా = కర్త
సాత్త్వికః = సత్త్వగుణము కల వాడుగ
ఉచ్యతే = చెప్పబడు చున్నాడు

**అర్జునా! ఫలసంగం లేని వాడు, నిరహంకారి, ధైర్యశాలి, ఉత్సాహవంతుడు, కార్యము సిద్ధించినా, సిద్ధించక పోయినా నిర్వికారంగా ఉండే వాడు సాత్త్విక కర్త.**

### వ్యాఖ్య

గుణ భేదాన్ని బట్టి త్రివిధము లైన కర్తలను గూర్చి వరుసగా చెప్పడానికి ఉపక్రమించి, ముందుగా సాత్త్విక కర్తను గూర్చి వివరిస్తున్నాడు. ప్రతి ఒక్కరికి కర్మ చాలా ప్రధాన మైంది. కనుక, కర్మ చేసే కర్త ఎలా ఉండాలో తెలుసుకొని, తదనుగుణంగా జీవించ డానికి ఈ కర్తృ ప్రకరణము ఎంత గానో ఉపకరిస్తుంది.

మనస్సును బట్టే మనుగడ ఉంటుంది. ఒక మనిషి జీవితంలో ఏ విధమైన వైభవము గోచరించినా, అది అతని మనస్సు లోని వికాసమే అయి ఉంటుంది. సాత్త్విక కర్త అంటే సాత్త్విక మైన కర్మను ఆచరించే వాడు అని అర్థము. జ్ఞానం లేకుండా కర్మ నెలా ఆచరిస్తాడు? మనస్సు లోని పవిత్రతే కర్మలలో తొంగి చూస్తుంది. ఎవరి కైనా, ఎప్పుడైనా మనస్సు లోని ఆలోచనలే మనుగడలో ప్రతిఫలిస్తూ ఉంటాయి. మనస్సు సాత్త్వికంగా ఉంటే మనస్సు లోని జ్ఞానము కూడా సాత్త్వికం గానే ఉంటుంది. అట్టి మనస్సు గల వ్యక్తి జీవితంలో చేసే ఆలోచనలు, ఆచరించే కర్మలు కూడా సాత్త్వికం గానే ఉంటాయి. ఈ శ్లోకంలో నాలుగు లక్షణాలను ప్రధానంగా భగవంతుడు చెబుతున్నాడు. ఈ నాలుగు లక్షణాలు ఎవరిలో ఉంటాయో అతడే సాత్త్విక కర్త (*కర్తా సాత్త్విక ఉచ్యతే*). సాత్త్విక కర్త యొక్క విశిష్ట మైన గుణ చతుష్టయాన్ని తెలుసు కుందాము.

**ముక్త సంగుడు**

సంగము అంటే ఆసక్తి అని పూర్వ శ్లోకాలలో చెప్పుకున్నాం. ఎవడైతే ఆసక్తి నుండి, లేదా సంగము నుండి విడి పడ్డాడో అతడు ముక్త సంగుడు (*ముక్తసంగః ముక్తః పరిత్యక్తః సంగః యేన సః ముక్తసంగః*). ఫలాభిసంధిని త్యజించిన వాడు.

సాత్త్విక కర్త కర్మలను ఆచరిస్తాడు గాని కర్మసంగము లేకుండా ఆచరిస్తాడు. కర్తృత్వాభిమానము లేని వాడై ఉంటాడు. రాగద్వేషాలు లేని వాడు కనుక, 'ఈ కర్మే చేయాలి - ఆ ఫలితమే రావాలి' అనే ఆలోచన లేకుండా, 'ఈ కర్మ చేయ దగినది, ఇది నా కర్తవ్యము' అని భావించి శాస్త్ర విహిత కర్మలను సంగత్వం లేకుండా ఆచరిస్తాడు.

ఏదేదో చేయాలనే ఊహలు ఎలాగైతే ఉండవో, ఏదేదో పొందాలనే ఆశలు కూడా ఉండవు. కనుకనే అతడు ముక్తసంగుడు. తాను చేయ వలసింది అంటూ ఏదో దానిని ధర్మబద్ధంగా నిర్వర్తిస్తాడు. అంతే కాదు. తాను పొంద వలసిం దేమిటో, పొంద దగిన దేమిటో, అది తప్పక అందుతుంది అనే స్థిరమైన అభిప్రాయాన్ని కలిగి ఉంటాడు.

ఈ రోజు ఉన్న వన్నీ మనం ఆశిస్తేనే వచ్చాయా? ఈ రోజు ఈ స్థితిలో ఉంటామని మనలో ఎవర మైనా పూర్వం ఆలోచించామా? ఆశించామా? గీతా వ్యాఖ్యానం వ్రాస్తా నని గతంలో నేను ఊహించానా? దీనిని చదువుతా మని మీరు మాత్రం కలలు కన్నారా?

మనకు అంద వలసినవి అందుతూనే ఉంటాయి. వాటిని ఎవ్వరూ ఆప లేరు. మనకు ఉండ వలసిన వన్నీ ఇప్పటి వరకూ ఉన్నాయి. భవిష్యత్తులో కూడా ఉంటాయి. ఇలా ఉంటామని, మనకు ఇవన్నీ ఉంటాయని



గతంలో మనం ఆలోచించ లేదు కదా! మనం ఆలోచించ లేదని నేడున్నవి అదృశ్య మౌతాయా? నేడున్న వన్నీ గతంలో మనం ఆశించినవి కానపుడు, భవిష్యత్తులో ఏవేవి ఉండాలో వాటిని మాత్రం ఇప్పుడు ఆలోచించడ మెందుకు?

జరిగేది జరిగి తీరుతుంది. వచ్చేవి వచ్చి తీరుతాయి. మనం రాక ముందే మన ఆహారం అవనికి చేరి పోయింది. మనం వస్తా మని తెలిసి మనకు సంబంధించిన జలాలను మేఘాలు వర్షిం చేశాయి. బావులు, చెరువులు, నదులు వాటిని నిలువ చేసి ఉంచాయి. మనం పుట్టక ముందే ఊయల తయారైంది. మనల్ని పంపడానికి ఉన్న పాడె వస్తేనే మనం నిష్క్రమిస్తాము.

కళ్ళు చూడ వలసిన దృశ్యా లన్నీ ముందే ప్రదర్శింపబడి ఉన్నాయి. కాళ్ళు సంచరించ వలసిన ప్రదేశా లన్నీ మన కొరకు నిరీక్షిస్తూ ఉన్నాయి. ప్రయాణాలకు, ప్రదర్శనలకు టిక్కెట్లన్నీ రిజర్వు చేయబడే ఉన్నాయి. ఆసుపత్రులు ఎన్నున్నా, మన పడక ఎక్కడుందో, ఆ ఆసుపత్రి లోకే మనం ప్రవేశిస్తాము. ఇలా ప్రారబ్ధం తన పనిని తాను చేసుకుంటూ పోతుంది.

నేను ప్రారబ్ధాన్ని అనుసరిస్తూనే నేడు ఇక్కడ ఉన్నాను. జీవించి ఉన్నాను. ఎంత వరకు ఉండమని చెబితే, అంత వరకు జీవిస్తూ ఉంటాను. జీవిస్తున్నాను అంటే, చేయ వలసింది ఉంది కనుకనే జీవిస్తున్నాను. నేను ఏది చేయాలో అది నా కొరకే ఉంటుంది. నా దైన దానిని, నా కొరకున్న దానిని నేను చేయక పోతే మరెవరు చేస్తారు?

నేను చేయ వలసిన కర్మ నా కొరకు ఎలాగైతే నిర్ణయింపబడి ఉందో, దానిని చేయడానికి అనువైన, అనుగుణమైన పరిస్థితులు కూడా నా కొరకు సృష్టింపబడే ఉన్నాయి. వస్తువు లన్నీ సిద్ధం చేయబడి ఉన్నాయి. ముడి సరుకంతా ఓ మూల నా కోసం పడి ఉంది.

నా కార్యాలు నా కొరకు ఎదురు చూస్తున్నాయి. వాటిని చేసేందుకు కరచరణాదులు నాకు ప్రసాదించ బడ్డాయి. కార్యాలు ఎలా చేయాలో ఆలోచించే మనస్సు నాకు తెలియకుండానే నా లోనే ఉంచ బడింది.

ఏదైనా నాకు నేనుగా ఒక్కడినే చేయలేను. ఎందరో సహకరించాలి. అలా సహకరించే వాళ్ళందరు నా కన్నా ముందే వచ్చి ఉన్నారు. నాకు సహకరించ మని వారికి ఇప్పటికే వర్తమానాలు అందాయి. నేను కర్తృత్వము లేకుండా కర్మ చేస్తాను. భగవంతుని చేతిలో మురళి లాగా పనుల్ని నేను ముట్టు కుంటాను. వేణువుకు వాయువు సహకరించినట్లు, నాకు ఎందరో సహకరిస్తారు. ఇంతవరకు ఎలా సహకరించారో, ఇక ముందు కూడా అలాగే సహకరిస్తారు. గతంలో సహకరించిన వాళ్ళే సహకరించాలని లేదు. ఎవరైనా సహకరించ వచ్చు. ఎప్పు డెప్పుడు ఎవరెవరు సహకరించాలో వాళ్ళు సహకరించి తీరుతారు. ఇదంతా నియతి. నియంత నియమించిన పద్ధతి. ఇంత జరిగే టప్పుడు, ఇంతగా జరిగే టప్పుడు, ఈ కర్మలలో నాకు సంగ మెందుకు? కర్మసంగ మెందుకు? ఇలా అర్థం చేసుకున్న వాడు సాత్త్విక కర్త. ముక్త సంగుడు.

**అనహంవాది**

అహం అంటే నేను. అహంవాది అంటే నేను అని పలికే వాడు. అనహంవాది అంటే నేను అని పలకని వాడు (*అనహం వాదీ న అహం వదన శీలః*). నేను చేశాను అని చెప్పని వాడు. తాను సంభావితు డనే ఆలోచనే లేని వాడు. ఆలాపనే తెలియని వాడు. మాట లోనే కాదు, మనస్సులో కూడా 'నేను ఇది చేశాను' అనే భావం లేని వాడు అనహంవాది. కనుక, తనను తాను శ్లాఘించు కొనడం అర్థం కాని వాడు. గర్వ మేమిటో తెలియని వాడు.

అంటే, అతడు ఏమీ చేయడా? ఎందుకు చేయడు! అన్నీ చేస్తాడు. దానధర్మాలు చేయడా? చేస్తాడు. అప్పుడే మనుకుంటాడు? నేను ధర్మం చేశాను, అని అనుకోడా? అనుకోడు. 'అందించే అవకాశం నాకు ఇవ్వబడింది. ఇచ్చిన దానిని అందుకొని నన్ను అనుగ్రహించే వ్యక్తిని కూడా నాకు ఇవ్వడం జరిగింది. అంతా భగవదనుగ్రహం' అనుకుంటాడు.

ఉన్న దానినే కదా దానం చేసేది! ఉన్న దేదైనా వచ్చిందే కదా! వచ్చి ఉన్నదే కదా! ఎవరు పంపితే వచ్చింది? నా వెంట నేను తెచ్చుకో లేదు కదా? ఎవరో పంపితేనే కదా వచ్చింది. ద్రవ్యాన్ని పంపిన దెవరో, గ్రహీతను పంపింది కూడా అతడే.

గ్రహీతలు గ్రహిస్తున్నారు. అనుగ్రహీతలు అనుగ్రహిస్తున్నారు. మధ్యలో తీర్థపు గిన్నె చేత పట్టుకొని ఆరాధనా భావంతో నేను నిలబడి ఉన్నాను. సమర్పణ భావంతో సంతసిస్తున్నాను. ఎనలేని సంతృప్తిని పొందుతున్నాను. దప్పిక గొన్న మేకకు చెంబుడు నీళ్ళు త్రాగిస్తే, మేఘాన్ని చూచి దణ్ణం పెట్టవలసిన వాణ్ణి. ప్రాణాన్ని మోసుకొచ్చి నాసికా సంతర్పణం చేస్తున్న గాలి ఋణం ఎలా తీర్చుకోవాలో అర్థం కాని వాణ్ణి. నీళ్ళకు ఖరీదు కట్టే శక్తి లేని వాణ్ణి. నిప్పును ముట్టుకొనే సాహసం లేని వాణ్ణి. భూమిని కొలిచే సామర్థ్యం లేని వాణ్ణి. నింగి లోకి తొంగి చూసే ధైర్యం లేని వాణ్ణి. అన్నీ నన్ను కరుణిస్తున్నాయి. అందరూ నన్ను అనుగ్రహిస్తున్నారు. కృతజ్ఞతతో కదిలి పోతున్నాను. భక్తితో నమస్కరిస్తూ ఉన్నాను.

నా కున్నవి రెండు చేతులే. అవి ఏం చేయ గలవు? ఎంతని చేయ గలవు? నేను ఎన్నో చేసి ఉండ వచ్చు. ఎంతెంతో చేసి ఉండ వచ్చు. అవన్నీ నా రెండు చేతులకు సాధ్య మవుతాయా? ఎన్నో చేతులు నా రెండు చేతుల్ని కాసాయి. ఎన్నో చిత్తాలు నా చిత్తాన్ని మోసాయి.

అందుకోవడానికి మాసాలు, సంవత్సరాలు సరిపోయాయి. అందించ డానికి క్షణాలే మిగిలాయి. నిమిషాలే ముందు నిలిచాయి. ఎంత ఋణగ్రస్తుణ్ణో. పట్టేందుకే ఉన్నాయి నా రెండు చేతులు. పెట్టేందుకు ఎక్కడ నుండి వస్తాయి?

పాడే నేర్పు నాకు ఉండొచ్చు. పాట వినే ఓర్పు శ్రోతలకు ఉండాలి కదా! పాడ మని పాట నిచ్చిన వాడే ఆ పాటను వినే వాళ్ళను కూడా దగ్గరకు చేర్చుతాడు. ఆనందంగా వినే వాళ్ళు లభించడం నా అదృష్టం కాదా? వినే వాళ్ళు లేనపుడు నాకు పాటెందుకు? పాటను వ్రాసే మాటెందుకు? మాటను కదిపే రాగ మెందుకు?

రచించే భాగ్యాన్ని ప్రసాదించా డని మురిసి పోనా? చదివే వాళ్ళు ఉన్నారనే అదృష్టానికి పొంగి పోనా? చదివే వాళ్ళు లేనపుడు వ్రాసి ఏమి ఉపయోగం? నోటికి మాటను అందించే దెవరు? మాటకు ప్రాణం పోసే దెవరు? గుండెలలో అమృతాన్ని ఒలికించే దెవరు? వీనులకు విందు చేసే దెవరు? ఎక్కడిది ఈ జగన్మోహన శక్తి? ఎవరిదీ విశ్వమోహన యుక్తి?

నాకు తెలియదు. నాకు తెలిసిం దల్లా ఒక్కటే. ఇవేవీ నావి కావని. వీటిని కంటూ, వింటూ; కనింది చాలక కంటూనే ఉండాలని, వినింది సరిపోక వింటూనే ఉండాలని అర్రులు చాచే వాణ్ణే గాని, అహంకారిగా మిగిలే వాణ్ణి కాను. అహంవాదిగా వెలిగే వాణ్ణి కాను. అనహంకారిని. అనహంవాదిని.

**కననీర కరుణాకర కమలనాథా!**
**కానరార గాంచెదను నా తనివి తీర!**
**చేర్చుకోర నన్ను నీ మనము లోన**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!** అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్న ముద్ద.



## ధృత్యుత్సాహ సమన్వితుడు

ధృతి అంటే ధైర్యము. ధారణము. నిలకడ. ఆటంకాలు ఎదురైనా, ఆరంభించిన కార్యాన్ని ఆపకుండా కొనసాగించే ధారణకు సంబంధించిన అంతఃకరణ వృత్తి విశేషము ధృతి.

ఉత్సాహము అంటే ఉద్యమము. ప్రయత్నము. కర్మాచరణము నందు ఇచ్ఛా వేగము ఉద్యమము. ఈ కార్యాన్ని ఎలాగైనా నెరవేర్చాలి, తప్పక ఆచరించాలి అనే నిశ్చయముతో కూడిన ప్రయత్నమే ఉద్యమము.

సాత్త్విక మైన ధైర్యము, సాత్త్విక మైన ఉత్సాహము ఎవరి యందు నిలకడగా ఉంటాయో, అతడు ధృత్యుత్సాహ సమన్వితుడు (***ధృతిః ధారణమ్ ఉత్సాహః ఉద్యమః తాభ్యాం సమన్వితః సంయుక్తః ధృత్యుత్సాహ సమన్వితః***). ఒక్క మాటలో చెప్పాలంటే, ఎవరిలో పిరికితనము లేదో, నిరుత్సాహము ఉండదో, అతడే సాత్త్విక కర్త.

అయితే, ఈ ధృత్యుత్సాహాలలో ఫలాకాంక్ష ఉండదు. ధైర్యముతో, ఉత్సాహంతో ఆచరించే కార్యాలన్నీ అంతఃకరణ శుద్ధ్యర్థమే ఉంటాయి. ఈశ్వర ప్రీత్యర్థమే చేయ బడతాయి.

ధృత్యుత్సాహాలు దుర్యోధనునిలో ఉన్నాయి. కౌరవు లందరూ ధైర్యోత్సాహాల తోనే ఊరేగారు. అవే ధైర్యోత్సాహాలు పాండవులలో కూడా ఉన్నాయి. కాకపోతే, కౌరవుల లోని ధైర్యోత్సాహాలు విధ్వంసక చర్యలకు ఉపకరించాయి. కారణం, అవి సాత్త్విక ధైర్యోత్సాహాలు కావు. రాజస, తామస సంబంధమైన ధృత్యుత్సాహాలు. కాని, పాండవుల ధైర్యోత్సాహాలు విధాయక చర్యలు గానే కొనసాగాయి. కారణం, వారి ధృత్యుత్సాహాలు సాత్త్వికాలు.

## సిద్ధ్య సిద్ధులలో నిర్వికారుడు

ఆచరించిన కర్మకు ఫలం సిద్ధించినా, సిద్ధించక పోయినా తనలో ఏ మార్పు లేకుండా నిర్వికారంగా ఉండే వాడు సిద్ధ్య సిద్ధులలో సముడు. హర్షశోకాలు లేని వాడు. ఆశించిన ఫలము సిద్ధించింది అనే హర్షము గాని, ఫలము సిద్ధించ లేదు అనే శోకము గాని లేని వాడు (***క్రియ మానస్య కర్మణః ఫలసిద్ధౌ అసిద్ధౌ చ సిద్ధ్య సిద్ధ్యోః నిర్వికారః***).

చెట్టుకు కాసిన ప్రతి కాయ ఫల మవుతుందని చెప్ప లేము. అలాగే, మనిషి ఆచరించే ప్రతి కర్మ సత్ఫలితాన్నే ఇస్తుందని చెప్ప లేము. కర్మ కర్మఫలంగా రూపాంతరం చెందడానికి నియతి ఉంది. ఈ అంతరాలలో అనుకూలాలు ఉంటాయి. ప్రతికూలాలూ ఉంటాయి.

అన్నీ అనుకూలిస్తే, తగు పాళ్ళలో అన్నీ సమకూరి నపుడు వంట రుచిగా తయారైనట్లు, కర్మకు సత్ఫలితం అందుతుంది. అలా కాకుండా నియతి విషమించి నపుడు, అంటే ప్రయత్నాలు నియతికి భిన్నంగా సాగి నపుడు ఫలితాలు తారుమారౌతూ ఉంటాయి.

అలాంటప్పుడు అనుకున్న ఫలాలు రావచ్చు. లేదా, వాటికి భిన్నమైన ఫలితాలు రావచ్చు. ఇవే సిద్ధ్య సిద్ధులు. అంటే సిద్ధించిన ఫలితాలు, సిద్ధించని ఫలితాలు.

సాధారణంగా ఆశించిన ఫలితాలు సిద్ధించి నపుడు ఆనందించడము, వికటించి నపుడు దుఃఖించడము మానవులకు పరిపాటి. కర్మల విషయంలో కర్త లందరూ అలాగే ఉంటారు. కాని, సాత్త్విక కర్త వారికి విలక్షణమైన వాడు. కర్మఫలము సిద్ధించినా, సిద్ధించక పోయినా, అతని లోని సమస్థితి చెడదు. హర్షశోకాలకు అతడు

లోను కాదు. ఎందుకని? అతడు కర్మల విషయంలో ముక్తసంగుడై ఉండటము ఒక కారణము. మరొక కారణం, ఫలప్రాప్తి విషయంలో అతనికి ఉండే అవగాహన.

ఫలం సిద్ధించి నపుడు పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నాయి కనుక సిద్ధి ప్రాప్తించింది అనుకుంటాడు. ఫలం వికటించి నపుడు, పరిస్థితులు నియతికి ప్రతికూలంగా ఉండటం చేత సిద్ధి ప్రాప్తించ లేదు అని అర్థం చేసుకుంటాడు. అందుచేత, ఫలసిద్ధిలో పొంగిపోడు. ఫల అసిద్ధిలో క్రుంగి పోడు.

అనుకూలాలలో ఫలం సిద్ధించి నపుడు నిర్వహణములో ధర్మమే ఉంది. ప్రతికూలాలలో ఫలం సిద్ధించ నపుడు కూడా నిర్వహణములో ధర్మమే ఉంది. ధర్మ నియతిలో వ్యక్తి పాత్ర ఏముంది? అనుకుంటాడు.

మరొక ప్రధాన మైన విషయ మేమిటంటే, కర్మలలో ఇష్టాయిష్టాలు ఉండే టప్పుడు, ఫలాలు వికారాన్ని కలిగిస్తాయి. అంటే, రాగద్వేషాల చేత ప్రేరేపించబడి కర్మల నాచరిస్తే, రాగానికి అనుకూలమైన ఫలం సిద్ధించి నపుడు సంతోషించడము, ప్రతికూల మైన ఫలం సిద్ధించి నపుడు దుఃఖించడము జరుగుతుంది. రాగము విషయములో ఎలాగో, ద్వేషము విషయము లోనూ అంతే.

కాని, సాత్త్విక కర్త రాగద్వేషాల చేత ప్రేరేపించ బడి కర్మల నాచరించే వాడు కాడు. శాస్త్ర విహిత కర్మలను కర్తవ్యాలుగా భావించి ఆచరించే వాడు. ఫలాభిసంధి లేని వాడు. కనుక, అతడు ఫలప్రాప్తి సమయంలో నిర్వికారంగా ఉంటాడు ***(నిర్వికారః కేవలం శాస్త్ర ప్రమాణ ప్రయుక్తః న ఫలాను రాగాదినా యుక్తః యః సః నిర్వికారః ఉచ్యతే, ఏవం భూతః యః సః సాత్త్వికః ఉచ్యతే)***. అట్టి నిర్వికారు డైన కర్త సాత్త్వికకర్తగా చెప్ప బడతాడు. సాత్త్విక కర్త కర్మయోగిగా గోచరిస్తున్నాడు. గీత మూడు, నాలుగు, ఐదు అధ్యాయాలలో ఏ కర్మయోగమును గూర్చి మనం తెలుసుకున్నామో, అదే యోగ స్థితి సాత్త్విక కర్తలో గోచరిస్తూ ఉంది.

ముక్తసంగుడై ఉండటం, అనహంవాదిగా శోభించడము, ఫలప్రాప్తి సమయంలో నిర్వికారుడై ఉండటము - ఈ లక్షణాలను చూచి సాత్త్విక కర్తను ఆత్మజ్ఞానిగా భావించి చాలా మంది వ్యాఖ్యానిస్తూ ఉంటారు. అది అవగాహనా రాహిత్యమే. సాత్త్విక కర్త కర్మయోగియే గాని జ్ఞాని కాడు. దీనికి వాదమే అనవసరము. కర్త అన్నపుడే జ్ఞాని కాదని అర్థం. జ్ఞాని అకర్తయే గాని కర్త కాడు కదా!

అనిత్యాలను అర్థం చేసుకుంటూ, నిత్య సత్యాలను బుద్ధికి పట్టిస్తూ, ఏది ఉండినా, ఏది ఊడినా, వాటి వెనుక నియతిని, నియతి రూపంలో ఉన్న నియంతను దర్శిస్తూ కర్మల నాచరించే సాత్త్విక కర్త అంతఃకరణ శుద్ధిని పొంది, తద్వారా జ్ఞానప్రాప్తికి సిద్ధ మవుతాడు.

**వెలుగు నీడ - పగలు రేయి**
**సంపదల వెనుక ఆపదలు**
**పగిలేది కుండ వాడేది దండ**
**చితుకును బ్రతుకు అతక కుండా**
**పోయే వాటిని పోనిపోనీ**
**ఉండే సత్యము వెలగనీ**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

ఇపుడు రాజస కర్తను గూర్చి చెబుతున్నాడు.





27

## రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
## హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥

***రాగీ-కర్మఫలప్రేప్సుః-లుబ్ధః-హింసాత్మకః-అశుచిః***
***హర్షశోకాన్వితః-కర్తా-రాజసః-పరికీర్తితః***

| | | | |
|---|---|---|---|
| రాగీ | = రాగము గలవాడు | హర్షశోకాన్వితః | = హర్షశోకములతో గూడిన వాడు |
| కర్మఫలప్రేప్సుః | = కర్మఫలము నాశించే వాడు | కర్తా | = కర్త |
| లుబ్ధః | = లుబ్ధుడును | రాజసః | = రాజసుడని |
| హింసాత్మకః | = హింసా స్వభావము గలవాడు | పరికీర్తితః | = చెప్పబడినాడు |
| అశుచిః | = శుచిత్వము లేనివాడు | | |

**అర్జునా! రాగము గలవాడు, ఫలాపేక్ష గలవాడు, లోభి, హింసాప్రవృత్తి గలవాడు, శుచిత్వము లేనివాడు, హర్షశోకములతో గూడిన వాడు రాజసకర్త.**

### వ్యాఖ్య

పూర్వ శ్లోకంలో సాత్త్విక కర్త లక్షణాలను అర్థం చేసుకున్నాం. దానికి భిన్నమైన లక్షణాలు కలిగిన వాడు రాజస కర్త.

కర్మ ఫలాల యందు ఆసక్తి కల వాడు ***(రాగీ)***. ఇతరుల ధనము నందు అపేక్ష కల వాడు, తన ధనాన్ని విడువడానికి ఇష్ట పడని వాడు ***(లుబ్ధః)***. ఇతరులను పీడించే, హింసించే స్వభావము కల వాడు ***(హింసాత్మకః)***. పవిత్రతకు నోచుకోని వాడు, అంటే బాహ్యాభ్యంతరాలలో శుచి లేని వాడు ***(అశుచిః)***, కర్మఫలాలు ప్రాప్తించి నపుడు వికారం చెందే వాడు, అంటే అనుకూలాలలో సుఖమును, ప్రతికూలాలలో దుఃఖమును పొందే వాడు ***(హర్షశోకాన్వితః)*** - ఇటువంటి గుణాలు గల కర్త రాజస కర్త అని చెప్ప బడ్డాడు ***(యః కర్తా సః రాజసః పరికీర్తితః)***.

పూర్వ శ్లోకంలో మనం చూచిన సాత్త్విక కర్త జ్ఞాని కాడని, కర్మయోగి మాత్రమే నని చెప్పు కున్నాము. ఈ శ్లోకం లోని రాజస కర్త కూడా కర్మయోగి కాడు. కేవలం కర్మి మాత్రమే.

**రాగి**

రాగి అంటే రాగము కల వాడు. రాగము ద్వేషానికి ఉప లక్షణము. రాగము ఉన్నపుడు ద్వేషము ఉండి తీరుతుంది. రాగము అంటే కామము. ద్వేషము అంటే క్రోధము. మనుషులలో రాగద్వేషా లుంటాయి. రాగ ద్వేషాలు విజృంభించి నపుడు అవి కామక్రోధాలుగా వ్యక్త మవుతాయి.

రాగము అంటే ఆసక్తి. ఎవరికి ఆసక్తి ఉంటుందో అతడు రాగి ***(రాగః అస్య అస్తీతి రాగీ)***. రాగద్వేషాల కారణం గానే కర్మాచరణం చేసే వాడు రాజస కర్త. ఇక్కడ రాగము, లేదా ఆసక్తి అన్నపుడు, ఏ విషయము నందు ఆసక్తి అనే ప్రశ్న పుడుతుంది. అందుకు పుత్ర కళత్ర ధనాదుల యందు, అలాగే స్వర్గప్రాప్తి యందు రాగము అని సమాధానము వస్తుంది. కనుక, రాజస కర్త ఇటు లౌకిక కర్మల నాచరించినా, అటు యజ్ఞ యాగాది వైదిక కర్మల నాచరించినా, ఫలార్థము ఆచరిస్తాడే గాని, మోక్షార్థం మాత్రం కాదు. రాజస కర్తకు ధర్మార్థ కామా లనే త్రివర్గముల యందే ఆసక్తి, లేదా రాగము.

కర్మఫలము నందే ఆసక్తి కల వాడు కనుక రాజస కర్త అయిన రాగి కర్మఫల ప్రేప్సువు. కర్మఫలమునే అర్థించు వాడు కర్మఫల ప్రేప్సువు (**కర్మఫలప్రేప్సుః కర్మ ఫలార్థీ**).

**లుబ్ధుడు**

లోభ గుణము కల వాడు లుబ్ధుడు. ధనాశ కల వాడు. కాని, 'లుబ్ధ' శబ్దము కేవలం ధనాశ మాత్రమే కాదు. తన ధనంపై తనకు ఆశ ఉండటం దోషం కాదు. కాని, లుబ్ధునికి పరుల ధనం మీద కూడా ఆశ (**లుబ్ధః పర ద్రవ్యేషు సంజాత తృష్ణః**). తన ధనం తనదే కదా! అది ఎలాగూ ఉంది. పరుల ద్రవ్యం కూడా లభించాలి అని ఆశ పడే వాడు లుబ్ధుడు.

పరుల ధనమును ఆశించడంలో ఎంత ఉత్సాహం ఉంటుందో, తన ధనాన్ని ఖర్చు చేయడంలో అతనికి అంత నిరుత్సాహం ఉంటుంది.

సాధారణంగా ద్రవ్య వినియోగానికి తీర్థ క్షేత్రాలు పవిత్ర స్థానాలని భావిస్తాము. పుణ్య ప్రదేశాలలో చేసే దాన ధర్మాలు జీవునికి శ్రేయస్సును కలిగిస్తా యని శాస్త్రాలు చెబుతున్నాయి. శాస్త్ర జ్ఞానం తనకు ఉండినా తీర్థాది పవిత్ర క్షేత్రాలలో కూడా ధనాన్ని త్యాగం చేయ లేని దృఢ స్థితి లోభిలో ఉంటుంది. అదే లుబ్ధుని ప్రత్యేకత (**తీర్థాదౌ చ స్వద్రవ్య అపరిత్యాగీ లుబ్ధః**). తాను త్యాగం చేయక పోవడమే కాదు, చేసే వాళ్ళను కూడా చేయ నివ్వడు. అంతే కాదు. కూడ బెట్టడమే గాని అనుభవించడము అనేది ఉండదు. లోభము బ్రతుకులో ఎన్నడూ లాభం కాదు. లోభి ఎప్పుడైనా నష్ట పోయే వాడే. ఇది దేశకాలాదులు మారినా మారని సత్యం. కామ లోభాలు బ్రతుకునే హరిస్తాయి.

**ఆఖ్యాయిక**

పూర్వం ఒక గ్రామ పొలిమేర్లలో పెద్ద కొండ ఒకటి ఉండేది. ఆ కొండకు సంబంధించిన ఆశ్చర్యకర మైన ఒక ఇతివృత్తం ఆ ప్రాంతంలో దంత కథ లాగా వ్యాపించి ఉండింది.

ఆ కొండలో ఏదో ఒక చోట, ఒక ప్రత్యేకమైన సమయంలో ద్వారం తెరుచుకున్నట్లు కొండ తెరుచుకుంటుం దని, అలా తెరుచుకొనిన గిరి ద్వారము కొంత సమయము మాత్రమే తెరుచుకొని ఉండి, ఆ తరువాత పూర్వం లాగే మూసుకు పోతుందని, గిరి ద్వారము తెరుచుకోవడం అదృష్టవంతులకే కనిపిస్తుందని, అలా చూచిన వారు లోనికి వెళ్తే అక్కడ అమూల్యమైన మణులు, మాణిక్యాలు, వజ్రాలు, రత్నాలు గుట్టలు గుట్టలుగా పడి ఉంటాయని, వాటిని తెచ్చుకో వచ్చని, అలా పూర్వ మెప్పుడో తెచ్చుకున్న అదృష్ట వంతులు కొందరు ఉన్నారని - ఈ విధమైన దంత కథ ప్రచారంలో ఉండింది.

కొండ సమీపాన ఉన్న గ్రామంలో ఒక జమీందారు ఉండే వాడు. ఆ గ్రామంలో ఆయనే అందరి కన్నా ఐశ్వర్యవంతుడు. ప్రతి రోజు ఉదయం గుఱ్ఱపు స్వారి చేస్తూ, గిరి ప్రాంతానికి వెళ్ళి వస్తూ ఉండే వాడు.

ఒక రోజు జమీందారు స్వారి చేస్తూ కొండ సమీపానికి రాగానే, అక్కడ గిరి ద్వారము తెరుచుకొని ఉండటం చూశాడు. తానెప్పుడో చిన్నప్పుడు వినిన దంత కథ గుర్తు కొచ్చింది. ఆ ప్రాంతంలో తానే ఐశ్వర్యవంతుడు కనుక, అదృష్టవంతు డైన తన కొరకు గిరి ద్వారము తెరుచుకుంది అని భావించి, గుఱ్ఱాన్ని దిగి వేగంగా లోనికి ప్రవేశించాడు.

అక్కడి దృశ్యాన్ని చూచి తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. మణులు, మాణిక్యాలు, రత్నాలు,



వజ్రాలు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. తన జన్మ ధన్య మైందని భావించాడు జమీందారు. ఆ విలువైన రత్న రాశులను తొందర తొందరగా పంచెలో కట్టుకొని బయటకు తెచ్చు కున్నాడు. వాటిని మరొక వస్త్రంలో మూట కట్టి కొండ బయట ఉన్న తన అశ్వం పైకి ఎక్కించాడు. ఇప్పటికే ఎంతో మూట కట్టేశాడు. ఈ లోగా అతనికి కథ లోని ప్రధానాంశము జ్ఞాపక మొచ్చింది. తెరుచుకొనిన గిరి ద్వారము కొంత సమయం తరువాత మూసుకు పోతుందనే విషయం స్మృతికి వచ్చి, ఇక ప్రాప్తించింది చాలు అని నిర్ణయించు కున్నాడు. గ్రామానికి తిరిగి బయలుదేరే సమయంలో, ఇక తృప్తిగా నస్యం పీల్చుకుందా మని జేబు తడవు కున్నాడు. నస్యం డబ్బీ కొండ లోపలే మరచి పోయాడు. వెంటనే దానిని తెచ్చుకుందామని పరుగు పరుగున మళ్ళీ కొండ లోకి వెళ్ళాడు. కొండ బిలము అదృశ్య మయ్యే కాలం సమీపించింది. అంతే. క్షణంలో కొండ ద్వారం మూసుకు పోయింది.

గ్రామస్థు లందరూ జమీందారు కొరకు అన్ని చోట్ల అన్వేషించారు. తీరా చూస్తే, జమీందారు గారి అశ్వం కనిపించింది. అశ్వంపై నున్న మూటలో అమూల్యమైన మణులు, మాణిక్యాలు ఉన్నాయి. సంవత్సరం పాటు గ్రామస్థులు జమీందారు కొరకు నిరీక్షిస్తూ, ఆ మణులు, మాణిక్యాలను రక్షిస్తూ ఉండినారు.

కాలం కళ్ళ ముందే కరిగి పోయింది. ఆశలు ఆవిరై పోయాయి. ఇంకేం చేస్తారు? దురదృష్టవంతు డైన జమీందారు గారి అదృష్టాన్ని గ్రామస్థు లందరూ పంచుకున్నారు.

రత్న రాశుల మూటలు వెంటే ఉన్నా, ప్రాణాలను పట్టుకు పోవడానికి ముక్కు పొడుం డబ్బీ చాలు. భూమి విశాల మైందే కావచ్చు. కాని మనిషి నివసించ డానికి ఎంత స్థలం అవసరం? ఆకాశం అనంతం కావచ్చు. అలాగని పక్షి ఎంత ఎత్తుకు ఎగర గలుగుతుంది? సముద్రంలో జలం అగాధంగా ఉండ వచ్చు. కాని చేప చరించ డానికి ఎంత జలం కావాలి? మనిషి ఈ ప్రపంచంలో ఎంత కాలం బ్రతుకుతాడు? పూర్ణాయుష్షు కల వాడి కైనా సుఖ పడటానికి ఎంత ఐశ్వర్యం అవసరం?

**కల లున్నాయి అంధునికి**
**కలవర ముంది అందరికి**
**కళ్ళున్నాయి మూత పడుటకు**
**మనసుంది మూగ బోవుటకు**
**ఉన్నవి ఉండవు కలకాలం**
**కాలము కదిపే మాయాజాలం**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

**హింసాత్మకుడు**

హింసాత్మకుడు అంటే పరులను పీడించే స్వభావం కల వాడు (**హింసాత్మకః పర పీడా స్వభావః**). వెలిగే దీపం వెలుగును విరజిమ్ముతుంది. మల్లె వాసన మల్లె కుంది. ఉల్లి వాసన ఉల్లి కుంది. ఎవరు ఏది పంచినా, వారి వద్ద ఉన్నదే పంచుతారు. ఎవడు తనను తాను హింసించు కుంటాడో, వాడు పరులను కూడా హింసిస్తాడు. ఇది కాస్త లోతుగా అధ్యయనం చేయ వలసిన విషయము. రాజస కర్త రాగద్వేషాల మధ్య ఊగిస లాడే స్వభావం కల వాడు అయినందున, శాంతి లేని జీవితాన్ని గడుపుతూ ఉంటాడు. తాను అశాంతిలో మగ్నమై ఉండటమే గాక, ఇతరులను కూడా అశాంతికి గురి చేస్తాడు.

**అశుచిర్భూతుడు**

శుచి అంటే శౌచము. శుభ్రత. పవిత్రత. శుచి లేని వాడు **అశుచిః** అని చెప్ప బడ్డాడు. అంటే శుభ్రత లేని వాడు. అపవిత్రుడు. బాహ్య శౌచము, అంతః శౌచము రెండూ లేని వాడు ***(అశుచిః బాహ్యాన్తః శౌచ వర్జితః)***.

బాహ్యంలో దేహ శుచి, ఆంతర్యంలో అంతఃకరణ శుచి రెండూ లేని వాడు. రాజస కర్త యొక్క దేహము, మనస్సు రెండూ అశుద్ధం గానే ఉంటాయి. అశుద్ధాన్ని దాచడం ఎవ్వరికీ సాధ్యం కాదు. అది బహిర్ముఖ మవుతూనే ఉంటుంది. కాకపోతే, రాజస కర్త బాహ్య అశుచిని దాచుకో గల డేమో గాని అంతః అశౌచాన్ని దాచ లేడు.

స్నానాదులు లేక మలినంగా ఉన్నా, అత్తరు పన్నీరులను పైన చల్లుకొని శుచిర్భూతుల కన్నా ఎక్కువ శుచిగా ఉన్నట్లు ప్రకటించు కుంటాడు. లోగుట్టు పెరుమాళ్ళ కెరుక. ఇలాంటి వారి కొరకే నేమో ఉర్దూలో ***బాహర్ శేర్వాని - అందర్ పరేషాని*** అనే నానుడి ఒకటి వినిపిస్తూ ఉంటుంది.

బాహ్య అశౌచాన్ని అత్తరు పన్నీరులతో తాత్కాలికంగా ఆప గల డేమో గాని అంతః అశౌచాన్ని ఆపడం సాధ్యం కాదు. అంతఃకరణ లోని మాలిన్యమే లోపల అశౌచము. క్రోధము, ద్వేషము, అసూయ మొదలైన వన్నీ ఆంతరంగిక అశౌచాలే. ఇవన్నీ రాజస కర్త యొక్క లక్షణాలు.

**హర్ష శోకాన్వితుడు**

ఇష్ట మైనది ప్రాప్తించి నపుడు హర్షమును, ఆ ఇష్ట మైనది దూరమైనా, లేదా అనిష్ట మైనది సమీపించినా శోకమును అనుభవించే కర్త రాజస కర్త ***(ఇష్ట ప్రాప్తౌ హర్షః అనిష్ట ప్రాప్తౌ ఇష్ట వియోగే చ శోకః తాభ్యాం హర్ష శోకాభ్యాం, అన్వితః సంయుక్తః)***. ఇష్టాయిష్టాలకు అతీతంగా ధర్మాధర్మాలను అవలోకిస్తూ, శాస్త్ర విహిత కర్మలను కర్తవ్యంగా చేసే వాడు అయినందున, సాత్త్విక కర్త నిర్వికారంగా ఉంటాడు. కాని, అందుకు భిన్న మైన ప్రవృత్తి, ప్రవర్తన కల వాడు కావడం చేత, రాజస కర్త సుఖదుఃఖాలలో పడి అలమటిస్తూ ఉంటాడు.

ఇక తామస కర్తను గూర్చి చెబుతున్నాడు.

**అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికో௨లసః ।**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥** 28

*అయుక్తః-ప్రాకృతః-స్తబ్ధః-శఠః-నైష్కృతికః-అలసః*
*విషాదీ-దీర్ఘసూత్రీ-చ-కర్తా-తామసః-ఉచ్యతే*

| | | | |
|---|---|---|---|
| అయుక్తః | = యుక్తుడు కాని వాడు | విషాదీ | = దుఃఖ స్వభావము గలవాడు |
| ప్రాకృతః | = పామరుడు | దీర్ఘసూత్రీ చ | = కాలయాపన చేయువాడు |
| స్తబ్ధః | = జడుడు | కర్తా | = కర్త |
| శఠః | = వంచకుడు | తామసః | = తామసుడని |
| నైష్కృతికః | = ఇతరులను మోసగించి నష్టపరచు వాడు | ఉచ్యతే | = చెప్పబడు చున్నాడు |
| అలసః | = సోమరియు | | |

**యుక్తుడు గాని వాడు, పామరుడు, జడుడు, వంచకుడు, మోసగాడు, సోమరి, దుఃఖించే వాడు, కాలయాపన చేసే వాడు తామసకర్త.**



**వ్యాఖ్య**

సాత్త్విక, రాజస కర్తల కన్నా విలక్షణ మైన వాడు తామస కర్త. చావు రానంత వరకు బ్రతుకుతూనే ఉంటాడు. మానవ రూపంలో ఉండే మృగము. భూమికి భారంగా, గాలికి అడ్డంగా తిరుగుతూ ఉంటాడు. వాడే తామస కర్త.

వ్యాఖ్యానానికి యుక్తం కాని వాడు. కారణం, అతడు అయుక్తుడు. ఇది అతని ప్రథమ లక్షణము. అయుక్తుడు అంటే నిలకడ లేని వాడు. మనస్సును ఒక చోట క్షణమైనా ఉంచ లేని వాడు. అస్థిర చిత్తుడు. పాదరసం లాంటి వాడు ***(అయుక్తః అసమాహితః)***.

అయుక్తుడే కాదు, ప్రాకృతుడు కూడా. అంటే, సంస్కార హీనుడు. పరిపక్వత లేని వాడు ***(ప్రాకృతః అత్యన్త అసంస్కృత బుద్ధిః)***. సాధారణంగా ఇలాంటి బుద్ధిహీనులు సుజనుల ముందు సిగ్గుతో తలవంచు కోవాలి. వినమ్రులై ఉండాలి. కాని, ఈ ఘటం అలాంటి వాడు కాదు. పొగరుబోతు. స్తబ్ధుడు.

స్తబ్ధత అంటే వంగని స్వభావము. కట్టె లాగా బిగుసుకొని ఉంటాడు అన్నారు ఆచార్యులు ***(స్తబ్ధః దండవత్ న నమతి కస్మై చిత్)***. కట్టెకు దండము అని పేరు. కాని, దండం పెట్టడం దండానికి తెలుసా? అది వంగి నమస్కరిస్తుందా? స్తబ్ధుడు కూడా అంతే. పేరుకు మానవుడే కాని, అన్నీ రాక్షస గుణాలే.

స్తబ్ధుడుగా ఉంటాడే గాని, కట్టెలో అగ్ని ఉన్నట్లే, ఈ ఉలిపి కట్టెలో కపటము దాగి ఉంటుంది. కొంపలు ముంచే స్వభావం ఉంటుంది. మాయ లన్నీ మనస్సు లోనే ఉంటాయి. అందుకే తామస కర్త శఠుడు ***(శఠః మాయావీ)***. తన స్వభావాన్ని వ్యక్తం కాకుండా కప్పి పుచ్చుకొనే వాడు.

తాను ఒక మంచి పనిని చేయలేక పోయినా, పరుల కార్యాలను పాడు చేయడమే తన కార్యంగా భావించి నిర్వర్తించే వాడు. కనుక నైష్కృతికుడు ***(నైష్కృతికః పరవృత్తి ఛేదన పరః)***.

సోమరిపోతు ***(అలసః)***. ఏడుపే వేడుకగా కలిగిన వాడు ***(విషాదీ)***. పైగా దీర్ఘసూత్రీ. అంటే పొడవైన దారం కల వాడు. ఎంత దూరమైనా సాగదీయ గలడు. ఈ రోజు బ్రతుకుతూ ఉంటాడు గాని, ఏది మాట్లాడినా రేపు, రేపు అంటూ ఉంటాడు. ఆ రేపుకు రూపే రాదు. నేడో, రేపో చేయ వలసిన కార్యాన్ని మాసం దాటినా చేయని వాడు దీర్ఘసూత్రి ***(దీర్ఘ సూత్రీ చ కర్తవ్యానాం దీర్ఘ ప్రసారణః, యత్ అద్య శ్వః వా కర్తవ్యం తత్ మాసేనాపి న కరోతి)***. ఈ విధమైన ప్రవృత్తి కల వాడు తామస కర్త. ఇలాంటి వాడు ఏమి సుఖ పడతాడు? అందుకే అష్ట లక్షణాలను అష్ట దరిద్రాలుగా చెప్పిన భగవానుడు, ఏడవ లక్షణంలో ఏడుపును పెట్టాడని నా భావం ***(విషాదీ)***.

మనం చిన్నతనంలో చిన్నయ్యసూరి దగ్గర నేర్చుకొనిన షడ్వికార శోక మూర్తులు, మీరు బాగా పరీక్షించి చూస్తే, ఈ ఒక్క దౌర్భాగ్యుడి లోనే దర్శన మిస్తారు. దుఃఖభాగులు ఆరు మంది అని బాల్యంలో మనం నేర్చుకున్నాం. ***ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, నిత్య శంకితుడు, పరభాగ్యోప జీవి*** - వీరు ఆరుగురు దుఃఖ భాగులని నీతి కోవిదులు చెబుతారు అన్నాడు చిన్నయ్యసూరి. కాని, ఆ ఆరుగురు ఈ ఒక్కడి లోనే ఉన్నా రంటున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

ఇప్పటి వరకు త్రివిధ జ్ఞానమును, త్రివిధ కర్మలను, త్రివిధ కర్తలను గూర్చి చెప్పుకున్నాం. ఇక, ఇప్పుడు జ్ఞాన స్థానమైన బుద్ధి త్రివిధంగా ఎలా ఉందో చెప్పి, ఆ తరువాత, సాత్త్విక కర్తలో మనం చూచిన 'ధృతి' ఎలా త్రివిధంగా ఉందో చెబుతాను. అక్కడే నేను ఒక్క విషయాన్ని మీ దృష్టికి తెచ్చాను (26 వ శ్లో). ధృతి, లేదా ధైర్యము సాత్త్వికం గానే ఉంటుందని చెప్ప లేము అని కౌరవ పాండవులను ఉదహరించాను. వాటి అంతరాన్ని కూడా త్రివిధ ధృతిలో పరమేశ్వరుడు వివరిస్తాడు. ప్రస్తుతం బుద్ధిని స్పృశిస్తున్నాడు.

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ ॥ 29

బుద్ధేః-భేదం-ధృతేః-చ-ఏవ-గుణతః-త్రివిధం-శృణు
ప్రోచ్యమానం-అశేషేణ-పృథక్త్వేన-ధనంజయ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధనంజయ | = | అర్జునా! | అశేషేణ | = | సంపూర్ణముగ |
| గుణతః | = | గుణములను బట్టి | ప్రోచ్య మానం | = | చెప్ప బడిన |
| బుద్ధేః | = | బుద్ధి యొక్క | త్రివిధం | = | మూడు విధములైన |
| ధృతేః చ ఏవ | = | ధైర్యము యొక్క | భేదం | = | భేదమును |
| పృథక్త్వేన | = | వేరువేరుగా | శృణు | = | విను |

**అర్జునా! గుణ భేదము వల్ల బుద్ధి, ధైర్యము మూడు విధాలుగా ఉన్నాయి. వాటిని వేరు వేరుగా పూర్తిగా చెబుతాను. విను.**

### వ్యాఖ్య

పందొమ్మిదవ శ్లోకంలో జ్ఞానము, కర్మ, కర్త అని ప్రతిపాదించ బడిన విషయాన్ని గుణ భేదాన్ని బట్టి త్రివిధముగా వ్యాఖ్యానించడం జరిగింది. ఇరవై ఆరవ శ్లోకము నందు **ధృత్యుత్సాహ సమన్వితః** అనే చోట అంతఃకరణ వృత్తిని సూత్ర ప్రాయంగా చెప్పడం జరిగింది.

కర్త ఆలోచించడానికి బుద్ధి కరణము. బుద్ధిలో ఏర్పడే వృత్తియే జ్ఞానము. కనుక బుద్ధి లేకుండా జ్ఞాన వృత్తి ఉత్పన్నం కాదు. వృత్తి లేకుండా బుద్ధిలో ఆలోచన జరగదు. కనుక జ్ఞాన నిలయమైన బుద్ధికి, బుద్ధి వృత్తి అయిన ధృతికి గుణ భేదాన్ని బట్టి త్రివిధ వ్యాఖ్యానము చేయ వలసి ఉంది.

వృత్తిమంత మైన బుద్ధికి, ధృతి అనే బుద్ధి వృత్తికి గుణ భేదాన్ని మూడు విధాలుగా వ్యాఖ్యానించ డానికి ఉపక్రమించిన భగవానుడు, ముందుగా త్రివిధమైన బుద్ధి విషయాన్ని గూర్చి ప్రసంగిస్తూ, 'ధనంజయా!' అని అర్జునుని సంబోధించాడు. దిగ్విజయ యాత్ర సందర్భములో సుర నర లోకాలకు సంబంధించిన విశేష ధనాన్ని ఆర్జించిన వాడు కావడం చేత అర్జునుడు ధనంజయుడని ఖ్యాతి వహించాడు. అది ధనమే అయినా, అక్షయ ధనము జ్ఞానమే అనే అర్థాన్ని సూచిస్తూ అర్జునుని 'ధనంజయా!' అని పిలిచాడు గీతాచార్యుడు. **శృణు** - విను అని ప్రత్యేకించి చెప్పడం కూడా జ్ఞాన వైశిష్ట్యాన్ని స్తుతించుటయే.

గుణ భేదాన్ని బట్టి త్రివిధముగా చెప్ప బడుతున్న బుద్ధి విషయములో ముందుగా సాత్త్విక బుద్ధిని గూర్చి చెబుతున్నాడు.

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30

ప్రవృత్తిం-చ-నివృత్తిం-చ-కార్యాకార్యే-భయాభయే
బంధం-మోక్షం-చ-యా-వేత్తి-బుద్ధిః-సా-పార్థ-సాత్త్వికీ

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | బుద్ధిః | = | బుద్ధి |
| యా | = | ఏ | ప్రవృత్తిం చ | = | ప్రవృత్తి విషయమును |
| నివృత్తిం చ | = | నివృత్తి విషయమును | వేత్తి | = | గ్రహించు చున్నదో |
| కార్యాకార్యే | = | కార్యమును, అకార్యమును | సా | = | ఆ |
| భయాభయే | = | భయమును, అభయమును | బుద్ధిః | = | బుద్ధి |
| బంధం | = | బంధమును | సాత్త్వికీ | = | సాత్త్విక మైనది |
| మోక్షం చ | = | మోక్షమును | | | |



**అర్జునా! ప్రవృత్తి నివృత్తి విషయాలను, కార్యాకార్యాలను, భయాభయాలను, బంధ మోక్షాలను తెలుసుకునే బుద్ధి సాత్త్విక బుద్ధి.**

### వ్యాఖ్య

వృత్తి విశేషం చేత బుద్ధిలో జ్ఞానము కలుగుతూ ఉంది. ఏ విధమైన జ్ఞానము బుద్ధిలో ఏర్పడటం చేత ఆ బుద్ధి సాత్త్విక మని చెప్ప బడుతుందో దానిని వివరిస్తున్నాడు.

ప్రవృత్తి నివృత్తులను (***ప్రవృత్తిం చ నివృత్తిం చ***), కార్యాకార్యాలను (***కార్యాకార్యే***), భయాభయాలను (***భయాభయే***), బంధమోక్షాలను (***బంధం మోక్షం చ***) ఏది తెలుసుకుంటూ ఉందో (***యా వేత్తి***) అది సాత్త్విక మైన బుద్ధి (***సా బుద్ధిః సాత్త్వికీ***). ఇది శ్లోకార్థము.

ఈ విధమైన భేదమును, దానికి సంబంధించిన జ్ఞానమును తెలుసుకునే బుద్ధి సాత్త్విక మైనది అంటున్నాడు. బుద్ధి అనేది కరణమే గాని కర్త కాదు. కరణము నందు కర్తృత్వము అనేది కేవలం ఔపచారికమే కనుక, కర్తయే బుద్ధి చేత తెలుసుకుంటున్నా డని భావము.

**ప్రవృత్తి నివృత్తులు**

మొదట ప్రవృత్తి నివృత్తుల విషయం. ప్రవృత్తి అంటే కర్మ మార్గము. నివృత్తి అంటే జ్ఞాన మార్గము. కర్మ మార్గము బంధ హేతువు. జ్ఞాన మార్గము మోక్ష హేతువు (***ప్రవృత్తిః ప్రవర్తనం బంధ హేతుః కర్మ మార్గః నివృత్తిః మోక్ష హేతుః సంన్యాస మార్గః***).

అలా ఎందుకు భావించాలి? ప్రవృత్తి అంటే ఆచరించ దగిన దని, నివృత్తి అంటే ఆచరించ దగనిది అని గ్రహించ వచ్చు కదా! గ్రహించ వచ్చు. కాని, బంధమోక్షాలను గూర్చి ప్రసంగించిన శ్లోకం లోనే ప్రవృత్తి నివృత్తులను ప్రస్తావించడం చేత బంధ హేతువైన కర్మ మార్గము ప్రవృత్తి అని, మోక్ష హేతువైన జ్ఞాన మార్గము నివృత్తి అని తెలుస్తూ ఉంది. ఆచరణీయము, అనాచరణీయము అనే అర్థం సముచితమే అయినా, ఆ అర్థాన్ని ప్రత్యేకంగా సూచిస్తూ కార్యాకార్యములు కూడా ఈ శ్లోకం లోనే ప్రతిపాదించబడి ఉన్నందున, ఈ విషయంలో మీమాంస అవసరము లేదు. ఈ ప్రవృత్తి నివృత్తుల భేదమును గుర్తించి గ్రహించే జ్ఞానము ఏ బుద్ధికి ఉందో అది సాత్త్విక బుద్ధి.

**కార్యాకార్యాలు**

తరువాత అంశము కార్యాకార్యాలు. అంటే, కార్యము, అకార్యము. కార్యము అంటే చేయ దగినది; విహిత కర్మ. అకార్యము అంటే చేయ కూడనిది; నిషిద్ధ కర్మ, లేదా ప్రతిషిద్ధ కర్మ. విహిత కర్మను ఆచరించ డము, ప్రతిషిద్ధ కర్మను ఆచరించకుండా ఉండటము కార్యాకార్యములు (***కార్యాకార్యే, విహిత ప్రతిషిద్ధే కర్తవ్యా కర్తవ్యే, కరణా కరణే ఇత్యేతత్***).

ఇక్కడ, ఈ చేయడము, చేయక పోవడము అనేది దేని విషయంలో అనే ప్రశ్న ఉత్పన్న మవుతుంది (***కస్య?***). లౌకికంగా, అంటే వ్యావహారికంగా కూడా మనకు కొన్ని కార్యాకార్యాలు ఉన్నాయి.

మద్యపాన నిషేధ చట్టమును ప్రభుత్వము ప్రవేశ పెట్టి నపుడు దానిని ప్రజ లందరూ ఆచరించి తీరాలి. మద్యపానము చేయడానికి వీలు లేదు. నేడు మద్యపానమును సేవించడం అకార్యము కావచ్చు. కాని, రేపు ప్రభుత్వము చట్టాన్ని మార్చి, మద్యపానాన్ని స్వేచ్ఛాపానీయం చేయ వచ్చు. అప్పుడు, ఇంత వరకు ఏది అకార్యమో, అది క్షణాల్లో కార్యంగా మారి పోతుంది. ఒక కాలంలో అకార్యంగా ఉన్నది మరొక కాలంలో కార్యంగా కనిపిస్తుంది. అంతే కాదు. ఒక కాలం లోనే, ఒక రాష్ట్రంలో కార్యం గాను, మరొక రాష్ట్రంలో అకార్యం గాను ఉండ వచ్చు. ఈ విధంగా కార్యాకార్యాలు దేశ కాలాదులను బట్టి మారుతూ ఉంటాయి ***( దేశ కాలాద్యపేక్షయా దృష్ట అదృష్టార్థానాం కర్మణామ్ ).***

కనుక, కేవలం దేశ కాలాదులనే కాకుండా, సాధకులు దృష్ట అదృష్ట ఫలాలను కూడా దృష్టిలో ఉంచుకొని కార్యాకార్యాలలో ప్రవర్తించాలి. మనం ఆచరించే కార్యాలకు ప్రత్యక్షంగా కనిపించేది దృష్ట ఫలం. ప్రత్యక్షంగా కనిపించనిది అదృష్ట ఫలం.

ఒక వ్యక్తి కోటి రూపాయలు ఒక సేవా సంస్థకు దానం చేస్తాడు. అలా చేయడం వల్ల అతను ఎంత గానో తృప్తి చెందుతాడు. అది దృష్ట ఫలం. కాని, అతడు చేసిన సత్కర్మకు పుణ్యఫలం కూడా ఉంది. అది కంటికి కనిపించదు. అది అదృష్ట ఫలం.

కనుక, ఈ దృష్టా దృష్ట ఫలాలు ఎలాంటివై ఉండాలి అనేది సాధకులు నిర్ణయించుకొని కార్యాకార్యాలలో ప్రవర్తించాలి. ఫలార్థి అయితే స్వర్గాది ఫలభోగాన్ని ఆశిస్తాడు. మోక్షార్థి అయితే, చిత్తశుద్ధిని, తద్వారా జ్ఞానప్రాప్తిని అభిలషిస్తాడు. కార్యాకార్యాలలో ఈ అంతరాన్ని గ్రహించే సూక్ష్మత్వము సాత్త్విక బుద్ధికే ఉంటుంది.

**భయాభయాలు**

దేని వలన మనిషి భీతి చెందుతాడో అది భయము ***( బిభే త్యస్మాదితి భయమ్ ).*** అంటే, భయ కారణము భయమే అని దాని అర్థం. ప్రవృత్తి మార్గము, లేదా కర్మమార్గము దుర్భరమైన సంసారానికి కారణ మవుతూ ఉంది కనుక, ప్రవృత్తి భయ హేతువు. అలాగే అకార్యము పాపానికి, నీచజన్మలకు కారణం కావడం చేత, అకార్యము కూడా భయ హేతువే.

దీనికి విరుద్ధ మైనది అభయము ***( తద్విపరీతమ్ అభయమ్ ).*** భయ రూపమైన సంసారము నుండి విముక్తిని కలిగిస్తూ ఉంది కనుక, నివృత్తి మార్గము, లేదా జ్ఞాన మార్గము అభయ హేతువు. అలాగే కార్యము చిత్తశుద్ధికి, జ్ఞాన యోగ్యతకు కారణం కావడం చేత కార్యము కూడా అభయ హేతువే.

ఈ విధంగా దృష్టా దృష్ట ఫలాలు భయాభయ హేతువులుగా తెలుస్తూ ఉన్నాయి ***(దృష్టా దృష్ట విషయోః భయా భయయోః కారణే ఇత్యర్థః).*** కనుక ఏది బంధమో, ఏది మోక్షమో; బంధమును, దాని కారణాన్ని; అలాగే మోక్షమును, దాని హేతువును ఏ బుద్ధి తెలుసుకుంటూ ఉందో అది సాత్త్విక బుద్ధి.

*ఇక రాజస బుద్ధిని గూర్చి వివరిస్తున్నాడు.*

**యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ ।**
**అయథావ త్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥** 31

**యయా-ధర్మం-అధర్మం-చ-కార్యం-చ-అకార్యం-ఏవ-చ**
**అయథావత్-ప్రజానాతి-బుద్ధిః-సా-పార్థ-రాజసీ**

| | | |
|---|---|---|
| పార్థ | = | అర్జునా! |
| యయా | = | ఏ బుద్ధి చేత |
| ధర్మం | = | ధర్మమును |
| అధర్మం | = | అధర్మమును |
| కార్యం చ | = | కార్యమును |
| అకార్యం ఏవ చ | = | అకార్యమును |
| అయథావత్ | = | యథార్థము కానట్లు |
| ప్రజానాతి | = | తెలుసుకుంటూ ఉందో |
| సా | = | ఆ |
| బుద్ధిః | = | బుద్ధి |
| రాజసీ | = | రాజసిక మైనది |

**అర్జునా! ధర్మాధర్మాలను, కార్యాకార్యాలను ఉన్న దున్నట్లు కాకుండా భిన్నంగా గ్రహించే బుద్ధి రాజసబుద్ధి.**

**వ్యాఖ్య**

శాస్త్ర విహిత మైనది ధర్మము. శాస్త్ర నిషిద్ధ మైనది అధర్మము. ఏది శాస్త్ర ప్రతిపాదితమో అది కర్తవ్య కర్మ. చేయ దగినది. ఏది శాస్త్ర విరుద్ధమో అది నిషిద్ధ కర్మ. చేయ కూడనిది ***(ధర్మం శాస్త్ర చోదితమ్, అధర్మం చ తత్ప్రతిషిద్ధం ).***

ఈ విధమైన ధర్మాధర్మాలను, కార్యాకార్యాలను సాత్త్విక బుద్ధి గ్రహిస్తుంది. రాజస బుద్ధి కూడా గ్రహిస్తుంది. కాకపోతే, ఉన్న దున్నట్లుగా సాత్త్విక బుద్ధి గ్రహిస్తుంది ***( యథావత్ ).*** రాజస బుద్ధి ఉన్నది ఉన్నట్లుగా గ్రహించ లేదు. ఉన్నది ఉన్నట్లు కాకుండా గ్రహిస్తుంది ***(అయథావత్).*** అది సందిగ్ధంతో కూడిన బుద్ధి. అదే రాజస బుద్ధి.

రాజస బుద్ధికి ఏదీ ఉన్న దున్నట్లు అర్థం కాదు. పోనివ్వండి. ఉన్నది ఉన్నట్లు అర్థం కాక పోయినా, ఏదో విధంగా అర్థ మవుతుంది కదా! అవును. అవుతుంది. అదే, ఎలా అర్థ మవుతుంది?

ఎలాగైనా అర్థం కావచ్చు. ***యథావత్*** అర్థమైతే సమస్య లేదు. ***అయథావత్*** అర్థం కావడ మంటే, ఇక అక్కడ అర్థమైంది ఏముంది? ఏది అర్థమైనా, అది మాత్రం ఉన్నది కాదు. అలాగని, లేనిదీ కాదు. ఎందుకని? అర్థమైంది అంటున్నాడు కనుక.

కనుక, అర్థమైంది. కాని, ఆ అర్థమైంది ఏదో వాస్తవంగా ఉన్నది మాత్రం కాదు. అలాగని లేనిదీ కాదు. ఏది తన బుద్ధిలో ఉందో, అదే అర్థమైంది; అర్థ మౌతుంది. ఈ విధంగా ఏ జ్ఞానమును సందిగ్ధంగా గ్రహిస్తుందో, ఆ బుద్ధి రాజస బుద్ధి.

యథార్థాన్ని చూడకుండా బుద్ధిలో ఉన్న దానిని చూస్తుంది అంటే, ఆ దృష్టి వెనుక సత్యం లేదు. రాగద్వేషాలే ఉన్నాయి. కనుక సాత్త్విక బుద్ధి ఏర్పడితేనే శాస్త్రం అర్థ మవుతుంది. రాజస బుద్ధి రాగద్వేషాల కోణం నుండి చూస్తుంది కనుక శాస్త్రం ఉన్న దున్నట్లుగా కాకుండా, వ్యక్తి మనస్సుకు అనుగుణంగా అర్థ మవుతుంది. కనుక, రాజస బుద్ధి గల వారు శాస్త్రాన్ని అధ్యయనం చేస్తారే గాని శాస్త్ర హృదయాన్ని పట్టుకో లేరు. పట్టుకోలేరు సరి గదా, వారి పైత్యాన్నంతా శాస్త్రానికి ఆపాదిస్తారు.

***దృశ్యన్తేహి పురుషాః రాగాది గౌరవాత్ శాస్త్రం అతిక్రామన్తః -*** రాగద్వేషాలు కల వారు శాస్త్రాన్ని వ్యతిరేకిస్తారని ఆచార్యులు భాష్యంలో అభిప్రాయ పడ్డారు. లేని దానిని ఉన్నట్లు చూడటము అంటే, ఉన్న దానిని నిరాకరించడమే కదా! అదే రాజస బుద్ధి.

*ఇక తామస బుద్ధిని గూర్చి చెబుతున్నాడు.*

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।**
**సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥** 32

**అధర్మం-ధర్మం-ఇతి-యా-మన్యతే-తమసా-ఆవృతా**
**సర్వార్థాన్-విపరీతాన్-చ-బుద్ధిః-సా-పార్థ-తామసీ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | ధర్మం ఇతి | = | ధర్మ మనియు |
| యా | = | ఏ | సర్వార్థాన్ | = | సర్వ విషయములను |
| బుద్ధిః | = | బుద్ధి | విపరీతాన్ చ | = | విపరీత భావము గల వానినిగ |
| తమసా | = | అజ్ఞానము చేత | మన్యతే | = | భావిస్తుందో |
| ఆవృతా | = | కప్పు బడినదై | సా బుద్ధిః | = | ఆ బుద్ధి |
| అధర్మం | = | అధర్మమును | తామసీ | = | తామసిక మైనది |

**అర్జునా! అజ్ఞానము చేత కప్పబడింది, అధర్మమును ధర్మము గాను, సమస్త విషయాలను విపరీతంగా భావించేది తామస బుద్ధి.**

**వ్యాఖ్య**

ఏ బుద్ధికి ధర్మం అధర్మం గాను, విహితం ప్రతిషిద్ధం గాను, కార్యం అకార్యం గాను, అర్థము అనర్థము గాను, యుక్తము అయుక్తము గాను గోచరిస్తుందో, ఆ బుద్ధి తామస బుద్ధి. ఏవేవి స్పష్టంగా జ్ఞేయములో అవన్నీ విపరీతాలు గానే గోచరిస్తాయి.

తామస బుద్ధికి విషయానందమే గాని ఆత్మానందము గిట్టదు. ఆచార్యోపదేశాన్ని ***యథావత్*** తామస బుద్ధి గ్రహించదు. అందుచేత సంశయ విచ్ఛేదనము జరగదు. శాస్త్రం విషయంలో శ్రద్ధ లేని కారణంగా జ్ఞానం వంట పట్టదు. అందుచేత విపరీత దృష్టి, విపర్యయ జ్ఞానం బుద్ధిని కప్పేసి ఉంటాయి. ఆ బుద్ధిలో చీకటే గాని వెలుగు ఉండదు. అదే తామస బుద్ధి.

ఉన్న దున్నట్లు గ్రహించేది సాత్త్విక బుద్ధి. ఉన్నది ఉన్నట్లు గ్రహించనిది రాజస బుద్ధి. లేనిది ఉన్నట్లు గ్రహించేది తామస బుద్ధి.

సాత్త్విక, రాజస, తామస బుద్ధులను గూర్చి వివరంగా చెప్పుకున్నాం. ఇదేమీ కథ కాదు. శాస్త్రం. శ్రేయస్సును ప్రసాదించే ప్రమాణము. బుద్ధి భేదాన్ని గ్రహించిన తరువాత ప్రయత్నాన్ని ముమ్మరం చేయాలి. తమోగుణం నుండి రజో గుణానికి, రజోగుణం నుండి సత్త్వ గుణానికి చేరాలి. ఆ తరువాత త్రిగుణాలను అధిగమించి గుణాతీతులమై తరించాలి. అందుకే, ఈ గుణత్రయ విశ్లేషణ మంతా.

*బుద్ధిని త్రివిధంగా వివరించి బోధించిన భగవానుడు, ఇక త్రివిధమైన ధృతిని వివరించే కార్యంలో ముందుగా సాత్త్విక ధృతిని గూర్చి చెబుతున్నాడు.*

**ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియ క్రియాః ।**
**యోగే నావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ 33**

**ధృత్యా-యయా-ధారయతే-మనః ప్రాణేంద్రియక్రియాః**
**యోగేన-అవ్యభిచారిణ్యా-ధృతిః-సా-పార్థ-సాత్త్వికీ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | మనఃప్రాణేంద్రియక్రియాః | = | మనస్సు, ప్రాణము, ఇంద్రియ చేష్టలు |
| యయా | = | ఏ | అవ్యభిచారిణ్యా | = | వ్యభిచరించనట్టి |
| ధృత్యా | = | ధృతి చేత | యోగేన | = | యోగము చేత |
| ధారయతే | = | ధరింప బడుచున్నవో | ధృతిః | = | ధైర్యము |
| సా | = | ఆ | సాత్త్వికీ | = | సత్త్వగుణ ప్రధాన మైనది |



**అర్జునా! మనస్సు, ప్రాణము, ఇంద్రియ చేష్టలు - వీటిని నిశ్చలమైన యోగము చేత నియమించేది సాత్త్విక ధృతి.**

**వ్యాఖ్య**

ధృతి అంటే ధారణము. నియమించడము. నిలకడ. చిత్తము లోని పటుత్వము. బుద్ధి లోని దృఢత్వము. మనస్సు సంకల్ప వికల్పాల మధ్య చిందు లేస్తూ ఉంటుంది. బుద్ధి నిశ్చయాత్మకమై, మనస్సు లోని విషయాన్ని నిశ్చయిస్తుంది. బుద్ధి నిశ్చయించిన విషయాన్ని ధృతి స్థిర పరుస్తుంది.

అనన్యమైన యోగం చేత స్థిరమైన ధైర్యము నవలంబించి, ఏ స్థిరమైన ధృతి చేత మనః ప్రాణేంద్రియ వ్యాపారాలను శాస్త్రమును అతిక్రమించకుండా నిరోధించి నిలపడం జరుగుతూ ఉందో, అదే సాత్త్విక ధృతి.

విషయాల సన్నిధిలో మనస్సు చలిస్తుంది. బాహ్య విషయాల వైపు సహజం గానే మనస్సు పరుగులు తీస్తుంది. మనస్సు అలా బహిర్ముఖం కావడానికి విషయాలు ప్రేరేపించడం కారణం కావచ్చు. లేదా, మనస్సు లోని వాసనల సహజ ప్రేరణ కావచ్చు. ప్రేరేపించ బడిన చిత్తము ఇంద్రియ ప్రాణాలను ఏకోన్ముఖం చేసి విషయానుభవానికి సిద్ధ పరుస్తుంది. నరాలతో, కండరాలతో నిండి ఉన్న దేహాన్ని ప్రాణం శక్తివంతం చేస్తుంది.

ఎలాగైతే విద్యుచ్ఛక్తి యంత్రములో వ్యాపించి యంత్రాన్ని శక్తివంతం చేస్తుందో, అలాగే ప్రాణ శక్తులు దేహాన్ని శక్తివంతం చేస్తాయి. చలింప చేస్తాయి. ప్రాణ శక్తితో కూడి చేతన మైన దేహము విషయ ప్రపంచంలో రమించ గలుగుతుంది. దేహము శక్తివంతంగా ఉందంటే, ప్రాణశక్తి దేహంలో అణువణువున వ్యాపించి ఉందని అర్థము. ప్రాణం దేహంలో చలించని క్షణం దేహం మృత కళేబరమే.

కనుక, అంతరంగంలో ఉన్న చిత్తానికి, జడ రూపమైన దేహానికి అనుసంధానంగా ప్రాణం కదుల్తూ ఉంది. యంత్రములో శక్తి వ్యాపించి ఉన్నా, యంత్రాన్ని నడిపే చేతుల మీదనే ప్రయాణం ఆధారపడి ఉన్నట్లు, దేహేంద్రియ ప్రాణ చేష్టల్ని మనస్సు నడుపుతూ ఉంది. అట్టి మనస్సులో దృఢమైన స్థైర్యం ఉన్నప్పుడే, అశాస్త్రీయ మార్గాలలో పయనించే దేహేంద్రియాలను నియంత్రించి, శాస్త్ర విహితమైన మోక్షమార్గంలో నియమించడం జరుగుతుంది. బుద్ధి లోని స్థిరమైన అట్టి ధైర్యమే సాత్త్విక ధృతి అని చెప్ప బడింది ***(సా ధృతిః సాత్త్వికీ)***.

*ఇక రాజస ధృతిని గూర్చి చెబుతున్నాడు.*

**యయా తు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽర్జున ।**
**ప్రసజ్గేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ 34**

**యయా-తు-ధర్మకామార్థాన్-ధృత్యా-ధారయతే-అర్జున**
**ప్రసంగేన-ఫలాకాంక్షీ-ధృతిః-సా-పార్థ-రాజసీ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | ధర్మకామార్థాన్ | = | ధర్మకామములను |
| అర్జున | = | పార్థా! | ధారయతే | = | ధరించు చున్నాడో |
| యయా | = | ఏ | సా | = | ఆ |
| ధృత్యా తు | = | ధృతి చేత | ధృతిః | = | ధృతి |
| ఫలాకాంక్షీ | = | ఫలము నాశించు వాడు | రాజసీ | = | రాజసిక మైనది |
| ప్రసంగేన | = | కోరికతో | | | |

**అర్జునా! ఫలాపేక్ష కల వాడు ఏ ధృతి చేత ధర్మార్థ కామాలను కోరుతున్నాడో అది రాజస ధృతి.**

**వ్యాఖ్య**

విషయ సుఖాల వెంట పడి పరుగులు తీసే ఇంద్రియ మనస్సులను నియమించి, మోక్ష మార్గంలో వినియోగించ డానికి ఉపకరించే ధృతి సాత్త్విక ధృతి అని పూర్వ శ్లోకంలో అర్థం చేసుకున్నాం.

మోక్ష ప్రస్తావనే లేకుండా, కేవలం త్రివర్గముల విషయము నందే, అంటే అర్థకామాల విషయం లోనే సహకరించే, ఉపకరించే ధృతి రాజసధృతి. ధర్మార్థ కామాలలో ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ దేని యందు అవసరమైతే, దాని యందే ధృతిని వినియోగిస్తూ, ఫలాకాంక్షతో కార్యాలను నిర్వహించే వాని ధృతి రాజస ధృతి.

సాత్త్విక ధృతి మోక్ష ప్రధానంగా వ్యవహరిస్తూ ఉంటుంది. రాజసధృతిలో మోక్షము అముఖ్యంగా ఉంటుంది. త్రివర్గాలే ప్రధానంగా ఉంటాయి. సంపాదనే ప్రధానంగా ఉంటుంది. కనుక, కర్మలలో ఫలాసక్తి ఉంటుందే గాని చిత్తశుద్ధి అనే ప్రసక్తి ఉండదు.

సాత్త్విక ధృతి కల వాడు ఎలాగైతే దేహేంద్రియ ప్రాణ మనస్సులను నిగ్రహిస్తూ ఉంటాడో, రాజసధృతి కల వాడు కూడా అలాగే నియమిస్తాడు. కాకపోతే, సాత్త్విక ధృతి గల సాధకుడు అనన్య యోగానికి ధృతిని ఉపయోగ పెట్టుకుంటూ మోక్ష మార్గంలో చరిస్తే, రాజసధృతి గల లౌకికుడు అర్థకామాల అన్వేషణలో ఫలాభిసంధితో ప్రవర్తిస్తూ ఉంటాడు. అతని మనస్సులో ధనానికే ప్రాధాన్యం కాని జ్ఞానానికి కాదు. నిరంతరం శ్రమిస్తాడు. ధృత్యుత్సాహాలను తోడు చేసుకొని ధనార్జనలో నిమగ్నమై ఉంటాడు. తరించాలనే ధ్యాసే ఉండదు. అనర్థ మార్గాలలో చరించడం వల్ల ధృత్యుత్సాహాలు సత్ఫలితాలను ఇవ్వ లేక పోగా బ్రతుకును తిమిరం లోకి తోసేస్తాయి. దారి తప్పిన శ్రమలు ఎవరి నైనా దగా చేస్తాయి. మతి లేని మార్గాలు గతిని నిరోధిస్తాయి.

**ఆఖ్యాయిక**

అచంచల మైన దీక్షతో, రాజస ధృత్యుత్సాహాలను తోడు చేసుకొని ఒక వ్యక్తి దివారాత్రులు శ్రమించి ధనాన్ని ప్రోగు చేశాడు. సుమారు పది కోట్ల రూపాయలను ఆర్జించాడు.

ఇక మీదట ఎలాంటి శ్రమ లేకుండా ఆర్జించిన ధనంతో హాయిగా కాలు మీద కాలు వేసుకొని బ్రతికేయ వచ్చు అనుకున్నాడు. ఊహల కేముంది? అవి పెట్టుబడి లేని వ్యాపారా లాయె. అలా అలా ఆలోచిస్తూ ఉన్నాడు. ఈ లోగా ఎవరో అపరిచితమైన వ్యక్తి వచ్చి ముందు నిలవడం జరిగింది.

ఎవరు మీరు? అని ప్రశ్నించాడు ధనికుడు. ఆ వచ్చిన వ్యక్తి తాను మృత్యువును అని సమాధాన మివ్వడం జరిగింది. ఇంత లోనే, వచ్చిన పని పూర్తి చేసుకుని వెళ్ళే ప్రయత్నంలో మృత్యువు కనిపించాడు.

ధనికుడు దిగ్భ్రాంతి చెందాడు. మృత్యువును ప్రాధేయ పడ్డాడు. తాను ఎంతగా శ్రమించి పది కోట్లు ప్రోగు చేశాడో మృత్యువుకు వివరించాడు. తన సంపాదనలో సగ భాగము సమర్పించ డానికి సంసిద్ధతను వ్యక్తం చేస్తూ, కనీసం రెండు రోజులు బ్రతికే అవకాశము ఇవ్వమని అర్థించాడు. అభ్యర్థన లన్నీ అరణ్య రోదన లయ్యాయి. చివరగా, తన ఆస్తి నంతా సమర్పించి, ఒక గంట కాలము నివసించే అవకాశానికి ప్రయత్నించాడు. అదీ విఫల మైంది. ఎట్టకేలకు ఒక్క వాక్యాన్ని కాగితం పై వ్రాసి పెట్టి నిష్క్రమించడానికి అనుమతిని కోరాడు. మృత్యువు అంగీకరించాడు. ఒక వాక్యాన్ని వ్రాసి కాగితం బల్లపై పెట్టాడు. మరు క్షణం కళ్ళు మూత పడి పోయాయి. దేహం నేలకు ఒరిగి పోయింది. అతడు ఏమి వ్రాసి పెట్టాడు? వీలునామా అయి ఉంటుందా? మీరే చదవండి. తెలుస్తుంది.





*ఈ వాక్యాన్ని చదివే వారు ఎవరైనా, వారికి నా మనవి ఒక్కటే. భుక్తికి కొరత లేకుండా మీ బ్రతుకు సాగి పోతూ ఉంటే, అంతటితో తృప్తి పడి పొండి. సంపదల్ని ప్రోగు చేసుకొనే పనిలో జీవితాన్ని ధారబోసుకోకండి. నా పది కోట్ల రూపాయలు నాకు పది నిమిషాల జీవితాన్ని ప్రసాదించ లేక పోయాయి. . . . . . .* ఇదే అతని మరణ సందేశము.

పోయిన వాళ్ళు ఏం పట్టుకు పోయారు? ఏమీ పట్టుకు పోలేక ఊరకే పోయారు. ఏమి విడిచి పెట్టి పోయారు? అంతా విడిచి పెట్టి ఖాళీగా పోయారు. పోయిన వాళ్ళను చూచి ఉన్న వాళ్ళు ఏమి నేర్చుకోవాలో ఆలోచించండి. ఎందుకని? ఉన్న వాళ్ళు ఒకనాడు లేకుండా పోయే వాళ్ళే కనుక.

*దీనబాంధవుడవు కదా నీవు దీననాథా!*
*నాకు మించిన దీను లెవ్వరు ధరణి లోన*
*నన్ను కడతేర్చి నీ పేరు నిలుపుకోరా!*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా !*

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

*తామస ధృతిని గూర్చి చెబుతున్నాడు.*

**యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ ।**
**న విముఞ్చతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥** 35

*యయా-స్వప్నం-భయం-శోకం-విషాదం-మదం-ఏవ-చ*
*న-విముంచతి-దుర్మేధాః-ధృతిః-సా-పార్థ-తామసీ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | విషాదం | = | విషాదమును |
| దుర్మేధాః | = | దుర్బుద్ధి గల వాడు | మదం ఏవ చ | = | మదమును |
| యయా | = | దేని చేత | న విముంచతి | = | విడిచి పెట్టడో |
| స్వప్నం | = | నిద్రను | సా | = | ఆ |
| భయం | = | భయమును | ధృతిః | = | ధృతి |
| శోకం | = | శోకమును | తామసీ | = | తామసిక మైనది |

**అర్జునా! దుర్బుద్ధి గలవాడు ఏ ధృతి చేత స్వప్నమును, భయమును, శోకమును, విషాదమును, మదమును విడిచి పెట్టడో అది తామస ధృతి.**

**వ్యాఖ్య**

సాత్త్విక ధృతి సన్మార్గము. రాజసధృతి వక్ర మార్గము. తామసధృతి దుర్మార్గము. సాత్త్విక ధృతితో సన్మార్గంలో చరించే సాత్త్విక కర్త పొందేది సద్గతి. రాజస ధృతితో వక్ర మార్గంలో చరించే రాజస కర్త పొందేది మిశ్రమ గతి. తామస ధృతితో దుర్మార్గంలో చరించే తామస కర్త పొందేది దుర్గతి. ప్రస్తుత శ్లోకంలో తామస ధృతిని తెలుసుకుంటాము.

ముప్పై మూడు, ముప్పై నాలుగు శ్లోకాలలో సాత్త్విక ధృతి, రాజస ధృతిని గూర్చి చెప్పుకున్నప్పుడు ఏ విధమైన ఆచరణ ఉంటే వాటిని అలా అంటారో చెప్పుకున్నాం. కాని, ప్రస్తుత శ్లోకంలో ఆచరణ అనే ఊసే లేదు. ఏవి విడవడం జరగదో అది తామస ధృతి అని విచిత్రంగా వింటున్నాము. చూడండి. పైగా, ఈ తామస

ధృతి గల పెద్ద మనిషికి దుష్టుడు అని భగవంతుడే బిరుదు ప్రదానం చేశాడు (**దుర్మేధాః కుత్సిత మేధాః పురుషః**). దుష్ట బుద్ధి కల తామస కర్త యొక్క ధృతి తామసధృతి.

ఏ ధృతి చేత స్వప్నము, భయము, శోకము, విషాదము, మదము అనే పంచ దోషాలను వ్యక్తి త్యజించడో, అట్టి వాని ధృతి తామస ధృతి. బ్రతుకును దుర్గతి పాలు చేసే ఈ పంచ దోషాలను ఎందుకని విడిచి పెట్టడు? ఇవన్నీ గొప్ప సేవా విషయాలని, విడువ దగినవి కావని అతని దురభిప్రాయము. అందుచేత వీటిని విడిచి పెట్టడు (**విషయ సేవామ్ ఆత్మనః బహు మన్యమానః**). విడిచి పెట్టడం అలా ఉంచి అవన్నీ అవశ్యం ఆచరించ దగిన కర్తవ్యాలని కూడా నిత్యం మనస్సులో భావిస్తాడు. ఇంకేమి వదుల్తాడు? (**మనసి నిత్య మేవ కర్తవ్య రూపతయా కుర్వన్ న విముంచతి**). ఇక్కడే తామస ధృతి దృఢ పడుతూ వజ్రతుల్యంగా మారుతూ ఉంది.

ధృతి అనేది స్వభావతః చాలా గొప్పది. శ్రేష్ఠ మైనది. దానిని నికృష్ట విషయాలలో ప్రవేశ పెట్ట కూడదు. అలా చేయడం వల్ల ఏదీ సఫలం కాదు సరి కదా, అంతా నిష్ఫలమే అవుతుంది.

దుష్టము, తమో దూషిత మైన తామస బుద్ధి తామస ధృతి సహాయంతో చెలరేగి స్వప్నిస్తూ ఉంటుంది (**స్వప్నం**). స్వప్నం అంటే నిద్ర అని అర్థం. కాని, నిద్ర అని అనకుండా స్వప్నం అని భగవంతుడు వెటకారంగా వ్యాఖ్యానించడం జరిగింది.

తామస ధృతి వల్ల ఏదీ ఆచరించక పోగా, పంచ దోషాల నుండి విడి పడటానికి కూడా ఇష్ట పడని దుష్ట శిఖామణి స్వప్న విహారమే మహాకార్యంగా నిర్వహిస్తూ ఉంటాడు. అంటే, నిద్ర పోయాడా, నిద్రలో కలలు గంటూ ఊరేగుతూ ఉంటాడు. ఎందుకంటే, కలలో కర్త లేడు. ఉండేది భోక్తే. కనుక స్వప్నానుభవంలో తన్మయుడై ఉంటాడు. మేలుకున్నాడా, అప్పుడు కూడా చేసేది ఏమీ లేదు కనుక, మేలుకొనిన తరువాత కూడా పగటి కలలు కంటూ ఉంటాడు. అంటే, గాలిమేడలు నిర్మించుకొని వాటిలో విహరిస్తూ ఉంటాడు. ఈ విషయంలో గొప్ప పట్టుదల తోనే వ్యవహరిస్తూ ఉంటాడు. అందుచేత, దానిని ధృతి అనవలసి వచ్చింది. అదే తామస ధృతి.

ప్రశస్తమైన మానవ జన్మను పొంది, పురుషార్థ సాధనకు అనువైన మనోబుద్ధులను కలిగి ఉండి కూడా, సన్మార్గంలో చరించ లేక గాలిమేడలలో కులికే దురదృష్టము మానవ జన్మకే కళంకము. ఇలాంటి నికృష్టులు ఉత్కృష్ట మార్గంలో చరించే లాగా, వారి పక్షాన నిలబడి పరమేశ్వరుని వేడుకుంది చైతన్య గీతిక.

పల్లవి : **సాధన సాగనీ స్వామీ**
**వేదనలన్నీ ఆగిపోనీ** ॥ సాధన ॥

చరణములు : (1) **గాలిమేడలు కట్టు గాలిమనసు**
**గాలి పోగానే జాలి బ్రతుకు**
**నిలకడ లేని నీటి బుడగిది**
**కడకు నిలువునా కాలిపోతది** ॥ సాధన ॥

(2) **అడుగంటు చుండె ఆయువు తైలము**
**కొడిగట్టు చుండె జీవన దీపము**
**సమయము కాదిది ఏమరుపాటుకు**
**కాలము కాదిది ఏ పొరపాటుకు** ॥ సాధన ॥

తామస ధృతి అంటే ఏమిటో అర్థం చేసుకున్నాం. ఈ విధమైన ధృతి చేత పంచ దోషాలుగా కనిపిస్తున్న



కర్మలలో వ్యవహరించే దుష్టుడైన తామసకర్త, తన ప్రవృత్తిని తాను ప్రశంసించుకుంటూ అందరినీ అప్రయోజకులుగా భావిస్తాడు. ఈ విధమైన నిర్ణయము కూడా అతనిలో చాలా దృఢంగా ఉంటుంది. అందుకే అది తామసధృతి (**సా ధృతిః తామసీ**).

ఇంత వరకు గుణ భేదాన్ని బట్టి త్రివిధ త్యాగము, త్రివిధ కర్మలు, త్రివిధ కర్తలు, త్రివిధ జ్ఞానము, త్రివిధ బుద్ధి, త్రివిధ ధృతిని గూర్చి చెప్పుకున్నాం. కర్మాచరణము చేసి నపుడు కర్మఫలాలు మనకు అందుతూ ఉంటాయి. కర్మఫలాన్ని ఆశించే మనం కర్మ చేస్తాము. ఆ ఫలం సుఖమై ఉండా లనుకుంటామే గాని దుఃఖంగా ఉండాలని కోరుకోము. వచ్చే వన్నీ సుఖాలు కాక పోవచ్చు. కాని, సుఖం అంటూ వస్తే మాత్రం అది కూడా త్రివిధం గానే ఉంటుంది. సాత్త్విక సుఖము, రాజస సుఖము, తామస సుఖముగా ఉంటుంది. ఆ సుఖం యొక్క స్వభావము, దానిని మనం పొందిన విధానము, అది ఉండే కాలము - వీటిని బట్టి అది ఎలాంటి సుఖమో నిర్ణయించ వచ్చు. ఇప్పుడు త్రివిధ సుఖాలను గూర్చి ప్రసంగిస్తున్నాడు పరమేశ్వరుడు.

*సుఖ విషయాన్ని ప్రస్తావిస్తున్నాడు.*

**సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।**
**అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥** 36

*సుఖం-తు-ఇదానీం-త్రివిధం-శృణు-మే-భరతర్షభ*
*అభ్యాసాత్-రమతే-యత్ర-దుఃఖాంతం-చ-నిగచ్ఛతి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతర్షభ | = | అర్జునా! | మే | = | నా చేత |
| యత్ర | = | ఎక్కడ | ఇదానీం | = | ఇప్పుడు |
| అభ్యాసాత్ | = | అభ్యాసము వలన | త్రివిధం | = | మూడు విధములైన |
| రమతే | = | రమిస్తున్నాడో | సుఖం తు | = | సుఖమును |
| దుఃఖాంతం చ | = | దుఃఖనాశమును కూడ | శృణు | = | వినుము |
| నిగచ్ఛతి | = | పొందుతున్నాడో | | | |

**భరత శ్రేష్ఠా! అర్జునా! సుఖము కూడా మూడు విధాలుగా ఉంది. చెబుతాను, విను. అభ్యాసము వల్ల మనిషి ఆ సుఖంలో రమిస్తూ దుఃఖాన్ని పోగొట్టు కుంటున్నాడు.**

## వ్యాఖ్య

గుణ భేదం చేత క్రియ కారకాదులకు త్రివిధ భేదాన్ని చెబుతూ, త్యాగము వద్ద ప్రారంభమైన త్రివిధ గుణ విశ్లేషణము జ్ఞానము, కర్మ, కర్త, బుద్ధి, ధృతి అనే ఆరు విషయాలను విశ్లేషణాత్మకంగా వివరించి, చివరగా సుఖ మనే చోట ఈ త్రివిధ ప్రకరణం ఆగింది.

ఏదైనా చివరగా ఆగ వలసింది సుఖప్రాప్తి తోనే. నదు లన్నీ పారి పారి సముద్రంలో విలీనమై శాంతించి నట్లు, కర్మ లన్నీ సాగి సాగి ఒక దశలో సుఖాంబోధిలో ప్రవేశించి విలీనమై పోతాయి.

జీవితంలో ఎవరెన్ని అనుభవించినా, వాస్తవానికి ఉన్నవి రెండే. ఒకటి సుఖము. రెండవది దుఃఖము. మొదటిది ఎప్పుడూ ఉండాలని, ఎప్పటికీ పోకూడ దని అందరూ ఆలోచిస్తారు. రెండవది ఎప్పుడూ ఉండ కూడదని, ఎప్పటికీ రాకూడ దని అందరూ ఆశిస్తారు. అలాగే జరిగితే అందరూ శాంతిని పొందుతారు. కాని, మన అనుభవం అందుకు భిన్నంగా ఉంది.

సుఖాలు మనకు తెలియనివి కావు. సుఖాలు వస్తాయి. ఉంటాయి. మరొక దశలో లేకుండా పోతాయి. అలాగే దుఃఖాలు లేని దశ కూడా మన అనుభవంలో ఉంది. ఉన్న దుఃఖాలు దూరం కావడం మనం చూశాము. అలా దూరమైన దుఃఖాలు మనకు ఇష్టం లేక పోయినా, మనం పిలవక పోయినా తిరిగి వస్తూనే ఉంటాయి. ఇక్కడే మన ఆశలకు రూపం రావడం లేదు. సుఖానికి ప్రాణం పోయలేక మానవాళి అలసి పోతోంది. మనిషి ఆశించే నిత్య సుఖాన్ని తెలుసుకునే ముందు గుణ భేదాన్ని బట్టి త్రివిధ సుఖాన్ని అర్థం చేసుకుందాము.

అర్జునా! దేని యందు ***(యత్ర)*** అభ్యాసం వల్ల మనిషి క్రీడించడం జరుగుతుందో ***(అభ్యాసాత్ రమతే)***, దుఃఖాంతమును పొందడం జరుగుతుందో ***(దుఃఖాన్తం నిగచ్ఛతి)***. అట్టి సుఖము త్రివిధ మని ***(త్రివిధం సుఖం)*** నా నుండి ఆలకించు ***(శృణు మే)*** అంటున్నాడు భగవంతుడు.

అభ్యాసము అంటే ఆవృత్తము. అభ్యాసం వల్ల, అంటే ఆవృత్తము వల్ల కలిగే సుఖం. ఆవృత్తము అంటే 'మరల కలిగిన దాని యందు' అని అర్థము. మన అనుభవములో ఉన్నదే, తిరిగి కలిగిన దాని యందు సుఖానుభూతిని పొందడము అభ్యాసము. ఈ విధమైన అభ్యాసము వల్ల ఏర్పడే సుఖానుభూతిలో దుఃఖం నశిస్తుంది; శాంతిస్తుంది అని అర్థము. పెరుగును చిలికితే వెన్న పుట్టినట్లు, అభ్యాసం చేత ఆనందానుభూతిని, దుఃఖ శాంతిని పొందడం జరుగుతుంది.

*ఇక త్రివిధ సుఖాలలో ముందుగా సాత్త్విక సుఖాన్ని గూర్చి చెబుతున్నాడు.*

**యత్త దగ్రే విష మివ పరిణామేఽ మృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥** 37

***యత్-తత్-అగ్రే-విషం-ఇవ-పరిణామే-అమృతోపమం***
***తత్-సుఖం-సాత్త్వికం-ప్రోక్తం-ఆత్మబుద్ధి ప్రసాదజం***

| | | | |
|---|---|---|---|
| యత్ తత్ | = ఏ సుఖము | ఆత్మబుద్ధిప్రసాదజం | = తన యొక్క బుద్ధి ప్రసన్నత చేత కలిగే |
| అగ్రే | = మొదట | తత్ | = ఆ |
| విషం ఇవ | = విషము లాగా | సుఖం | = సుఖము |
| పరిణామే | = అంతము నందు | సాత్త్వికం | = సాత్త్విక మని |
| అమృతోపమం | = అమృతతుల్యము గాను | ప్రోక్తం | = చెప్పబడినది |

**అర్జునా! ఇది బుద్ధి ప్రసన్నత వల్ల కలిగే సుఖము. మొదట విషం లాగా ఉంటుంది. ఆ తరువాత అమృత తుల్యంగా ఉంటుంది. అదే సాత్త్విక సుఖము.**

**వ్యాఖ్య**

మనిషి సుఖాభిలాషి. సుఖ పిపాసి. ఆనందాభిలాషి. ఒకరు ఆశించింది మరొకరు ఆశించక పోవచ్చు. ఒకరికి ఇష్టమైంది మరొకరికి ఇష్టం కాక పోవచ్చు. కాని, సుఖాన్ని అందరూ ఆశిస్తారు. అందరూ సుఖాన్నే వాంఛిస్తారు.

ఎక్కడైతే ఒకరికి సుఖం లభిస్తుందో అక్కడ మరొకరికి సుఖం లభించక పోవచ్చు. అంతే కాదు. ఎక్కడ ఎవరికి సుఖం లభించినా, వారికి ఎప్పుడూ అక్కడే సుఖం లభిస్తుంది అని కూడా చెప్ప లేము. అందుకే, సుఖాభిలాషి ప్రదేశాలు మారుస్తూ ఉంటాడు.



ఒక వ్యక్తి వల్ల అందరికీ సుఖం కలుగుతుందనే దాఖలాలు లేవు. ఒక వ్యక్తి వల్ల ఎవరి కైనా సుఖం కలుగ వచ్చు. అలాగని వారికి కూడా ఆ వ్యక్తి నుండి సదా సుఖం కలుగుతుందని చెప్ప లేము. అందుచేత, వ్యక్తి మనుషులతో సంబంధాలను మార్చుకుంటూ ఉంటాడు.

అనుభవ సుఖాలు ఏవయినా అనిత్యాలే. అనిత్యాలు అంటే రాకపోకలు గలవి. వచ్చిపోయే సుఖాలు. మనిషి ఆశించేది నిత్యసుఖం. అదే స్వరూప సుఖం. రాక తెలియని, పోక అర్థం కాని నిత్యసుఖం.

ఒక కారణంగా ప్రాప్తించే సుఖం ఏదయినా అనిత్యమే. కారణం పోగానే కార్యమైన సుఖం కూడా పోతుంది. మనం ఆనందంగా ఉండే టప్పుడు మనలో ఏముంది? ఎప్పుడైనా ఆలోచించారా? ఆనందం ఉందా, ఆనంద హేతువు ఉందా? సుఖం ఉందా, సుఖహేతువు ఉందా? సుఖం ఉందే గాని సుఖహేతువు లేదు.

కనుక నీవే సుఖం. నీవే ఆనందము. నీవే నీకు ప్రియం. ఏదైనా నీకు అప్రియం కావచ్చు. నీవు నీ కెప్పుడూ అప్రియంగా లేవు. నాకు నే నెప్పుడూ అప్రియంగా లేను ***(కదాచిన్నాహ మప్రియః)***. నేను నాకు ప్రియం కనుకనే సర్వం ప్రియంగా ఉంటుంది. అదే ఆత్మసుఖము.

ఆ వైపు సాగే ప్రయాణంలో లభించే సుఖం సాత్త్విక సుఖం. ఏ మనస్సులో ఆత్మకు సంబంధించిన జ్ఞానము కలుగుతుందో, ఆ మనస్సు విశుద్ధంగా, ప్రసన్నంగా ఉంటుంది. అట్టి ప్రశాంత చిత్తములో స్ఫురించే సుఖము సాత్త్విక సుఖము. ఇది ఆత్మ సంబంధమైన సుఖము.

వివేక వైరాగ్యాదుల కారణంగా నిర్మలమైన బుద్ధిలో ఏ సుఖం అనుభవింప బడుతుందో, అది సాత్త్విక సుఖం. ప్రారంభంలో ఈ సుఖం విషం లాగా గోచరించి పరిణామ క్రమంలో అమృతానుభవమును ప్రసాదిస్తుంది.

ఆత్మ సంబంధమైన సాధనలు అనుభవంలో లేనివి కావడం చేత, వివేక, వైరాగ్య, ధ్యాన, సమాధులు ప్రారంభంలో చాలా శ్రమతో కూడుకొని ఉంటాయి ***(అగ్రే ప్రథమ సంనిపాతే జ్ఞాన వైరాగ్య సమాధ్యారంభే అత్యంత ఆయాస పూర్వకత్వాత్ విష మివ దుఃఖాత్మకం భవతి)***. చాలా శ్రమతో కూడినట్లు ఉంటాయి కనుక అవి విషం లాగా గోచరిస్తాయి. పరిణామంలో సాధనలు పక్వ దశకు రావడం చేత, అంతవరకు విషం వలె తెలిసింది, ఆ తరువాత అమృత తుల్యంగా ఉంటుంది ***(పరిణామే జ్ఞాన వైరాగ్యాది పరిపాకజం సుఖం అమృతోపమమ్)***. దీనినే సాత్త్విక సుఖం అంటారు ***(తత్ సుఖం సాత్త్వికం ప్రోక్తం)***.

వాస్తవానికి అది ప్రారంభంలో విషమే అయితే పరిణామంలో అమృత రూపాన్ని పొందే అవకాశమే లేదు. విషం విషమే. అమృతము అమృతమే. విషము అమృత మయ్యే ప్రసక్తే లేదు. అందుకే పరమాత్మ **విష మివ** అన్నాడు. 'ఇవ' అంటె 'వలె' అని అర్థం. విషం వలె అనిపించింది కాని విషం కాదు.

కనుక అన్ని సుఖాల లోకి ఉత్తమ మైన సుఖం సాత్త్విక సుఖం. ఇది అనుభవానికి అందింది అంటే, ఆ తరువాత స్వరూప సుఖము అనుభూత మవుతుంది. సాత్త్విక సుఖము కేవలం అంతరంగ సుఖము. బాహ్యంతో సంబంధము లేనిది. అది బుద్ధికి లభించే సుఖం కాదు. బుద్ధిలో లభించే సుఖం.

*ఇక రాజస సుఖాన్ని వివరిస్తున్నాడు.*

**విషయేన్ద్రియ సంయోగా ద్యత్త దగ్రేఽ మృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥** 38

***విషయేంద్రియ సంయోగాత్-యత్-తత్-అగ్రే-అమృతోపమం***
***పరిణామే-విషం-ఇవ-తత్-సుఖం-రాజసం-స్మృతం***

| | | | |
|---|---|---|---|
| యత్ తత్ | = ఏ సుఖము | విషం ఇవ | = విషతుల్యము గను |
| విషయేంద్రియ సంయోగాత్ | = విషయేంద్రియ సంయోగము వలన | తత్ | = ఆ |
| అగ్రే | = మొదట | సుఖం | = సుఖము |
| అమృతోపమం | = అమృతతుల్యము గను | రాజసం | = రాజసిక మైనదిగ |
| పరిణామే | = అనంతరము | స్మృతం | = చెప్పబడినది |

**అర్జునా! ఇది ఇంద్రియాలు విషయాలతో కలవడం వల్ల ఏర్పడే సుఖము. మొదట అమృత తుల్యంగా ఉంటుంది. ఆ తరువాత విషం లాగా మారుతుంది. అదే రాజస సుఖము.**

**వ్యాఖ్య**

ఇంద్రియాలు ఇంద్రియ విషయాలతో కలిసి నపుడు ఏర్పడే సుఖము రాజస సుఖము ***(విషయేన్ద్రియ సంయోగాత్ యత్, తత్ సుఖం జాయతే)***. ఇది మొదట అమృతం వలె ఉండి, పరిణామంలో విషం లాగా అనిపిస్తుంది ***(అగ్రే అమృత సమం, పరిణామే విష మివ)***. సాత్త్విక సుఖానికి పూర్తిగా భిన్న మైనది. సాత్త్విక సుఖము అంతరంగమునకు సంబంధించింది కాగా, రాజస సుఖము బాహ్యమునకు సంబంధించింది. విషయ సంబంధ మైనది.

బాహ్య విషయాలతో ఇంద్రియ సంయోగము వల్ల ఏర్పడే సుఖము సుఖము కాదు. వాస్తవానికి అది దుఃఖము యొక్క ప్రతిరూపమే. అది భోగానందమే కనుక మనిషిని రోగాల వాత పడేస్తుంది.

విషయ భోగాలు ఆద్యంతాలు కలిగి ఉంటాయి. వాటి వల్ల కలిగే సుఖాలు కూడా ఆద్యంతాలు కలిగి ఉంటాయి కనుక, అవి అనిత్యాలు.. అధిక శ్రమతో ప్రాప్తిస్తాయి. ప్రాప్తించి శ్రమింప చేస్తాయి. దుఃఖాన్ని పంచి, మనిషిని దుర్భరంగా పీడించి నిష్క్రమిస్తాయి. ఈ సత్యాన్ని గ్రహించ లేని అవివేకులు, విషయ భోగాల యందు నిత్య సుఖ ముందని భ్రమించి వాటి యందు రమిస్తూ ఉంటారు. వీరు పశు జీవనానికి భిన్నంగా లేరు అన్నారు భాష్యంలో శ్రీ శంకరాచార్య స్వామి ***(అత్యన్త మూఢానాం ఏవ హి విషయేషు రతిః దృశ్యతే, యథా పశు ప్రభృతీనామ్)***. కనుక ఈ విషయేంద్రియ సుఖాన్ని రాజస సుఖము అన్నారు.

విషయ సుఖాలలో సుఖం అసలే లేక పోలేదు. సుఖము అసలే లేకపోతే, వాటి నెవ్వరూ వాంఛించరు. కనుక విషయాలలో సుఖం అసలే లేదని కాదు, అసలైన సుఖం లేదు. స్వల్ప సుఖాలు, అల్ప సుఖాలు ఉంటాయి. అందుకే అవి అనిత్య సుఖాలు. ఆదిలో అమృతాన్ని పంచి, ఆ తరువాత విషాన్ని దించడమే విషయంగా పెట్టుకుంటాయి. అట్టి అనిత్య సుఖాన్ని రాజస సుఖము అంటారు ***(తత్సుఖం రాజసం స్మృతమ్)***.

ఇక తామస సుఖాన్ని గూర్చి చెబుతున్నాడు.

యు దగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్ ॥ 39

***యత్-అగ్రే-చ-అనుబంధే-చ-సుఖం-మోహనం-ఆత్మనః***
***నిద్రాలస్య ప్రమాదోత్థం-తత్-తామసం-ఉదాహృతం***

| | | | |
|---|---|---|---|
| యత్ | = ఏ సుఖము | ఆత్మనః | = తనకు |
| అగ్రేచ | = మొదట | మోహనం | = మోహమును కలుగ జేయునది |
| అనుబంధే చ | = అంతము నందు | | |



| | | | |
|---|---|---|---|
| నిద్రాలస్యప్రమాదోత్థం | = నిద్ర, అలసత్వము, ప్రమాదము, వీటి వలన జనించినది యైన | తామసం | = తామస మని |
| తత్ | = ఆ | ఉదాహృతం | = చెప్పబడినది |
| సుఖం | = సుఖము | | |

**అర్జునా! ఇది తామస సుఖము. ఆద్యంతం మనిషికి మోహాన్ని కలిగిస్తుంది. నిద్ర, సోమరితనము, ప్రమాదము వల్ల కలుగుతుంది.**

**వ్యాఖ్య**

ప్రారంభంలో విషం లాగా కనిపించి, పరిణామ క్రమంలో అమృత రూపంగా అనుభవానికి అందేది సాత్త్విక సుఖము. ప్రారంభంలో అమృత మనిపించి, పరిణామంలో విషం లాగా కనిపించేది రాజస సుఖము. ప్రారంభము లోను ***(అగ్రే)***, అంతము నందును ***(అనుబంధే)*** తనకు ***(ఆత్మనః)*** మోహాన్ని కలిగించేది ***(మోహనమ్)*** తామస సుఖము.

**ఇదీ ఒక సుఖ మేనా?**

ఆద్యంతాల యందు మోహముతో నిండింది, అజ్ఞానంతో కూడింది కూడా ఒక సుఖ మేనా? అంతా మోహమయం. కనుకనే దానిని నిద్రాలస్య ప్రమాదోత్థ మంటున్నాడు.

దాని పుట్టుకే మహా భయంకరంగా ఉంది. అలాంటిది సుఖాన్ని ప్రసాదిస్తుందా? మోహ రూపమైన ఈ తామస సుఖం నిద్ర నుండి, సోమరితనం నుండి, పొరపాటు నుండి పుడుతుంది ***(నిద్రా చ ఆలస్యం చ ప్రమాదశ్చ ఇతి ఏతేభ్యః సముత్తిష్ఠతి)***.

నిద్రలో సుఖ ముందా? సుఖం అనేది అనుభవింప బడాలి. నిద్రలో అనుభూతి ఎక్కడుంది? అనుభవాన్ని పొంద వలసిన వాడే కదా నిద్రలో కూరుకు పోయింది? అనుభవించే వాడే లేనపుడు ఇక అనుభూతి ఎక్కడిది? కనుక నిద్రలో ఉండేది సుఖం కాదు. సుఖాభాస. అలాంటి నిద్ర నుండి పుట్టే సుఖము కూడా ఒక సుఖ మేనా?

సుఖ మనేది ప్రయత్నం వల్ల నైనా కలుగుతుంది. లేదా సహజంగా నైనా అనుభవానికి అందుతుంది. అంతేగాని, పొరపాటు వల్ల కూడా కలుగుతుందా? కాని, తామస సుఖం పొరపాటు వల్ల ***(ప్రమాదం)*** కలుగుతుందట. పొరపాటు వల్ల సుఖ మెలా కలుగుతుంది? పొరపాటు వల్ల సుఖం కలిగినట్లు అనిపిస్తుంది. అంతే.

జన్మలో జరిగిన అతి పెద్ద పొరపాటు జీవభ్రాంతి. అదెలా పోతుందో అర్థం గాక జన్మలే దొర్లి పోతున్నాయి. అది చాలదు అన్నట్లు మధ్యలో పొరపాట్లు, గ్రహపాట్లును.

అయోమయంగా, మోహమయంగా, కళ్ళు మూసి మత్తు లోకి జారి పోవడం సుఖ మని భ్రమించడం, అలాగే పొరపాట్లు సుఖోత్పత్తి స్థానా లనుకోవడం అజ్ఞానానికి పరాకాష్ఠ. తమస్సు అంటే మరి అజ్ఞానమే కదా!

తమస్సులో తారాడుతూ, పొరపాట్లు, ఏమరుపాట్లు చేస్తూ అదే తేజస్సు అని భ్రమించడం కాకుండా, నిజమైన తేజస్సులో జీవించేటట్లు అనుగ్రహించ మని భగవంతుని ప్రార్థిస్తే, ఈ మోహ జాడ్యం మెల్ల మెల్లగా తొలగి పోయే అవకాశం ఉంది.

పల్లవి : **ఎటులనో? ఏగుటేలనో!**
**ఆ పొరపాటు - ఈ గ్రహపాటు ॥ ఎటులనో ॥**

చరణములు : (1) ఇచ్చినట్లే బ్రతుకు నిచ్చి
నిద్రలో సగమును దోచినావా?
వడ్డీ బుద్ధిని వదలని వరదా!
అసలు ఏమిటో తెలుపవా! ॥ ఎటులనో ॥

(2) శరధిని దాటిన దాశరధి
భవ జలధికి వారధి
నాకమైనా నరకమైనా
ఆ సన్నిధి అక్షయనిధి ॥ ఎటులనో ॥

అని తమస్సు నుండి బయట పడే మార్గాన్ని గానం చేసి చూపింది చైతన్య గీతిక.

నిద్ర నుండి, ప్రమాదం నుండి కలిగింది అనడం ఎంత విడ్డూరమో, సోమరితనం నుండి పుట్టింది అనడం అంత కన్నా ఆశ్చర్యం *(ఆలస్యః)*. ఏ అనుభవానికీ నోచుకోనిది సోమరితనము. దాని నుండి పుట్టే సుఖము ఎలాంటిదో ఊహించడం ఎంతటి సోమరి కైనా సాధ్యమే. అందుకే దానిని తామస సుఖము అన్నారు.

**ఆఖ్యాయిక**

ఒక గ్రామంలో ఇద్దరు మిత్రులు ఉండే వారు. ఒకడిని మించిన సోమరి ఇంకొకడు. ఊరిలో అదే పనిగ పగటి పూట కూడా నిద్రిస్తూ ఉంటే గ్రామస్థులు, కుటుంబీకులు గొడవ చేస్తారని, ఇద్దరు మిత్రులు పరస్పరం మాట్లాడుకొని, ఊరు బయటకు ఏదో కార్యార్థము వెళ్ళినట్లు వెళ్ళి, ఒక చెట్టు నీడను చూసుకొని నిద్ర పోతూ ఉండే వారు.

ఒకనాడు రహదారి ప్రక్కనే ఉన్న నేరేడు చెట్టు నీడలో ఇద్దరూ ప్రక్క ప్రక్కనే వెలికిల పడుకున్నారు. పైన చెట్టుకు నేరేడు పండ్లు గుత్తులు గుత్తులుగా వేళ్ళాడున్నాయి. అవి తిని పడుకుంటే బాగుణ్ణు అనుకుంటాడు అందులో ఒకడు. మరి, వాటిని తినాలి అంటే లేవాలి. చెట్టెక్కాలి. ఇదంతా చేయాలంటే, సోమరితనాన్ని ఏ ఉట్టి కెక్కించాలి? పడుకొని అలా ఆలోచిస్తూ ఉంటే, ఈ లోగా చెట్టుపై నుండి నేరేడు పండు ఒకటి జారి అతని ప్రక్కనే పడింది. సోమరికి నోరూరింది.

అదే సమయానికి ఒక బాటసారి ఆ దారిన పోతున్నాడు. ఇదే మంచి అవకాశం అని భావించిన సోమరి, 'అయ్యా! అయ్యా! దయ చేసి ఇటు రండి' అని బాటసారిని అర్థించాడు. బాటసారి పాపం, ఏమైందో అనుకుంటూ ఆదుర్దాగా దగ్గరకు వచ్చాడు. అతడితో ఈ సోమరి, 'మరోలా అనుకోకండి. నా ప్రక్కనే పడి ఉన్న నేరేడు పండును కాస్త నా నోట్లో పడేసి పొండి, పుణ్య ముంటుంది' అన్నాడు.

ఆ మాటలకు బాటసారి కోపోద్రిక్తు డయ్యాడు. 'ఛీ! నువ్వసలు మనిషేనా? నీదీ ఒక బ్రతుకేనా?' అంటూ, తిట్టిన తిట్టు తిట్టకుండా, మొహం వాచేటట్లు చీవాట్లు వేసి తన దారిన తాను పోయాడు.

ప్రక్కనే పడుకొని ఉన్న రెండో సోమరి, 'అలాగే కావాలి, వెధవకి. బాగా పడ్డాయి. లేకపోతే, నిన్న నా ముఖం మీద కాకి రెట్ట వేస్తే, కాస్త తుడవరా అంటే, లేచి తుడిస్తేనా! ఈ రోజు బాగా పూజ అయిందిలే' అని మహా సంతోష పడిపోయాడు.

ఇవి కూడా సుఖాలే అయితే, ఇక మాట్లాడే దేముంటుంది? ఇంతటితో, గుణ భేదాన్ని స్పృశిస్తూ సాగిన త్రివిధ గుణ విశ్లేషణము సమాప్త మైంది.

ప్రకరణ ఉపసంహారాన్ని సూచిస్తూ తరువాత శ్లోకం చెబుతున్నాడు.



**న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।** 40
**సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభిః స్యా త్త్రిభి ర్గుణైః ॥**

*న-తత్-అస్తి-పృథివ్యాం-వా-దివి-దేవేషు-వా-పునః*
*సత్త్వం-ప్రకృతిజైః-ముక్తం-యత్-ఏభిః-స్యాత్-త్రిభిః-గుణైః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృతిజైః | = | ప్రకృతి వలన జనించిన | స్యాత్ | = | కలదో |
| ఏభిః | = | ఈ | తత్ | = | అది |
| త్రిభిః | = | మూడైన | పృథివ్యాం వా | = | భూలోకము నందు గాని |
| గుణైః | = | గుణముల చేత | దివి | = | స్వర్గలోకము నందు గాని |
| ముక్తం | = | విడువ బడిన | పునః | = | మరల |
| సత్త్వం | = | సత్త్వము | దేవేషు వా | = | దేవతల యందు గాని |
| యత్ | = | ఏది | న అస్తి | = | లేదు |

**అర్జునా! త్రిగుణాలు ప్రకృతి నుండి పుట్టాయి. ఈ గుణాల నుండి విడి పడిన ప్రాణి భూలోకంలో లేదు. స్వర్గంలో లేదు. దేవలోకం లోనూ లేదు.**

**వ్యాఖ్య**

మానవుల స్వభావంలో, ప్రవర్తనములో ప్రధాన పాత్రను పోషిస్తున్న సత్త్వ రజ స్తమో గుణాలను, స్వరూప స్వభావ ప్రభావాలను విస్తరించి చెప్పుకున్నాం. ఇంతగా చెప్పు కున్నది ఏదో పొందాలని కాదు, పోగొట్టు కోవాలని. గుణాల నుండి విడి పడాలని, గుణాతీత స్థితిని చేరుకోవాలని.

గుణాలు - గుణాలు అంటూ చెప్పుకోవడమే గాని, బాగా పరిశీలించి అర్థం చేసుకుంటే, అక్కడ గుణా లంటూ ఏమీ లేవు. అన్నీ దోషాలే. దోషాలు లేని సమస్థితి పరమాత్మలో ఉంటుందే గాని *(5 వ అ - 19 వ శ్లో)*, ప్రకృతిలో ఉండదు. గుణా లన్నీ ప్రకృతి నుండే పుట్టాయి. మాయ నుండే ఉద్భవించాయి. అందుకే వాటిని ప్రకృతి సంభవాలని పద్నాల్గవ అధ్యాయం లోనే చెప్పుకున్నాం ***(సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ;** 14 వ అ - 5 వ శ్లో )*.

గుణాలకు ఉత్పత్తి స్థానం ప్రకృతి. ప్రకృతి మోహంలో పడటం వల్లనే జీవత్వం ప్రాప్తించింది. జీవత్వమే బంధం. అది గుణ సంబంధము. జీవబంధం నుండి విడి పడాలి అంటే, గుణ బంధం నుండి విడి పడాలి. గుణాతీత స్థితికి చేరి పోవాలి. అలా చేర్చే ప్రయత్నంలో భాగం గానే భగవద్గీత ఇంతగా విస్తరించి గుణ ప్రసంగం చేసింది. వాస్తవానికి గుణ ప్రాధాన్యాన్ని ప్రవచించడం భగవద్గీత ఉద్దేశం కాదు. నిర్దోషమై, గుణాతీత మైన పరబ్రహ్మ విషయమును నిర్ధారించడమే గీతా తాత్పర్యము. కనుకనే, ప్రారంభం లోనే శ్రీకృష్ణ పరమాత్మ తన హృదయం లోని మాటను సూటిగా చెప్పడం జరిగింది. ***నిస్త్రైగుణ్యో భవార్జున !*** - అర్జునా! త్రిగుణాల నుండి విడిపడు. గుణాతీతుడివి కా! అని సాంఖ్యయోగం లోనే ప్రవచించాడు *(2 వ అ - 45 వ శ్లో)*.

నిర్దోషము, గుణ రహితము అయిన బ్రహ్మమును విడిచి పెడితే, సృష్టి అంతా త్రిగుణ మిళితమే. ప్రకృతి స్వరూపమే. మాయామయమే. కనుక, మానవులే కాదు, స్వర్గాది లోకాల లోని పుణ్య పురుషులు గాని, సురాది లోకాల లోని దేవతలు గాని, ఎవ్వరూ త్రిగుణాల నుండి విడిపడిన వారు కారు. అలాంటిది ప్రకృతి లోనే, లేదా సృష్టి లోనే ఎక్కడా కనిపించదు ***( న తదస్తి )*** అని చెబుతూ గుణ ప్రకరణాన్ని ఇక్కడ ఉపసంహరిస్తున్నాడు.

## వర్ణ విభాగము - ఆచార వ్యవహారము

సృష్ట్యాదిలో ధర్మ స్థాపన కొరకు పరమేశ్వరుడు ఒక వ్యవస్థను ఏర్పాటు చేయ వలసి వచ్చింది. అదే వర్ణ వ్యవస్థ. గుణ ప్రధానం గాను, కర్మ ప్రధానం గాను, సమాజ అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ నియమించిన వర్ణ వ్యవస్థ. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర విభాగము. ఇది భేదంలో అభేదాన్ని దర్శించే పవిత్ర మార్గం.

ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజ్యాంగము కీలకపాత్రను పోషిస్తుంది. అందులోని నియమా లన్నీ ప్రజాస్వామ్య పరిరక్షణ కొరకే గాని విధ్వంసం కొరకు కాదు. ఎవరైనా, ఎక్కడైనా రాజ్యాంగ విరుద్ధంగా ప్రవర్తిస్తే, దాని వల్ల రాజ్యంలో సంక్షోభం ఏర్పడితే, అది వ్యక్తుల దోషమే గాని, రాజ్యాంగ లోపము కాదు. ఏ వ్యవస్థలో నైనా, చివరికి సృష్టి కార్యంలో కూడా, ఈ నియమ నిబంధనలు విలక్షణంగా లేవు.

వర్ణ వ్యవస్థ అలాగే ఏర్పడింది. అది గుణకర్మ ప్రధానంగా ఉంటుంది. వర్ణ విభాగము స్వభావం వల్ల పుట్టిన గుణాల కారణంగా ఏర్పడింది. కనుక స్వభావాన్ని ముందుగా అర్థం చేసుకోవాలి.

స్వభావము అంటే త్రిగుణాత్మక మైన మాయ, లేదా ప్రకృతి. గుణాలకు ప్రభవ స్థానం మాయ కనుక, గుణాలు స్వభావ ప్రభవములు ( ***స్వభావ ప్రభవై ర్గుణైః*** ). ఈ విధంగా, అంటే గుణానుసారంగా కర్మలు నిర్ణయింప బడతాయి. ఎవరి గుణానికి అనుగుణమైన కర్మలో వారు ప్రవర్తించ వచ్చు. వైద్య వృత్తిపై ఆసక్తి ఉండి, వైద్య కళాశాలలో స్థానం లభించ లేదని, సాంకేతిక పరమైన విద్యల లోకి అనాసక్తితో ప్రవేశించ నవసరం లేదు.

గుణాన్ని బట్టే కర్మ ఉంటుందని ఈ దశలో నేను చెప్ప నవసరం లేదనుకుంటాను. కనుక, ఎవరిలో ఏ గుణం ప్రధానంగా ఉంటే, ఆ గుణానికి అనుగుణమైన కర్మను ఈశ్వరార్పనగా ఆచరించి అంతఃకరణ శుద్ధిని పొంది, జ్ఞానానికి సిద్ధపడ వచ్చు. నాలుగు వర్ణాల వాళ్ళు అలా తరించ వచ్చు. అభేద దర్శనమునే పరమార్థంగా భావించి ప్రమాణంగా శోభిస్తున్న వేదాంత శాస్త్రము భేదాన్ని అంగీకరించదు. భేదానికి శాస్త్రంలో చోటే లేదు.

ఈ వర్ణ వ్యవస్థ అంతర్జాతీయంగా, ప్రతి దేశం లోను, ప్రతి కాలం లోను తెలియకనే కొనసాగుతు న్నప్పటికీ, భారతదేశంలో దానికి సంబంధించిన స్పృహ ఉండటం లోపం కాదు, శాపం కాదు; ఒక గొప్ప వరం. వరణీయం.

కాలం మారింది. పరిస్థితులు మారాయి. వర్ణ వ్యవస్థ ఏ సమాజాని కైనా అతికినట్లు సరి పోతుంది. కాని, మానవుల మస్తిష్కాల నుండి విరజిమ్మ బడుతున్న విషం నేటి సమాజంలో వర్ణ వ్యవస్థను భయంకరంగా చూస్తోంది.

విషయం ఎవరికీ పట్టడం లేదు. అందరికీ పేర్లతో, పదాల తోనే పేచీ లొస్తున్నాయి. అవసరం లేదనుకుంటే పదాలను ప్రక్కన పెట్టండి. దోషం లేదు. పేర్లు తలలో పేలు లాగా కుడుతూ ఉంటే, వాటిని కూడా మరొక ప్రక్కన పెట్టేయండి. కొన్ని పండ్లు తొక్కలు తీసి తిన వలసి ఉంటుంది. కొన్ని పళ్ళను తొక్కలతో తింటేనే మంచిది. తొక్క, పిక్కల జోలికి పోకుండా, రసపానం చేసి రసానుభూతిని (ఆనందానుభూతిని) పొందమని చెప్పేందుకే చైతన్య భగవద్గీత. ఇక చదవండి.

**బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః ॥** 41



*బ్రాహ్మణ-క్షత్రియవిశాం-శూద్రాణాం-చ-పరంతప*
*కర్మాణి-ప్రవిభక్తాని-స్వభావ-ప్రభవైః-గుణైః*

పరంతప = అర్జునా!
బ్రాహ్మణక్షత్రియవిశాం = బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు
శూద్రాణాం చ = శూద్రులకు
స్వభావ ప్రభవైః = స్వభావముచే గలిగిన
గుణైః = గుణముల చేత
కర్మాణి = కర్మములు
ప్రవిభక్తాని = వేర్వేరుగ విభజింప బడినవి

**అర్జునా! నాలుగు వర్ణాల వారికి వారి వారి స్వభావాన్ని బట్టి గుణాలు ఏర్పడతాయి. వాటి ననుసరించి కర్మలు నియమింప బడతాయి.**

### వ్యాఖ్య

కర్మలు, కర్మ సాధనాలు, కర్మఫలాలు - ఈ మూడిటి యొక్క స్వరూపమే సంసారము. ఇది త్రిగుణాత్మకము. అవిద్యా కల్పితము. సత్త్వ రజ స్తమో గుణాత్మకమైన సమస్త సంసారము, కారణంతో సహా అనర్థ దాయకము అని ప్రతిపాదిస్తూ, పదిహేనవ అధ్యాయారంభం లోనే ***ఊర్ధ్వమూలం*** అంటూ సంసారానికి వృక్ష రూపకాన్ని కల్పించడం జరిగింది.

వృక్ష రూప సంసార వర్ణనము సంసార వృక్ష ఛాయలో విశ్రమించ డానికి కాదు. అసంగ మనే దృఢమైన ఖడ్గం చేత దానిని సమూలంగా ఖండించి, అంతకు మించిన, పరమోత్కృష్ట మైన స్థానాన్ని, తిరిగి రావడ మనేది లేని పరంధామాన్ని ( ***యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ*** ) అన్వేషించి పొందడానికి అనే విషయాన్ని అక్కడే నిర్దేశించడం జరిగింది.

ఇదిలా ఉండగా, సర్వమూ త్రిగుణాత్మక మని, ప్రకృతి పరిణామమే నని నిర్ణయమై పోయింది కనుక, సంసార ప్రవృత్తికి త్రిగుణాలే కారణ మని నిర్ణయించడం జరిగింది. అలాంటప్పుడు సంసార కారణ నివృత్తి ఎలా జరుగుతుంది? అనే సందేహము అనివార్యంగా తలెత్తుతుంది. దానిని కూడా నివారించ వలసి ఉంది. అలా నివారించడం జరిగితే, సమస్త గీతాశాస్త్రాన్ని ఉపసంహరించి నట్లు అవుతుంది. శ్రుతుల, స్మృతుల యొక్క తాత్పర్యం ఇదే నని ( ***ఏతా వానేవ చ సర్వ వేద స్మృత్యర్థః*** ); ఇదే పురుషార్థ సిద్ధికి ప్రయత్నించు వారు ఆచరించ దగినది ( ***ఇచ్ఛద్భిః అనుష్ఠేయః*** ) అని కూడా చెప్ప వలసి ఉంది. అందుచేత ***బ్రాహ్మణ క్షత్రియ విశాం*** అనే నూతన ప్రకరణమును ఆరంభించి ప్రసంగించడం జరుగుతోంది.

**జ్ఞానాత్ మోక్షా ఇతి -** *జ్ఞానం ద్వారానే ముక్తి సిద్ధిస్తుంది. జ్ఞానం సిద్ధించాలంటే అంతఃకరణ శుద్ధి ఉండాలి. దానికి కర్మయోగమే సాధనము. కనుక, తన స్వభావానికి అనుగుణ మైన కర్మల ద్వారా పరమేశ్వరుని ఆరాధించి చిత్తశుద్ధిని పొందాలి. ఆయా వర్ణాల వారి గుణాలకు అనుగుణమైన కర్మలను గూర్చి భగవానుడు చెబుతున్నాడు.*

**శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవ చ ।**
**జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥** 42

*శమః-దమః-తపః-శౌచం-క్షాంతిః-ఆర్జవం-ఏవ-చ*
*జ్ఞానం-విజ్ఞానం-ఆస్తిక్యం-బ్రహ్మకర్మ-స్వభావజం*

శమః = మనో నిగ్రహము

| | | | | | |
|---|---|---|---|---|---|
| దమః | = | ఇంద్రియ నిగ్రహము | జ్ఞానం | = | శాస్త్ర జ్ఞానము |
| తపః | = | తపస్సు | విజ్ఞానం | = | అనుభవ జ్ఞానము |
| శౌచం | = | శుచిత్వము | ఆస్తిక్యం | = | ఆస్తిక్య బుద్ధి |
| క్షాంతిః | = | సహనము | స్వభావజం | = | స్వభావము వలన కలిగిన |
| ఆర్జవం ఏవ చ | = | ఋజుత్వము | బ్రహ్మకర్మ | = | బ్రాహ్మణుల కర్మ |

**అర్జునా! మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఋజుత్వము, సహనము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము - ఇవన్నీ బ్రాహ్మణులకు స్వభావం చేత ఏర్పడిన కర్మలు.**

**వ్యాఖ్య**

పూర్వాధ్యాయాలలో మనం విస్తారంగా చెప్పుకున్న సత్త్వగుణ ప్రధానమైన ఈ తొమ్మిది లక్షణాలు బ్రాహ్మణుని కర్మగా చెప్ప బడ్డాయి.

అంతఃకరణమైన మనస్సును నిగ్రహించి, అది బహిర్ముఖం కాకుండా చూసుకోవడం శమము, లేదా అంతరేంద్రియ నిగ్రహము. అలాగే శ్రోత్రాది ఇంద్రియాలు శబ్దాది విషయాల వైపు పరుగులు పెట్టకుండా నియమించడము దమము, లేదా బాహ్యేంద్రియ నిగ్రహము. ఇవే శమదమాలు. ఇవి పూర్వాధ్యాయాలలో వ్యాఖ్యానించ బడ్డాయి *(16 వ అ - 1 & 2 శ్లో)*.

శరీరాన్ని, వాక్కును, మనస్సును నియమాలను పాటిస్తూ నిగ్రహించడం తపస్సు అనబడుతుంది. ఇది వ్యాఖ్యాతమే *(17 వ అ - 14 - 16 శ్లో)*.

బాహ్యాభ్యంతరాలలో దేహమును, మనస్సును శుచిగా ఉంచుకోవడమే శౌచము, లేదా శుచిత్వము. దీనిని పదహారవ అధ్యాయంలో చెప్పుకున్నాం *(16 వ అ - 3 వ శ్లో)*.

క్షాంతి అనేది క్షమా గుణము. ఓరిమి. తనకు అపకారము చేసిన వారికి తిరిగి అపకారం చేయకుండా ఉండటమే గాక, తనకు పరులు చేసిన అపకారమును మనస్సులో కూడా పెట్టుకోకుండా మరచి పోవడము ఏదైతే ఉందో, అది కూడా క్షాంతి క్రిందికే వస్తుంది. బాధలలో నిర్వికారంగా ఉండే స్వభావము *(16 వ అ - 3 వ శ్లో)*.

ఆర్జవము అంటే సరళ స్వభావము. కుటిలత్వము లేని ప్రవర్తనము. ఋజు వర్తనము. మాటకు, మనస్సుకు అభేదంగా ఉండే ఋజు స్వభావము ఆర్జవము *(16 వ అ - 1 వ శ్లో)*.

జ్ఞానము అంటే శాస్త్ర జ్ఞానము. విజ్ఞానము అంటే అనుభవ జ్ఞానము. ఇవే జ్ఞాన విజ్ఞానాలు. బంధ విముక్తిని కలిగించేవి. మోక్షాన్ని ప్రసాదించేవి *(9 వ అ - 1 వ శ్లో)*.

ఇక చివరిది ఆస్తిక్యం. శాస్త్ర విషయము నందు గల శ్రద్ధను ఆస్తిక్య మంటారు ***(ఆస్తిక్యమ్ అస్తి భావః శ్రద్ధధానతా ఆగమార్థేషు)***. భగవంతుని అస్తిత్వము నందు అకుంఠిత మైన విశ్వాసమును, భగవ దైశ్వర్యమును నిర్ణయించే శాస్త్రము నందు, శాస్త్రమును విప్పి చెప్పే ఆచార్యుని యందు అచంచల మైన విశ్వాసమును కలిగి ఉండటము కూడా శ్రద్ధ అనే ఆస్తిక్యము.

ప్రస్తుత శ్లోకం లోని శమాది నవకము (తొమ్మిది) బ్రాహ్మణునికి సత్త్వగుణము వలన ప్రాప్తించిన స్వభావము. పూర్వ శ్లోకంలో ***స్వభావ ప్రభవైః గుణైః ప్రవిభక్తాని*** అని చెప్ప బడినదే ప్రస్తుత శ్లోకంలో ***స్వభావజమ్*** అని చెప్ప బడింది.



ఇక, క్షత్రియ విహితమైన కర్మను గూర్చి చెబుతున్నాడు.

**శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్ ।**
**దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥** 43

***శౌర్యం-తేజః-ధృతిః-దాక్ష్యం-యుద్ధే-చ-అపి-అపలాయనం***
***దానం-ఈశ్వరభావః-చ-క్షాత్రం-కర్మ-స్వభావజం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| శౌర్యం | = | శూరత్వము | దానం | = | దానగుణము |
| తేజః | = | తేజస్సు | ఈశ్వర భావః చ | = | స్వామి భావము |
| ధృతిః | = | ధీరత్వము | స్వభావజం | = | స్వభావ సిద్ధమైన |
| దాక్ష్యం | = | సామర్థ్యము | క్షాత్రం | = | క్షత్రియ నియమిత మైన |
| యుద్ధే | = | యుద్ధము నందు | కర్మ | = | కర్మము |
| అపలాయనం అపి చ | = | పారిపోకుండుట | | | |

**అర్జునా! శూరత్వము, తేజస్సు, ధీరత్వము, సామర్థ్యము, యుద్ధములో పారి పోకుండా ఉండటము, దానము, స్వామి భావము - ఇవన్నీ క్షత్రియులకు స్వభావం చేత ఏర్పడిన కర్మలు.**

**వ్యాఖ్య**

సాత్త్విక స్వభావము గల బ్రాహ్మణునికి స్వభావము చేత ఏర్పడిన తొమ్మిది కర్మములను గూర్చి తెలుసు కున్నాం. ప్రస్తుత శ్లోకంలో రాజస స్వభావము గల క్షత్రియునికి స్వభావము చేత ఏర్పడిన ఏడు కర్మములను గూర్చి వింటున్నాము. అవి (1) శౌర్యము (2) తేజస్సు (3) ధృతి (4) దాక్ష్యం (5) యుద్ధము నుండి పారి పోకుండా ఉండటము (6) దానము (7) ఈశ్వర భావము. ఈ సప్తకము క్షత్రియునికి స్వభావము వలన ఏర్పడిన కర్మములు.

శౌర్యము అంటే శూరుని లక్షణము ***(శౌర్యం శూరస్య భావః)***. తన కన్నా బలహీనుడిపై పరాక్రమాన్ని చూపడానికి శూరుడు కా నవసరం లేదు. భీరువైనా చాలు. తనతో సమానుడిపై పోరాడటము వీరుడికే సాధ్యం. కాని, తనను మించిన బలవంతుణ్ణి కూడా ఎదుర్కొని పోరాడాలి అంటే, అది శూరునికే సాధ్యం. ఈ విధమైన శూరత్వము రాజస ప్రవృత్తి గల క్షత్రియునికే ఉంటుంది.

శూరత్వమును ప్రదర్శించుట శౌర్య మైతే, తనపై ప్రదర్శింప బడే శౌర్యమును ఎదిరించి నిలబడటం తేజము. ఎదుటి వాడు ఎంతటి పరాక్రమవంతు డైనా జంకని స్వభావము. దానినే ప్రాగల్భ్యము అంటారు. నిర్భయంగా ఎదుర్కొనే స్వభావము ***(తేజః ప్రాగల్భ్యం)***. శత్రువుల చేత నిగ్రహింప బడని ఈ తేజము క్షత్రియ స్వభావము.

అపాయాలు చుట్టు ముట్టినా, ఆపదలు ముంచు కొచ్చినా, కదలని, చెదరని మొక్కవోని ధైర్యము ధృతి. ధృతి అంటే ధారణము, లేదా నిలబెట్టుకొనే గుణము. ఎట్టి పరిస్థితుల లోను జంక కుండా, క్రుంగి పోకుండా, తనను తాను నిలబెట్టుకొనే ధైర్యమే ధృతి ***(ధృతిః ధారణమ్ సర్వావస్థాసు అనవ సాదః భవతి యయా ధృత్యా ఉత్తమ్భితస్య)***. పోరాటంలో దేహేంద్రియాలు అశక్త మౌతున్నా, వాటిని నిర్వీర్యం కానివ్వకుండా ఉత్తేజ పరచే చిత్త వృత్తియే ధృతి.

దక్షుని యొక్క లక్షణం దాక్ష్యము ***(దాక్ష్యం దక్షస్య భావః)***. కార్య నిర్వహణము నందు సామర్థ్యము

దాక్ష్యము. కర్మల యందు నైపుణ్యము. ఊహించని విధంగా ఎదురైన సంక్లిష్ట పరిస్థితులలో ఏ మాత్రం జడవకుండా, చెదరకుండా కార్యాలలో శీఘ్రంగా ప్రవేశించి వాటిని నిర్వహించడము దాక్ష్యము (**సాహసా ప్రత్యుత్పన్నేషు కార్యేషు అవ్యామోహేన ప్రవృత్తిః**).

యుద్ధరంగము నందు వెన్ను చూపని, మడమ తిప్పని పోరాటమును సాగించడమే కర్తవ్యము గాని, వెను దిరిగి పలాయనము చిత్తగించడం క్షత్రియుని స్వభావము కాదు (**యుద్ధేచ అపి అపలాయనమ్ అపరాఙ్ముఖీ భావః శత్రుభ్యః**).

ఇచ్చే చోట కనబరచే చేతి విడుపు దానం. ముందు వెనుక చూడకుండా దానం చేసే త్యాగబుద్ధి. చేతిని ముడుచుకొనే అలవాటు లేని దాన గుణము (**దానం దేయేషు ముక్త హస్తతా**).

చివరిది ఈశ్వర భావము. ప్రభు శక్తిని ప్రదర్శించే లక్షణము ఈశ్వర భావము. పరిపాలించ బడే వారి విషయంలో ప్రభావమును అతిశయించి ప్రదర్శించడము ఈశ్వర భావము, లేదా ఈశ్వర వైభవము (**ఈశ్వర భావః ఈశ్వరస్య భావః ప్రభు శక్తి ప్రకటీకరణమ్ ఈశితవ్యాన్ ప్రతి**). ఈ కర్మ సప్తకము క్షత్రియునికి పూర్వ కర్మ సంస్కార జనిత కర్మలు, లేదా స్వభావజములు.

*వర్ణ చతుష్టయంలో బ్రాహ్మణ, క్షత్రియులను చెప్పిన తరువాత, మిగిలిన ఇరువురిని - అంటే వైశ్య, శూద్రులను తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.*

కృషి గోరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్ర స్యాపి స్వభావజమ్ ॥ 44

*కృషిగోరక్ష్య వాణిజ్యం-వైశ్యకర్మ-స్వభావజం*
*పరిచర్యాత్మకం-కర్మ-శూద్రస్య-అపి-స్వభావజం*

| | | | |
|---|---|---|---|
| కృషిగోరక్ష్య వాణిజ్యం | = వ్యవసాయం, పశుపాలనము, వ్యాపారము | శూద్రస్య అపి | = శూద్రునకు |
| స్వభావజం | = స్వభావ జనితమైన | పరిచర్యాత్మకం | = పరిచర్య రూపమైన |
| వైశ్యకర్మ | = వైశ్యుల కర్మము | కర్మ | = కర్మము |
| | | స్వభావజం | = స్వభావసిద్ధ మైనది |

**అర్జునా! వ్యవసాయము, గోవులను రక్షించడం, వ్యాపారము వైశ్యులకు స్వభావం చేత ఏర్పడిన కర్మలు. సేవా కార్యాలు శూద్రులకు స్వభావం చేత ఏర్పడిన కర్మలు.**

### వ్యాఖ్య

వ్యవసాయము చేయడము, గోరక్షణము, వ్యాపారము చేయడము - ఈ మూడు వైశ్యునికి స్వభావంతో ఏర్పడిన కర్మలు. పరిచర్యలు చేయడ మనేది శూద్రునికి స్వభావంతో కలిగిన కర్మ; ఇది సేవా జీవనము.

వ్యవసాయము చేయడము అంటే, తాను భూస్వామిగా నిలబడి సేవకుల చేత వ్యవసాయము చేయించడము కాదు. తానే స్వయంగా చేయడం. అదే కృషి శబ్దార్థము. 'కృషి' అంటే భూమిని దున్నడము అని అర్థము (**కృషిః భూమేః విలేఖనమ్**). అంటే దున్నే వాడిదే భూమి. భూమి ఉన్న వాడే వ్యవసాయం చేస్తాడు.

అలాగే వాణిజ్యము. వణిజుని కర్మము వాణిజ్యము. అంటే కొనడము, అమ్మడము అనే ధర్మము. క్రయ విక్రయాది లక్షణము (**వణిక్కర్మ క్రయ విక్రయాది లక్షణమ్**). క్రయ విక్రయాదు లన్నప్పుడు 'మిత్తి', అంటే



వడ్డీ వ్యాపారము కూడా అందులో అంతర్భూతమే నని గ్రహించాలి (**కుసీదం చేతి**). కుసీదము అంటే వడ్డీ వ్యాపారము. ప్రపంచ బ్యాంక్ కూడా అందు లోనే చేరి పోతుంది.

**శుశ్రూషా శూద్రస్య** - శూద్రునకు సేవ చేయడము స్వభావజ కర్మగా చెప్ప బడింది. సేవ అనేది మహోన్నత మైన కార్యము. మహోత్కృష్టమైన జీవనము. లేకపోతే, లెక్కపెట్ట లేనన్ని సేవా సమాజాలు లోకంలో ఎందుకు పుట్టు కొస్తాయి? ఈ విషయంలో శాస్త్రానికి పూర్ణ అవగాహన ఉంది.

**శూద్రః చతుర్థో వర్ణ ఏకజాతిః తస్యాపి సత్య మక్రోధః పరిచర్యా చేతరేషాం** - సత్యము, అక్రోధము మొదలైనవి నాల్గవ వర్ణానికి సంబంధించిన శూద్రునకు ఎలా అనుష్ఠేయాలో, అలాగే ఇతర వర్ణాలకు పరిచర్య, అంటే సేవ కూడా అనుష్ఠేయమే అనేది శాస్త్ర హృదయము.

శ్లోకంలో కూడా **పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్** అని ఉంది. కనుక, సేవ చేయడం శూద్రునకు కూడా అనుష్ఠేయ మైన కర్మే నని అర్థము. దాని అర్థము, సేవ అనేది ఒక్క శూద్రునికే కాదు. వర్ణ చతుష్టయానికి మొత్తానికి సంబంధించిన విషయము. కాకపోతే, శూద్రునికి పూర్వ సంస్కార యోగ్యత కూడా కలిసి రావడం చేత, పరిచర్య అనేది స్వభావజం కావడం వల్ల, సేవా కార్యాలలో అతడు అసమానంగా శోభిస్తాడు. అంతే.

*కర్మ లన్నీ స్వభావజాలే అయినపుడు, ఏదైనా గమ్యానికి మార్గమే. అదే చెబుతున్నాడు.*

స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥ 45

*స్వే-స్వే-కర్మణి-అభిరతః-సంసిద్ధిం-లభతే-నరః*
*స్వకర్మనిరతః-సిద్ధిం-యథా-విందతి-తత్-శృణు*

| | | | |
|---|---|---|---|
| నరః | = నరుడు | స్వకర్మనిరతః | = తన కర్మమందు నిరతుడైన వాడు |
| స్వేస్వే | = తన తన | సిద్ధిం | = సిద్ధిని |
| కర్మణి | = కర్మము నందు | యథా | = ఎలా |
| అభిరతః | = ఆసక్తి గలవాడై | విందతి | = పొందుచున్నాడో |
| సంసిద్ధిం | = సిద్ధిని | తత్ | = దానిని |
| లభతే | = పొందుచున్నాడు | శృణు | = విను |

**అర్జునా! స్వభావం చేత ప్రాప్తించిన కర్మలను ఆసక్తితో ఆచరించే వారు సిద్ధిని పొందుతారు. అదెలాగో చెబుతాను. విను.**

### వ్యాఖ్య

స్వభావము వలన ఏర్పడిన కర్మలు స్వభావజాలు. సంస్కార జనితాలు. ఆ స్వభావాలు మనం కోరి వరించినవే గాని ఎవరో తగిలించినవి కావు. ప్రారబ్ధ రూపంలో మన జీవితంలో తొంగి చూచే మన కర్మల్ని మనం ఆదరించకుంటే మరెవరు ఆదరిస్తారు? మనం కాకపోతే మరెవరు ఆచరిస్తారు?

పూర్వ శ్లోకంలో మనం చెప్పు కున్నట్లు స్వభావ భేదం వల్ల తన తన కర్మము నందు (**స్వే స్వే కర్మణి, యథోక్త లక్షణ భేదే కర్మణి**) ఆసక్తుడై ఆచరించే మానవుడు (**అభిరతః తత్పరః నరః**). సిద్ధిని పొందుతాడు (**సంసిద్ధిం లభతే**). అదెలాగో భగవంతుడు చెబుతాడట. శ్రద్ధగా విందాము.

యోగ్యత కొద్ది ప్రాప్తించిన స్వభావజ కర్మను ఎవడైతే శ్రద్ధతో, ఆసక్తితో, ప్రేమతో ఆచరిస్తాడో, అలా ఆచరించడం చేత దేహేంద్రియ మనస్సులలో ఏర్పడి ఉన్న మాలిన్య మంతా తొలగి పోతుంది. దేహేంద్రియాదుల లోని అశౌచము ప్రక్షాళనం కాగానే అతడు జ్ఞాన నిష్ఠా యోగ్యతకు కావలసిన అంతఃకరణ శుద్ధిని సిద్ధింపచేసు కోవడం జరుగుతుంది ***(స్వకర్మానుష్ఠానాత్ అశుద్ధి క్షయే సతి కాయేన్ద్రియాణాం జ్ఞాన నిష్ఠా యోగ్యతా లక్షణం ప్రాప్నోతి పురుషః)***.

స్వభావజము లైన కర్మలను ఆచరించడానికి అనువైన ప్రదేశాలలో, వర్ణాలలో మనిషి ఆవిర్భవించి, తన తన ***(స్వేస్వే)*** నియమిత కర్మలను ఆచరించడం వల్ల, అతడు గృహస్థుడే అయినప్పటికీ, స్వకర్మానుష్ఠానాన్ని చక్కగా ఆచరించడం చేత, వర్ణ బంధము నుండి, స్వభావజ కర్మ బంధం నుండి కూడా విడిపడి, మరణానంతరము ఉత్తమ లోకాలను పొందుతాడు అని శాస్త్రం చెబుతూ ఉంది ***(యస్తు సమ్యక్కరోతి ఏవం గృహస్థః పరమం విధిమ్ ! తద్వర్ణ బంధ ముక్తోఽసౌ లోకా నాప్నో త్యనుత్తమాన్ !)***.

బాగుంది. స్వభావజ కర్మానుష్ఠానం వల్ల వర్ణ బంధ విముక్తుడై ఉత్తమ లోకాలను పొంద వచ్చు. అలాగని, అతనికి పునర్జన్మ లేకుండా ఉంటుందా? జ్ఞానము లేనందున మోక్షము ప్రాప్తించదు కదా! మరి అతడు, ఆ తరువాత ఏమౌతాడు? దీనికి గౌతముని ధర్మశాస్త్రము స్పష్టంగా సమాధానం చెప్పింది.

***వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మ నిష్ఠాః ప్రేత్య, కర్మఫలం అనుభూయ తతః శేషేణ విశిష్ట దేశ జాతి కుల ధర్మాయుః శ్రుత విత్త సుఖ మేధసః జన్మ ప్రతి పద్యన్తే*** - తమ తమ స్వభావజ కర్మల యందు నిష్ఠ గల వర్ణాల వాళ్ళు, ఆశ్రమాల వాళ్ళు, మరణానంతరము, వారి వారి కర్మఫలాలను ఉత్తమ లోకాలలో అనుభవించి, మిగిలిన కర్మ విశేషం చేత విశిష్టమైన ప్రదేశము, జాతి, కులము, ధర్మము, ఆయుర్దాయము, విద్య, విత్తము, సుఖము, బుద్ధి బలము కల వారై జన్మిస్తుంటారు *(గౌతమ ధర్మ సూత్రాలు ; 11 - 29)*.

*మరి, స్వభావజమైన స్వకర్మానుష్ఠానం వల్లనే సిద్ధి లభిస్తుందా? అలా కాదు. వినండి.*

**యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥** 46

***యతః-ప్రవృత్తిః-భూతానాం-యేన-సర్వం-ఇదం-తతం***
***స్వకర్మణా-తం-అభ్యర్చ్య-సిద్ధిం-విందతి-మానవః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూతానాం | = | ప్రాణుల యొక్క | తం | = | వానిని |
| ప్రవృత్తిః | = | పుట్టుక | మానవః | = | మానవుడు |
| యతః | = | ఎవని వలన కలిగినదో | స్వకర్మణా | = | తన కర్మ చేత |
| యేన | = | ఎవని చేత | అభ్యర్చ్య | = | ఆరాధించి |
| ఇదం | = | ఈ | సిద్ధిం | = | సిద్ధిని |
| సర్వం | = | సమస్తమును | విందతి | = | పొందుచున్నాడు |
| తతం | = | వ్యాపింపబడి యున్నదో | | | |

**అర్జునా! ప్రాణుల పుట్టుకకు కారణ మైన వాడు ఈ సమస్త ప్రపంచములో వ్యాపించి ఉన్నాడు. స్వభావము వల్ల ప్రాప్తించిన కర్మతో అతణ్ణి ఆరాధించే వాడు సిద్ధిని పొందుతాడు.**



### వ్యాఖ్య

సృష్టికి పరమేశ్వరుడు అభిన్న నిమిత్త ఉపాదాన కారణంగా ఎలా ఉన్నాడో విజ్ఞాన యోగంలో మనం విస్తరించి చెప్పుకున్నాం. సృష్టి, సృష్టికర్త కన్నా వేరుగా లేదని కూడా గ్రహించాము. సృష్టిలో నియతి రూపంలో ఉన్నది నియంతయే నని తెలుసుకున్నాం.

***యతః*** - ఎవరి నుండి ఈ భూతాలకు ఉత్పత్తి ***(ప్రవృత్తిః)*** కలిగిందో, ***యేన*** - ఎవరి చేత ఈ ప్రపంచం అంతా పరివ్యాప్తమై ఉందో ***(సర్వ మిదం తతం)***, అతడిని పూర్వ శ్లోకం వరకు మనం చూచిన స్వభావజ కర్మల చేత ***(స్వకర్మణా)*** అర్చించి నట్లైతే, జ్ఞానయోగ్యతా లక్షణమైన సిద్ధిని పొందడం జరుగుతుంది ***(సిద్ధిం విన్దతి మానవః)***. ఇదీ, శ్లోక హృదయం.

పరమేశ్వరుని నుండి ఆవిర్భవించిన ఈ విశ్వము ***(యతః యస్మాత్ ఈశ్వరాత్)***, పరమేశ్వరుని చేతనే పరివ్యాప్తమై ఉంది ***(ఈశ్వరేణ ఇదం జగత్ తతం వ్యాప్తం)***. ఈ సృష్టి నడవ డానికి ఆధారమైన నియతి రూపంలో ఉన్నది నియంతయే. ధర్మ రూపంలో ఉన్నది దైవమే. దైవం ధర్మ రూపంలో ఉన్నాడు అని తెలిసి ధర్మ జీవనాన్ని సాగిస్తే, అది ధర్మ రూపంలో ఉన్న దైవాన్ని అర్చించినట్లే అవుతుంది. పను లన్నీ పూజలుగా మారుతాయి. ధర్మ జీవనం దైవారాధనగా మారుతుంది. మనం ఆచరించే కర్మలలో పరమేశ్వరుడు ఎప్పుడైతే ప్రవేశించాడో, ఆ కర్మ అర్చనగా మారుతుంది. ఆరాధనగా రూపుదిద్దు కుంటుంది. ఏ కర్మ చేస్తున్నాము అనేది ప్రధానం కాదు. ఏ కర్మ చేసినా అది పూజే.

***యద్య త్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనమ్*** - ఏ కర్మ చేసినా దానిని నైవేద్యంగా మార్చుతాడు కర్మయోగి. తన దేహమే పూజాగది అవుతుంది. గుండె గుడిగా మారుతుంది. భావాలన్నీ సుమా లవుతాయి. ఇదే భక్తి. కర్మయోగానికి ప్రాణం లాంటిది. ఇదే ఈశ్వరారాధన. కర్మ లన్నీ నైవేద్యా లవుతున్నాయి కనుక, కర్మఫలా లన్నీ ప్రసాదా లవుతాయి. ***భావగ్రాహి జనార్దనః*** - నీ భావాన్ని గ్రహించే వాడు జనార్దనుడు. కర్మ ఎలా వేద్యమో అర్థమైతే, ఆ తరువాత ఏది సమర్పించినా అది నైవేద్యమే అవుతుంది.

***ఆశతో కదిలాను శ్వాస నీవు కాగా***
***శ్వాస మిగిలింది ఆశ ఎటో పారిపోయె***
***శ్వాస లాగు వరకు నీ సేవ ఆపనయ్యా !***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా !***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద. ఇదే కర్మయోగి చల్లని యెద.

*అందుచేత స్వభావజ మైన స్వధర్మమే శ్రేష్ఠ మని చెబుతున్నాడు భగవంతుడు.*

**శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।**
**స్వభావ నియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥** 47

***శ్రేయాన్-స్వధర్మః-విగుణః-పరధర్మాత్-స్వనుష్ఠితాత్***
***స్వభావ నియతం-కర్మ-కుర్వన్-న-ఆప్నోతి-కిల్బిషం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్వధర్మః | = | స్వధర్మము | పరధర్మాత్ | = | పరధర్మము కంటెను |
| విగుణః | = | గుణహీన మైనను | శ్రేయాన్ | = | శ్రేయస్కరము |
| స్వనుష్ఠితాత్ | = | చక్కగా ఆచరించబడిన | స్వభావ నియతం | = | స్వభావ సిద్ధమైన |

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మ | = | కర్మమును | కిల్బిషం | = | పాపమును |
| కుర్వన్ | = | చేయువాడు | న ఆప్నోతి | = | పొందదు |

**అర్జునా! బాగా ఆచరింప బడే పరధర్మము కంటే కూడా, లోపాలు ఉండినా స్వధర్మమును ఆచరించడమే మేలు. స్వభావం వల్ల ఏర్పడిన కర్మను చేసే వాడు పాపాన్ని పొందదు.**

**వ్యాఖ్య**

**పొరుగింటి పుల్లగూర**

ఉన్నది బాగా లేదు అనే అభిప్రాయం గనుక ఏర్పడితే, ఇక ఆ తరువాత, లేనిది ఏదో, అది బాగున్నట్లు అనిపిస్తూ ఉంటుంది అనేది మనస్తత్త్వ శాస్త్ర విశ్లేషణము. అది వాస్తవమా, కాదా అనేది ప్రక్కన పెడితే, 'పొరుగింటి పుల్లగూర రుచి' అనే సామెత ఎందుకు వచ్చిందో అర్థ మవుతుంది. తన ఇంటి కూర ఎప్పుడూ తింటూ ఉండేదే కనుక, క్రొత్త రుచు లీనే పొరుగింటి పుల్లగూరలో పులుపు కాస్త ఎక్కువే అయినా, క్రొత్తదనాన్ని ఆశించే నాలుకకు అది రుచికరం గానే ఉంటుంది.

ఏది రుచి - ఏది అరుచి అనేది అలా ఉంచండి. ఏది యుక్తము - ఏది అయుక్తము అనే కోణంలో ఆలోచిస్తే మాత్రం ఇంటి వంటకమే నయ మనిపిస్తుంది. రుచి కాస్త తక్కు వైనా, ఎక్కువ రుచి కలిగిన పొరుగింటి వంట కంటే ఇంటి వంటే నయం.

ఎప్పుడూ ఉండేది ఇంటి వంట. ఎప్పుడో గాని దొరకనిది పొరుగింటి వంట. ఏ నెలకో, రెండు నెలలకో ఒకసారి లభించే ప్రక్కింటి వంట కన్నా, రోజూ లభ్య మయ్యే ఇంటి వంటే శ్రేష్ఠము కదా! నిత్యము భుజిస్తే గాని మనిషి బ్రతక లేడు. నెల కొకసారి దొరికే పొరుగింటి వంటతో బ్రతికే దెలా? ప్రాణానికే ముప్పు తెచ్చే రుచికర మైన పొరుగింటి వంట కన్నా అంత రుచి లేని దైనా, మనిషిని నిత్యము పోషించి రక్షించే ఇంటి వంటే మేలు కదా!

లేదండీ! ప్రక్కింటి వంట మాకు రోజూ లభిస్తుందండీ! అని మీరు చెప్పినా, ఇంటి వంటే శ్రేయస్కరము అనేది నిత్య సత్యం. మన ఇల్లే మనది. పొరుగిల్లు మన దెలా అవుతుంది? ఒకవేళ మనదే అని పైకి చెప్పు కున్నా, ఆ తరువాత ఎదురయ్యే సమస్యలను ఎదుర్కోవడానికి మనం సరిపోము.

**స్వధర్మమే శ్రేయస్కరము**

స్వభావం వల్ల కలిగిన స్వధర్మము గుణము లేని దని మనకు అనిపించ వచ్చు. మనస్సుకు ప్రియంగా గోచరించక పోవచ్చు. కర్కశంగా అగుపించ వచ్చు.

మనది కాని పరధర్మము గుణయుతంగా, ప్రియంగా, మనోహరంగా కనిపించ వచ్చు. అయినా, దోష రహితమైన, శ్రేష్ఠమైన పరధర్మము కన్నా, దోషయుత మైనా, నికృష్ట మైనా స్వధర్మమే మనిషికి మేలు చేస్తుంది.

నీళ్ళతో పోలిస్తే పాలు శ్రేష్ఠమైన పానీయము. జలక్షీరాలను కలిపి ముందుంచితే, నీళ్ళను త్యజించి, హంస క్షీరాన్ని పానం చేస్తుంది అంటారు. కావచ్చు. నీరు సాధారణమైన జలము. కానీ క్షీరము సమీకృత ఆహారము. బలకర మైనది. పుష్టికర మైనది. ఆరోగ్యకర మైనది. ఈ విషయంలో ఎవరికీ ఎవరితో విభేద ముండదు.

చేప నీళ్ళల్లో బ్రతుకు తుంది. నీళ్ళల్లో ఆనందంగా జీవిస్తుంది. అదే చేపను నీళ్ళ నుండి తీసి పాలల్లో వేసి చూడండి. నీళ్ళల్లో హాయిగా బ్రతికిన చేప పాలల్లో ప్రాణాలను వదిలేస్తుంది.





స్వధర్మము బ్రతికిస్తుంది. పరధర్మము ప్రాణం తీస్తుంది. ప్రాణం తీసే పరధర్మము ఎంత శ్రేష్ఠమైన దైనా, శ్రేష్ఠము కాని దైనా బ్రతుకు నిచ్చే స్వధర్మమే మేలు.

**బిచ్చ కన్నా రచ్చ నయం**

స్వజనులను చంపుకొని రాజ్య సుఖాలు అనుభవిస్తూ , పంచ భక్ష్య పరమాన్నాలు భుజించడం కన్నా, భిక్ష మెత్తుకొని జీవించడమే శ్రేయస్కరము అనేది అర్జునుడు ప్రారంభములో వెలి బుచ్చిన · అభిప్రాయము (***శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే ;*** *2 వ అ - 5 వ శ్లో*). ఈ దశలో సూటిగా ప్రస్తావించక పోయినా, పరోక్షంగా అర్జునుణ్ణి భగవంతుడు ఈ శ్లోకం ద్వారా కుదిపేశా డనే చెప్పాలి.

అర్జునుడు క్షత్రియుడు. శౌర్యము, తేజము, ధృతి, యుద్ధము నుండి పరా ఙ్మఖుడు కాకుండా పోరాడటము - ఇవన్నీ క్షత్రియులకు స్వభావజాలు అని చెప్పుకున్నాం కదా! *(18 వ అ - 43 వ శ్లో)*.

క్షత్రియునికి యుద్ధము స్వధర్మము. భిక్షాటనము పరధర్మము. ఎందుకనో, కురుక్షేత్రంలో అర్జునుడికి స్వధర్మము రుచించ లేదు. భిక్షాటనము పరధర్మ మైనా అది సుఖకరము, శ్రేయస్కరము, లాభదాయకము అనిపిస్తూ ఉందా? ఇది వాస్తవ మేనా?

భిక్షాటన చేయడానికి అక్షయ పాత్ర సరిపోతుంది. అక్షయ తూణీరాలు అవసరమా? ఎవరైనా పాశు పతాస్త్రాన్ని పట్టుకొని భిక్షకు పోతారా? అవన్నీ శ్రమించి సాధించు కున్నవి కావా? ఘోరమైన తపస్సు చేసి అస్త్ర శస్త్రాలు సాధించు కున్నది దేనికి? జాలి తలచి బిచ్చం పెట్టని వాళ్ళ మీద ప్రయోగించ డానికా?

సరే, అర్జునుడు చెప్పినట్లు భయంకరమైన యుద్ధ కర్మ కన్నా భిక్షాటనే శ్రేయస్కర మని భావిద్దాం. యుద్ధాన్ని విరమించుకొని, రేపు ధనంజయుడు భిక్షాటనకి వెళ్ళాడనే అనుకుందాం. ఒక ఇంటి ముందు నిలబడి, మాతా! భిక్షాం దేహి! అని పార్థుడు అడిగా డనుకుందాం. దుర్యోధనుడు లాంటి ఆ ఇంటి యజమాని వచ్చి, 'సిగ్గు లేదూ! సాలవృక్ష మంత ఉన్నావు. అడుక్కు తినక పోతే, అంట్లు తోముకొని బ్రతక రాదా!' అని ఛీ కొట్టాడనుకోండి. అప్పుడు అర్జునుడు ఊరుకుంటాడా?

ధర్మజ భీముల తమ్ముణ్ణి, నకుల సహదేవుల అన్నయ్యని, కుంతీ కుమారుణ్ణి, సుభద్రాపతిని, సాక్షాత్తు భగవంతుడైన గీతాచార్యుడికి బావమరిదిని, నన్ను అంట్లు తోముకో మంటావా? అని ఆ గృహస్థుడి ఒళ్ళు తోమి ఒంట్లో ఎముక లేకుండా చేయడా? అదేదో ఇప్పుడే కురుక్షేత్రంలో చేస్తే పోతుంది కదా! రేపు వీధుల్లో రచ్చ లాడటం కన్నా, గీత చెప్పినట్లు స్వధర్మాన్ని ఇక్కడే ఆచరిస్తే సరి పోతుంది కదా! రేపు గీతాచార్యుడి బావమరిదిని అంటూ అందరితో పేచీలు పడటం దేనికి? అనేది శ్రీకృష్ణుని అభిప్రాయము.

**విహితము - పాప రహితము**

యుద్ధము స్వధర్మమే అయినా, బంధువులను వధించడం విగుణము కాబట్టి యుద్ధము విహితము కాదని అర్జునుడు భావించి ఉండ వచ్చు. కానీ, యుద్ధకర్మ క్షత్రియునకు స్వభావ నియతము కనుక, దానిని ఆచరించడం వల్ల ఏ విధమైన పాపము అంటదు ***(కిల్బిషమ్ న ఆప్నోతి)***.

అంతే కాదు. స్వభావము వల్ల కలిగిన సంస్కారము బలీయంగా ఉంటుంది. దానిని ఎదిరించి నిల బడటం చాలా కష్టము. అలాంటి స్వధర్మాన్ని విడిచి పెట్టి పరధర్మాన్ని ఆశ్రయించినా, అది ఫలప్రదం కాదు. స్వభావం అంతర్యంలో స్థిరపడి ఉంటుంది కనుక, పరధర్మమును ఆశ్రయించి ప్రవర్తించాలన్నా, మనస్సు లోని స్వభావము మనిషి వెంటే ఉంటుంది. తాను ఆచరించే కర్మల ననుసరించే ఉంటుంది.

పరధర్మాన్ని ఆశ్రయించడం జరిగింది కనుక, స్వధర్మానుష్ఠానం లేని వాడు అవుతాడు. స్వభావము వెంట పడి ఉన్నందున పరధర్మమును సక్రమంగా ఆచరించ లేక పోతాడు. ఎటు చూచినా ధర్మభ్రష్టుడే అవుతాడు. ధర్మభ్రష్టు డైనందున పాపాన్ని పొందుతాడు.

స్వధర్మము ప్రతికూలంగా అనిపించినా, పరధర్మము అనుకూలంగా కనిపించినా, పరధర్మము నాశ్రయించి పాపాన్ని పొందడం కన్నా, పూర్వ శ్లోకంలో చూచినట్లు, స్వధర్మమును ఈశ్వరారాధనగా ఆచరిస్తే పాపము అంటదు సరి కదా, ఫలాసక్తి లేకుండా విహిత కర్మాచరణము జరిగి నందున చిత్తము ప్రసన్నమై, అంతఃకరణ శుద్ధి ఏర్పడుతుంది. అంతఃకరణ శుద్ధి ద్వారా జ్ఞానప్రాప్తికి బుద్ధి సిద్ధ పడుతుంది.

***అతః స్వధర్మే స్థితస్య మరణ మపి శ్రేయః పరధర్మే స్థితస్య జీవితాత్ -*** అందుచేత, పరధర్మము నాశ్రయించి బ్రతకడం కన్నా, స్వధర్మంలో మనిషి మరణించడమే మేలు.

*కనుక, స్వధర్మమును త్యజించ కూడదు అనే విషయాన్నే పునః ప్రసంగిస్తున్నాడు.*

సహజం కర్మ కౌన్తేయ సదోష మపి న త్యజేత్ ।
సర్వారమ్భా హి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః ॥ 48

***సహజం-కర్మ-కౌంతేయ-సదోషం-అపి-న-త్యజేత్***
***సర్వారంభాః-హి-దోషేణ-ధూమేన-అగ్నిః-ఇవ-ఆవృతాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | అగ్నిః | = | అగ్నిని |
| సహజం | = | సహజమైన | ధూమేన ఇవ | = | పొగ వలె |
| కర్మ | = | కర్మము | సర్వారంభాః | = | సకల కర్మలును |
| సదోషం అపి | = | దోషయుత మైనను | దోషేణ | = | దోషము చేతను |
| న త్యజేత్ | = | విడువరాదు | ఆవృతాఃహి | = | ఆవరింపబడి యున్నవి గదా! |

**కుంతీకుమారా! నిప్పును పొగ కమ్మినట్లు, కర్మలను దోషము కప్పి ఉంది. అందుచేత, స్వభావం వల్ల కలిగిన కర్మను విడిచిపెట్ట కూడదు.**

**వ్యాఖ్య**

కర్మను కర్మయోగంగా ఎలా మార్చుకోవాలో తెలియ జేస్తూ, నలభై ఒకటవ శ్లోకం వద్ద కర్మ ప్రసంగాన్ని ఆరంభించిన పరమేశ్వరుడు, కర్మ విషయం లోను, ధర్మం విషయం లోను, స్వధర్మ నిష్ఠ విషయం లోను సుదీర్ఘంగా, సహేతుకంగా, సశాస్త్రీయంగా ప్రవచించి, చివరగా కర్మ ప్రసంగాన్ని ఈ శ్లోకంతో సమాప్తం చేస్తూ, జ్ఞాన యోగాన్ని మరల ఉపదేశించే ముందు, కర్మల విషయంలో తన నిశ్చితాభిప్రాయాన్ని స్పష్టం చేస్తున్నాడు.

**సహజ కర్మే సాకర్యము**

అర్జునా! సహజ కర్మ దోషయుతంగా కనిపించి నప్పటికి దానిని త్యజించ కూడదు ***( స దోష మపి సహజం కర్మ న త్యజేత్ ).*** పొగ చేత నిప్పు ఎలా కప్పబడి ఉంటుందో, ఏ కర్మ అయినా దోషయుతం గానే ఉంటుంది ***( ధూమేన అగ్నిః ఇవ సర్వారంభాః దోషేణ ఆవృతాః ).*** కర్మ విషయంలో ఈ శ్లోకము ఈశ్వర శాసనము లాంటిది. దీనిని చక్కగా అర్థం చేసుకోవాలి.



కర్మ సహజ మైనది అని శ్రీ భగవానువాచ. సహజం అంటే కలిసి పుట్టింది అని భావము. జన్మతో కలిసి పుట్టిన కర్మ సహజ కర్మ; లేదా, స్వభావజం కర్మ. ***సహజం సహ జన్మ నైవ ఉత్పన్నం సహజమ్ -*** సహజమైన తన జన్మతో కలిసి పుట్టిన కర్మ కనుక, స్వభావ జనితమైన కర్మ స్వధర్మంగా మారింది. అలాంటి కర్మను త్యజించ కూడదు ***( న త్యజేత్ ).***

పైగా, కర్మ లన్నీ దోషయుతాలే. నివురు నిప్పును అంటుకొని ఉన్నట్లు, దోషము కర్మను అంటి పెట్టుకొని ఉంటుంది. కర్మ ఎందుకు దోషయుతము అంటే, అది త్రిగుణ యుతము కనుక ***( త్రిగుణత్వాత్ ).*** కర్మ ఎలాగూ దోషయుతం కనుక, పరధర్మాన్ని ఆశ్రయించి భ్రష్టుడు కావడం కన్నా, స్వధర్మము గొప్పది కాక పోయినా, స్వధర్మానుష్ఠానము మనిషికి గొప్ప మేలు చేస్తుంది.

కర్మే దోషయుత మైనపుడు కర్మల మధ్య అంతరాన్ని చూడ వలసిన అవసరం లేదు. సహజ కర్మ కన్నా, పరధర్మానికి సంబంధించిన కర్మను విశిష్టంగా వీక్షించ నవసరం లేదు అనేది పరమేశ్వరుని అభిప్రాయము. కర్మ బంధం నుండి విడి పడటమే ముఖ్యం కాని, కర్మల మధ్య విశిష్టతను అన్వేషించడం కాదు.

ఏ కర్మ చేస్తున్నాము అనేది ప్రధానం కాదు. ఎలా చేస్తున్నాము అనేదే ముఖ్యము. స్వధర్మమునకు సంబంధించిన కర్మే ముక్తికి కారణ మయ్యే టప్పుడు, పరధర్మానికి సంబంధించి, ఆచరణ యోగ్యం కాని కర్మను ఆచరించ వలసిన అవసర మేముంది? ఇలాంటి అవగాహనా రాహిత్యం వల్ల అగచాట్లు, అనర్థాలు సంభ విస్తాయి.

స్వభావ కర్మ ఏ రూపంలో ఉందో పరిమితుల మైన మన కేమి తెలుసు? ప్రారబ్ధాన్ని మనం అంచనా వేయ గలమా? అంచనా వేసి మాత్రం సాధించే దేముంటుంది? దోషయుతం కనుక, ఏ కర్మ చేసినా ముక్తి రాదు. కర్మ ఈశ్వర భావంతో కలిసి నపుడే అది కర్మయోగమై అంతఃకరణ శుద్ధికి సహకరిస్తుంది. జ్ఞానార్హతను ప్రసాదిస్తుంది.

భావాన్ని బట్టే బ్రతుకు భవ్య మౌతుంది కాని, కర్మను బట్టి కాదు. పరమేశ్వరునితో పోరాడిన పార్థుడు పాశుపతాస్త్రాన్ని, పరమానుగ్రహాన్ని పొందాడే గాని, పాపాన్ని పొంద లేదు.

శ్రీకృష్ణ పరమాత్మకు ఎదురుగా శత్రు పక్షంలో నిలబడి పోరాడినా భీష్ముడు సద్గతిని పొందాడే గాని దుర్గతిని పొంద లేదు.

కర్మలో స్వార్థం ఉంటుంది. కర్మయోగంలో త్యాగం ఉంటుంది. త్యాగం మనస్సును శుద్ధి చేస్తుంది. అంతఃకరణమును జ్ఞానానికి సిద్ధం చేస్తుంది. బ్రతుకును భవ్యంగా మార్చుతుంది. జీవుణ్ణి ధన్యుణ్ణి చేస్తుంది. భావశుద్ధి లేకుండా కర్మశుద్ధి రాదు. భావాన్ని శుద్ధి చేసేది, బ్రతుకును బాగు పరచేది, బుద్ధిని జ్ఞానానికి సిద్ధం చేసేది కర్మయోగమే.

*నిష్కామ కర్మయోగమే నైష్కర్మ్యానికి దారి తీస్తుంది. చదవండి.*

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసే నాధిగచ్ఛతి ॥ 49

***అసక్తబుద్ధిః-సర్వత్ర-జితాత్మా-విగతస్పృహః***
***నైష్కర్మ్యసిద్ధిం-పరమాం-సంన్యాసేన-అధిగచ్ఛతి***

| | | |
|---|---|---|
| సర్వత్ర | = | అంతట |

| | | |
|---|---|---|
| అసక్తబుద్ధిః | = | ఆసక్తి లేనివాడై |
| జితాత్మా | = | మనస్సును జయించిన వాడై |
| విగతస్పృహః | = | కోరికలు లేని వాడై |
| సంన్యాసేన | = | సన్యాసము చేత |
| పరమాం | = | ఉత్తమమైన |
| నైష్కర్మ్యసిద్ధిం | = | నిష్కామకర్మ సిద్ధిని |
| అధిగచ్ఛతి | = | పొందుచున్నాడు |

**అర్జునా! అంతట విషయాసక్తి లేని వాడు, మనో నిగ్రహం కల వాడు, ఆశలు లేని వాడు సన్యాసం చేత నైష్కర్మ్య సిద్ధిని పొందుతున్నాడు.**

**వ్యాఖ్య**

కర్మయోగం వల్ల సిద్ధి లభిస్తుందని నలభై ఆరవ శ్లోకంలో చెప్పుకున్నాం. ధర్మ రూపంలో ఉన్న దైవాన్ని ధర్మాచరణం ద్వారా అర్చించడం వల్ల మానవులు సిద్ధిని పొందుతున్నారు అని తెలుసుకున్నాం ***(స్వకర్మణా తం అభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః)***. ఇక్కడ సిద్ధి అంటే మోక్షము కాదు. మోక్షమును పొందడానికి ఏకైక సాధన మైన జ్ఞానమునకు యోగ్యతను సంపాదించడమే సిద్ధి. అదే జ్ఞాన నిష్ఠా యోగ్యతా లక్షణము. దీనికి ఫలంగా నైష్కర్మ్య సిద్ధి ప్రాప్తిస్తుంది అనేది చెప్ప వలసి ఉంది. నిష్కామ కర్మయోగ ఫలమే నైష్కర్మ్య సిద్ధి.

నైష్కర్మ్య సిద్ధి అంటే ఆత్మ స్వరూపము అనుభూతిగా నిలిచి పోవడమే. అదే సర్వ కర్మ సన్యాసము. కర్మయోగములో సన్యసించడము అనే త్యాగ లక్షణము ఉంది. సన్యాసము త్యాగమునే ప్రధాన లక్షణంగా కలిగి ఉంది. ఈ త్యాగ లక్షణము కర్మయోగంలో కూడా ఉంది.

కర్మఫలము నందు ఆసక్తిని విడిచి పెట్టడము త్యాగమే కదా! కర్మఫల త్యాగము అంటే వాస్తవానికి రాగద్వేషాలను త్యాగం చేయడమే. కనుక, ఈ త్యాగ లక్షణము ద్వారా కర్మయోగంలో ప్రసాద చిత్తమును సాధించిన కర్మయోగి, లేదా భక్తుడు పరిణామ క్రమంలో సన్యాసి అవుతాడు. సన్యాసము అనే జీవన విధానాన్ని స్వీకరించక పోయినా, బుద్ధిలో సన్యాసి గానే ఉంటాడు. ఈ విషయాన్నే ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు. వాస్తవానికి ఇక్కడి నుండి జ్ఞానయోగ విచారం ఆరంభ మవుతుంది. జ్ఞానయోగము నందు పరిపక్వమైన వాడు నైష్కర్మ్య సిద్ధిని పొందుతున్నాడు.

**అసక్త బుద్ధి**

అతడు అంతట అసక్త బుద్ధిని కలిగి ఉన్నాడు ***(అసక్త బుద్ధిః సంగరహితా బుద్ధిః)***. సంగము లేక పోవడమే అసక్తము. అట్టి బుద్ధిని కల వాడు అసక్త బుద్ధి. సంగము లేని వాడు. ఎవరితో సంగము లేని వాడు? భార్యాపిల్లల యందు ఆసక్తి లేని వాడు ***(అసక్త బుద్ధిః పుత్ర దారాదిషు)***. 'వీళ్ళు నాకు సంబంధించిన వాళ్ళు. నేను వీళ్ళకి సంబంధించిన వాడను' అనే సంగము లేని వాడు.

గృహము కాని, గృహం లోని దారా పుత్రాదులు గాని సుఖ హేతువులు కారు. సంసారాలు శిక్షా నిలయాలు. అవగాహన ఉన్న వారికి శిక్షణా నిలయాలు. అంతేగాని, రక్షణా నిలయాలు కావు. సంసారాలలో కుటుంబీకుల మధ్య ఉన్న సంబంధాలకు, కారాగృహాలలో ఖైదీల మధ్య ఉన్న సంబంధాలకు పెద్ద తేడా లేదు.

శిక్షలు పడ్డ వాళ్ళే ఖైదీలుగా ఉంటారు. కారాగృహాలలో ఉంటారు. ఎవరి శిక్షా కాలము పూర్తి అయితే, వారు విడుదలై వారి దారిన వారు పోతారు. అందరూ కారాగృహం లోకి ఒకేసారి ప్రవేశించ లేదు. అందుకని ఒకేసారి విడుదల కారు.

ప్రారబ్దాలు ఉన్న వాళ్ళే సంసారులుగా ఉంటారు. సంసారాలలో ఉంటారు. ఎవరి ప్రారబ్దం తీరిపోతే,





వారి దారిన వారు విడుదలై పోతూ ఉంటారు. సంసారాలలో అందరూ ఒకేసారి ప్రవేశించ లేదు. అందుకే ఒకేసారి విడుదల సాధ్యం కాదు.

సంసారంలో నాన్న ప్రవేశించి నపుడు అమ్మ లేదు. రెండు పదులు నాన్న సంసారంలో ఉండి, ఆ తరువాత వివాహం చేసుకున్నాడు. అప్పుడు అమ్మ వచ్చింది. ఆ తరువాత ఒక సంవత్సరము అన్న, మరొక సంవత్సరము అక్క, మరి కొంత కాలానికి నేను, ఇలా అందరూ, ఖైదీలు కారాగృహంలో ప్రవేశించినట్లు , కుటుంబంలో ప్రవేశించాము.

అందరూ ఒకే కుటుంబంలో ఉంటూ ఉన్నా, అందరూ ఒకే పనిని చేసి ఇక్కడకు చేర లేదు. ఎవరి కర్మలు వారివి. ఎవరి ప్రారబ్దాలు వారివి. ఇది అర్థమైతే, సంసారంలో అందరూ కలిసి ఉంటారు. కాని, మనస్సులు కలుపుకొని కలిసిపోరు. కల్లోలం చెందరు. అలాంటి వారే అసక్తులు. సంగబుద్ధి లేని వారు. విచార జనిత విచక్షణా చిత్తము కల వారు.

***కాతే కాంతా కస్తే పుత్రః సంసారోఽ యమతీవ విచిత్రః*** - నీ భార్య ఎవరు? నీ కుమారు డెవరు? ఇది చాలా విచిత్రమైన సంసారము అన్నారు భజగోవిందం శ్లోకాలలో శ్రీ శంకరాచార్య స్వామి. ఇదే విచారము. విచారం చేయనంత వరకు ఉన్న దంతా సంసారమే. విచారం మొదలైందా, ఆ తరువాత ఏదైనా ఉంటుంది గాని, సంసారము మాత్రము ఉండదు ***(విచార్య మాణే తత్త్వదృష్ట్యా పుత్రాదయో న సన్తి)***. ఆ మాత్రానికి నా భార్య! నా బిడ్డలు! నా సంసారము! ఒకటే కలవరింత. మేలుకుంటే, కలలు ఉండవు; కలవరింతలూ ఉండవు.

*పల్లవి :* **మేలుకోరా జీవ! మేలుకో జీవ!**
**మేలుకో సంజీవ! మేలుకో!**

*పల్లవి :* **మాయదారి యముడు మార్గాన యున్నాడు**
**మగత వీడి నీవు మేలుకో!** ॥ మేలుకోరా ॥

*చరణము :* **ఆలు బిడ్డలంచు అల్లాడుతున్నావు**
**కలసి ఎవరొచ్చారు మేలుకో!**
**కర్మము కలిసొచ్చి జీవి పోయేనాడు**
**తనువు కూడా రాదు మేలుకో!** ॥ మేలుకోరా ॥

అని మేలు తెలుపుతూ, మేలు కొలిపింది చైతన్య గీతిక.

ఈ విధమైన సంగము లేని వాడు అసక్త బుద్ధి. అతడు జితాత్ముడు. 'జిత' అంటే జయించిన వాడు. 'ఆత్మా' అంటే ఇక్కడ మనస్సు. జితాత్మా అంటే మనస్సును జయించిన వాడు ***(జితః వశీకృతః ఆత్మా అన్తః కరణం యస్య సః జితాత్మా)***. సంగత్వము లేని వాడు జితాత్ముడు. అంటే, తాను - తన వారు అనేది లేని వాడు. కోరికల నుండి విడి పడిన వాడు. కనుక అతడు విగత స్పృహుడు. వాంఛా రహితుడు.

కర్మల యందు కోరికలు లేని వాడు నిష్కర్మి. అంటే నిష్క్రియుడు. అతడు నిష్కర్ముడు కనుక, నైష్కర్మ్యమును పొందుతాడు. నిష్కర్ముని ధర్మమే కదా నైష్కర్మ్యము? ***(సః నిష్కర్మా, తస్య భావః నైష్కర్మ్యమ్)*** నైష్కర్మ్యము యొక్క సిద్ధియే నైష్కర్మ్య సిద్ధి. సర్వ కర్మ సన్యాసం వల్ల నైష్కర్మ్యసిద్ధి ప్రాప్తిస్తుంది.

*మరి, నలభై ఆరవ శ్లోకంలో చర్చించు కున్నట్లు ధర్మాచరణం వల్ల దైవారాధన చేసే కర్మయోగికి ఈ సర్వకర్మ సన్యాసము, లేదా నైష్కర్మ్య సిద్ధి ఎలా ప్రాప్తిస్తుంది? చెబుతున్నాడు.*

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।**
**సమాసే నైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥** 50

*సిద్ధిం-ప్రాప్తః-యథా-బ్రహ్మ-తథా-ఆప్నోతి-నిబోధ-మే*
*సమాసేన-ఏవ-కౌంతేయ-నిష్ఠా-జ్ఞానస్య-యా-పరా*

| | | |
|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! |
| సిద్ధిం | = | సిద్ధిని |
| ప్రాప్తః | = | పొందిన వాడు |
| యథా | = | ఎటుల |
| బ్రహ్మ | = | బ్రహ్మమును |
| ఆప్నోతి | = | పొందుచున్నాడో |
| తథా | = | అటులనే |
| జ్ఞానస్య | = | జ్ఞానము యొక్క |
| పరా | = | ఉత్తమమైన |
| నిష్ఠా | = | నిష్ఠ |
| యా | = | ఏదియో |
| సమాసేన ఏవ | = | సంక్షిప్తముగా |
| మే | = | నా వలన |
| నిబోధ | = | తెలిసికొనుము |

**అర్జునా! అంతఃకరణ శుద్ధిని సిద్ధించుకున్న వాడు ఉత్తమ మైన బ్రహ్మమును పొందుతున్నాడు. దానిని సంక్షిప్తంగా చెబుతా. తెలుసుకో!**

**వ్యాఖ్య**

కర్మయోగము ద్వారా చిత్తశుద్దిని పొందిన వాడు బ్రహ్మమును ఎలా పొందుతాడో చెబుతాను అంటున్నాడు. అలాగే శ్రేష్ఠ మైన జ్ఞాన నిష్ఠను కూడా సంక్షేపంగా చెబుతాను అంటున్నాడు.

ప్రవృత్తి నివృత్తి లక్షణ మైన వేద ధర్మాన్ని, అభ్యుదయ నిశ్శ్రేయస హేతువు లైన కర్మయోగ, జ్ఞానయోగా లను సంక్షేపంగా చెబుతాను అని అంటున్నా డంటే, గీతాజ్ఞానాన్ని సమాప్తం చేస్తున్నాడని అర్థము. అలాగే గీతా తాత్పర్యమును, అంటే సర్వవేద సారమైన కర్మయోగ, జ్ఞానయోగాలను రెండిటిని సమన్వయించి ఏక వాక్యతను అందిస్తున్నాడు.

వేదార్థము ఏం చెబుతుంది? వేదార్థము ఏమి చెబుతుందో గీతార్థం అదే చెబుతుంది. గీతార్థం ఏదో కాదు, సమస్త మైన వేదార్థము గీత యందే సమాప్త మైంది.

బాగుంది. ఇంతకీ వేదార్థ మన్నా, గీతార్థ మన్నా ఒక్కటే అంటున్నారు కనుక, రెండూ ప్రమాణాలే నని స్వీకరించడం చేత, ప్రమాణమైన శాస్త్ర తాత్పర్యం ఏమిటి? అనేది సూటి ప్రశ్న.

ఈ సందర్భములో నేను కూడా ఒక సూటి ప్రశ్నను సంధిస్తున్నాను. ప్రమాణమైన శాస్త్రము ఏం చెబు తుంది? వేదాంత సందేశ మేమిటి?

ఇది చెయ్యండి అని చెబుతుందా? లేక, ఇది తెలుసుకోండి అని చెబుతుందా? ఇది అసలైన ప్రశ్న.

**జ్ఞాతే హి అనర్థ మూలే తదుచ్ఛేదాయ కర్మ కుర్యాత్**

అనర్థము యొక్క మూల మెక్కడో తెలిసిం దంటే, ఆ అనర్థాన్ని పోగొట్టుకోవ డానికి కర్మ చేయాలి. వీరు మొదటి వారు.

***న మోక్షార్థాని కర్మాణి ఇతి సిద్ధమ్ ! జ్ఞానాత్ మోక్షా ఇతి!***
***శాస్త్ర విహిత విషయః కర్మమార్గః బంధహేతుః !***



కర్మల వల్ల మోక్షము రాదు. జ్ఞానం వల్లనే మోక్షం వస్తుంది.

శాస్త్ర విహితమైన దైనా, కర్మ మార్గము బంధ హేతువే. వీరు రెండవ వారు.

మోక్షము అనేది పొంద వలసిందే కదా! తెలుసుకున్నంత మాత్రాన ఏం జరుగుతుంది? ఏదైనా చేస్తేనే వస్తుంది. ఏదీ చెయ్యక పోతే ఏదీ రాదు అనేది కర్మ మార్గానుయాయుల అభిప్రాయము.

ఏది చేసినా కాలం లోనే చేస్తాము. దేని ఫలం వచ్చినా కాలం లోనే వస్తుంది. కాలంలో ఏ దొచ్చినా, అది కాలం లోనే పోతుంది. కనుక నిత్యమోక్షము కర్మల వల్ల వచ్చేది కాదు. అది తెలుసుకోవలసిందే గాని, చేసి పొంద దగింది కాదని జ్ఞాన మార్గానుయాయుల మతము.

గీతోపనిషత్తులు ఈ విషయంలో సుస్పష్ట మైన అవగాహనను అందిస్తాయి. మోక్షము అనేది ఉన్నదే కనుక, ఉన్న దానిని ప్రయత్నించి పొందే దేముంటుంది? ఉన్న దానిని తెలుసుకోవాలి. తెలుసుకోవాలి అని ప్రయత్నించినా తెలియడము లేదు అంటే ప్రతిబంధకాలు ఉన్నాయి. ప్రతిబంధకాలను తొలగించుకొని విచారము చేస్తే ఉన్నది ఉన్నట్లు తెలుస్తుంది ***( వస్తు సిద్ధి విచారేణ ).*** విచారము చేయడానికి ప్రతిబంధకా లున్నాయి కదా! ఔను. ఏమిటి ఆ ప్రతిబంధకము? చిత్తశుద్ధి లేక పోవడమే. మరి, చిత్తశుద్ధి ఎలా వస్తుంది? కర్మయోగము ద్వారా వస్తుంది ***( చిత్తస్య శుద్ధయే కర్మ ).***

కర్మయోగము ద్వారా అంత:కరణ శుద్దిని పొంది, జ్ఞానమార్గము ద్వారా విచారము కొనసాగించి, బ్రహ్మాత్మ జ్ఞానమును పొందాలి. ఇదే వేదార్థము. ఇదే సంక్షేపంగా గీతా తాత్పర్యము.

*ఇక, పరమాత్మ ప్రాప్తి విధానాన్ని వరుసగా మూడు శ్లోకాలలో చెబుతున్నాడు. దీనిని గీతా సారమని, సంక్షిప్త గీత అని అంటారు. చదవండి.*

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥** 51

*బుద్ధ్యా-విశుద్ధయా-యుక్తః-ధృత్యా-ఆత్మానం-నియమ్య-చ*
*శబ్దాదీన్-విషయాన్-త్యక్త్వా-రాగద్వేషౌ-వ్యుదస్య-చ*

| | | |
|---|---|---|
| విశుద్ధయా | = | విశుద్ధమైన |
| బుద్ధ్యా | = | బుద్ధితో |
| యుక్తః | = | కూడిన వాడు |
| ధృత్యా | = | ధైర్యముతో |
| ఆత్మానం | = | తనను |
| నియమ్య చ | = | నియమించి |
| శబ్దాదీన్ | = | శబ్దాదులైన |
| విషయాన్ | = | విషయములను |
| త్యక్త్వా | = | విడచి |
| రాగద్వేషౌ | = | రాగద్వేషములను |
| వ్యుదస్య చ | = | విడచి |

**అర్జునా! విశుద్ధమైన బుద్ధిని కలిగి, ధైర్యముతో మనస్సును నిగ్రహించి, శబ్దాది విషయాలను విడిచి, రాగద్వేషాలను వదలి,**

**వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయమానసః ।**
**ధ్యానయోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥** 52

*వివిక్తసేవీ-లఘ్వాశీ-యత వాక్కాయమానసః*
*ధ్యానయోగపరః-నిత్యం-వైరాగ్యం-సముపాశ్రితః*

| | | | |
|---|---|---|---|
| వివిక్తసేవీ | = ఏకాంతవాసియు | నిత్యం | = ఎల్లప్పుడు |
| లఘ్వాశీ | = మితాహారియు | ధ్యానయోగపరః | = ధ్యానయోగ పరాయణుడై యుండు వాడు |
| యత వాక్కాయమానసః | = స్వాధీన మైన మనోవాక్కాయములు కలవాడు | వైరాగ్యం | = వైరాగ్యమును |
| | | సముపాశ్రితః | = చక్కగా ఆశ్రయించిన వాడు |

**ఏకాంత ప్రదేశములో వసిస్తూ, మితాహారం చేస్తూ, వాక్కును, మనస్సును, దేహమును నియమించి, సదా ధ్యానయోగ పరుడై, వైరాగ్యమును పొంది,**

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53

*అహంకారం-బలం-దర్పం-కామం-క్రోధం-పరిగ్రహం*
*విముచ్య-నిర్మమః-శాంతః-బ్రహ్మభూయాయ-కల్పతే*

| | | | |
|---|---|---|---|
| అహంకారం | = అహంకారమును | విముచ్య | = విడచి |
| బలం | = బలమును | నిర్మమః | = మమకార రహితుడు |
| దర్పం | = దర్పమును | శాంతః | = శాంతుడు |
| కామం | = కామమును | బ్రహ్మభూయాయ | = బ్రహ్మత్వమును పొందుటకు |
| క్రోధం | = క్రోధమును | కల్పతే | = కల్పింపబడు చున్నాడు |
| పరిగ్రహం | = సంగ్రహమును | | |

**అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, పరిగ్రహమును విడిచి పెట్టి, మమకారము లేకుండా, శాంతుడైన వాడు బ్రహ్మత్వాన్ని పొందదానికి సమర్థుడు.**

**వ్యాఖ్య**

ప్రతిజ్ఞా వాక్యాన్ని అర్థవంతం చేస్తూ గీత యొక్క సారాన్ని వరుసగా మూడు శ్లోకాలలో సంక్షేపంగా వినిపిస్తున్నాడు. ఈ మూడు శ్లోకాలను ***సంక్షిప్త గీత*** అంటారు. దీనినే 'గీతా సారము' అని కూడా అంటారు. ఈ మూడు శ్లోకాలను విడగొట్టకుండా మూడిటిని ఏకంగా అర్థం చేసుకోవాలి. సాధ్య సాధనాలను సమన్వయం చేస్తూ గీతార్థా న్నంతా ఈ మూడు శ్లోకాలు ప్రతిఫలింప చేస్తాయి. ఈ మూడు శ్లోకాల లోని విషయాల నన్నిటినీ పూర్వాధ్యాయాలలో మనం విస్తరించి చెప్పుకున్నాం. అయినా, సింహావలోకనంగా, మనన పూర్వకంగా, మళ్ళీ మనస్సుకు తెచ్చుకుందాం.

సాధకుడు విశుద్ధమైన, అంటే మాయా రహితమైన, నిర్మలమైన బుద్ధితో కూడి ఉండాలి ***( బుద్ధ్యా విశుద్ధయా, మాయా రహితాయా యుక్తః ).*** శుద్ధయా అనకుండా **విశుద్ధయా** అని చెప్పడంలో, ఏ మాత్రం మలినం లేని బుద్ధి యందే జ్ఞానం ప్రతిఫలిస్తుంది అనే భావం ధ్వనిస్తూ ఉంది.

కేవలం బుద్ధిని మాత్రమే కాకుండా ధైర్యముతో కూడి ఇంద్రియ మనస్సులను కూడా నియమించాలి.





***ధృత్యా ఆత్మానం నియమ్య -*** ధృతితో ఆత్మను నియమించాలి అంటున్నాడు. ఇక్కడ ఆత్మ అంటే, దేహేంద్రియాలు అయిన కార్యకరణాలు అని అర్థము ***( ఆత్మానం కార్యకరణ సంఘాతం ).***

శబ్దాది విషయ సంగము లేకుండా ఉండాలి. అదే శబ్దాది విషయ త్యాగము. శ్రోత్రాది ఇంద్రియాలను శబ్దాది విషయాల నుండి వెనుకకు మరల్చి అంతర్ముఖం చేయాలి ***( శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా ).*** ఇదే ఇంద్రియ విషయ త్యాగము.

విషయాలను త్యజించినట్లే రాగద్వేషాలను కూడా త్యజించాలి ***( రాగద్వేషౌ వ్యుదస్య చ ).*** రాగద్వేషాలను దూరం చేసుకోవడం అనుకున్నంత సులభం కాదు. వాస్తవానికి రాగద్వేషాలు ఉంటే నష్టం లేదు. కాని వాటికి వశ పడకుండా ఉండమని బోధించాడు గీతాచార్యుడు ***( తయోర్న వశమాగచ్ఛేత్).*** శత్రువులకు లొంగిన వాని పరిస్థితి ఎలా ఉంటుందో ప్రత్యేకంగా చెప్పాలా? సాధకునికి రాగద్వేషాలను మించిన శత్రువులు లేరని కదా గీత అభిప్రాయము ***( తౌ హ్యస్య పరిపన్థినౌ ) !*** రాగద్వేషాల వల్లనే కర్మలు బంధహేతువులు అవుతున్నాయి. రాగద్వేషాలను పీకి దూరంగా పడేస్తే, కర్మలు కోరలు తీసిన పాము ల్లాగా పడి ఉంటాయి.

ఆ తరువాత సాధకుడు ఏకాంత వాసియై ఉండాలి. అదే వివిక్త సేవిత్వం. ఏకాంత ప్రదేశమున నివసిస్తూ ఉండే అలవాటును చేసుకోవాలి ***( వివిక్తాన్ దేశాన్ శీలమ్ ఇతి వివిక్త సేవీ ).*** జన సంసర్గము వల్ల చిత్త విక్షేపము కలిగే అవకాశం ఉంటుంది. కాలాన్ని సద్వినియోగం చేసుకోవడానికి, మనస్సును నియమించ డానికి ఏకాంతము అనువైన వాస స్థానము. కేవలం ఒంటరితనాన్ని ఏకాంత మని భావించడానికి వీలు లేదు. ఎక్కడ ఉంటే విషయా లనే అయస్కాంతాలు ఆకర్షించవో అదే నిజమైన ఏకాంత ప్రదేశము. ప్రారంభంలో ఒంటరితనము కూడా ఇందుకు కొంత ఉపయుక్తం గానే ఉంటుంది.

విహారాన్ని గురించి చెప్పుకున్నాం. ఆహారం విషయంలో కూడా సాధకులు నియమాలను అవశ్యం పాటించాలి. అదే ***లఘ్వాశీ*** అంటే ***( లఘ్వాశీ లఘ్వాశన శీలః ).*** యుక్తాహార విహారాదులు, నిద్ర మొదలైన దోషాలను మనస్సు నుండి దూరం చేసి, చిత్త ప్రసాదాన్ని కలిగిస్తాయి. కనుక, సాధకులు ఆహార విహారాదుల యందు నియమవంతులై ఉండాలి.

ఆ తరువాత, మనోవాక్కాయా లనే త్రికరణాలను అదుపులో పెట్టుకోవాలి. కాయక తపస్సు ద్వారా శరీరాన్ని, వాచిక తపస్సు ద్వారా వాక్కును, మానస తపస్సు ద్వారా మనస్సును నిగ్రహించాలి. కాయంతో పూజ, వాక్కుతో జపము, మనస్సుతో ధ్యానములను ఆచరించడం వల్ల బుద్ధి శుద్ధి పడుతుంది. అదే ముక్తి సాధక మవుతుంది.

నిత్యము ధ్యానమును అనుష్ఠించాలి. ధ్యానయోగ పరుడై ఉండాలి. ధ్యానయోగము అంటే, గీతా భక్తుడు ధ్యాన యోగమును అనుష్ఠించే వాడై ఉండాలి. అంతేకాని, యోగధ్యానాన్ని ఆచరించే వాడుగా ఉండ కూడదు.

***యోగః చిత్తవృత్తి నిరోధః -*** మనస్సు లోని చిత్తవృత్తులను శూన్యం చేయడం యోగము. అదే యోగ ధ్యానము. కాని, భగవద్గీత బోధించే ధ్యానము వేరే. అది వృత్తి శూన్యమైన యోగ ధ్యానము కాదు. వృత్తిని పరమేశ్వర స్వరూపంగా మార్చే ధ్యానయోగము. ***సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారః -*** సగుణ రూపుడైన పరమేశ్వరునికి సంబంధించిన విషయ సంకల్పాన్ని తదేకంగా ధ్యానించడం. అనన్య యోగంతో సేవించడం. ***విజాతీయ రహిత సజాతీయ వృత్తి ప్రవాహ సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారః -*** పరమేశ్వరుని కన్నా అన్యమైన విషయాలను చింతించకుండా, అంటే విరళ చింతనము కాకుండా సరళ చింతనము సాగే లాగా సాధకులు నిరంతరం జాగ్రత్త పడాలి.

రాగయుత మైన బుద్ధి ధ్యానం చేయ లేదు. విరాగ మైనపుడే బుద్ధి పరమేశ్వరుని యందు లగ్న మౌతుంది. కనుక, వైరాగ్యాన్ని నిరంతరము మనస్సులో కలిగి ఉండాలి. ఈ ప్రపంచం లోని వ్యక్తులు, వస్తువులు, విషయాలు ఎంత అనిత్యమో ప్రతిక్షణం మనస్సులో అవధరించి ఉండాలి. దృష్టా దృష్ట విషయాల యందు ఆసక్తి లేక తృష్ణ లేకుండా ఉండటమే వైరాగ్యము ***(దృష్టా దృష్టేషు విషయేషు వైతృష్ణ్యం సముపాశ్రితః).*** అట్టి వైరాగ్యాన్ని నిరంతరము ఆశ్రయించాలి.

వైరాగ్యాన్ని ఆశ్రయించాలి. ఆదరించాలి. తద్వారా వినాశ హేతువైన అహంకారాన్ని దూరం చేసుకోవాలి. ఈ దేహము నేను. నేను గొప్ప వంశంలో పుట్టాను. ఉన్నత కులస్థుణ్ణి. జ్ఞానం కల వాణ్ణి. గాయకుణ్ణి. కవిని. నాతో సమానులు లేరు. నా కంఠం మధురంగా ఉంటుంది. నా మాటలు అందరిని మంత్రముగ్ధుల్ని చేస్తాయి అని విర్రవీగుతూ, దేహేంద్రియాలు తానని భ్రమించి అనర్థ ప్రలాపాలు చేయడం అహంకారము. ఆత్మ కాని విషయాల యందు ఆత్మ అనే భావమే అహంకారము ***(అనాత్మని అహ మితి మతిః అహంకారః).***

అహంకారానికి ఊత మిచ్చే వాసనా రూపమే బలము. గట్టి దైన అభిమానము దర్పము. దర్పములో సర్వత్ర దౌర్జన్యమే గాని సౌజన్య ముండదు.

***దర్పః - హృష్టో దృప్యతి, దృప్తో ధర్మ మతి క్రామతి....*** తృప్తి చెందిన అహంకారి దర్పముతో విర్రవీగుతాడు. దర్పము చేరిందంటే, శాస్త్రాన్ని ధిక్కరిస్తాడు. సంతృప్తిలో, సంతోషములో మానవులు ధర్మాన్ని అతిక్రమించ డానికి ఈ దర్పమే కారణము. కనుక సాధకులు ప్రయత్నశీలురై వీటిని త్యజించాలి.

కామము అనేది కోరిక. అది తీరనపుడు కలిగేది క్రోధము. ధనాన్ని ప్రోగు చేసుకునే మనస్తత్త్వము పరిగ్రహము. వీటన్నిటిని త్యజించాలి. ఇవన్నీ అనాత్మ రూపాలు కనుక అనర్థ దాయకాలు. ఇలాంటి అనాత్మ విషయాల నుండి విముక్తులై, శాంతరూపులై, బ్రహ్మభూతులు కావడానికి సమర్థులు కావాలి అంటూ గీతా హృదయాన్ని సంక్షిప్తంగా ఈ మూడు శ్లోకాలలో విస్పష్టం చేశాడు వాసుదేవ భగవానుడు.

*ఈ సాధనల పర్యవసానంగా ఏర్పడే భక్తిని సమన్వయం చేస్తున్నాడు.*

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥** **54**

**బ్రహ్మభూతః-ప్రసన్నాత్మా-న-శోచతి-న-కాంక్షతి**
**సమః-సర్వేషు-భూతేషు-మద్భక్తిం-లభతే-పరాం**

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మభూతః | = బ్రహ్మభావమును పొందిన వాడు | భూతేషు | = ప్రాణుల యందు |
| ప్రసన్నాత్మా | = ప్రసన్నచిత్తుడు | సమః | = సమబుద్ధి కలిగి |
| న శోచతి | = దుఃఖించడు | పరాం | = ఉత్తమమైన |
| న కాంక్షతి | = ఆశించడు | మద్భక్తిం | = నా భక్తిని |
| సర్వేషు | = సమస్త | లభతే | = పొందుచున్నాడు |

**అర్జునా! బ్రహ్మమును పొందిన ప్రసన్న చిత్తుడు దేనికీ దుఃఖించడు. దేనినీ ఆశించడు. సర్వుల యందు సమబుద్ధి కలిగి, ఉత్తమ మైన భగవద్భక్తిని పొందుతాడు.**

**వ్యాఖ్య**

వేదార్థమును, గీతార్థమును సంపూర్ణం చేసే ఉద్దేశంతో భగవంతుడు మూడు శ్లోకాలలో ముక్తసరిగా





శాస్త్రాన్ని సారభూతంగా, సంక్షేపంగా అందించాడు. సాధకులు అనునిత్యము అభ్యసించ వలసినవి, అలాగే త్యజించ వలసినవి రెండూ చెప్పడం జరిగింది. అనుష్ఠానమునే ప్రధానంగా చేసుకొని బోధించడం చేత, సాధ్య సాధనాలను అనుసంధానం చేస్తూ అందించడం జరిగింది.

అర్జునా! బ్రహ్మమును పొందిన వాడు ***(బ్రహ్మభూతః బ్రహ్మ ప్రాప్తః)*** ప్రసన్నమైన బుద్ధి కల వాడు అవుతున్నాడు ***(ప్రసన్నాత్మా లబ్ధ అధ్యాత్మ ప్రసాద స్వభావః).*** సమస్తము లైన అనర్థములు తొలగుట చేత బుద్ధిలో నిర్మలమైన పరమానందము ఆవిర్భవించిన వాడు. ఇది ఆనందమును అనుభవించడం కాదు. పున్నమి నాడు లోక మంతా వెన్నెల పరచు కున్నట్లు, బ్రహ్మభూతుని బుద్ధిలో ఆనందము అలరారుతూ ఉంటుంది. బ్రహ్మభూతు డైన సాధువు ఎవరో కాదు, బ్రహ్మమే. **సాధవో హృదయం మమ -** 'ఆ సాధువు ఎవరో కాదు; నా హృదయమే' అన్నాడు భగవంతుడు. భగవంతు డైన బ్రహ్మభూతునికి కొరత ఉంటుందా? వెలితి ఉంటుందా? ***ఆత్మనా విందతే వీర్యం -*** ఆత్మే తానని తెలుసుకున్న బ్రహ్మవిదుడు, అనంత శక్తిని పొందుతున్నాడు, అనంత ఐశ్వర్యాన్ని పొందుతున్నాడు అన్నది కేనోపనిషత్. అలాంటి వాడు తనకు ఏమి లేదని దుఃఖిస్తాడు? ఏది దూర మైందని బాధ పడతాడు? అందుచేత అతడు శోకము తెలియని వాడు. కోరిక లేని వాడు ***(న శోచతి న కాంక్షతి).***

ఇక్కడ ఒక సూక్ష్మమైన విషయాన్ని గుర్తించాలి. శోకము లేని స్థితి, కోరిక అర్థం గాని పరిస్థితి - ఈ లక్షణాలు రెండూ బ్రహ్మభూతుడైన ప్రసన్నాత్ముని స్వరూపంగా అనువదింప బడుతున్నాయే గాని, ఇవి సాధన పరమైన లక్షణాలు కావు. బ్రహ్మభూతునిలో సిద్ధించి ఉన్నవే, చంద్రుడి నుండి వెన్నెల లాగా వ్యక్త మవుతూ ఉన్నాయి. ఇది జాగ్రత్తగా అర్థం చేసుకోవలసిన విషయము. బ్రహ్మభూతుడు అంటే బ్రహ్మ భావంలో ఉండే వాడు. మోక్ష రూపుడు. ***బ్రహ్మ భావశ్చ మోక్షః -*** బ్రహ్మభావమే మోక్షము అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీశంకరాచార్య స్వామి. ఇదే ఆత్మ భావము. ఆత్మస్థితి. బ్రహ్మాత్మ భావ స్థితి. 'ఈ ఆత్మయే బ్రహ్మము' అనే అఖండ అద్వయానుభూతి.

***ఆనందాబ్ధిః యత్పరః సోఽహమస్మి -*** 'ఏది ఆనంద సాగరమో అది నేనే అయి ఉన్నాను' అని ప్రసన్నాత్ము డైన బ్రహ్మవిదుని దివ్యానుభూతిని ఉపనిషత్తు అభివర్ణించింది. సమస్థితిలో ఓలలాడే బ్రహ్మవిదుడు సమమైన బ్రహ్మమును తప్ప మరొక దానిని ఎలా వీక్షిస్తాడు?

అర్జునా! బ్రహ్మభూతుడు సర్వ భూతముల యందు సముడై ఉన్నాడు ***(సమః సర్వేషు భూతేషు).*** సముడైన వానికి విషమత్వ మెలా అర్థ మవుతుంది? భేదా లెలా గోచరిస్తాయి? బ్రహ్మము నిర్దోషము కనుక సమము *(5 వ అ - 19 వ శ్లో).* సముడైన బ్రహ్మభూతుడు సమ రూపమైన బ్రహ్మమునే దర్శిస్తాడు. ఆ దివ్యానుభూతిలో శోకాలు, కాంక్షలు, వాంఛలు, వరాలు అన్నీ వాటంతటవే రాలి పోతాయి. నిద్రించిన వాని చేతి లోని వస్తువు అప్రయత్నంగా జారి పోయినట్లు, అద్వైతానుభూతిలో ద్వైత మంతా పడపోతకు గురై అదృశ్య మవుతుంది.

*మనసు కట్టింది భావాల పూల మాల*
*వేయ మన్నది నువ్వు నన్ను చేరువేళ*
*నిన్ను గాంచిన మత్తులో మరచి పోతి*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

ఇక్కడ ఏదయితే పరమ జ్ఞానముగా ప్రకాశిస్తూ ఉందో, అదే పరాభక్తి. ఈ రెండిటి మధ్య భేదము చూడ నవసరం లేదు. అందుచేత, అర్జునా! సమస్త భూతముల యందు సముడైన ప్రసన్నాత్ముడు నా భక్తిలో రమిస్తాడు ***(మద్భక్తిం లభతే పరామ్)***.

అర్జునా! నాలుగు విధాలైన భక్తులు నన్ను ఆరాధిస్తున్నారు. వారు అర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు (*7 వ అ - 16 వ శ్లో*). నాల్గవ వాడైన జ్ఞానియే ప్రస్తుత శ్లోకంలో బ్రహ్మభూతు డైన ప్రసన్నాత్ముడు. భక్తుడిగా భజిస్తాడు. జ్ఞానియై బ్రహ్మమును పొందుతాడు. రెండూ ఒక్కటే. ఇది సూక్ష్మమైన విషయం. వాదాలకు, వివాదాలకు చిక్కేది కాదు. హృదయంతో పట్టుకోవాలి.

*అదెలాగో, తరువాత శ్లోకం అర్థం పడుతుంది.*

**భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥** 55

***భక్త్యా-మాం-అభిజానాతి-యావాన్-యః-చ-అస్మి-తత్త్వతః***
***తతః-మాం-తత్త్వతః-జ్ఞాత్వా-విశతే-తదనంతరం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భక్త్యా | = | భక్తి చేత | తతః | = | ఆ తరువాత |
| మాం | = | నన్ను | మాం | = | నన్ను |
| తత్త్వతః | = | యథార్థముగ | తత్త్వతః | = | యథార్థముగ |
| యావాన్ | = | ఎంతటి వాడనో | జ్ఞాత్వా | = | తెలిసికొని |
| యః చ అస్మి | = | ఎట్టి వాడనో | తదనంతరం | = | అటుపిమ్మట |
| అభిజానాతి | = | గ్రహించు చున్నాడు | విశతే | = | ప్రవేశించు చున్నాడు |

**అర్జునా! నే నెవరో, ఎలాంటి వాడనో, నా యథార్థ స్వరూపాన్ని అతడు భక్తి చేత తెలుసు కుంటున్నాడు. అలా యథార్థంగా తెలుసుకున్న తరువాత నా లోనే చేరి పోతున్నాడు.**

**వ్యాఖ్య**

గంగా యమునలు సంగమించినట్లు భక్తి జ్ఞానాలు సంగమించే పవిత్ర సన్నివేశంలో మనం నిలబడి ఉన్నాము. అనంతుడైన వాడు లేని దెక్కడ? ఆ మాట కొస్తే ఉన్న దెక్కడ? అక్కడ ఉన్నాడు అని చెప్పగానే, ఇక్కడ లేడా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. పుట్టుక లేని వాణ్ణి పుట్టే ప్రశ్నలు ఏమి తెలుసుకోగలవు? అతడు ఉదయించడు. కనుక, అస్తమించడు. అతనిలో ఉదయాలు లేవు. అస్తమయాలూ లేవు ***(నోదేతి నాస్త మేతి)***. ఉదయాస్తమయాలే లేని వానిలో ఏది వృద్ధి? ఏది క్షయం? ***(న వృద్ధిం యాతి న క్షయమ్)***. ఉదయాస్తమయాలు లేనిది, వృద్ధిక్షయాలు ఎరుగనిది, భానుని వలె స్వప్రకాశమై భాసించేది ఆత్మస్వరూపం. అదే బ్రహ్మ స్వరూపము. ఆత్మయే బ్రహ్మము అనే బ్రహ్మాత్మ స్వరూపము.

సూర్యునిలో ఉదయాస్తమయాలు లేవు. సూర్య భగవానుని దర్శించే మన కున్నాయి. బ్రహ్మములో ద్వైతమే లేదు. జగత్తును దర్శించే మనలో ద్వైత ముంది. మసక చీకటి తెలుస్తూ ఉంది. అదే సంధ్య. ఉదయ సంధ్యయా? సాయం సంధ్యయా? సంధ్య ఒక్కటే. అర్థ మైతే అది సంగమము. భక్తి జ్ఞానాల అపూర్వ సమ్మేళనము.





***భాను డుదయించుట తూర్పు పుణ్య మేమో***
***పడమట పాపమేమి అస్తమించు నచట***
***అందుకో స్వామి సంధ్యలో వందనములు***
***నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*** అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

అర్జునా! నేను ఎంతటి వాడినో ***(యావాన్ అహం)***, నేను ఎవడనో ***(యః చ)***, భక్తుడైన వాడు నా యథార్థ స్వరూపమును ***(తత్త్వతః మాం)*** భక్తి చేత గుర్తిస్తాడు ***(భక్త్యా అభిజానాతి)***. తరువాత నన్ను యథార్థ రూపంలో తెలుసుకొని ***(తతః మామ్ తత్త్వతః జ్ఞాత్వా)***, అనంతరం నా లోనే ప్రవేశిస్తాడు ***(విశతే తదనంతరం)***.

భక్తి జ్ఞానాలు ఏకం కావడం సంగమ మని చెప్పుకున్నాం. ముందుగా భక్తి విషయాని కొస్తే, మూడు విధాలుగా తెలిసే భక్తి ఏకమైన దివ్య స్థితిలో, యమున గంగతో కలిసినట్లు, భక్తి జ్ఞానంతో ఏక మవుతుంది.

భక్తి ప్రారంభంలో మాధుర్య ప్రధానంగా ఉంటుంది. అభివృద్ధి సాధించే దశలో అది ఐశ్వర్య ప్రధాన భక్తిగా మారుతుంది. ఆ రెండిటి స్వరూపము తత్త్వత: ఒకటే అని అర్థమయ్యే దశలో అది ఏకాంత భక్తి అవుతుంది. అదే ముఖ్య భక్తి. దాని అసలు పేరు పరాభక్తి. పరమ మైన జ్ఞానము, పరమ మైన భక్తి, రెండూ ఒక్కటే అనే అనుభూతి ఇక్కడే ప్రాప్త మవుతుంది.

లోక వ్యవహారాలను సాగిస్తూ కూడా భగవంతుని యొక్క అనంత కళ్యాణ గుణాలను శ్రవణ కీర్తనాదుల ద్వారా మనస్సులో నింపుకొనే ప్రయత్నం చేయడము ప్రథమంగా గౌణభక్తి ; అంటే గుణయుత మైన భక్తి ***(లోకేఽ పి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్)*** అని నారద భక్తి సూత్ర ప్రబోధము.

ప్రహ్లాదుడు బోధించినట్లు, ఈ విధమైన గౌణభక్తిలో, నవవిధ భక్తి మార్గాలలో పరమేశ్వరుని ఆరాధించ డము జరుగుతుంది. మాధుర్య ప్రధానమైన భక్తి ఐశ్వర్య ప్రధానమైన భక్తిగా మారేది ఈ స్థితి లోనే ***(ఈశ్వరస్య భావః ఐశ్వర్యం)***. పరమేశ్వరుని షడ్గుణైశ్వర్యాలను అర్థం చేసుకొని, మాధుర్య ప్రధాన భక్తిలో ప్రభువుగా తెలిసిన పరమేశ్వరుని సర్వైశ్వర్యమయుడుగా, భగవ త్స్వరూపంగా బుద్ధిలో నిలుపుకోవడమే ఐశ్వర్య ప్రధాన భక్తి.

సమగ్ర మైన ఐశ్వర్యము, సమగ్ర మైన ధర్మము, సమగ్ర మైన యశస్సు, సమగ్ర మైన సంపద, సమగ్ర మైన జ్ఞానము, సమగ్ర మైన వైరాగ్యము - ఈ ఆరు లక్షణాలు ఎవరిలో ఉంటాయో అతడే భగవానుడు. ఈశ్వరుడు అని గ్రహించడం, లేదా ఈశ్వర భావాన్ని బుద్ధి లోకి తెచ్చుకోవడం ఐశ్వర్య ప్రధాన భక్తి. ఇది సోపాధిక ఐశ్వర్యం. ఉపాధి ద్వారా తెలిసే ఐశ్వర్యము.

నే నెంతటి వాడినో ***(యావాన్ అహం)*** భక్తుడు తత్త్వత: తెలుసు కుంటాడు అని అంటున్నాడు. అంటే, ఉపాధులతో కలిసి, ఉపాధులలో భాసించే చైతన్యమూర్తిగా నన్ను తెలుసు కుంటాడు అని అర్థం. ఇదే సోపాధిక ఐశ్వర్యం.

ఆ తరువాత, నే నెవడనో ***(యః చ)*** కూడా తత్త్వత: భక్తుడు తెలుసు కుంటాడు అని అంటున్నాడు. అంటే, ఇక్కడ నిరుపాధిక చైతన్య స్వరూపాన్ని అర్థం చేసు కుంటున్నాడు అని భావం. సోపాధిక ఐశ్వర్యంతో శోభించే ఈశ్వరుణ్ణి ***(తం ఈశ్వరం)***, నిరుపాధిక సత్తా స్వరూపంగా దర్శిస్తున్నాడు. ఇదే నిరుపాధిక ఐశ్వర్యం. పుట్టుక లేని, వృద్ధాప్యం తెలియని, మరణము ప్రాప్తించని, భయము అర్థం గాని, నాశ మేమిటో ఊహ కందని అద్వైత చైతన్య స్వరూప మూర్తిని పొందుతున్నాడు అని అర్థం ***(మాం అద్వైత చైతన్య మాత్రైక రసమ్, అజమ్, అజరమ్, అమరమ్, అభయమ్, తత్త్వతః అభిజానాతి)***. సోపాధిక స్వరూపాన్ని యథార్థంగా

గ్రహించాడు ***(తత్త్వతః)***. రెండు చోట్ల ***తత్త్వతః***, 'యథార్థంగా' అనే ఒకే పదాన్ని ఉపయోగించడం గమనార్హం. ఉపాధి భేదమే గాని, స్వరూపత: అంటే తత్త్వత: అభేదమే అని తెలియ చేయడమే అందులోని ముఖ్యోద్దేశము.

పరమేశ్వరుని నిరుపాధిక ఐశ్వర్యంలో రెండవ వస్తువు లేదని ***తత్త్వతః*** బ్రహ్మభూతుడు అర్థం చేసుకుంటాడు. ఇది మాధుర్య ప్రధాన భక్తిని, ఐశ్వర్య ప్రధాన భక్తిని అధిగమించిన దశలో భక్తి పరాభక్తిగా రూపాంతరం చెందడము. ఇక్కడ పరాభక్తి, పరమ జ్ఞానము రెండూ ఒక్కటే. భక్తిలో పరాభక్తిగా భాసించే తత్త్వమే జ్ఞానంలో అఖండ బ్రహ్మాకారంగా శోభిస్తూ ఉంది.

ఈ దశలో, భగవంతుని సత్య జ్ఞానానంద స్వరూపమైన నిరుపాధిక సత్తా స్వరూపమును తత్త్వత: ఎరిగిన కారణంగా ***(తతః మాం ఏవం తత్త్వతః జ్ఞాత్వా)***, అతడు పరమాత్మ యందే ప్రవేశిస్తున్నాడు ***(విశతే తదనంతరం మాం ఏవ)***.

ఇక్కడ, ముందుగా పరమాత్మను తెలుసుకోవడం ***(జ్ఞాత్వా)***. తరువాత, పరమాత్మను పొందడము ***(విశతే)*** అని చెప్పడంలో రెండు క్రియలు ఉన్నా యనేది ఉద్దేశం కాదు. పొందడ మనేది మరొక ఫలంగా, వేరుగా లేదని తెలియ చేయడమే ***(ఫలాన్తరాభావ జ్ఞాన మాత్ర మేవ)***. ముందు పరమాత్మను తెలుసుకోవడం, ఆ తరువాత ప్రవేశించడము అనే రెండు పనులు అక్కడ లేవు. తెలుసుకోవడమే ప్రవేశించడము. అది జరిగిన తరువాత కర్తవ్యం అనేది ఇక ఉండే అవకాశమే లేదు.

పరమాత్మను తెలుసుకోవడము అంటే తాను క్షేత్రజ్ఞ స్వరూప మని తెలుసుకొని, ***అయమాత్మా బ్రహ్మ*** - ఈ ఆత్మయే బ్రహ్మ అనే మహావాక్యాన్ని అనుభూతం చేసుకోవడమే. అంతేగాని, తెలుసుకొని ప్రవేశించడము ***(జ్ఞాత్వా విశతే తదనన్తరమ్)*** అంటే సింహము గుహలో ప్రవేశించినట్లో, లేక గువ్వ గూటిలో ప్రవేశించినట్లో కాదు. ఉపనిషత్తు చెప్పినట్లు, ***క్షీరం క్షీరే జలం జలే*** - పాలు పాలల్లో, నీళ్ళు నీళ్ళల్లో కలిసి పోవునట్లు అని అర్థము. ఇంకా స్పష్టత కావాలి అంటే ప్రతిబింబము బింబములో ఐక్య మైనట్లు అని అర్థము.

అనంత జ్ఞాన స్వరూపములో ప్రవేశ మెక్కడ? నిష్క్రమణ మెక్కడ? అంతా బ్రహ్మ స్వరూపమే. పూర్వ శ్లోకంలో జ్ఞానంలో మునక వేసి భక్తిగంగలో తేలాం. ప్రస్తుత శ్లోకంలో భక్తి గంగలో మునకేసి జ్ఞాన సాగరంలో విలీన మవుతున్నాం. భక్తి జ్ఞాన ప్రవాహాన్ని అఖండంగా అనుభూత మొనర్చుకుంటున్నాం.

స్వభావజా లైన కర్మల చేత పరమేశ్వరుణ్ణి ఆరాధించే వారు జ్ఞాన నిష్ఠా యోగ్యతా లక్షణమైన సిద్ధిని పొందుతారు. ఈ విషయాన్ని విస్పష్టం చేసేందుకు **స్వే స్వే కర్మణ్యభిరతః** అనే శ్లోకంలో స్వకర్మను ఈశ్వరార్చనగా మార్చుకొనే కర్మయోగ విష్ఠను, తద్వారా ప్రాప్తించే జ్ఞాన నిష్ఠా యోగ్యతను (అంత:కరణ శుద్ధిని) తెలిపిన పరమేశ్వరుడు, ఈ శ్లోకం వద్ద ప్రకరణాన్ని ఉపసంహరిస్తున్నాడు. సోపాధిక పరమాత్మ తత్త్వమును భక్తి చేయడం ద్వారా జ్ఞాన నిష్ఠా యోగ్యత, నిరుపాధిక భగవ తత్త్వమును అర్థం చేసుకోవడం చేత బ్రహ్మానుభూతి కలుగుతా యనేది విస్పష్ట మైంది.

*భగవద్భక్తి భగవత్కృపను వర్షింప చేసి భగవత్స్వరూపంతో ఏకం చేస్తుంది. ఎలాగో వినండి.*

**సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥** 56

**సర్వకర్మాణి-అపి-సదా-కుర్వాణః-మద్వ్యపాశ్రయః**
**మత్ప్రసాదాత్-అవాప్నోతి-శాశ్వతం-పదం-అవ్యయం**





సర్వకర్మాణి = సర్వ కర్మలను
సదా = ఎల్లప్పుడు
కుర్వాణః అపి = చేయుచున్న వాడైనా
మద్వ్యపాశ్రయః = నన్నే శరణు పొందిన వాడు
మత్ప్రసాదాత్ = నా అనుగ్రహము వలన
అవ్యయం = నాశరహిత మైన
శాశ్వతం = శాశ్వతమైన
పదం = పదమును
అవాప్నోతి = పొందు చున్నాడు

**అర్జునా! నన్ను ఆశ్రయించిన వాడు సదా కర్మలు చేస్తూ ఉండినా, నా అనుగ్రహం వల్ల నాశము లేని మోక్షమును పొందు చున్నాడు.**

**వ్యాఖ్య**

శాస్త్రార్థాన్ని ఉపసంహరించే చివరి ప్రకరణం లోకి మనం ప్రవేశించాం. జీవికి మోక్షమే ఏకైక పరమ పురుషార్థం. మోక్షం జ్ఞాన రూపంలో ఉన్నందున జ్ఞాన నిష్ఠ సాధన తోనే మోక్షం సిద్ధిస్తుంది.

జ్ఞాన నిష్ఠ మోక్ష రూప ఫలాన్నే లక్ష్యంగా కలిగి ఉంది కనుక, జ్ఞాన నిష్ఠకు ఏది నిమిత్తంగా ఉందో అట్టి అంత:కరణ శుద్ధి, స్వకర్మ చేత ఈశ్వరుణ్ణి ఆరాధించడ మనే కర్మయోగానికి ఫలంగా ఉంది ***(స్వకర్మణా భగవతః అభ్యర్చన భక్తి యోగస్య సిద్ధి ప్రాప్తిః ఫలం, జ్ఞానయోగ నిష్ఠతా)***. కనుక, భక్తియోగం అనే ఈ కర్మయోగ నిష్ఠ జ్ఞానయోగ నిష్ఠకు నిమిత్తంగా ఉండటం చేత, శాస్త్రార్థాన్ని సమాప్తం చేసే ఈ చివరి ప్రకరణంలో శాస్త్రార్థ నిశ్చయం దృఢ పడటం కోసం భగవద్భక్తిని స్తుతించడం జరుగుతూ ఉంది.

పరమేశ్వరుని ఆశ్రయించుకొని, సమస్త మైన కర్మలను ఆచరిస్తూ ఉన్న భక్తుడు పరమేశ్వరుని అనుగ్రహం చేత మోక్ష పదాన్ని పొందుతాడు. ఇది శ్లోకార్థం.

శాస్త్రార్థాన్ని, వేదార్థాన్ని విస్పష్టం చేసిన గీతామాత, ప్రారంభం లోనే ప్రవృత్తి నివృత్తులను ప్రవేశ పెట్టి, కర్మయోగ, జ్ఞానయోగా లనే నిష్ఠా ద్వయంగా పేర్కొనడం జరిగింది. అధ్యాయాలను సోపానక్రమంగా మనం అధిరోహిస్తూ వచ్చినా, సూత్రార్థంగా నిష్ఠాద్వయము మనతో కలిసి పయనిస్తూనే వచ్చింది. ఇక చివరగా, శాస్త్రాన్ని ఉపసంహరించే ఈ ఆఖరి ప్రకరణంలో కూడా ఆ విషయాన్నే ప్రముఖంగా ప్రస్తావిస్తూ, ఉపేయమైన జ్ఞాన నిష్ఠకు, కర్మనిష్ఠ ఎలా ఉపాయంగా ఉందో వివరిస్తున్నాడు.

జ్ఞానయోగి, లేదా సన్యాసి జ్ఞాననిష్ఠయే ప్రధానంగా కలిగిన వాడు. మరొక కర్తవ్యము, ధర్మాచరణము సన్యాసికి లేవు.

ఇక కర్మయోగి స్వధర్మాన్ని ఈశ్వరార్చనగా భావించి ఆచరిస్తాడు. తాను కర్మలను ఆచరిస్తున్నా, వాసుదేవుడే తనకు ఆశ్రయము అనే అభిప్రాయాన్ని దృఢంగా కలిగి ఉంటాడు.

సమస్తాన్ని పరమేశ్వరునికే సమర్పించి, సర్వేశ్వరుణ్ణే ఆశ్రయించుకొని, ఆయన అనుగ్రహం చేత ముక్తిని పొంది భక్తుడు తరిస్తాడు.

ఈ ప్రపంచం లోకి మనం వచ్చాము. ఇంద్రియ మనోబుద్ధులను కలిగిన దేహ మొక్కటే మనతో కలిసి ఉంది. ఏ ప్రపంచంలో అయితే మనం నివసిస్తున్నామో, ఆ ప్రపంచం పరమేశ్వరుని కన్నా అన్యంగా లేదు.

విశ్వంలో ఎక్కడ చూచినా నియతి ఉంది. ధర్మమే ఉంది. నియతి రూపంలో నియంతే ఉన్నాడు. ధర్మ రూపములో ఉన్నది దైవమే. ఇది అర్థమైన భక్తుడు తాను ఎక్కడున్నా, ఎలా ఉన్నా, ధర్మరూపంలో ఉన్న దైవానికి మాత్రం దూరంగా లేడు.

పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వ శక్తిమంతుడు. సర్వవ్యాపి. విశ్వంలో ధర్మ రూపంలో ఉన్న భగవంతుడే వ్యక్తిలో కూడా ధర్మరూపంలో ఉన్నాడు. ఇది అర్థమైన మరు క్షణాన తన మనుగడకు ఆధారమైన వాడు ఈశ్వరుడే అని తెలిసి పోతుంది.

ఆ క్షణం నుండి ఒక్క పరమేశ్వరుణ్ణే ఆశ్రయించుకొని ఈశ్వరార్చన ప్రారంభ మవుతుంది. దాని ఫలంగా ఈశ్వర కృప కలుగుతుంది. అదే ముక్తి సాధక మవుతుంది.

*అలల వోలె నే గన్న కలల వోలె*
*కరిగి పోయాయి కల్పిత బంధనాలు*
*నా కంటి పాపగా నిలిచినావు*
*నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా !*

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

*భక్తిని అంతరంగ సాధనంగా చూపిస్తున్నాడు.*

**చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।** 57
**బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ ॥**

**చేతసా-సర్వకర్మాణి-మయి-సంన్యస్య-మత్పరః**
**బుద్ధియోగం-ఉపాశ్రిత్య-మచ్చిత్తః-సతతం-భవ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చేతసా | = | మనస్సు చేత | బుద్ధియోగం | = | బుద్ధి యోగమును |
| సర్వకర్మాణి | = | సర్వ కర్మలను | ఉపాశ్రిత్య | = | అవలంబించి |
| మయి | = | నా యందు | సతతం | = | ఎల్లప్పుడును |
| సంన్యస్య | = | ఉంచి | మచ్చిత్తః | = | నా యందు చిత్తము గల వాడవు |
| మత్పరః | = | మత్పరాయణుడై | భవ | = | కమ్ము |

**అర్జునా! బుద్ధితో సర్వ కర్మలను నా యందు ఉంచు. నన్నే ఉత్తమ గతిగా భావించు. బుద్ధి యోగాన్ని ఆశ్రయించి సదా నా యందే మనస్సు కల వాడివి కా!**

## వ్యాఖ్య

***మచ్చిత్తః సతతం భవ*** - సదా నా యందే చిత్తము కల వాడవు కా! ***( మచ్చిత్తః మయ్యేవ చిత్తం యస్య తవ సః త్వం మచ్చిత్తః సన్ సతతం సర్వదా భవ! ).*** ఈ శ్లోకంలో అష్టాక్షరీ మహామంత్రం లాగా శోభిస్తున్న ఈ వాక్యము భక్తి యోగానికి గుండె లాంటిది. ప్రాణ వాయువు లాంటిది.

మనస్సు అందరికీ ఉంది. కాని అందరి మనస్సులు భగవంతుని మీద ఉండవు. ఉండ లేవు. మనస్సులో ఉండే ప్రాధాన్యతలే మనో చేష్టలను, మనో మార్గాలను నిర్ణయిస్తూ ఉంటాయి. ఎవరికి ఏది ప్రియమో, దాని మీదికి వారి మనస్సు పరుగు లెత్తుతూ ఉంటుంది. సర్వులకు ప్రియం కావలసిన వాడు పరమాత్మ ఒక్కడే అయినా, ఎందుకనో అందరికీ ఆ వైపు మనస్సు మరలదు.

భగవంతునికి సంబంధించిన ఆలోచనలే కదలని మనస్సులు కూడా ఉంటాయి. భగవంతుణ్ణి విశ్వసించి ఆరాధించే భక్తులలో కూడా సతతము వారి మనస్సులు పరమాత్మపై ఉండవు. ఉండ లేవు.

అవసరాలు, ఆపదలు చుట్టు ముట్టి నపుడు కొందరు పరమేశ్వరుని ప్రార్థిస్తారు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో,





పర్వదినాలలో మాత్రమే భగవంతుని కొందరు పూజిస్తూ ఉంటారు. కొందరికి నిత్య కర్మలలో భగవదర్చన కూడా యాంత్రికంగా సాగే ఒక క్రియ లాగా ఉంటుంది. భగవంతు డంటే ఏమిటో తెలిసి, భగవంతునితో తమ కుండే నిత్య సంబంధాన్ని గుర్తించి, పరమేశ్వరుని పొందడమే జీవితంలో ఏకైక లక్ష్యంగా భావించి జీవించే భక్తులు మాత్రమే నిరంతరము తమ చిత్తాన్ని భగవంతుని యందు లగ్నం చేయ గలరు.

పరమేశ్వరుడు తనకు ఏకైక గమ్యము కావడం చేత, భక్తుడే మనస్సును సతతం భగవంతునిపై ఉంచ గలడు. అలా కానపుడు భక్తి చేయాలని పూజాగదిలో కూర్చున్నా, మనస్సు ప్రపంచంలో పచార్లు చేస్తూ ఉంటుంది. జీవితంలో గమ్యాలు అనేకంగా ఉండే టప్పుడు, మార్గాలు కూడా అగమ్య గోచరంగా ఉంటాయి.

మనస్సును పరమేశ్వరునిపై సదా ఉంచడ మనేది అనుకున్నంత సులభమైన విషయం కాదు. భారాన్నంతా పరమేశ్వరునిపై ఉంచి, ఉద్వేగము లేకుండా, ఫలాసక్తి లేకుండా కర్మలు ఆచరించ గలిగిన భక్తులు మాత్రమే సర్వ కర్మల్ని పరమేశ్వరుని యందు సమర్పించి నిశ్చింతగా ఉండ గలరు.

***రక్షిష్య తీతి విశ్వాసః*** - భగవంతుడే నన్ను రక్షిస్తాడు. భగవంతుని అమృత హస్తాలలో నా బ్రతుకు దివ్యంగా ఉంటుంది అని భావించి జీవించ గలిగితే, విశ్వామిత్రుని యాగశాల వద్ద కోదండముతో నిలబడి రక్షించిన రాముడు, మన జీవితాలలో కూడా ప్రవేశిస్తాడు.

సదా భగవంతుణ్ణే మనస్సులో పెట్టుకొని జీవించే భక్తుడు ***( మచ్చిత్తః సతతం భవ )*** పనులు ఎలా చేస్తాడు? అనే సంశయం కలుగుతుంది. భక్తి భావప్రధాన మైంది. భావము బుద్ధికి సంబంధించింది. పని ఉన్నా, లేక పోయినా, భక్తుని మనస్సు మాత్రం భగవంతుని యందే ఉంటుంది. ఏది చేసినా, దాని వెనుక మనో భావము భగవంతుడే. ఏది సమర్పించినా, అందులో అంతా భగవద్భావనే. కనుక, బుద్ధియోగాన్ని ఆశ్రయించుకొని ***( బుద్ధి యోగం ఉపాశ్రిత్య ).*** సర్వ కర్మలను భావన చేత పరమేశ్వరుని యందు సమర్పించి భక్తుడు నిశ్చింతగా ఉంటాడు. ఎలా ఉండ గలుగుతాడు? అతనికి అదెలా సాధ్యం? అతడు మత్పరుడు కనుక, అంటున్నాడు భగవంతుడు. మత్పరుడు అంటే, వాసుదేవు డైన పరమేశ్వరుణ్ణే పరుడుగా స్వీకరించిన వాడు ***(మత్పరః అహం వాసుదేవః పరః యస్య తవ సః త్వం మత్పరః సన్ ).***

మత్పరత్వము అనేది సామాన్యమైన విషయం కాదు. జీవితంలో పరమాత్మ కన్నా రెండవది అవసరం లేనపుడే మత్పరత్వం సిద్ధిస్తుంది. అన్య విషయాలను సాధించు కోవడం కోసం పరమేశ్వరుని ఆశ్రయించడం కాకుండా, పరమేశ్వరుని పరమేశ్వరుని కొరకు ప్రార్థించడమే మత్పరత్వము.

అన్యము లన్నీ అనిత్యాలే నని మత్పరునికి తెలుసు. అన్నీ పోయేవే నని తెలుసు. అందుచేత, భగవంతుడే అతని బ్రతుకులో పరమ మయ్యాడు. భగవత్సేవే ప్రధాన కర్తవ్య మైంది.

**నదులు ఉన్నవి ఉన్నవి గిరులు**
**నరులు మృగాలు వనములు తరువులు**
**ఉన్న వన్నీ పోయిన నాడు**
**మిగిలిన దేదో సత్య మదే**
**అన్ని పోయినా ఉండును దైవము**
**అతని స్మరణమే శుభకరము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్** అని రామజోగి చిట్కా.

*భక్తి ఎంత ఉత్కృష్టమో, అభక్తి అంత నికృష్టము. వినండి.*

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।
అథ చేత్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58

మచ్చిత్తః-సర్వదుర్గాణి-మత్ప్రసాదాత్-తరిష్యసి
అథ-చేత్-త్వం-అహంకారాత్-న-శ్రోష్యసి-వినంక్ష్యసి

| | | | |
|---|---|---|---|
| మచ్చిత్తః | = నా యందు చిత్తము గల వాడవై | త్వం | = నీవు |
| మత్ప్రసాదాత్ | = నా అనుగ్రహము వలన | అహం కారాత్ | = అహంకారము వలన |
| సర్వ దుర్గాణి | = సర్వ సంకటములను | న శ్రోష్యసి చేత్ | = వినక పోతే |
| తరిష్యసి | = దాటగలవు | వినంక్ష్యసి | = నశించి పోతావు |
| అథ | = ఒకవేళ | | |

**అర్జునా! నాపై మనస్సు ఉంచిన నీవు నా అనుగ్రహం వల్ల సమస్త దుఃఖాలను దాటి పోతావు. ఒకవేళ అహంకారంతో పెడ చెవిని పెడితే చెడి పోతావు.**

**వ్యాఖ్య**

భగవంతుడు దయామయుడు. కరుణా సముద్రుడు. అది వాస్తవమా, కాదా అనే విషయాన్ని అనుభవములో దర్శించడమే భక్తి సాధన.

వాడి పోవడానికే ఏదైనా వికసిస్తుంది. కూలి పోవడానికే భవంతులు లేస్తాయి. గిట్టేందుకే దేహాలు పుడుతాయి. విరిగేందుకే ఏదైనా పెరుగుతుంది.

నమ్మిన మనుషులు వమ్ము చేస్తే, ఆయుష్షును కాలం సొమ్ము చేసు కుంటుంది. అందరి బ్రతుకులు ఆపదలలో మగ్నమై ఉన్నాయి. మరణంతో ముగిసి పోయే బంధాలను, బాంధవ్యాలను నమ్ముకొని మనిషి మురిసి పోతున్నాడు. ఎన్నున్నా, ఎందరున్నా, ఎవ్వరూ తోడు రారు అనే జ్ఞానం మనిషికి రావడం లేదు.

అర్జునా! నీ మనస్సును నా యందు ఉంచు (*మచ్చిత్తః*). నా అనుగ్రహం వల్ల (*మత్ప్రసాదాత్*) సమస్తము లైన కష్టాలను, సర్వ దుఃఖాలను (*సర్వదుర్గాణి*) దాటి పోతావు. ఇది భగవంతుని ప్రతిజ్ఞ. తరించా లనుకొనే వారికి ఇదే మంగళా శాసనము.

**తరించే వాళ్ళు**

పరమాత్మ అనుగ్రహం ప్రత్యేకంగా అవసరమా? మనం బ్రతుకు తున్నది ఆయన అనుగ్రహంతో కాదా? ఆయన కృప తోనే ఉంటున్నాము. తింటున్నాము. వింటున్నాము. తిరుగు తున్నాము. శ్వాసిస్తున్నాము. పలుకు తున్నాము. పిలుస్తున్నాము.

ఈ ప్రపంచంలో మనవిగా ఏవి ఉన్నాయి? ఎవరు ఉన్నారు? నిత్యం మన కూడా ఉండే వారెవరు? అలా చూచి నపుడు చివరికి దేహం కూడా మనది కాదు. దేహం మనకు తోడు ఉండి సహకరించ వచ్చు. కాని, దేహం మనది కాదు. కనుకనే రోగాలతో వేధిస్తుంది. చివరికి శ్మశానంలో తగలబడి పోతుంది.

ఇంతకాలం విశ్వాన్ని విశ్వసించి కృంగి పోయాము. ఇక ఇప్పుడు భగవంతుణ్ణి విశ్వసించి చూడండి. ఆయన చల్లని నీడలో ఎవ్వరూ కష్టాల పాలు కారు. కన్నీళ్ళను పానం చేయరు. యుగాలు దాటిన విశ్వ మానవ చరిత్రలో భగవంతుణ్ణి నమ్మి చెడ్డ వాళ్ళు లేరు. ఒకనాడు లోకం మనల్ని విడిచి పెట్టేస్తుంది. కాని, భగవంతుడు జన్మాంతరాలలో కూడా మనకు తోడు ఉంటాడు.



అర్జునా! నీ మనస్సును నా కిచ్చేయ్! కష్టాలను, కడగండ్లను దాటి పోతావు (*సర్వ దుర్గాణి తరిష్యసి*) అంటున్నాడు.

దుర్గములు అంటే కష్టాలు. బాధలు. దాట శక్యము కానివి. దేనిని సులభంగా దాటడం శక్యం కాదో, దానిని దుర్గము అంటారు.

*దుర్గా - దుఃఖేన గమ్యతే, దుఃఖేన గంతుం శక్యతే -* దేనిని దాటడము దుస్సాధ్యమో అది దుర్గము. అది అరణ్య ప్రయాణము కావచ్చు. గిరి ప్రయాణము కావచ్చు (*వన గిరి రూపం ఆవాసః యస్యాః సా దుర్గా*). వాటి నైనా దాట వచ్చు నేమో గాని, దుస్తర మైన సంసారాన్ని దాటడము ఎవ్వరికీ శక్యం కాదు.

మన మనస్సులలో సంసార భారం పెరిగి పోయింది. సంసార బరువును బుద్ధి మోయ లేక పోతోంది. అందుకే భవ సాగరంలో మునిగి పోతున్నాము. మన లోని భారమే మనల్ని ముంచేస్తూ ఉంది. ఆంతర్యంలో సంసారాన్ని విడిచి పెడితే చాలు. బాహ్యంలో సంసార సాగరాన్ని దాటించ డానికి పరమేశ్వరుడు సిద్ధంగా ఉన్నాడు. నన్ను నమ్ముకున్న భక్తులు భవ సాగరంలో మునిగి పోరు. వాళ్ళకు అగాధ మైన సంసార జలాలు నడుము లోతే; అని తన రెండు చేతులను నడుంపై ఉంచుకొని ప్రామాణికంగా ప్రదర్శించి మరీ ప్రతిజ్ఞ చేశాడు పాండురంగ స్వామి.

కనుక, భగవంతునిపై మనస్సు నుంచితే (*మచ్చిత్తః*), సమస్త మైన దుస్తరాలను (*సర్వ దుర్గాణి సర్వాణి దుస్తరాణి సంసార హేతు జాతాని*), సంసార కారణాలైన సమస్త అవరోధాలను, ఆయన అనుగ్రహం చేత (*మత్ప్రసాదాత్*) దాటి పోతాము (*తరిష్యసి అతిక్రమిష్యసి*).

పల్లవి : **రాధా రమణ - రాదేల కరుణ!**
**దేవకీనందన - మాకేల వేదన!** ॥ రాధా ॥

అనుపల్లవి : **జీవుల గమ్యము నీవే కావా!**
**బ్రతుకు సంద్రమున నీవే నావ!** ॥ రాధా ॥

చరణములు : (1) **నాదనుకుంటే అంతా నరకము**
**కాదనుకుంటే ఎంతో సుఖము**
**లేదనుకుంటే ఎక్కడి బంధము?**
**తోడు నీవుంటే అదియే అందము** ॥ రాధా ॥

(2) **నను కరుణించిన భక్తివి నీవే**
**నేను వరించిన ముక్తివి నీవే**
**నీ వెంట పడితే మిగలదు మోహము**
**నీవు వెంట రాగా వెలుగును మోక్షము** ॥ రాధా ॥

అని మనసును, మనుగడను మాధవుని వైపు త్రిప్పింది చైతన్య గీతిక.

**అంతరించే వాళ్ళు**

దీనదయాళుడు, భక్తవత్సలు డైన భగవంతుని నమ్మినోళ్ళు తరించి పోతూ ఉంటే, అహంకారాన్ని పట్టుకొని భగవంతుని నమ్మలేని వాళ్ళే చెడి పోతున్నారు. పాడై పోతున్నారు. నశించి పోతున్నారు.

తరించే మార్గాన్ని తెలియ జేస్తూ, భగవంతుడు హిత వచనాన్ని వినిపించినా, అహంకారం చేత నేనే పండితుణ్ణి అని విర్రవీగుతూ, పరమాత్మ మాటను వినని వారు (*అహంకారాత్ పండితం అహ మితి న*

**శ్రోష్యసి చేత్ ).** తప్పక నశించి పోతారు అంటున్నాడు భగవంతుడు ( **వినంక్ష్యసి వినాశం గమిష్యసి** ). అహంకారంతో మనిషి ఏమి పొంద గలడు, వినాశము తప్ప?

మరి, కురుక్షేత్రంలో 'నేను యుద్ధము చేయను' అని అర్జునుడు పలికింది అహంకారం కాదా? దానికి శ్రీకృష్ణుడు ఏమి చెబుతాడు? మీరే వినండి.

యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥ 59

*యత్-అహంకారం-ఆశ్రిత్య-న-యోత్స్య-ఇతి-మన్యసే*
*మిథ్యా-ఏషః-వ్యవసాయః-తే-ప్రకృతిః-త్వాం-నియోక్ష్యతి*

| | | | |
|---|---|---|---|
| యత్ అహంకారం | = ఏ అహంకారమును | వ్యవసాయః | = ప్రయత్నము |
| ఆశ్రిత్య | = ఆశ్రయించి | మిథ్యా | = వ్యర్థము |
| న యోత్స్య ఇతి | = యుద్ధము చేయనని | త్వాం | = నిన్ను |
| మన్యసే | = తలచు చున్నావో | ప్రకృతిః | = స్వభావము |
| తే | = నీ యొక్క | నియోక్ష్యతి | = నియోగింప గలదు |
| ఏషః | = ఈ | | |

**అర్జునా! అహంకారాన్ని ఆశ్రయించి, 'నేను యుద్ధము చేయను' అని నువ్వు అనుకున్నా, నీ ప్రయత్నము జరగదు. నీ స్వభావమే నీ చేత ఆ పని చేయిస్తుంది.**

స్వభావజేన కౌన్తేయ నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్ ॥ 60

*స్వభావజేన-కౌంతేయ-నిబద్ధః-స్వేన-కర్మణా*
*కర్తుం-న-ఇచ్ఛసి-యత్-మోహాత్-కరిష్యసి-అవశః-అపి-తత్*

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | స్వభావజేన | = స్వభావ సిద్ధమైన |
| యత్ | = దేనిని | స్వేన | = నీ దైన |
| కర్తుం | = చేయుటకు | కర్మణా | = కర్మ చేత |
| మోహాత్ | = మోహము వలన | నిబద్ధః | = బంధింపబడిన వాడవై |
| న ఇచ్ఛసి | = ఇచ్ఛగింపవో | అవశః అపి | = పరవశుడవై కూడా |
| తత్ | = దానిని | కరిష్యసి | = చేయుదువు |

**అర్జునా! అజ్ఞానము చేత ఏ పనిని చేయడానికి నువ్వు ఇష్ట పడటం లేదో, నీ స్వభావమునకు సంబంధించిన ఆ కర్మను నీకు తెలియకనే నీ స్వభావము నీ చేత చేయిస్తుంది.**

### వ్యాఖ్య

పూర్వ సంస్కార జనితమైన స్వభావము చేత స్వకర్మలు స్వధర్మంగా నిర్ణయింప బడుతున్నా యని స్పష్టంగా అర్థం చేసుకున్నాం. స్వభావం మనతో కలిసి పుట్టింది. స్వభావాన్ని ఎవ్వరూ అతిక్రమించ లేరు. స్వధర్మాచరణం ప్రవాహానికి అనుకూలంగా ఈదడ మైతే, పరధర్మాచరణం ఎదురీత లాంటిది. ఎంత ప్రయత్నిస్తున్నా ప్రమాద భరితం గానే ఉంటుంది.



కనుక స్వకర్మను, స్వధర్మాన్ని అనుసరిస్తూ, ఫలాభిసంధి లేకుండా, శాస్త్ర విహిత కర్మలను ధర్మబద్ధంగా ఆచరిస్తే, చిత్తశుద్ధి కలిగి జ్ఞాననిష్ఠా యోగ్యత సిద్ధిస్తుందని పరమేశ్వరుడు సశాస్త్రీయంగా, సలక్షణంగా వివరించాడు.

సందర్భాన్ని దృష్టిలో ఉంచుకొని అర్జునుని ఉద్దేశించి, సర్వ మానవాళికి ఉపయుక్త మైన ఒక సూచనను భగవంతుడు ఇస్తున్నాడు.

'అర్జునా! నేను ఇంత చెప్పినా, ఇదంతా నేను ఎందుకు చేయాలి? నాకు కర్మ స్వేచ్ఛ ఉంది. నేను స్వతంత్రుణ్ణి. నా ఇష్ట మొచ్చినట్లు చేస్తాను. యుద్ధం నాకు ఇష్టం లేదు. నేను యుద్ధం చెయ్యను అని ( ***న యోత్స్య ఇతి*** ) నీవు అనుకున్నా, నీ నిర్ణయము సముచిత మైనది కాదని, నిస్సార మైనదని, మిథ్యా మాత్ర మని ( ***ఏషః వ్యవసాయః మిథ్యా*** ) చెబుతున్నాను. నీ స్వభావమే నీ చేత యుద్ధం చేయిస్తుంది' అంటున్నాడు భగవంతుడు. ఇక్కడ ఒక్క విషయాన్ని గమనించాలి. ***న యోత్స్య ఇతి*** - అని పరమేశ్వరుడు ఈ శ్లోకంలో ప్రయోగించిన మాట, అంటే, 'నేను యుద్ధము చేయను' అనే మాట, అర్జునుడు మునుపు రెండవ అధ్యాయంలో పలికిందే *(2వ అ - 9 వ శ్లో)*. అదే మాటను గనుక అర్జునుడు ఈ దశలో కూడా పలికితే, గీతా ప్రబోధ ప్రభావం పార్థునిపై లేనట్లే. ప్రమాణం ఫలించనట్లే.

అహంకారాన్ని పట్టుకొని, గాండీవాన్ని పడేసి, యుద్ధము చేయను అని ప్రారంభంలో అన్నాడు. గీతార్థం సమాప్త మైంది. ఇప్పుడు కూడా అహంకారం చేతిలో పనిముట్టుగా మారుతాడా? లేక అహంకారాన్ని విడిచి, అచ్యుతుని వాక్యానుసారం శాస్త్ర విహిత కర్మను ధర్మబద్ధంగా ఆచరిస్తాడా?

భగవంతుడు స్వధర్మాచరణమునకు హేతువును కూడా చెబుతున్నాడు. అర్జునా! నేను చెయ్యను అని నువ్వు భీష్మించుకున్నా, నీది క్షత్రియ స్వభావం కనుక ( ***శౌర్యం తేజో ధృతిః*** *- 43 వ శ్లో*), నీ స్వభావజ కర్మ మైన యుద్ధమును పట్టు తప్పి, ప్రకృతిచే నెట్టబడి మరీ ఆచరిస్తావు. యుద్ధం మానాలి అన్న నీ ప్రయత్నాలు ఫలించవు. నీ నిర్ణయం మిథ్యే కనుక తప్పక వ్యర్థ మౌతుంది. ఆకాశంలో కాలి నడకన ప్రయాణం చేయా లనుకునే వాడి ప్రయత్నానికి, ***న యోత్స్య ఇతి*** అనే నీ నిర్ణయానికి పెద్ద తేడా లేదు.

అర్జునా! చివరగా ఒక్క మాట చెబుతున్నా. విరాట నగరంలో నువ్వు చేసిన నిర్వాక మేమిటి? నా నిర్వాకమే కదా! ఈ రోజు నేను నీ బండిని తోలుతున్నట్లు, ఆ రోజు నువ్వు ఉత్తర కుమారుని రథం నడప డానికి కులుకుతూ మరీ వెళ్ళావు. ఆ పని చేసి తిరిగి రావడం నీ కర్తవ్యము. అలా చేయకుండా, కౌరవులను అభిముఖంగా చూడగానే వాళ్ళ మీదికి రెచ్చిపోయా వెందుకని? వారిపై విరుచుక పడి వీర పోరాటం చేశా వెందుకని? ఇప్పు డర్థ మైందా? స్వభావం అలా మెడ పట్టి ముందుకు నెట్టుతుంది! వెను దిరిగి చూడ నివ్వదు. స్వభావాన్ని మార్చడం దేహంపై వస్త్రం మార్చినట్లు కాదు. శరీరంపై ఉన్న చర్మాన్ని ఒలిచినట్లే ఉంటుంది.

***ప్రాక్సంసార పరంపరా పరిణతం ప్రాయో మనః ప్రాణినాం కస్తస్య ప్రకృతిం నిరస్య సహజాం కర్తాఽ న్యథా స్యాన్నరః। దౌర్గన్ధ్యం లశునాది కస్య సహజం యత్నా త్సముత్సారయన్ సౌరభ్యం వితనోతి కోఽ సురభితాం కర్పూర ముఖ్యస్యవా*** - సాధారణంగా ప్రాణుల మనస్సు పూర్వ సంస్కార పరంపర చేత పరిణతమై ఉంటుంది. సహజ మైన తన స్వభావాన్ని విడిచి పెట్టి మనిషి ఎప్పుడూ మరో విధంగా ప్రవర్తించ లేడు. లశునాదులకు (వెల్లుల్లి) సహజ వాసనను తొలగించడం గాని, కర్పూరాదుల సువాసనను వాటికి లేకుండా చేయడం గాని ఎవరికి సాధ్య పడుతుంది? స్వభావం కూడా అంతే - అని **పరమార్థ ప్రప** వ్యాఖ్యానంలో దైవజ్ఞ పండిత సూరి అభిప్రాయ పడ్డారు.

*స్వభావాన్ని తయారు చేసుకోవడం మన చేతిలో ఉంది. కాని, ఆ తరువాత దానిని నిరాకరించడం మన చేతిలో లేదు. అది నియంత చేతి లోకి చేరి పోతుంది. ఆ తరువాత, మరో విధంగా ప్రవర్తించడం ఎవ్వరికీ వీలు కాదు. ఎందుకని? అక్కడ మనం కీలుబొమ్మలం కనుక. చదవండి.*

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥** 61

***ఈశ్వరః-సర్వభూతానాం-హృద్దేశే-అర్జున-తిష్ఠతి***
***భ్రామయన్-సర్వభూతాని-యంత్రారూఢాని-మాయయా***

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా | భ్రామయన్ | = త్రిప్పుచు |
| ఈశ్వరః | = ఈశ్వరుడు | సర్వభూతానాం | = సమస్త ప్రాణుల యొక్క |
| యంత్రారూఢాని | = యంత్రము నధిష్ఠించిన వారి వలె | హృద్దేశే | = హృదయ ప్రదేశము నందు |
| సర్వభూతాని | = సమస్త ప్రాణులను | తిష్ఠతి | = ఉన్నాడు |
| మాయయా | = మాయాశక్తి చేత | | |

**అర్జునా! పరమేశ్వరుడు సర్వ జీవుల హృదయాలలో నెలవై ఉన్నాడు. యంత్రము నెక్కిన వాడు త్రిప్పునట్లు, జీవు లందరినీ తన మాయా శక్తి చేత త్రిప్పు చున్నాడు.**

**వ్యాఖ్య**

స్వభావాలు మనం తయారు చేసుకుంటాం. కర్మలను మనం ఆచరిస్తాం. కాని, వీటి ఫలితాలు మన చేతుల్లో ఉండవు. సర్వ నియంత అయిన సర్వేశ్వరుని చేతి లోకి చేరి పోతాయి. ఆ క్షణం నుండి మనం ఆయన చేతిలో కీలు బొమ్మలం. జీవన రంగుల రాట్నం లోకి ప్రవేశిస్తాం. ఆ తరువాత, మాయను తన వశంలో ఉంచుకున్న ఈశ్వరుడు, జీవన చక్రాన్ని త్రిప్పు తుంటాడు.

**రంగుల రాట్నం**

అర్జునా! సర్వ ప్రాణులను నియమించే ఈశ్వరుడు సర్వ ప్రాణుల హృదయాలలో ఉన్నాడు ( ***ఈశ్వరః ఈశన శీలః నారాయణః సర్వప్రాణినాం హృదయ దేశే తిష్ఠతి*** ). రంగుల రాట్నమును ఎక్కిన వారిని యంత్రాన్ని నడిపే వాడు ఎలా త్రిప్పుతాడో, అలాగే దేహాలనే బొమ్మలను ఎన్నుకొని, వాటిని అవధరించిన జీవులను భగవంతుడు తాను అకర్తే అయినా, నిష్క్రియుడే అయినా, మాయను అదుపులో ఉంచుకొని ఈ జగచ్చక్రాన్ని, జీవన చక్రాన్ని త్రిప్పుతూ ఉంటాడు.

రంగుల రాట్నంలో రకరకాల బొమ్మలు ఉంటాయి. ఎవరికి ఏ బొమ్మ ఇష్టమో - అది ఏనుగో, గుఱ్ఱమో, ఆవో, సింహమో - దానిపై ఎక్కి కూర్చుంటారు. త్రిప్పే వాడు అందరిని సమానంగా త్రిప్పు తుంటాడు.

సర్వ ప్రాణులు, అంటే మానవులే కాదు, జీవు లన్నీ వాటి వాటి ఉపాధులను, దేహాలను ధరించి ఉన్నాయి. పరమాత్మ జీవన యంత్రాన్ని త్రిప్పుతున్నాడు. యంత్రాన్ని త్రిప్పే వాడు కూడా యంత్రం లోనే ఉన్నాడు.

***యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరోఽ యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరో యమ యతి!*** - ఎవడు భూమి నంతా వ్యాపించి ఉన్నాడో, ఎవడిని భూమి తెలుసుకో లేదో, ఎవనికి ఈ పృథివి





ఉపాధిగా ఉందో, పృథివిలో ఉంటూ ఎవడు పృథివిని నియమిస్తున్నాడో, అతడే పరమేశ్వరుడు, ఆదినారాయణ మూర్తి అని బృహదారణ్యక శ్రుతి.

రంగుల రాట్నంలో ఎక్కిన వాడికి త్రిప్పట తప్పదు. బొమ్మను ఆశ్రయించి ఉన్నంత వరకు తిరుగుతూ ఉండ వలసిందే. దిగి పోవాలి అనుకుంటే మాత్రం త్రిప్పే వాణ్ణి ఆశ్రయించాలి.

దేహాభిమానం ఉన్నంత వరకు జీవులు జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉండ వలసిందే. ఈశ్వరుణ్ణి ఆశ్రయిస్తే త్రిప్పట తప్పుతుంది. హృదయం శాంతిస్తుంది. 'దురదృష్టాలలో అదృష్టం' అనే నానుడి ననుసరించి, మనం చేసుకున్న కర్మలు విధి రూపంలో బాధిస్తున్నా, వాటిని దూరం చేసి మనల్ని రక్షించే పరమేశ్వరుడు మన హృదయం లోనే ఉండటం మన అదృష్టం. జగ చ్చక్రాన్ని, జీవి ప్రారబ్ధాన్ని నియంత్రించే నేత మన హృదయం లోనే ఉన్నాడు (***నేతా - జగద్యంత్ర నిర్వాహకః నేతా*** - *విష్ణుసహస్రనామం ; 222 వ నామం*). ఇక, మనం అనాథుల మెలా అవుతాము? తెలియక పోతే అనాథులము. తెలిస్తే సనాథులము.

*మరి, ఈ మాయా నిర్మిత జగద్యంత్రము నుండి, ఈ రంగుల రాట్నం నుండి విముక్తిని పొందే దెలా? పరమేశ్వరునికి శరణాగతులం కావడమే. చదవండి.*

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥** 62

***తం-ఏవ-శరణం-గచ్ఛ-సర్వభావేన-భారత***
***తత్ప్రసాదాత్-పరాం-శాంతిం-స్థానం-ప్రాప్స్యసి-శాశ్వతం***

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | పరాం | = ఉత్తమమైన |
| సర్వభావేన | = సర్వ భావముల చేత | శాంతిః | = శాంతిని |
| తం ఏవ | = అట్టి పరమేశ్వరునే | శాశ్వతం | = శాశ్వతమైన |
| శరణం | = శరణును | స్థానం | = మోక్షమును |
| గచ్ఛ | = పొందుము | ప్రాప్స్యసి | = పొందగలవు |
| తత్ప్రసాదాత్ | = అతని అనుగ్రహము వలన | | |

**అర్జునా! అన్ని విధాల పరమేశ్వరునే శరణు బొందు. అతని అనుగ్రహం చేత పరమశాంతిని, నిత్య మోక్షాన్ని పొందుతావు.**

**వ్యాఖ్య**

భక్తి పవిత్ర మైంది. శరణాగతి రూపంలో శోభిస్తుంది. భక్తి హృదయాన్ని పవిత్రంగా మార్చుతుంది. భగవంతుడు ఉండేది హృదయం లోనే నని తెలుసుకున్నాం కదా! చిద్విలాసుని చిరునామా తెలిసి పోయింది. ఇక అది గుండె ఎలా అవుతుంది? గుడి అవుతుంది. భక్తి గుండెను గుడిగా మార్చుతుంది. బాహ్యంలో ప్రపంచాన్ని చూస్తే దుఃఖ మంతా మనదే. ఆంతర్యంలో అచ్యుతునికి శరణాగతుల మైతే సుఖా లన్నీ మనవే. శాంతి మన సొంతం. మనమే శాంతి. మనస్సులను మల్లెల లాగా తెల్లగా, చల్లగా మార్చుకొని, సంపూర్ణ శరణాగతులమై గుండె గుడి వైపు నడక సాగిద్దాం. గోవిందుని సన్నిధిలో ఒదిగి పోదాం. హృదిలో హృదయేశ్వరునితో చేరి పోదాం.

ఎవరు లేక మిగిలి యున్నా నిన్నే నమ్ముకున్నా
వమ్ము చేసి పోకురా బ్రతక లేను కన్నా!
మల్లె కన్నా తెల్ల నైన మనసు నాకుందిరా!
మనసు లేని స్వామి నా మనసు నేలరా! ॥ మల్లె ॥

అంటూ మన వెంట నేపథ్య సంగీతంలా నడుస్తూ ఉంది చైతన్య గీతిక.

అర్జునా! అన్ని విధాల (*సర్వ భావేన సర్వాత్మనా*) ఈశ్వరుణ్ణే (*తం ఏవ*) శరణు పొందు (*శరణం గచ్ఛ*) అంటున్నాడు భగవంతుడు. సంసార దుఃఖాన్ని పోగొట్టుకోవడానికి (*సంసారార్తి హరణార్థం*) పరమేశ్వరుని ఆశ్రయించాలి. ఇదే శరణాగతి.

వట్టి చేతులతో, ఓటి చేతులతో ప్రపంచం లోకి వచ్చాం. ఇక్కడ ఎలా బ్రతకాలని వచ్చాము? ఎంత గుండె నిబ్బరంతో వచ్చాము? ఎవరి ధైర్యంతో వచ్చామో, ఆ దయామయుడు ఇక్కడే ఉన్నాడు. మనం ఎక్కడుంటే అక్కడున్నాడు. మనం చూచే ప్రతి విషయంలో తానే ఉన్నాడు. మన చూపులో కూడా తానే ఉన్నాడు. మన దేముంది? అంతా అతనిదే. అన్నీ తానే. ఇదే శరణాగతి.

భగవాన్! నువ్వు ఇచ్చిన దేహం ఇది. నేను పీల్చే గాలిలో ప్రాణం నువ్వే. నేను తినే ఆహారంలో శక్తి నువ్వే. నేను పానం చేసే జలములో ప్రాణాధారము నువ్వే. నేను తిరిగేది నీ లోనే. నీ వల్లనే నా దేహంలో వేడి. నీ వల్లనే నా మనస్సులో వాడి.

ఇవే భావ సుమాలు. గుండె గుడిలో నిరంతరం భావ సుమాలను భగవంతునికి సమర్పిస్తూ ఉండాలి. అదే శరణాగతి. శరణాగతిలో బుద్ధి వికసిస్తుంది. హృదయం నిర్మల మవుతుంది. సంసార దుఃఖా లన్నీ తీరి పోతాయి. అందుకే భక్తిలో శరణాగతి మహోత్కృష్ట మని చెప్ప బడింది.

**ఈశ్వరునే శరణంబు వేడెదన్** అన్నాడు గజేంద్రుడు. మనమూ అదే అనాలి. అలాగే ప్రార్థించాలి. అలాగే శరణాగతులం కావాలి.

**సర్వదా సర్వ భావేన నిశ్చింతితైః భగవానేవ భజనీయః**

అంతట, అన్ని విధాల మరో చింత లేకుండా పరమేశ్వరుణ్ణే భజిస్తూ ఉండాలి అని నారద భక్తి సూత్ర ప్రబోధము.

హే భారతా! అర్జునా! ఇలా శరణాగతు లైన వారు ఈశ్వరానుగ్రహం చేత ఉత్తమ మైన శాంతిని, మోక్షాన్ని పొందుతారు.

***స కీర్త్యమానః శీఘ్ర మేవ ఆవిర్భవతి అనుభావయతి చ భక్తాన్*** - భగవంతునికి శరణాగతులమై భక్తి చేస్తే, శీఘ్రముగా భగవంతుడు మనకు దర్శన మిచ్చి, దివ్యానుభూతిని అనుగ్రహిస్తాడు.

*చెప్పవలసిం దంతా భగవంతుడు చెప్పేశాడు. ఇక మనం చెయ్య వలసిందే మిగిలి ఉంది.*

**ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥** **63**

**ఇతి-తే-జ్ఞానం-ఆఖ్యాతం-గుహ్యాత్-గుహ్యతరం-మయా**
**విమృశ్య-ఏతత్-అశేషేణ-యథా-ఇచ్ఛసి-తథా-కురు**





| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇతి | = | ఇట్లు | ఏతత్ | = | దీనిని |
| గుహ్యాత్ | = | గుహ్యమైన దాని కంటె | అశేషేణ | = | పూర్తిగ |
| గుహ్యతరం | = | రహస్య మైనది | విమృశ్య | = | విచారణ చేసి |
| జ్ఞానం | = | జ్ఞానము | యథా | = | ఏ విధముగ |
| మయా | = | నా చేత | ఇచ్ఛసి | = | అభిలషింతువో |
| తే | = | నీ కొరకు | తథా | = | అలాగున |
| ఆఖ్యాతం | = | చెప్పబడినది | కురు | = | చేయుము |

**పార్థా! రహస్యాల లోకి రహస్య మైన జ్ఞానాన్ని నీకు బోధించాను. బాగా విచారం చెయ్యి. ఆ తరువాత, ఏది నీ కిష్టమో అది చెయ్యి.**

**వ్యాఖ్య**

భగవంతుడు గీతా శాస్త్రాన్ని ఉపసంహరిస్తున్నాడు. అర్జునా! రహస్యాల లోకి రహస్యమైన జ్ఞానాన్ని నీకు బోధించాను అన్నాడు (*గుహ్యాత్ గుహ్యతరం అతిశయేన గుహ్యమ్ రహస్యం ఇత్యర్థః*).

రహస్యం అంటే లేనిది కాదు. ఉండి తెలియనిది. ఒక వ్యక్తి పిడికిలి బిగించి, 'నా చేతిలో ఏముందో చెప్పండి' అన్నా డనుకోండి. అతని చెయ్యి మన ముందే ఉన్నా, మనం చెప్ప లేము అనే నమ్మకం ఉండ బట్టే అతడు ఆ ప్రశ్న వేశాడని అర్థం. అదే రహస్య మంటే. ఒకవేళ పిడికిలి విప్పేస్తే, ఆ వస్తువు ఏదో కాదు, చింత పిక్క అని తెలిసి పోతుంది. ఆ క్షణం నుండి రహస్యం లేదు. చింత లేదు.

అలా కాకుండా, పిడికిలి విప్పి చూపినా, అది రహస్యం గానే ఉందంటే, దాని నే మనాలి? చెప్పనా! వేదాంతం అనాలి. వింటూనే ఉంటారు. అర్థం గాక తికమక పడుతూనే ఉంటారు (*శృణ్వన్తః అపి న జానన్తి*). అందుకే అది రహస్యం కాకుండా రహస్యాల లోకి రహస్య మైంది (*గోప్యాత్ గోప్యం*).

ఇది ప్రమ. అంటే జ్ఞానానికి సంబంధించిన విషయం. ప్రమాణము ఉంటేనే అర్థ మౌతుంది. అది కూడా బోధనా విధి తెలిసిన వాడు బోధించి నపుడే అర్థ మవుతుంది. అంతే గాకుండా, శ్రోత కూడా అర్హుడై ఉండాలి. శిక్షణ యోగ్యుడై ఉండాలి. ఇన్ని విషయాలపై ఆధారపడి ఉన్న ఈ ప్రామాణిక జ్ఞానము వ్యక్తి స్వరూపమే అయి ఉండటం కూడా ఒక కారణం. ఇన్ని కారణాల చేత బ్రహ్మవిద్య రహస్య జ్ఞాన మైంది. భగవత్ప్రసాదంగా అర్జునునికి, అర్జునుని కారణంగా మనకు లభ్య మైంది.

అంతా చెప్పి, చివరగా ఒక్క వాక్యాన్ని భగవంతుడు మహోన్నతంగా పలికాడు. 'అర్జునా! నేను చెప్పిన ఈ రహస్య మైన జ్ఞానాన్ని బాగా విమర్శించుకొని (*అశేషేణ విమృశ్య*). ఆ తరువాత, నీకు ఎలా చెయ్యా లనిపిస్తే అలా చెయ్యి!' (*యథేచ్ఛసి తథా కురు!*). ఎంత అందమైన మాట! ఎంత అర్థవంత మైన మాట! ఆర్ష సంస్కృతీ వైభవాన్ని అంబారీ ఎక్కించి ఊరేగించిన రతనాల మూట.

ఇంత జ్ఞానాన్ని సాక్షాత్తు భగవంతుడే సహేతుకంగా అందించిన తరువాత, అర్జునుడు ఆలోచించ డానికి ఏమి మిగిలుంది గనుక? 'శాస్త్రాన్ని పూర్ణంగా చెప్పాను. అర్జునా! నేను చెప్పినట్లు చెయ్యి' అని శ్రీకృష్ణుడు ఎందు కనలేదు?

ఎందుకో చెప్పనా! శ్రీకృష్ణుడు మత బోధకుడు కాదు కనుక. నమ్మకాలను ఫణంగా పెట్టి సొమ్ము చేసుకోవడం, బ్రతుకుల్ని వమ్ము చేయడం తెలియని వాడు కనుక. తన జ్ఞానం మీద తనకు అకుంఠిత మైన

నమ్మకం ఉన్న వాడు కనుక. ఇంత బోధించిన తరువాత, 'ఇలా ఆచరించు' అని చెప్పడం అంటేనే గురువుకు తన మీద, తన జ్ఞానం మీద నమ్మకం లేదని అర్థము. అలా గాక, ఇతడు ఆచరిస్తాడో లేదో అనే అవిశ్వాసం గురువుకే గనుక శిష్యుడి మీద ఉంటే, ఇక అత డెలాంటి శిష్యుడై ఉండాలి?

అందుకే, **యథేచ్ఛసి తథా కురు** - నీకు ఎలా ఇష్టమో అలా చేసుకో! శ్రీకృష్ణుడే కాదు, ఏ గురువైనా ఆర్ష ధర్మంలో అదే చేస్తాడు. అదే చేయాలి. అంతేగాని, వ్యక్తి స్వేచ్ఛను భగ్నం చేయ కూడదు. ఎవరి స్వేచ్ఛను వారికి ఉండ నివ్వాలి. కారణం, ఎవరి మనస్సుతో వారు తరించాలి కనుక.

***శాస్త్రం దృష్టం గురోర్వాక్యం తృతీయం ఆత్మ నిశ్చయం*** - శాస్త్ర ప్రమాణం మొదటిది. సంప్రదాయంలో ప్రాప్తించిన గురుబోధ రెండవది. స్వాభిప్రాయం మూడవది. మొదటి రెండు గురువు చేయ వలసిన పనులు. మూడవది శిష్యునికి సంబంధించిన విషయం. ఈ ఉత్కృష్ట మైన సంప్రదాయమే గీత లోనూ అనుసరించ బడింది. శ్రీకృష్ణుడు గురువుగా తాను చేయ వలసింది చేశాడు. తరువాత నిర్ణయాన్ని శిష్యుడికే విడిచి పెట్టాడు.

**ఆర్ష సంస్కృతికీ జై!**

*చివరగా హితబోధ చేస్తున్నాడు.*

**సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ ॥** 64

**సర్వగుహ్యతమం-భూయః-శృణు-మే-పరమం-వచః**
**ఇష్టః-అసి-మే-దృఢం-ఇతి-తతః-వక్ష్యామి-తే-హితం**

| | | | | |
|---|---|---|---|---|
| భూయః | = మరల | దృఢం | = | నిశ్చయముగ |
| సర్వగుహ్యతమం | = పరమ రహస్య మైనది | ఇష్టః | = | ఇష్టుడవు |
| పరమం | = ఉత్తమ మైనది అగు | అసి ఇతి | = | అయి ఉన్నావని |
| మే | = నా యొక్క | తతః | = | అందువలన |
| వచః | = వాక్కును | తే | = | నీ కొరకు |
| శృణు | = విను | హితం | = | హితమును |
| మే | = నాకు | వక్ష్యామి | = | చెప్పు చున్నాను |

**అర్జునా! పరమ రహస్య మైన నా మాటను మళ్ళీ విను. నువ్వు నాకు మిక్కిలి ఇష్టమైన వాడివి. అందువల్ల నీ మేలు కోరి చెబుతున్నా.**

**వ్యాఖ్య**

అతి రహస్య మైన ఈ గీతా శాస్త్రమును సారభూతంగా చెప్పి, ఉపసంహరించా లని భగవంతుడు భావిస్తున్నట్లుంది. అందుచేత, 'మళ్ళీ విను' *(భూయః శృణు)* అంటున్నాడు.

ఇలా మళ్ళీ చెప్పడానికి హేతు వేమిటి అంటే, రెండు కారణాలు చెబుతున్నాడు. శాస్త్రము సర్వ గుహ్యతమం కావడము ఒక కారణ మైతే, అర్జునుడు తనకు అత్యంత ఇష్టుడు కావడం చేత, హితకర మైన గీతాబోధను పుష్టత కోసం మళ్ళీ చెప్పాలను కోవడం రెండవ కారణం. ప్రారంభం నుండి ఏకబిగిన ప్రవచిస్తున్న నిష్ఠాద్వయమును చివరగా స్పృశించి సమాప్తం చేస్తున్నాడు.





*ఇంతకీ, పరమేశ్వరుడు చెబుతా నంటున్న హిత మేమిటి?*

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥** 65

**మన్మనాః-భవ-మద్భక్తః-మద్యాజీ-మాం-నమస్కురు**
**మాం-ఏవ-ఏష్యసి-సత్యం-తే-ప్రతిజానే-ప్రియః-అసి-మే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మన్మనాః | = | నా యందు మనస్సు కల వాడవు | ఏష్యసి | = | పొందగలవు |
| మద్భక్తః | = | నా యందు భక్తి కల వాడవు | మే | = | నాకు |
| మద్యాజీ | = | నన్ను అర్చించు వాడవు | ప్రియః | = | ఇష్టుడవు |
| భవ | = | కమ్ము | అసి | = | అయి ఉన్నావు |
| మాం | = | నన్ను | తే | = | నీకు |
| నమస్కురు | = | నమస్కరింపుము | సత్యం | = | సత్యమును |
| మాం ఏవ | = | నన్నే | ప్రతిజానే | = | ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను |

**అర్జునా! నీ మనస్సును నాపై ఉంచు. నా భక్తుడివి కా. నన్నే అర్చించు. నాకే నమస్కరించు. నువ్వు నన్నే పొందుతావు. నువ్వు నాకు ప్రియమైన వాడివి. అందుచేత ప్రతిజ్ఞ చేసి సత్యం చెబుతున్నా.**

**వ్యాఖ్య**

జ్ఞానయోగము సన్యాసులకు, కర్మయోగము యోగులకు అని మూడవ అధ్యాయ ఆరంభంలో నిష్ఠా ద్వయమును ప్రతిపాదించిన గీతాచార్యుడు, ప్రస్తుత శ్లోకంలో కర్మయోగ సారాన్ని సమాప్తం చేసి, తరువాత శ్లోకంలో జ్ఞానయోగ సారాన్ని సమాప్తం చేస్తాడు.

ఈ శ్లోకానికి ఒక విశిష్టత ఉంది. భగవద్గీతలో కొద్దిపాటి మార్పుతో రెండు సార్లు దర్శన మిచ్చిన శ్లోకం ఇదే. అది కూడా గీత పూర్వార్ధం సమాప్త మయ్యే తొమ్మిదవ అధ్యాయం లోను, ఉత్తరార్ధం సమాప్త మయ్యే పద్దెనిమిదవ అధ్యాయం లోను రెండు సార్లు భగవానుని ముఖ కమలము నుండి వెలువడింది. అందమైన ఈ శ్లోకంలో అద్భుతమైన నాలుగు సాధనలు తెలుప బడ్డాయి.

**మన్మనా భవ !**

అర్జునా! నా యందే మనస్సును నిలుపు ***(మన్మనాః భవ మచ్చిత్తః భవ!)***. మనస్సు జలం లాగా ఒక చోట నిలవదు. పైగా, నీళ్ళు ఎలాగైతే పల్లానికే ప్రవహిస్తాయో, మనస్సు కూడా ఎప్పుడూ అధోముఖంగా అనిత్య మైన విషయాల మీదికే పరుగులు తీస్తూ ఉంటుంది. నీరు ఏ పాత్రలో పోస్తే, ఆ పాత్ర ఆకారమునే పొందు తుంది. నీరు దేనితో నైనా కలిసి పోతుంది. మనస్సూ అంతే.

మనస్సును ఎవరి కైనా ఇవ్వ వచ్చు. కానీ ఎవరి కిచ్చినా దానిని పాడు చేసే వారే. పగుల గొట్టే వారే. కనుక మనస్సును ఇవ్వ దగిన వాడు పరమాత్మ ఒక్కడే. అక్కడే మనస్సుకు పూర్ణత్వము ప్రాప్తిస్తుంది.

**మద్భక్తో భవ !**

అర్జునా! నా భక్తుడివి కా! ***(మద్భక్తః భవ మద్భజనః భవ!)***. నన్ను సదా పూజించు. ధ్యానించు. కీర్తించు.

భక్తి బ్రతుకును భగవన్మయం చేస్తుంది. భగవంతుని పొందుటకు చేయు ప్రయత్నమే భక్తి. భక్తికి లోటు తెలియదు. వెలితి అర్థం కాదు. భక్తి నిత్య సుఖమును అనుగ్రహిస్తుంది. పరమ శాంతిని ప్రసాదిస్తుంది.

**మద్యాజీ భవ !**

నన్నే పూజించు. నన్నే పూజించే స్వభావం కలవాడివి కా! ***(మద్యాజీ మద్యజన శీలః భవ !).*** పూజ అనేది ఉత్కృష్ట మైన ఉపాసన. భక్తి ఆంతర్యంలో భావనా రూపంలో ఉంటుంది. బాహ్యంలో క్రియా రూపంలో సాగుతుంది. క్రియా రూపంలో జరిగే వాటిలో కాయక మైనది పూజ. వాచిక మైనది జపం. ప్రారంభ సాధకులకు దేహేంద్రియ మనస్సులను నిగ్రహించ డానికి పూజ విశిష్ట మైన సాధన.

**మాం నమస్కురు భవ !**

నమస్కారం కూడా నాకే చేయాలి ***(నమస్కార మపి మమైవ కురు !).*** ***'నమ' ఇతి ద్వే అక్షరే*** అన్నది శాస్త్రం. **మ** అంటే నాది. **న** అంటే లేదు అని అర్థము. **నమః** అంటే నా దంటూ ఏమీ లేదు అని అర్థం. కనుక, అంతా పరమాత్మే అనే శరణాగతికి ప్రతిరూపమే నమస్కారము. ఇదే వందనము. భక్తుని వందనము - భగవంతునికి బంధనము.

ఈ విధంగా, సర్వమును పరమాత్మ యందే సమర్పించి ప్రవర్తించే వారు పరమాత్మనే పొంద గలుగుతారు. ఇదే భక్తి వైశిష్ట్యము.

భక్తులను ఉద్ధరిస్తా నని ఈ శ్లోకంలో పరమాత్మ ప్రతిజ్ఞ చేసి చెప్పడము విశేషము.

*కర్మయోగ నిష్ఠా సారమును వివరించిన భగవానుడు, జ్ఞానయోగ నిష్ఠా సారమును వివరిస్తున్నాడు.*

**సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥** 66

***సర్వధర్మాన్-పరిత్యజ్య-మాం-ఏకం-శరణం-వ్రజ***
***అహం-త్వా-సర్వపాపేభ్యః-మోక్షయిష్యామి-మా-శుచః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వధర్మాన్ | = | సమస్త ధర్మములను | అహం | = | నేను |
| పరిత్యజ్య | = | విడిచి పెట్టి | త్వా | = | నిన్ను |
| మాం | = | నన్ను | సర్వపాపేభ్యః | = | సకల పాపముల నుండి |
| ఏకం | = | ఒక్కడినే | మోక్షయిష్యామి | = | విడిపిస్తాను |
| శరణం | = | శరణమును | మా శుచః | = | దుఃఖించకు |
| వ్రజ | = | పొందు | | | |

**అర్జునా! ధర్మా లన్నిటినీ విడిచి పెట్టేయ్! నన్నొక్కణ్ణే శరణు బొందు. నిన్ను సమస్త పాపాల నుండి విడిపిస్తాను. బాధ పడకు.**

**వ్యాఖ్య**

కర్మయోగ నిష్ఠ యొక్క పరమ రహస్య మైన ఈశ్వర శరణత్వాన్ని ఉపసంహరించి, కర్మ యోగ నిష్ఠకు ఫలమైన ఉపనిష త్ర్శుతిపాదిత అద్వయాత్మ జ్ఞానాన్ని చెప్పడానికి ప్రస్తుత శ్లోకాన్ని వినిపిస్తున్నాడు గీతాచార్యుడు.





ఈ శ్లోకం లోని ***సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ*** అనే ప్రథమ పాదాన్ని శక్తి గాను, ***అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః*** అనే ద్వితీయ పాదాన్ని కీలకం గాను గీతా పారాయణ పాఠ విధిలో పొందు పరచడం ఈ శ్లోక వైశిష్ట్యాన్ని తెలుపుతూ ఉంది.

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ దివ్య బోధ ఈ శ్లోకం వద్ద సమాప్త మైంది. మొదటి అధ్యాయము - అర్జున విషాద యోగము లోని నలభై ఏడు శ్లోకాలు, రెండవ అధ్యాయం లోని మొదటి పది శ్లోకాలు - మొత్తం యాభై ఏడు శ్లోకాలను గీతకు పూర్వ పీఠిక గాను, పద్దెనిమిదవ అధ్యాయంలో ప్రస్తుత శ్లోకమైన ***సర్వ ధర్మాన్ పరిత్యజ్య*** అనే శ్లోకం తరువాత వచ్చే పన్నెండు శ్లోకాలను ఉత్తర పీఠిక గాను చాలా మంది భావిస్తారు. అలా చూచి నపుడు ప్రస్తుత శ్లోకాన్ని చరమ శ్లోకం అని చెప్పాలి.

ఇదొక అద్భుతమైన శ్లోకం. అర్జునుని విషాదం తరువాత, రెండవ అధ్యాయం పదకొండవ శ్లోకంలో, ***అశోచ్యాన్ అన్వశోచస్త్వం*** - 'ఏడవ కూడని వాళ్ళ కోసం ఏడుస్తున్నావు' అని భగవంతుడు బోధను ప్రారంభించి, ప్రస్తుతం ఈ శ్లోకంలో ***మా శుచః*** - ఏడవకు అని సమాప్తం చేయడము మహాద్భుతము. ఉపక్రమ, ఉపసంహారాలలో శ్రీకృష్ణ పరమాత్మ విషయాన్ని ప్రదర్శించిన తీరు ఆయన జగద్గురుత్వానికి నిలువెత్తు నిదర్శనంలా గోచరిస్తూ ఉంది.

***సర్వ ధర్మాన్ పరిత్యజ్య*** అంటూ ఈ ఒక్క శ్లోకంలో సర్వ మానవాళికి, సర్వ కాలాలలో, సమస్త దేశాలకు అవసరమైన దంతా పుష్కలంగా వితరణ చేయడం ఒక్క గీతాచార్యునికే సాధ్య మైంది. (1) సర్వధర్మ పరిత్యాగము (2) సాక్షాత్తు భగవంతుని దివ్యాశ్రయము (3) సర్వపాప విముక్తి (4) మోక్షప్రాప్తి (5) సర్వదుఃఖ వినాశము - అన్నీ కలిపి చరమ శ్లోకంలో ఉదారంగా వితరణ చేశాడు.

**సర్వధర్మ పరిత్యాగము**

ఇక్కడ సర్వ ధర్మ పరిత్యాగము అంటే సర్వ కర్మ పరిత్యాగము అని అర్థం. సర్వ కర్మములు అంటే సత్కర్మలే కాదు, దుష్కర్మలు కూడా అని అర్థం. అలా చూచి నపుడు సర్వ ధర్మములు అన్నప్పుడు, ధర్మ శబ్దం చేత అధర్మం కూడా గ్రహించ బడుతుంది ***(సర్వ ధర్మాన్ - సర్వే చ తే ధర్మాశ్చ సర్వధర్మాః తాన్ ధర్మ శబ్దే నాత్ర అధర్మః అపి గృహ్యతే).*** ఎందువల్ల నంటే, ఇక్కడ నైష్కర్మ్యం చెప్ప బడింది. ఆత్మజ్ఞానమును ఉద్దేశించి ప్రవచింప బడింది. ***నావిరతో దుశ్చరితాత్*** - దుష్కర్మల నుండి ***(దుశ్చరితాత్)*** మరలని వాడు ***(అవిరతః)*** ఈ ఆత్మను ***(ఏనం)*** పొంద లేడు ***(న ఆప్నుయాత్)*** అని కఠోపనిషత్తు. ధర్మముతో పాటు అధర్మమును కూడా త్యజించాలి అని మహాభారతము - శాంతిపర్వము *(329 - 40, 331 - 44).* శ్రుతి స్మృతులు సర్వ ధర్మ పరిత్యాగాన్నే చెబుతున్నాయి. కనుక ***సర్వ ధర్మాన్ పరిత్యజ్య*** - సర్వ ధర్మాలను పరిత్యజించి, అంటే సర్వ కర్మములను సన్యసించి అని అర్థం.

**ఏకైక ఆశ్రయము**

సర్వ ధర్మములను, అంటే సర్వ కర్మములను సన్యసించి, నన్నొక్కడినే శరణుబొందు ***(మాం ఏకం శరణం వ్రజ).*** 'నన్నే శరణు బొందు' అంటే, పరమాత్మ ఈశ్వరుడు, ఆయన కంటే అన్య మైనది లేదు అని నిర్ధారణ చేసుకొని, సముడు, సర్వాత్మ స్వరూపుడు అయిన ఈశ్వరుణ్ణి శరణు బొంద మని అర్థం.

సర్వ కర్మములను సన్యసించి, నన్నే శరణు బొందితే సర్వ పాపముల నుండి విడిపిస్తాను అంటున్నాడు. సర్వ పాపాలు అంటే, ధర్మాధర్మ రూప బంధాలని అర్థం. వాటి నుండి విడిపిస్తాడు అని భావము. ఎలా విడిపిస్తాడు అనేది శంక.

**నాశయామి ఆత్మ భావస్థః జ్ఞాన దీపేన భాస్వతా -** ప్రకాశించే జ్ఞానదీపం చేత వారిలో అజ్ఞానం సృష్టించిన అంధకారాన్ని అదృశ్యం చేస్తాను అని గీత - విభూతి యోగంలో పరమాత్మ తెలిపిందే శంకకు సమాధానము *(10 వ అ - 11 వ శ్లో).*

**మా శుచః -** అర్జునా! దుఃఖించకు. పరమేశ్వరుని **విశోకః** అని అభివర్ణించింది ఛాందోగ్యోపనిషత్తు **(విమృత్యుర్విశోకో ...** *8 - 1 - 5).* విశోకుడని, శోకనాశను డని పరమేశ్వరుని కీర్తించింది విష్ణుసహస్రనామం *(631, 632 నామములు).* అట్టి శోక రహితుడు, శోక వినాశకుడు అయిన పరమేశ్వరుని, సర్వ ధర్మములను పరిత్యజించి ఆశ్రయించిన వారు, పాపాల నుండి, శోకాల నుండి విముక్తులై మోక్షాన్ని పొందుతారు.

చరణములు : **అభమూ శుభమూ తెలియని నేను**
**అభయము కోరి నిను చేరినాను**
**నీకు లేదులే కన్నతల్లి**
**ఉన్నది నీవే మము గన్న తండ్రీ** ॥ వెన్నెల ॥

పల్లవి : **వెన్నెల నవ్వుల గోపాలా!**
**వెన్నలు తినను రావేల ?**

అనుపల్లవి : **పువ్వుల సొగసు గాలికి తెలుసు**
**విరిసిన నా మనసు నీకే తెలుసు** ॥ వెన్నెల ॥

అని చరమ శ్లోక చరణాలను అనుసరించి సాగింది చైతన్య గీతిక.

*శాస్త్రం సమాప్త మైంది కనుక, శాస్త్ర సంప్రదాయ విధిని గూర్చి ప్రసంగిస్తున్నాడు.*

**ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।**
**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥** 67

***ఇదం-తే-న-అతపస్కాయ-న-అభక్తాయ-కదాచన***
***న-చ-అశుశ్రూషవే-వాచ్యం-న-చ-మాం-యః-అభ్యసూయతి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే | = | నీ కొరకు | అశుశ్రూషవే చ | = | శుశ్రూష చేయని వానికి |
| ఇదం | = | ఈ బోధ | న వాచ్యం | = | చెప్పదగదు |
| కదాచన | = | ఒకప్పుడును | యః | = | ఎవడు |
| అతపస్కాయ | = | తపస్వి గాని వానికి | మాం | = | నన్ను |
| న వాచ్యం | = | ఉపదేశింప దగదు | అభ్యసూయతి చ | = | ద్వేషించు చున్నాడో |
| అభక్తాయ | = | భక్తుడు గాని వానికి | న వాచ్యం | = | చెప్పగూడదు |

**అర్జునా! నేను బోధించిన ఈ జ్ఞానాన్ని తపస్సు లేని వారికి చెప్ప కూడదు. భక్తులు కాని వారికి బోధించ కూడదు. శుశ్రూష చేయని వారికి వినిపించ కూడదు. నన్ను ద్వేషించే వారికి అసలు చెప్ప కూడదు.**

**వ్యాఖ్య**

గీతాశాస్త్రాన్ని ఉపసంహరించిన శ్రీ భగవానుడు, చివరగా శాస్త్ర సంప్రదాయ విధిని తెలుపు తున్నాడు **(శాస్త్ర సంప్రదాయ విధిమ్ ఆహ ).** సంప్రదాయ విదుడైన వక్త శాస్త్రమును బోధించు నపుడు అనుసరించ వలసిన విధిని శాస్త్ర సంప్రదాయ విధి అంటారు. ప్రథమంగా శాస్త్రాన్ని ఎలాంటి వారికి బోధించాలి, ఎలాంటి వారికి బోధించ కూడదు అనేది ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు.





మోక్ష శాస్త్ర మైన గీతా శాస్త్రాన్ని తపస్సు లేని వానికి ***( అతపస్కాయ తపో రహితాయ ),*** భక్తుడు కాని వానికి ***( అభక్తాయ గురు దేవ భక్తి రహితాయ ),*** వినాలనే కోరిక లేని వానికి ***( అశుశ్రూషవే న శుశ్రూషః ),*** భగవంతుని ద్వేషించు వానికి ***( మాం వాసుదేవం ప్రాకృతం మనుష్యం మత్వా అభ్యసూయతి )*** చెప్ప కూడదు. ఇది శాస్త్ర విధి.

ఉత్కృష్ట మైన జ్ఞానాన్ని నికృష్ట మైన వ్యక్తులకు పంచ కూడదు. అయోగ్యులకు పంచిన జ్ఞానము నిరుపయోగ మవుతుంది.

***తపసా విజిజ్ఞాసస్వ*** అన్నది తైత్తిరీయ శ్రుతి. ***తపః స్వాధ్యాయ నిరతం*** అంటూ ప్రారంభ మైంది శ్రీమద్రామాయణము. దాహము లేని వారికి జలపాన మెందుకు? తపస్సు లేని వారికి జ్ఞాన దాన మెందుకు? తపించిన వారే గ్రహించి తరిస్తారు. తాపానికి కాగిన భూమి జలాన్ని పీల్చేసినట్లు, తపస్సు గల వారే జ్ఞానాన్ని అమాంతం సొంతం చేసుకుంటారు. తపస్సు లేని వారికి జ్ఞానం యొక్క విలువ తెలియదు. విలువ తెలియని వారు విలువ కట్టడానికి పనికి రారు. పనికి రాని వారికి చెప్ప కూడదు.

తపస్సు ఉండినా, భక్తులు కాని వారికి చెప్ప కూడదు. భక్తి లేని తపస్సు అహంకారానికి దారి తీస్తుంది. వర్షపు జలం పల్లపు ప్రదేశాలలో నిలిచినట్లు, నమ్రత గల వారి మస్తకాల లోనే జ్ఞానం నిలుస్తుంది. వర్షపు జలం కొండలపై పడినా, క్రిందికి కారి పోవునట్లు, జ్ఞాన జలం అహంకారుల మస్తిష్కాల నుండి జారి పోతుంది. ఇక్కడ భక్తి అంటే ఆదిదేవుని యందు, ఆచార్యదేవుని యందు అచంచల మైన భక్తిని కలిగి ఉండటము అని ఆచార్యుల వారి భాష్యము.

తపస్సు, భక్తి ఉండినా, శుశ్రూష లేని వారికి చెప్ప కూడదు. శుశ్రూష అంటే రెండు అర్థాలు. వినాలనే కోరిక శుశ్రూష ***(శ్రోతుం ఇచ్ఛ).*** రెండవ అర్థము ఆచార్య సేవ. వినాలనే కోరిక లేని వారికి, గురుసేవ చేయని వారికి బోధించ కూడదు.

చివరిగా భగవంతుని యందు విశ్వాసము లేని వారికి, రామ, కృష్ణాది అవతార పురుషులను సామాన్య మానవులుగా గుర్తించి, భావించి, ద్వేషించే వారికి చెప్ప కూడదు. అహితులైన వారికి హితబోధ చేసి సాధించే దేముంటుంది? పోనీ, ఫలితం రాకపోతే పోతుంది. బోధిస్తే ఏమౌతుంది? అని పిడివాదాలు చేసే వారూ లేక పోలేదు. సారవంతమైన బీజాలను రాళ్ళ గుట్టలపై ఎవరైనా చల్లుతారా? ఇదీ అంతే.

*సంప్రదాయానుసారం బోధించే వారికి ఫల మేమిటి? చెబుతున్నాడు.*

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మా మే వైష్య త్యసంశయః ॥** 68

***యః-ఇమం-పరమం-గుహ్యం-మద్భక్తేషు-అభిధాస్యతి***
***భక్తిం-మయి-పరాం-కృత్వా-మాం-ఏవ-ఏష్యతి-అసంశయః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఎవడు | అభిధాస్యతి | = | చెప్పునో |
| పరమం | = | ఉత్తమ మైన | సః | = | వాడు |
| గుహ్యం | = | రహస్యమైన | మయి | = | నా యందు |
| ఇమం | = | దీనిని | పరాం | = | ఉత్తమమైన |
| మద్భక్తేషు | = | నా భక్తుల యందు | భక్తిం | = | భక్తిని |

కృత్వా = చేసి
అసంశయః = సంశయ రహితుడై
మాం ఏవ = నన్నే
ఏష్యతి = పొందగలడు

**అర్జునా! పరమ రహస్యమైన ఈ జ్ఞానమును ఎవడు నా భక్తులకు చెబుతాడో వాడు గొప్ప భక్తి చేసి నన్నే పొందుతాడు. ఈ విషయంలో సందేహం వద్దు.**

న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥ 69

*న-చ-తస్మాత్-మనుష్యేషు-కశ్చిత్-మే-ప్రియకృత్తమః*
*భవితా-న-చ-మే-తస్మాత్-అన్యః-ప్రియతరః-భువి*

మనుష్యేషు = మనుష్యుల యందు
తస్మాత్ = వాని కంటెను
మే = నాకు
ప్రియకృత్తమః = మిక్కిలి ఇష్టమొనర్చు వాడు
కశ్చిత్ = ఒకడును
న చ = లేదు
మే = నాకు
తస్మాత్ = వాని కంటె
అన్యః = ఇతరుడు
ప్రియతరః = మిగుల ప్రియమైన వాడు
భువి = భూమి యందు
న చ భవితా = కలుగబోడు

**అర్జునా! అతని కంటే నాకు ప్రియం చేసే వాడు మరొకడు ఉండడు. అతని కంటే నాకు ప్రియమైన వాడు ఈ ప్రపంచంలో మరొకడు ఉండబోడు.**

### వ్యాఖ్య

గీతను బోధించే ఆచార్యునికి ప్రాప్తించే ఫలాన్ని ఈ రెండు శ్లోకాలలో చెబుతున్నాడు. కేశవార్జున సంవాద రూపంలో సాగిన గీతాశాస్త్రము ఉత్కృష్ట మైనది ***(పరమమ్ నిఃశ్రేయసార్థం)***, అంటే మోక్షమే ప్రయోజనముగా గలది. అట్టి రహస్య విషయమును భగవ ద్భక్తులకు ఎవడైతే చెబుతాడో ***(అభిధాస్యతి)*** - ఇక్కడ చెప్పడ మంటే గ్రంథ రూపం లోను, అర్థ రూపం లోను ***(గ్రంథతః అర్థతః)*** బోధించి భక్తుల హృదయాలలో సుస్థిర పరచడం అని అర్థం - అట్టివాడు నన్నే పొందుతాడు ***(మామేవ ఏష్యతి)***, ఈ విషయంలో సంశయము లేదు అంటున్నాడు ***(న సంశయః)***.

గీతను బోధించడము అంటే గీతా జ్ఞానమును బోధించడము అని అర్థము. గీతాజ్ఞానము, గీతాచార్యుడు ఒక్కటే. జ్ఞానము, జ్ఞాని వేరుగా లేరు. జ్ఞానమును బోధించే వాడు కూడా జ్ఞాన పూర్ణుడే. **జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్** - జ్ఞాని నా ఆత్మయే, జ్ఞానికి నాకు భేదం లేదు అని గీతాచార్యుడే ఏడవ అధ్యాయంలో చెప్పాడు *(7వ అ - 18 వ శ్లో)*. అందుచేతనే, జ్ఞాని నన్నే పొందుతాడు, సందేహము లేదు అంటున్నాడు.

గీతను బోధించే వాడు సంప్రదాయ విదుడు. సంప్రదాయ రక్షకుడు. సంప్రదాయ రక్షణే విశ్వ కళ్యాణాన్ని ఆవిష్కరిస్తుంది. భగవంతు డనే పేరు చెప్పుకుంటూ, మతి లోని భావాలను పలికి, మానవాళిని మభ్య పెట్టి, మాయం చేయడం సులభం. సంప్రదాయ గాడిలో నిలబడి శాస్త్రాన్ని యథాతథంగా బోధించడం అందరికీ సాధ్య పడే విషయం కాదు. అట్టి సంప్రదాయ కర్త యైన ఆచార్యుడే జ్ఞానాన్ని బోధించ గలడు. అట్టి వాడే పరమేశ్వరునికి పరమ ప్రియుడు. అతనికి మించిన ప్రియుడు మరొకడు ఉండబోడు అని స్వయంగా భగవానుడే చెబుతున్నాడు.





ఆత్మబంధువులారా! ఈ సందర్భంలో నాతో పరిచయం లేని వారిని, నన్ను తెలియని వారిని ఉద్దేశించి నా స్వవిషయానికి సంబంధించి రెండే రెండు మాటలు చెబుతాను. నాలుగు దశాబ్దాల క్రితం నాకు స్ఫూర్తి నిచ్చినవి ఈ రెండు శ్లోకాలే. రెండు వందలకు పైగా నేను జ్ఞాన యజ్ఞాలను నిర్వహించడం వెనుక ఈ రెండు శ్లోకాలే స్ఫూర్తి దాయకాలు.

గంగాజలంలో ముంచిన తులసి దళాలను చేత పట్టుకొని, ఐదు పది చేసి, ఒక సత్యం మీకు చెబుతున్నా! బాల్యం నుండి శ్రీకృష్ణు డంటే నాకు మాటల్లో చెప్ప లేనంత భక్తి. ముక్కు పచ్చలారని పూప వయస్సులో అర్థం కాకపోయినా, గీతను చేత పట్టుకొని చదువుతూ ఉంటే, ఈ రెండు శ్లోకాలు నన్ను కట్టి పడేశాయి. పరవశింప చేశాయి. ఈ పని చేయ గలిగితే, నేను నా దైవానికి దగ్గ రవుతానా! అని మనస్సు పిచ్చి దైంది. అలాగే చేయా లని నిశ్చయించు కున్నాను. దివారాత్రాలు దైవాన్ని ప్రార్థించాను. ఫలితం వచ్చిందో, లేదో నాకు తెలుసు. మీకూ తెలుసు. నేడు ఈ మహత్తర గ్రంథాన్ని మీ చేతులలో పెట్టడం అనే అద్భుత కార్యానికి ఈ రెండు శ్లోకాలలో భగవంతుడు పలికిన మాటలే ఆధార మని సవినయంగా చెప్పు కుంటున్నాను.

**ఓం నమో భగవతే వాసుదేవాయ**

*మోక్ష శాస్త్ర మైన గీతా శాస్త్రాన్ని చెప్పిన వాడే కాదు, చదివిన వాడు కూడా ధన్యుడే. చదవండి.*

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టః స్యా మితి మే మతిః ॥ 70

*అధ్యేష్యతే-చ-యః-ఇమం-ధర్మ్యం-సంవాదం-ఆవయోః*
*జ్ఞానయజ్ఞేన-తేన-అహం-ఇష్టః-స్యాం-ఇతి-మే-మతిః*

ఆవయోః = మన యొక్క
ధర్మ్యం = ధర్మప్రయోజన మైన
ఇమం = ఈ
సంవాదం = సంవాదమును
యః = ఎవడు
అధ్యేష్యతే చ = చదువ బోవుచున్నాడో
తేన = వాని చేత
జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞము చేతను
అహం = నేను
ఇష్టః = పూజితుడను
స్యాం = అగుదును
ఇతి = అని
మే = నా యొక్క
మతిః = నిశ్చయము

**అర్జునా! ధర్మ రూపమైన మన సంవాదమును ఎవడు చదువుతాడో, వాడు జ్ఞాన యజ్ఞముతో నన్ను పూజించిన వాడు అవుతాడు. ఇది నా నిశ్చితాభిప్రాయము.**

### వ్యాఖ్య

మోక్ష శాస్త్రమైన గీతను పఠించే వాడు పరమేశ్వరుని జ్ఞానయజ్ఞము చేత ఆరాధించిన వాడు అవుతాడు అంటున్నాడు భగవంతుడు. ఇది గీతా శాస్త్రాధ్యయన స్తుతి. ఇది అధ్యయన ఫలశ్రుతి.

ప్రచారం చేసే వాడు పది మందిని తరింప చేస్తాడు. ప్రచారం చేయలేక పోయినా, ఇతరులను తరింప చేయలేక పోయినా, స్వాధ్యాయం చేసే వాడు తానైనా తరిస్తాడు. ఎందరు తరించా రనేది విషయం కాదు. తరించడమే విషయం.

*గీతా శాస్త్రాన్ని బోధించ లేక పోయినా, పఠించలేక పోయినా, శ్రద్ధగా ఆలకించే వానికి కలిగే ఫలశ్రుతిని చెబుతున్నాడు.*

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః ।
సోఽపి ముక్తః శుభాన్ లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్ ॥ 71

***శ్రద్ధావాన్-అనసూయః-చ-శృణుయాత్-అపి-యః-నరః***
***సః-అపి-ముక్తః-శుభాన్-లోకాన్-ప్రాప్నుయాత్-పుణ్యకర్మణాం***

| | | | |
|---|---|---|---|
| యః | = ఏ | ముక్తః | = ముక్తుడై |
| నరః | = నరుడు | పుణ్య కర్మణాం | = పుణ్యకర్మల యొక్క |
| శ్రద్ధావాన్ | = శ్రద్ధావంతుడు | శుభాన్ | = శుభకరమైన |
| అనసూయః చ | = అసూయ లేని వాడు | లోకాన్ | = లోకములను |
| శృణుయాత్ అపి | = వినినా కూడా | ప్రాప్నుయాత్ | = పొందుతాడు |
| సః అపి | = వాడు | | |

**అర్జునా! ఈ గీతా జ్ఞానమును ఆలకించిన వాడు పాపము నుండి ముక్తు డవుతాడు. ప్రశస్తమైన పుణ్య లోకాలను పొందుతాడు.**

**వ్యాఖ్య**

ఈ శ్లోకంలో గీతా శాస్త్ర ప్రశంస జరుగుతూ ఉంది. దీనినే ఫలశ్రుతి అంటారు. శాస్త్రాన్ని వినడం వల్ల కలిగే ఫలమే ఫలశ్రుతి. శ్రద్ధ కలవారై ***(శ్రద్ధావాన్ శ్రద్ధధానః)***, అనసూయులై, అంటే అసూయ లేని వారై ***(అనసూయః అసూయా వర్జితః)***, ఈ గీతా శాస్త్రాన్ని ఆలకించినా కూడా ***(శృణుయాదపి)*** ప్రశస్త మైన పుణ్య లోకాలను పొందుతారు అని భగవంతుడు ఫలశ్రుతిని వినిపిస్తున్నాడు.

ఇక్కడ **శృణుయాదపి** - 'అపి' అంటే కూడా అని అర్థము. శాస్త్రాన్ని కేవలం వింటే కూడా పుణ్య లోకాలను పొందుతారు అంటే, శాస్త్రార్థాన్ని గ్రహించి జీవించే వారి మాట వేరే చెప్పాలా? అనే అర్థం అందులో ధ్వనిస్తోంది.

*చివరగా గీతాచార్యుడు శిష్యుడైన అర్జునుని ప్రశ్నిస్తున్నాడు.*

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా ।
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రనష్టస్తే ధనఞ్జయ ॥ 72

***కచ్చిత్-ఏతత్-శ్రుతం-పార్థ-త్వయా-ఏకాగ్రేణ-చేతసా***
***కచ్చిత్-అజ్ఞానసమ్మోహః-ప్రనష్టః-తే-ధనంజయ***

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | శ్రుతం కచ్చిత్ | = శ్రవణము చేయబడినది గదా |
| ఏతత్ | = ఇది | ధనంజయ | = అర్జునా! |
| త్వయా | = నీ చేత | తే | = నీ యొక్క |
| ఏకాగ్రేణ | = నిశ్చలమైన | అజ్ఞాన సమ్మోహః | = అజ్ఞానము వలన కలిగిన మోహము |
| చేతసా | = మనస్సుతో | ప్రనష్టః కచ్చిత్ | = పోయినది గదా! |





**పార్థా! గీతా శాస్త్రాన్ని నిశ్చలమైన బుద్ధితో శ్రద్ధగా విన్నావు కదా! ధనంజయా! అజ్ఞానము వల్ల ఏర్పడిన మోహం నశించిందా?**

**వ్యాఖ్య**

ఇది భగవద్గీతలో ఆచార్యుడైన శ్రీకృష్ణ భగవానుని చివరి మాటలు. అర్జునా! నా ఉపదేశాన్ని ఏకాగ్ర చిత్తంతో శ్రవణం చేశావు కదా! ధనంజయా! అజ్ఞానం వల్ల కలిగిన నీ మోహం నశించిందా? అని ప్రశ్నించాడు భక్తవత్సలు డైన భగవానుడు, శిష్యవత్సలు డైన గీతాచార్యుడు.

గీతాచార్యుడు భగవంతుడు. మనకు తండ్రి. భగవద్గీత భగవతి. మనకు తల్లి. గీతలో ప్రశ్న రూపంలో ఉన్న ఈ చివరి మాటలలో తండ్రి పాలనము ఉంది. తల్లి లాలనమూ ఉంది.

'అమ్మా! ఆకలిగా ఉంది' అని బిడ్డ అనగానే, కడుపారా తినిపించి, 'నాయనా! తృప్తిగా తిన్నావా? నీ ఆకలి తీరిందా?' అనే కన్నతల్లి చల్లని లాలనము గీతామాత చివరి మాటలుగా హృదయాన్ని స్పృశిస్తోంది.

నాయనా! శ్రద్ధతో ఆలకించావా? అజ్ఞానం వల్ల ఏర్పడిన నీ మోహం నశించిందా? అనే కన్నతండ్రి వెచ్చని పాలనము గీతాచార్యుని చివరి మాటలుగా మనస్సును పరవశింప చేస్తోంది.

ఆకలి తీరక పోతే ఇంక కాస్త తినిపిద్దా మనే తల్లి ఆలోచన; ఒకవేళ అర్థం కాకపోతే, మరొక ఉపాయం చేత నైనా మళ్ళీ బోధించి, కృతార్థుణ్ణి చేయాలనే తండ్రి ఉద్దేశము ***(తదగ్రహణే జ్ఞాతే పునః గ్రాహయిష్యామి ఉపాయాన్తరేణాపీతి ప్రష్టుః అభిప్రాయః)*** ఈ ప్రశ్నలో ఒదిగి ఉన్నాయి. వక్త, శ్రోతల శ్రమలు ఫలించాయో, లేదో తెలుసుకుందా మని చివరగా అర్జునుణ్ణి ప్రశ్నించాడు శ్రీకృష్ణ పరమాత్మ.

*అర్జునుడు సమాధానం చెబుతున్నాడు.*

**అర్జున ఉవాచ :**

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥ 73

***నష్టః-మోహః-స్మృతిః-లబ్ధా-త్వత్ప్రసాదాత్-మయా-అచ్యుత***
***స్థితః-అస్మి-గతసందేహః-కరిష్యే-వచనం-తవ***

| | | | |
|---|---|---|---|
| అచ్యుత | = కృష్ణా! | గతసందేహః | = సందేహములు తొలగి |
| త్వత్ప్రసాదాత్ | = నీ అనుగ్రహము వలన | స్థితః | = ఉన్న వాడను |
| మోహః | = మోహము | అస్మి | = అగుచున్నాను |
| నష్టః | = నశించినది | తవ | = నీ యొక్క |
| మయా | = నా చేత | వచనం | = ఆజ్ఞను |
| స్మృతిః | = స్మృతి | కరిష్యే | = ఆచరింతును |
| లబ్ధా | = పొంద బడింది | | |

**అర్జునుడు చెబుతున్నాడు :**

**అచ్యుతా! నా మోహం నశించింది. అంతా నీ అనుగ్రహము. ఆత్మ విషయం స్మృతికి అందింది. సందేహా లన్నీ తొలగి పోయాయి. నీ మాటే నా బాట.**

### వ్యాఖ్య

సర్వ వేదార్థ సారమైన గీతా శాస్త్రాన్ని సమాప్తం చేసిన భగవంతుడు, 'నేను చేసిన ఉపదేశాన్ని ఏకాగ్ర చిత్తంతో శ్రవణం చేశావా?' అంటూ మొదటి ప్రశ్నను సంధించాడు. ఈ ప్రశ్న వెనుక భగవంతుని హృదయం ఆవిష్కరింప బడుతూనే ఉంది. తాను ఏమి బోధించాడో, ఎలా బోధించాడో తనకు తెలుసు. బోధించిన వ్యక్తి సర్వజ్ఞత్వం కలిగిన పరమేశ్వరుడు. ఇక, బోధనావిధి సంప్రదాయ వైభవము. కనుక, అర్జునుడు అవధానం చెడకుండా శ్రవణం చేసి ఉంటే, జ్ఞానం కలగకుండా పోయే అవకాశం లేదు. అందుకని, ఏకాగ్ర చిత్తంతో ఆలకించావా? అని మొదటి ప్రశ్నను సంధించాడు.

ఇకపోతే, శ్రవణం సక్రమంగా సాగి ఉంటే, జ్ఞానం కలిగి తీరాలి. అజ్ఞానం నశించి ఉండాలి. అజ్ఞాన జనిత మోహం అదృశ్యమై ఉండాలి. కనుక, రోగ నిధానం చేసి అమృత తుల్యమైన ఔషధాన్ని ఇచ్చిన వైద్యుడు, చికిత్స పూర్తి అయిన తరువాత, 'నువ్వు చక్కగా మందు తీసుకున్నావా? నీ అనారోగ్యం పోయిందా?' అని అడిగి నట్లు, 'ఏకాగ్ర చిత్తంతో శ్రవణం చేశావా? అజ్ఞాన జనితమైన నీ మోహం నశించిందా?' అని భగవంతుడు అర్జునుణ్ణి ప్రశ్నించాడు. అర్జునుడు ఏం చెప్పాడు?

**మోహ నాశము - స్మృతి ప్రాప్తము**

అచ్యుతా! నా మోహం నశించింది ***( నష్టో మోహః )*** అనేశాడు. బాగుంది. ఇంతకీ ఏ మోహం నశించింది? అజ్ఞానం వల్ల కలిగింది, సమస్త సంసార రూప అనర్థానికి కారణ మైనది, భయంకరమైన సాగరము వలె దాట శక్యము కానిది అయిన మోహము నశించింది ***( నష్టః మోహః అజ్ఞానజః సమస్త సంసారానర్థ హేతుః సాగరః ఇవ దుస్తరః ).*** పోగొట్టు కున్నది సరే, రాబట్టుకున్న దేమైనా ఉందా? ఉంది. అదే చెబుతున్నాడు.

స్మృతి పొంద బడింది అంటున్నాడు ***(స్మృతిర్లబ్ధా).*** బాగుంది. ఇంతకీ ఆయనకు ప్రాప్తించిన స్మృతి ఏమిటి? ఆత్మతత్త్వాన్ని గూర్చిన స్మృతి లభించింది. ఏ స్మృతి లభించడం చేత సమస్త హృదయ గ్రంథులు (అజ్ఞాన ముడులు) విడి పోతాయో, అలాంటి స్మృతి కలిగింది ***( యస్యాః లాభాత్ సర్వ హృదయ గ్రంథీనాం విప్ర మోక్షః ).*** ఏ హృదయ గ్రంథులు సంసార హేతువులో అవి నశించాయి అంటున్నాడు.

**సందేహ నివారణము**

అజ్ఞానము సమూలంగా నశించింది. జ్ఞానము కలిగింది. శాస్త్రబోధ ఫలించింది అని అర్థము. కనుక, సర్వ సంశయాలు విచ్ఛిన్న మయ్యాయి. ప్రమేయగత సంశయము, ప్రమాణ గత సంశయము, రెండూ నశించి పోయాయి. శాస్త్రము విషయము లోను, శాస్త్రము ప్రతిపాదించే సత్య వస్తు నిర్ధారణ లోను, సంశయా లన్నీ పటాపంచ లయ్యాయి. అదే శ్రవణ ఫలం. ఈ అనుభూతి గీతా శాస్త్రార్థానికి, వేద శాస్త్రార్థానికి అద్దం పడుతూ ఉంది.

***భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యన్తే సర్వ సంశయాః ।***
***క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥***

పరమాత్మ జ్ఞానం కలగ గానే అజ్ఞాన ముడి విడి పోతుంది. జ్ఞానం కలగడం కారణంగా సర్వ సంశయాలు విచ్ఛిన్న మవుతాయి. కర్మ లన్నీ నశించి పోతాయి అని ముండకోపనిషత్తు *(2 - 2 - 9).*

**అర్జునుని ఔన్నత్యము**

నా ఉపదేశాన్ని ఏకాగ్ర చిత్తముతో విన్నావా? అని శ్రీకృష్ణ పరమాత్మ ప్రశ్నించాడు. కాని, అర్జునుడు





అవధాన చిత్తము తోనే ఆలకించాను అని చెప్ప లేదు. అచ్యుతా! నీ అనుగ్రహం వల్ల ***( త్వత్ప్రసాదాత్, మయా త్వత్ప్రసాదమ్ ఆశ్రితేన అచ్యుత! )*** అని వినమ్రుడై పలికాడు. వినయము ఉన్న వారి లోనే విద్య నిలుస్తుంది.

**అమృతము వంటి ఔషధమైనా**
**పథ్యము చెడితే విషమయము**
**ఎంత చదివినా ఎన్ని నేర్చినా**
**వినయము చెడితే వికృతము**
**ఫలవృక్షాలు వంగును క్రిందికి**
**మేఘజలాలు జారును అవనికి**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్** - అని రామజోగి చిట్కా.

**కేశవార్జునులు - ఆదర్శ గురుశిష్యులు**

శిష్యుని అజ్ఞానం సమూలంగా నశించే వరకు పట్టు వదలని ప్రయత్నం గల దయామయు డైన గురుదేవుడు, వినమ్రుడు, శాస్త్రాచార్యోపదేశము నందు అకుంఠిత మైన భక్తి శ్రద్ధలు గల శిక్షణ యోగ్యుడైన శిష్యుడు ఉన్న చోట జ్ఞానానికి కొరత ఎక్క డుంటుంది? శ్రీకృష్ణార్జునులు ఆదర్శ మైన గురుశిష్యులు.

జ్ఞానం కలగక ముందు అహంకారాన్ని పట్టుకొని, గాండీవాన్ని పడేశాడు. జ్ఞానం సిద్ధించిన తరువాత, అహంకారాన్ని పడేసి గాండీవాన్ని పట్టుకోవ డానికి సిద్ధ పడ్డాడు.

***యథేచ్ఛసి తథా కురు*** - బోధను ముగించి, 'నీకు ఎలా ఇష్ట మైతే అలా చెయ్యి!' అన్నాడు ఆచార్య దేవుడైన గురుదేవుడు. బోధను జీర్ణించుకున్న అర్జునుడు, ***కరిష్యే వచనం తవ*** - కృష్ణా! నువ్వు చెప్పినట్లే చేస్తాను అన్నాడు. ఆదర్శవంత మైన గురుశిష్యుల మధ్య ఇక్కడే శాస్త్రము జాజ్వల్యమాన మైంది.

***కరిష్యే*** అంటే ఆచరిస్తాను అని అర్థము. అదే కర్మయోగము. ఏమి ఆచరిస్తాడు? భగవంతుడు బోధించిన జ్ఞానము. అదే వచనము. వాక్యము. ***తత్త్వమసి*** మహావాక్యము ***(వచనం).*** అదే జ్ఞానయోగము.

కర్మయోగ మైనా, జ్ఞానయోగ మైనా, భక్తి హీనంగా, భక్తి శూన్యంగా ఉండటానికి వీలు లేదు. అందుచేత, ***తవ*** - నీ భక్తుడనై ***( తవ దాసోఽహం )*** ఆచరిస్తాను అంటూ పరమాత్మ బోధించిన గీతాశాస్త్రము నంతా, జ్ఞానయోగ, కర్మయోగాలను, భక్తి ప్రపత్తిని కలిపి, మూడు మాటల్లో చెప్పేశాడు అర్జునుడు ***( కరిష్యే వచనం తవ).*** అర్జునుని లాగా మనందరము కూడా ఈ వాక్యాన్ని భగవంతుడికి వినిపిస్తే, అర్జునుని చూచి సంతోషించి నట్లే, మన విషయంలో కూడా భగవంతుడు సంతోష పడతాడు.

శాస్త్రార్థము సమాప్త మైంది ***( పరి సమాప్తః శాస్త్రార్థః ).*** మనం కురుక్షేత్రం నుండి వెనుదిరుగు తున్నాం. యుద్ధభూమి నుండి వెను దిరిగి కథా సంబంధాన్ని గుర్తు తెచ్చుకుంటూ ***( ఇదానీం కథా సంబంధ దర్శనార్థమ్)*** ధృతరాష్ట్రుని మందిరం లోకి ప్రవేశిస్తున్నాం. అంధకారాన్ని తోడు చేసుకొని ధృతరాష్ట్రుడు వింటున్నాడు. ఆశ్చర్యాన్ని ప్రదర్శిస్తూ సంజయుడు చెబుతున్నాడు.

**సంజయ ఉవాచ :**

**ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥** 74

**ఇతి-అహం-వాసుదేవస్య-పార్థస్య-చ-మహాత్మనః**
**సంవాదం-ఇమం-అశ్రౌషం-అద్భుతం-రోమహర్షణం**

అహం = నేను
ఇతి = ఇట్లు
వాసుదేవస్య = శ్రీకృష్ణుని యొక్క
మహాత్మనః = మహాత్ము డగు
పార్థస్య చ = పార్థుని యొక్క

అద్భుతం = అద్భుత మైనది
రోమహర్షణం = గగుర్పాటును కలిగించునది
ఇమం = ఈ
సంవాదం = సంవాదమును
అశ్రౌషం = విన్నాను

**సంజయుడు వినిపిస్తున్నాడు :**

**రాజా! శ్రీ వాసుదేవునికి, మహాత్ముడైన అర్జునునికి మధ్య జరిగిన సంవాదమును ఆలకించాను. ఎంత అద్భుతమో! మేను పులకరిస్తోంది.**

**వ్యాఖ్య**

ధృతరాష్ట్ర మహారాజా! పరమేశ్వరు డైన వాసుదేవుని యొక్క, మహాత్ముడైన అర్జునుని యొక్క సంవాదమును (సమీచీన మైన వాదమును) విన్నాను. అత్యంత విస్మయకర మైన ఆ సంవాదము గగుర్పాటును కలిగించింది.

రాజా! ఈ సృష్టిలో గతంలో ఎన్ని యుద్ధాలు జరిగి ఉంటాయి? ఇలాంటి సంవాదమును కదన రంగంలో ఎవరైనా చూచి ఉంటారా? విని ఉంటారా? నా భాగ్యానికి పొంగి పోతున్నాను.

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్య మహం పరమ్ ।
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయతః స్వయమ్ ॥ 75

**వ్యాసప్రసాదాత్-శ్రుతవాన్-ఏతత్-గుహ్యం-అహం-పరం**
**యోగం-యోగేశ్వరాత్-కృష్ణాత్-సాక్షాత్-కథయతః-స్వయం**

వ్యాసప్రసాదాత్ = వ్యాసభగవానుని అనుగ్రహము వలన
గుహ్యం = గుహ్య మైనది
పరం = ఉత్తమ మైనది
ఏతత్ = ఈ
యోగం = యోగమును
స్వయం = స్వయముగ

కథయతః = చెప్పినటువంటి
యోగేశ్వరాత్ = యోగేశ్వరు డైనట్టి
కృష్ణాత్ = శ్రీకృష్ణుని వలన
అహం = నేను
సాక్షాత్ = ప్రత్యక్షముగ
శ్రుతవాన్ = విన్నాను

**రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు పలికిన గీతా జ్ఞానము ఉత్కృష్ట మైనది. రహస్య మైనది. వ్యాసుని దయ వల్ల నేను ప్రత్యక్షంగా విన గలిగాను.**

రాజ న్సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

**రాజన్-సంస్మృత్య-సంస్మృత్య-సంవాదం-ఇమం-అద్భుతం**
**కేశవార్జునయోః-పుణ్యం-హృష్యామి-చ-ముహుర్ముహుః**





రాజన్ = రాజా!
పుణ్యం = పుణ్యకరమైన
ఇమం = ఈ
అద్భుతం = ఆశ్చర్యకరమైన
కేశవా ర్జునయోః = కృష్ణార్జునుల యొక్క

సంవాదం = సంవాదమును
సంస్మృత్య సంస్మృత్య = తలచి తలచి
ముహుర్ముహుః = మాటిమాటికిని
హృష్యామి చ = సంతసించు చున్నాను

**ధృతరాష్ట్ర మహారాజా! కృష్ణార్జునుల మధ్య నడచిన ఈ సంవాదము పుణ్య ప్రదము. ఆశ్చర్యకరము. దానిని తలచి తలచి మళ్ళీ మళ్ళీ తన్మయ మౌతున్నాను.**

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ॥ 77

**తత్-చ-సంస్మృత్య-సంస్మృత్య-రూపం-అతి-అద్భుతం-హరేః**
**విస్మయః-మే-మహాన్-రాజన్-హృష్యామి-చ-పునః-పునః**

రాజన్ = రాజా!
హరేః = శ్రీకృష్ణుని యొక్క
అత్యద్భుతం = మిక్కిలి అద్భుతమైన
తత్ = ఆ
రూపం చ = రూపమును
సంస్మృత్య సంస్మృత్య = తలచి తలచి

మే = నాకు
మహాన్ = గొప్ప
విస్మయః = ఆశ్చర్యము కలుగుచున్నది
పునఃపునః చ = మరల మరల
హృష్యామి చ = సంతసించు చున్నాను

**రాజా! శ్రీహరి ప్రదర్శించిన మహాద్భుత మైన విశ్వరూపమును స్మరించే కొద్ది నాకు విస్మయం కలుగుతోంది. మళ్ళీ మళ్ళీ పులకించి పోతున్నాను.**

**వ్యాఖ్య**

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు పలికిన ఈ గీతా శాస్త్రమును ప్రత్యక్షంగా విన్నాను అనే సత్యాన్ని నమ్మలేక పోతున్నాను. ఇదంతా వ్యాస మహర్షి కరుణా కటాక్షమే. ఆ మహాత్ముని దయ వల్లనే నేను స్వయంగా విన గలిగాను. ఆ మాటలే నా వీనులలో మారుమ్రోగు తున్నాయి. మాటి మాటికి రోమహర్షణ మవుతూ ఉంది. రణరంగంలో వాసుదేవ పరబ్రహ్మము ప్రదర్శించిన దివ్యమైన విశ్వరూపము నా నేత్రాలలో కదుల్తూనే ఉంది. నా మనస్సులో మెదుల్తూనే ఉంది. మరపు రాని మధురానుభూతిగా వెలిగి పోతూ ఉంది.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥ 78

**యత్ర-యోగేశ్వరః-కృష్ణః-యత్ర-పార్థః-ధనుర్ధరః**
**తత్ర-శ్రీః-విజయః-భూతిః-ధ్రువా-నీతిః-మతిః-మమ**

యత్ర = ఎచ్చట
యోగేశ్వరః = యోగేశ్వరుడగు
కృష్ణః = శ్రీకృష్ణుడు

యత్ర = ఎచ్చట
ధనుర్ధరః = ధనుస్సును ధరించిన
పార్థః = అర్జునుడు

| | | |
|---|---|---|
| తత్ర | = | అచ్చట |
| శ్రీః | = | లక్ష్మియు |
| విజయః | = | విజయము |
| భూతిః | = | ఐశ్వర్యము |
| ధ్రువా | = | స్థిరమగు |
| నీతిః | = | నీతియు |
| ఇతి | = | అని |
| మమ | = | నా యొక్క |
| మతిః | = | అభిప్రాయము |

**రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధరు డైన ధనంజయుడు ఎక్కడ ఉంటారో, అక్కడ లక్ష్మి కొలువై ఉంటుంది. విజయలక్ష్మిగా, ఐశ్వర్య లక్ష్మిగా, దృఢమైన ధర్మరూప లక్ష్మిగా ఉంటుంది. ఇది నా అభిప్రాయము.**

**వ్యాఖ్య**

గీతా శాస్త్ర శ్రవణమును, విశ్వరూప సందర్శనానుభూతిని పదే పదే తలచుకుంటూ, తనలో తాను తలపోసుకుంటూ తన్మయు డవుతున్న సంజయుడు, తన అభిప్రాయాన్ని ***తత్ర*** అంటూ, ఈ చివరి శ్లోకంలో ధృతరాష్ట్రునికి విన్నవించు కుంటున్నాడు.

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఎక్కడ ఉంటాడో, అక్కడ సంపద, విజయము ఉంటాయి. ధనుర్ధారి అయిన అర్జునుడు ఎక్కడ ఉంటాడో, అక్కడ సంపద, విజయము ఉంటాయి. ప్రస్తుతం ఇద్దరూ ఒకే చోట, ఒకే పక్షంలో ఉన్నారు. సంపద మరొక చోట ఎలా ఉంటుంది? విజయము మరొకరిని ఎలా వరిస్తుంది? అని తన అభిప్రాయాన్ని సూటిగా చెప్పేశాడు సంజయుడు ***(మతిః మమ ఇతి)***.

ఈ దశలో ధృతరాష్ట్రునిలో మార్పును సంజయుడు ఆశిస్తున్నా డని నే నైతే అనుకోవడం లేదు. కాకపోతే, తనయుడి విజయముపై తండ్రి ఇక ఆశలు వదులు కోవచ్చని సూటి గానే చెప్పిన ట్లైంది.

**అర్జునుల మైతేనే ఆత్మజ్ఞానం**

'అర్జున' శబ్దానికి బుద్ధి కల వాడని అర్థము. పరిశుద్ధ మైన తెల్లని అంతఃకరణము కల వాడని శ్రీశంకరాచార్య స్వామి భాష్యంలో వ్యాఖ్యానించారు ***(శుక్లాన్త రాత్మ స్వభావః విశుద్ధాంతః కరణః ఇతి)***. ఇందుకు వేదాన్ని కూడా సహకారంగా ఉటంకించారు.

***అహశ్చకృష్ణం అహ రర్జునం చ - అహః*** అంటే పగలు. ***అహశ్చకృష్ణం*** అంటే ఒక పగలు నల్లని మేఘాలతో కప్పబడిన ఆకాశం లాగా ఉంది (శ్రీకృష్ణ పరమాత్మ). ***అహరర్జునం*** అంటే, ఒక పగలు స్వచ్ఛంగా, దివ్యంగా ప్రకాశిస్తూ ఉంది అని అర్థం. అదే శుద్ధ బుద్ధి. అర్జున బుద్ధి.

***యత్ర*** అంటూ సంజయుడు శ్లోకారంభం చేయడంలో ఇరువురు ఒకే చోట ఉన్నారు అనేదే స్థూలంగా తెలిపే భావ మైతే, ఇరువురు ఒక్కరే అనేది సూక్ష్మంగా దాగి ఉన్న అంతర్భావం. అదే నర నారాయణ స్వరూప వైభవం.

అందుకనే, ***పార్థస్య చ మహాత్మనః*** అంటూ అర్జునుణ్ణి ఆకాశానికి ఎత్తేశాడు సంజయుడు. అర్జును డెంతటి భాగ్యవంతుడో! లేకపోతే, సాక్షాత్తు భగవంతుడైన వాసుదేవ పరబ్రహ్మము స్వయంగా, అంతగా శ్లాఘిస్తాడా?

***ఇష్టోఽసి*** - అర్జునా! నువ్వు నాకు ఇష్టుడివి *(64 వ శ్లో)*. ***భక్తోఽసి*** - నువ్వు నా భక్తుడివి *(4 వ అ - 3 వ శ్లో)*. నువ్వు నాకు సఖుడివి. ప్రియుడివి అని భగవంతుని చేత ఎన్ని సార్లు అనిపించు కున్నాడో? ఎవరి కుంది ఆ భాగ్యం? దుఃఖ మొచ్చినా కృష్ణుణ్ణే ముందుంచుకొని ఏడ్చాడు. ఆనందం కలిగినా, కృష్ణుని సన్నిధి లోనే పరవశించాడు. అదే పార్థుని భక్తి. భగవంతుడు భక్త వశుడు. అందుకు అర్జునుడే నిదర్శనము. అర్జునుని భక్తి శ్రీకృష్ణుని ఎంతగా కదిలించిందో చెప్పడానికి మాటలు సరిపోవు. అదేదో అర్జునుని మాట ల్లోనే విందాం.





అది కూడా తియ్యని తెలుగుకే తేనెలు తాపిన పోతన పదాలలో విని తృప్తి చెందుదాము.

*సీ॥ చెలికాడ! రమ్మని చీరు నన్నొక వేళ మన్నించు నొక వేళ మఱంది యనుచు*
*బంధు భావంబున బాటించు నొక వేళ దాతయై నొక వేళ ధనము లిచ్చు*
*మంత్రియై యొక వేళ మంత్ర మాదేశించు బోధియై యొక వేళ బుద్ధి సెప్పు*
*సారథ్య మొనరించు జన విచ్చి యొక వేళ గ్రీడించు నొక వేళ గేలి సేయు*

*తే॥ నొక్క శయ్యాస నంబున నుండు గన్న తండ్రి కైవడిఁ జేసిన తప్పు గాచు*
*హస్తములు వట్టి పొత్తున నారగించు మనుజ వల్లభ! మాధవ మరవ రాదు!*

మా కృష్ణయ్యకు నే నంటే ఎంత ప్రేమో! చెలికాడా! రా! రా! అని ఒకసారి పిలిచే వాడు. బావమరదీ! అని ముద్దుగా మరొకసారి సంబోధించే వాడు. బంధువై ఆదరిస్తాడు. ఔదార్యాన్ని ప్రదర్శిస్తూ నాకు సొమ్ము లిచ్చేశాడు. ఒక్కొక్కసారి మంత్రి లాగా సలహా లిచ్చే వాడు. ఒక్కొక్కసారి గురువు లాగా బుద్ధి చెప్పే వాడు. రథం నడిపే టప్పుడు చనువుతో భాషించే వాడు. ఒక్కొక్కసారి హాస్యానికి నన్ను ఆట పట్టించే వాడు. కొన్ని పర్యాయాలు నన్ను తన పడకపై కూర్చో బెట్టుకొని తండ్రి లాగా నా తప్పుల్ని ఎత్తి చూపి సరి చేసే వాడు. ఒక్కొక్కసారి నన్ను చేతులు పట్టుకొని, బలవంతంగా ఇంక కొద్దిగా, ఇంక కొద్దిగా అని తన చేత్తో తినిపించే వాడు. అన్నా! ధర్మరాజా! నా మాధవ బావను నేను మరచి పోగలనా? అన్నాడు ధర్మరాజుతో అర్జునుడు.

నా గుండె వ్రాయ లేనంత బరు వెక్కుతోంది. నీళ్ళను ఆపుకొనే శక్తి నా కళ్ళకు లేకుండా పోతోంది. ఇలా పులకరిస్తూ, పరవశిస్తూ చైతన్య భగవద్గీతను సమాప్తం చేస్తున్నందుకు పొంగి పోతున్నా! పారం తెలియని పరమేశ్వరుని పరమ ప్రేమకు తల వంచి, ఐదు పది చేసి, వందన మని వంగుతున్నా!

ఇక శ్లోక విషయం.

సంపద, విజయము, ఐశ్వర్యము, దృఢమైన ధర్మము - వీటిని అందరూ వాంఛిస్తారు. ఇవన్నీ అందరికీ లభ్యం కావు. కాని, అందరూ వీటిని అభిలషిస్తూ ఉంటారు. ఎవరికి ఏది అవసరమో దాని కొరకు ప్రయత్నిస్తూ ఉంటారు. కాని, లభ్యం కావచ్చు. కాక పోవచ్చు. ఒకటి లభ్యమైతే మరొకటి లభ్యం కాక పోవచ్చు.

కాని, ఒక్క దానిని పొంద గలిగితే, అన్నీ పొందినట్లే అవుతుంది. ఏమిటది? మోక్షము. అది ఎక్క డుంటుంది? ఎక్కడైతే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధారి అయిన అర్జునుడు ఉంటారో, అక్కడ మోక్షము. ఆ మోక్షము లోనే ధర్మార్థ కామాలు సిద్ధిస్తాయి. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు జ్ఞానయోగానికి ప్రతిరూపము. ధనుర్ధారి యైన అర్జునుడు కర్మయోగానికి ప్రతిరూపము. కర్మయోగం ద్వారా అంతఃకరణ శుద్ధిని పొంది, జ్ఞాన నిష్ఠా యోగ్యతా లక్షణాన్ని సిద్ధింప చేసుకుంటే, ఆ తరువాత జ్ఞాన నిష్ఠ ఫలంగా అద్వైతామృత రూపమైన మోక్షము సిద్ధిస్తుంది. **అస్తు.**

**కైవల్య ప్రాప్తి రస్తు!**

## ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసంన్యాస యోగోనామ అష్టాదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు మోక్షసన్న్యాస యోగ మనే పద్దెనిమిదవ అధ్యాయము.**





# అకారాది శ్లోకానుక్రమణిక

## చతుర్దశాధ్యాయము









చైతన్య భగవద్గీత

# అకారాది శ్లోకానుక్రమణిక

## పంచదశాధ్యాయము





## చైతన్య భగవద్గీత

# అకారాది శ్లోకానుక్రమణిక

## షోడశాధ్యాయము









## చైతన్య భగవద్గీత

# అకారాది శ్లోకానుక్రమణిక

## సప్తదశాధ్యాయము





# అకారాది శ్లోకానుక్రమణిక



## అష్టాదశాధ్యాయము










# అకారాది శ్లోకానుక్రమణిక





## అష్టాదశాధ్యాయము

## గీతామతా! హారతి గైకొనుమా!

స్వామి సుందర చైతన్యానంద

ఓం జయ గీతామాతా! ఓం జయ గీతామాతా
భవబంధము తొలగించి ముక్తి నొసగు దాత ॥ ఓం ॥

కర్మ భక్తి జ్ఞాన యోగములు
నీ ఆభరణాలు - అమ్మా నీ ఆభరణాలు
ముక్తి నొసగు నీ సన్నిధి కరుణించుము మాతా ॥ ఓం ॥

1. సీతవు నీవే సావిత్రివి నీవే
గాయత్రివి నీవే - అమ్మా గాయత్రివి నీవే
గంగాయమునా సరస్వతులలో పవిత్రతవు నీవే ॥ ఓం ॥

2. జాగ్రత్స్వప్న సుషుప్తులలో సాక్షివై యుండి
దివ్య సాక్షివై యుండి
తురీయాతీత బ్రహ్మవు నీవే చిన్మయ స్వరూపిణి ॥ ఓం ॥

3. విషాదమును దాటించి సాంఖ్యము బోధించి
అమ్మా సాంఖ్యము బోధించి
కర్మ జ్ఞాన సంన్యాసము ధ్యానమును తెలుపు
మమ్ము ఆత్మలో నిలుపు ॥ ఓం ॥

4. విజ్ఞానమును తెలిపి అక్షర బ్రహ్మమును పలికి
రాజగుహ్య విభూతి దర్శన భక్తిని అందించు
మాకు ముక్తి ప్రసాదించు ॥ ఓం ॥

5. క్షేత్రము కాదని, క్షేత్రజ్ఞుడ నేనని
గుణత్రయము వివరించు,
పురుషునిలో మమ్ముంచు,
దైవాసుర సంపత్తి శ్రద్ధను బోధించు
మోక్షరూపముగా ఉంచు ॥ ఓం ॥

6. అమ్మవు నీవు ఆత్మవు నీవు
అంతయు నీవేలే! ఉన్నదంతయు నీవేలే
సుందరమగు చైతన్యము నీవు
లక్ష్మివి నీవేలే! మోక్షలక్ష్మివి నీవేలే ॥ ఓం ॥



## నిరుపమ వేదమ్మకు నిజపద నీరాజనం

కాల ప్రవాహానికి ఎదురీది, కలకాలం నిలిచే కాలాతీత జ్ఞాన పుష్పాన్ని జడలో తురుముకొని శోభించే వేదమ్మకు

**మనసైన నీరాజనం.**
**మంగళకరమైన నీరాజనం.**

అబ్ధి మథనంలో అమృతము ప్రాప్తిస్తే, అంతరంగ మథనంలో అద్వైతం సిద్ధిస్తుందని బోధించిన శ్రుతిమాతకు

**కవితా కెంపుల నీరాజనం.**
**మమతా మాణిక్య నీరాజనం.**

ముందు నిలిచిన మనుగడే అర్థం గాని మనిషికి వెనుక నడిపే వెన్నుని మురళీరవాన్ని వినిపించిన వేదనాద కుమారికి

**చరాచర సార నీరాజనం.**
**అమృత స్వరసార నీరాజనం.**

భవ సంతప్త హృదయాలకు శివజ్ఞానామృతమును పోయుటలో చలివేంద్రమై విలసిల్లిన ఉపనిషత్కుమారికి

**గీర్వాణ నీరాజనం.**
**స్వరూప నిర్వాణ నీరాజనం.**

మతి కందని గతి తానై, జత నోర్వని ద్యుతి తానై, యతిమదిలో శ్రుతిని మీటి పలుకు నేర్పిన ప్రభావతికి, పలుకు కందని జ్ఞానకళావతికి

**చిన్ముద్ర నీరాజనం.**
**రుద్రుని యెద భద్ర నీరాజనం.**

లేని వాటిని ఉన్నవంటూ ఉట్టికెక్కించే ఉన్మాదంలో మతాలు ఉల్లి పువ్వుల్ని ఊరేగిస్తుంటే, ఉన్న వాటిని లేవంటూ 'ఉనికి'ని వాడని మల్లెపువ్వులా ఉర్విపై ఊరేగించిన వేదవతికి

**భావుక నీరాజనం.**
**బలమైన తార్కిక నీరాజనం.**

బండరాతి గుండెలను కరిగించి, మనసులలో మల్లెలను పూయించి, హృదయాలలో వెన్నెలను కాయించే ఋషి బిడ్డలను ప్రసవించిన వేదాంత జననికి

**ప్రామాణ్య నీరాజనం.**
**బహుముఖ ప్రావీణ్య నీరాజనం.**

అమృతాన్ని పానం చేసిన రాహువు రాక్షసుడుగనే మిగిలిపోయినా జ్ఞానామృతాన్ని పానం చేసిన మానవుడు మానవుడుగా మిగలక పోవుటయే గాక మాధవుడుగా వెలిగి పోతాడని ప్రమాణ మందించి నిరూపించిన శ్రుతి శిఖర సంచారిణికి, వేదవిద్యావతికి ....

**శ్రుతిరేవ శరణ మితి నీరాజనం.**
**అఖండ రూప స్థితి రేవ నీరాజనం.**

స్వామి సుందర చైతన్యానంద

# అమ్మా! భారతీ! అందుకో హారతి!

స్వామి సుందర చైతన్యానంద

ఎత్తైన భావ సంపదలో, లోతైన హృదయ సౌందర్యంలో నాకు మించిన వారు లేరంటూ, హిమాలయాలను, సాగర జలాలను అటు ఇటు ఉంచుకొని శోభించే జననీ! భరతావనీ! జోహారు!

శతాబ్దాల సంకెళ్ళతో చేతులు చలించక పోయినా, జ్ఞాన రుధిర ప్రవాహం క్షణమైనా ఆగని చైతన్య సంజీవనీ! పరమ పావనీ! జోహారు!

గంగా తరంగాల సంగీత పొంగులు, యమునా జలాలలో కన్నయ్య నవ్వులు కలబోసి కులికేటి సుకుమార జననీ! మంగళకళ్యాణీ! జోహారు!

హింసాయుత దుండగులను అహింసతో నిలదీసి సమతా సందేశంతో సంబర మొనరించిన సహన ప్రియా! సేవామయా! సదాశయా! జోహారు!

అమ్మా!

కర్మయోగులను కన్నావు. ధర్మవీరులను పెంచావు. త్యాగధనులను పెంపొందించావు. బుద్ధుని మొదలు వివేకానందుని వరకు శాంతిదూతలను, జ్ఞానప్రదాతలను ప్రపంచాని కందించావు. బాహ్యంలో మండుటెండలు రగులుతున్నా, ఆంతర్యంలో పండు వెన్నెలలు పూయించుకొనే విద్యను ఉగ్గుపాలతో నీ బిడ్డలకు నేర్పావు.

అమ్మా! నీ కొంగు పట్టుకొని తిరిగిన నీ బిడ్డలు శాంతికపోతాలు. నీ కీర్తి రథానికి అమర్చిన చక్రాలు.

అమ్మల గన్న అమ్మకు అఖిల జగతి శిరమోడ్చి నీరాజన మిచ్చే రోజు ఎంతో దూరంలో లేదు. ఆ కలలు పండేరోజు, ఆ కళల పండుగరోజు ఇక ఎంతో కాలం పట్టదు.

విబుధావని విమలకీర్తి విశ్వగగనంలో ఊరేగే సమయం మరెప్పుడో కాదు. దివి నుండి దివ్యాత్ములు భువికి బయలు దేరారు.

ఆర్షసంస్కృతీ జగతిలో ఆశాదీపికలు వెలిగాయి.

వేదాంత వెన్నెల విశ్వాన్ని తడుప బోతోంది.

జ్ఞాన శంఖాన్ని పూరిస్తూ శాంతిజ్యోతుల్ని వెలిగించ బోతోంది.

రేబవలు ఋషికీర్తిని సంద్రము కీర్తిస్తుంటే, ఋషి వాణిని హృదిలో నిలుపుకొని, మసి తుడిచే ప్రయత్నంలో పవిత్రాత్ములు పావురాలై విహరించే రోజులు దగ్గరి కొస్తున్నాయి.

ఇక,

హింసపై అహింస దండయాత్ర చేస్తుంది. ద్వేషాన్ని ప్రేమ కాల రాచేస్తుంది. లోభాలను త్యాగాలు



చుట్టు ముట్టేస్తాయి. స్వార్థాన్ని సేవలు నిలదీస్తాయి. అధర్మాన్ని ధర్మం జయిస్తుంది. కామాన్ని ప్రేమ దగ్ధం చేస్తుంది.

జ్ఞాన పవనాలు వీచేందుకు సిద్ధంగా ఉన్నాయి. ప్రేమ తరంగాలు లేచేందుకు ఉరక లేస్తున్నాయి. ఇక నడువ లేనంటూ మంచి పరుగెత్త బోతోంది. ఇక చలించ లేనంటూ శాంతి కూర్చోబోతోంది.

ఆకాశంలో ప్రతి తార అంబరానికి అలంకారమే. భారతావనిలో ప్రతిబిడ్డ అమ్మ ఖ్యాతికి ఆభరణమే.

జయభేరిని మ్రోగించే అలలే అమ్మ బిడ్డలు.

జైత్రయాత్ర సాగించే కళలే అమ్మ తనయులు.

మా అమ్మ శారదను ధనమ్మకు అమ్మలేనంటూ కాయలు కాచిన చేతులతో కవితా పంటను పండించిన కవికృషీవలుడు పోతన మాకు స్పందన.

'నిధి చాల సుఖమా! రాముని సన్నిధి సేవ సుఖమా?

నిజముగ బల్కు మనసా!' అని మనస్సునే నిలదీసిన త్యాగానికి రాజు మా త్యాగరాజు మీదే మాకు మోజు.

అమ్మా! మము గన్న తల్లి! మా కల్పవల్లి!

మనస్సులను పరిమళింపచేసే మంచి మల్లెల మాటలను మాచే పలికించు.

గుండె గుండెను గుడిగా మార్చే వెన్నెల పాటలు పాడించు. వేదాంత వెన్నెల పాటలు పాడించు.

తీపిగుండెలో నాలుకను తడిపి రాగసుధను ఒలికించే శక్తిని ప్రసాదించు.

ముళ్ళు చుట్టు ముట్టినా మృదువుగా నవ్వే గులాబీల గుట్టు మాకు నేర్పించు. లోతుల కెళ్ళి తురుముతున్నా తుమ్మెదలకు తీపి తేనెలను తినిపించిన మందారాలుగా మము దీవించు.

జై భారత్!



## పరమహంసల పుటలు
## మహాత్ముల అభినందనలు - ఆశీస్సులు

స్వామి సుందర చైతన్యానందులు ఏకత్వానికి, దివ్యత్వానికి, పవిత్రతకు ప్రతిరూపము. నేడు మనకున్న మహాత్ములలో, ప్రమాణ పురుషులలో వీరు ఒకరు. ఆత్మజ్ఞానమును పంచుతూ, నిత్యశాంతి వైపుకు మానవాళిని మరలిస్తున్న మహనీయులు వీరు. సనాతన ధర్మమునకు వీరు చేస్తున్న సేవ అమోఘము.



స్వామీజీ శ్రీకృష్ణ భగవానుని పరమ భక్తులు. కృష్ణ చైతన్యమునకు విశ్వకేంద్రంగా ఈ ఆశ్రమమును తీర్చి దిద్దుటలో నేనూ మీలో ఒకడినై ఉంటాను. 'శుద్ధ' - 'సుందర' కృష్ణ తత్త్వములో సదా ఏకమై ఉండెదరు.

**మహర్షి శుద్ధానంద భారతి**

**యోగ సమాజ్ స్థాపకులు**



సుందర చైతన్యానంద స్వామికి పాండిత్యము ఉంది. ఆధ్యాత్మిక జీవితము ఉంది. ఆధునిక విద్యను, సంస్కృతాన్ని సమున్నతంగా పొంది, తమ అద్భుతమైన శక్తిని, సంగీత వైదుష్యమును మన రాష్ట్రంలో సనాతన ధర్మ ప్రచారానికి వినియోగించారు.

**స్వామి రంగనాథానంద**

**అధ్యక్షులు, రామకృష్ణ మిషన్**





సుందర చైతన్యానంద స్వామి ఆంధ్రదేశంలో విస్తృతంగా నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక కార్యక్రమాలను గూర్చి తెలుసుకొని అమితానందమును పొందుతూ ఉన్నాను.

మహోన్నత దృక్పథంతో వారు చేపట్టే పవిత్ర కార్యాలు నన్ను పులకాంకితుడను చేస్తూ ఉన్నాయి. వేదాంత ప్రబోధముల ద్వారా ఆర్షసంస్కృతిని పునరుద్ధరించేందుకు ఈ విధమైన నిశ్శబ్ద ఆధ్యాత్మిక ఉద్యమాలే ఏకైక మార్గము.

శక్తివంతమైన వారి యజ్ఞకార్యములు ఎడతెగక నిత్యము కొనసాగాలని ప్రార్థిస్తూ ఉన్నాను.

**స్వామి చిన్మయానంద**

**చిన్మయ మిషన్**



శ్రీ శంకరాచార్య స్వామి ఏ ధర్మం కొరకు పాటు పడ్డారో, సుందర చైతన్యానంద స్వామి కూడా ఆ ధర్మం కొరకే శ్రమిస్తున్నారు. శంకర సిద్ధాంతాన్ని, వేదాంత వైభవాన్ని వినిపించేందుకు కంకణం కట్టుకున్నారు. మా పీఠము తరపున వారికి 'సత్సంగ ప్రచారమణి' అనే బిరుదును ఇచ్చాము.

**స్వామి జయేంద్ర సరస్వతి**

**కంచి కామకోటి పీఠాధిపతులు**

భగీరథుడు ఆకాశగంగను భూలోకంలో ప్రవహింప చేసినట్లు, శ్రీ సుందర చైతన్యానంద స్వామి అపర భగీరథులై వారు వెళ్ళిన చోటల్లా జ్ఞానగంగను ప్రవహింప చేశారు. సంసార జీవనయాత్రలో విసిగి వేసారిన మానవ హృదయాలపై భక్తి అనెడి అమృతాన్ని చిందింప చేసి వారిని కడతేర్చిన మహానుభావులు శ్రీసుందర చైతన్యానందుల వారు. ఒక మహాసభలో వారికి 'జ్ఞానబ్రహ్మ' ప్రశస్తిని మేము ఇచ్చినాము.



**స్వామి విశ్వేశ తీర్థులు**

**పెజావరు పీఠాధిపతులు**

**ఉడిపి**



సుందర చైతన్యస్వామి కలకాలము జీవించు గాక! పూర్ణ ఆయురారోగ్యాలతో ఈ ధర్మ ప్రచార ఉద్యమములో, జన జాగరణ కార్యములో వర్ధిల్లు గాక! వేదాలలో, రామాయణ భాగవతాది పురాణ ఇతిహాసము లలో నిక్షిప్తమై ఉన్న జ్ఞానమణులను వెలికి తీసి వితరణ చేయుటలో వారికి వారే సాటి. వారి జీవన విధానము, వారి ప్రచారోద్య మము అంతులేని కళలతో, విశేష జ్ఞాన వైభవంతో విరాజిల్లుతూ ఉన్నాయి.

గహనమైన విషయాలను సరళమైన శైలిలో అక్షర రూపంలో లిఖించి అలరించే నేర్పు పరమాత్మ వారి కిచ్చిన అపురూపమైన వరము. సరస్వతీ కటాక్షం వారిపై పూర్ణంగా ఉంది.

**స్వామి చిదానంద**
***అధ్యక్షులు, దివ్యజీవన సంఘము, ఋషీకేశ్***

శ్రీ స్వామి సుందర చైతన్యానందజీతో మాకు 1965 వ సంవత్సరము నుండి, అనగా వారు వేంకటగిరిలో విద్యార్థిగా ఉన్నప్పటి నుండి పరిచయ మున్నది. విద్యార్థిగా ఉన్నప్పుడే వారు మా దివ్యజీవన సంఘ కార్యక్రమాలలో తరచుగా పాల్గొను చుండెడి వారు. వారు మేము అనేక సార్లు భజనలు - సంకీర్తనలు కలిసి చేసితిమి.



శ్రీ సుందర చైతన్యానంద స్వాముల వారు అనేక చోట్ల గీతా యజ్ఞములను నిర్వహించినారు. మంచి పేరును గడించినారు. ఆశ్రమమును స్థాపించి వారి ప్రచార కార్యక్రమములను విరివిగా సాగించుచున్నారు. వారి సంకీర్తనా మాధుర్యమును చవిగొన్నవారు, వారి ప్రవచనములను విని ఆకర్షింపబడిన వారు అనేకమంది భక్తులు మమ్ములను కలిసి చెప్పునప్పుడు ఎంతో ఆనందించు చుందుము.

కరుణాసాగరుడైన శ్రీకృష్ణ పరమాత్మ శ్రీ సుందర చైతన్యానంద స్వాముల వారు విరివిగా ఆధ్యాత్మిక ప్రచార, ప్రసారము లొనర్చుటకు వలయు ఆయురారోగ్యములను, బలమును ప్రసాదించి రక్షించు గాక!

**స్వామి దేవానంద**
**శివానందాశ్రమము, ఋషీకేశ్, హిమాలయములు.**



**"సత్పురుషులకు జన్మ నిచ్చిన వంశము ధన్యము, తల్లిదండ్రులు ధన్యులు, దేశము ధన్యము"** - ఇది శాస్త్ర వచనము. భారతమాత నిరంతరం సద్గురువులకు, సంత పురుషులకు జన్మ నిస్తూనే ఉంది. వారిలో కొందరు మన సమకాలీనులుగా జీవించడం మన భాగ్యం. అటువంటి ఉత్తమ కోవకు చెందిన మహనీయులే మన ప్రియతమ స్వామి సుందర చైతన్యానందజీ మహరాజ్.

చిరుతప్రాయము లోనే అంకిత భావము, సనాతన ధర్మశాస్త్రము నందు అకుంఠిత దీక్ష, బహుముఖ ప్రావీణ్యములతో ఆంధ్రదేశ మంతటా లక్షలాది మందిని ఆకర్షించి దైవోన్ముఖులను గావిస్తూ ఉన్నారు.

మృదు మధుర స్వరముతో, హృదయ లోతుల నుండి పెల్లుబుకు గాన మాధుర్యముతో శ్రోతల హృదయాలను భక్తి పారవశ్యంలో ముంచెత్తు తున్నారు.

దేశ సమైక్యత మరియు ఆధ్యాత్మికత వైపుకు మానవాళిని నడుప గల శక్తిని శ్రీ పాండురంగడు, రుక్మిణీదేవి వారికి అనుగ్రహింతురు గాక!

**సంత్ కేశవదాస్**
**దాసాశ్రమం, బెంగుళూరు**



**జగత్పిత పపా!**
**ప్రియతమ సుందర రాజన్,**

పూజ్య పపా జ్ఞానమయ పలుకులు మీకు సదా స్ఫూర్తి దాయక మగుగాక. . . .

"సత్య జ్ఞానము అజ్ఞానమును నిర్మూలించి అహంకారమును విలీన మొనర్చును. విశ్వ కారణము, సర్వవ్యాపి అయిన చైతన్యాత్మయే నేను అన్న ఎరుకయే సత్యజ్ఞానము."

మీ ప్రేమపూరిత మైన ఉత్తరముతో పాటు ఈ నెల 14 నుండి 29 వ తేది వరకు మీరు నిర్వహించనున్న గీతా జ్ఞానయజ్ఞ ఆహ్వానము అందినది. ఈ పవిత్ర యజ్ఞకార్యము, అందు పాల్గొను సమస్త భక్తజనులపై పూజ్య పపా పూర్ణ ఆశీస్సులు వర్షించుగాక!

**మాతా కృష్ణాబాయి**
***9-8-74***
**ఆనందాశ్రమం, కన్హన్‌గాడ్, కేరళ**



శ్రీ స్వామి దయానందజీతో పూజ్య స్వామీజీ



శ్రీ స్వామి బాలగంగాధరనాథ్‌జీతో పూజ్య స్వామీజీ





రామకృష్ణ మఠాధ్యక్షులు
శ్రీ స్వామి అనన్యానందజీతో పూజ్య స్వామీజీ



# సుందర చైతన్య మహోద్యమంలో వెలసిన భగవాన్ శ్రీ మురళీకృష్ణ ఆలయాలు - సత్సంగ మందిరాలు





భగవాన్ శ్రీ మురళీకృష్ణ ఆలయం - సుందర చైతన్యాశ్రమం, హైదరాబాద్





ధవళేశ్వరం
తూర్పు గోదావరి జిల్లా



విశాఖపట్నం



కడప



నెల్లూరు


సిద్దిపేట
మెదక్ జిల్లా


మెట్‌పల్లి
కరీంనగర్ జిల్లా


నిర్మల్
ఆదిలాబాద్ జిల్లా


గజ్వేల్
మెదక్ జిల్లా

# సుందర చైతన్యం

అఖిలాంధ్ర దేశంలో తమ గంభీరోపన్యాసముల ద్వారా, విశేష గ్రంథ రచనల ద్వారా, సుమధుర సంకీర్తనము ద్వారా లక్షలాది భక్త జన హృదయాలలో జ్ఞాన జ్యోతులను వెలిగించిన మహా మనీషి, సంప్రదాయ మహర్షి,

ఆర్ష సంస్కృతీ పునర్వైభవానికి పిలుపు నిచ్చి, అరవై రెండు సంవత్సరాల జీవిత కాలములో నలభై రెండు సంవత్సరాలు భక్త జన క్షేమానికి వినియోగించిన అనుభవ వేదాంత ప్రవక్త, ఆర్ష విజ్ఞాన కంఠీరవము,

మంజులామృత భాషణంలో మహిని పులకింప చేసిన మహాయతి, వేద వేదాంత శాస్త్ర పురాణేతిహాస రహస్యార్థ సారమతి, అపర సరస్వతి, ఆదర్శ పుణ్యమూర్తి,

అజ్ఞాన చీకట్లు ముసిరిన హృదయాలలో నిత్య వెలుగులను నింపి, సనాతన ధర్మ జీవన బాటను అద్భుతంగా తీర్చి దిద్దుతూ, వక్తగా, రచయితగా, గాయకుడుగా, బోధకుడుగా, గురువుగా అశేష భక్త జనుల హృదయ మందిరాలలో ప్రతిష్ఠింప బడి ఉన్న పరమ పూజ్య గురుదేవులు,

**శ్రీశ్రీశ్రీ స్వామి సుందర చైతన్యానందుల** వారు.

## శ్రీ చైతన్య జయ ధ్వజం

*సర్వజిత్ - మార్గశీర్షశ్రీః*
*గీతా భాగవతో దయః*
*జ్ఞానబ్రహ్మర్ష సర్వజ్ఞ*
*శ్రీ చైతన్య జయ ధ్వజః*

శ్రీ సర్వజిల్ వైకుంఠైకాదశి గీతా జయంతీ పరోషస్సున 1947 డిసెంబరు 25 వ తేది ఉదయం 4.30 గంటలకు శ్రీ స్వామీజీ వారి **ఆవిర్భావ విజయం.**

శ్రీ ప్లవంగ వినాయక చతుర్థి 1967 డిసెంబరు 8 వ తేది శ్రీ స్వామీజీ వారి **వాగావిష్కార విజయం.**

శ్రీ రక్తాక్షి కార్తీక కృష్ణ తృతీయ తదియ 1984 నవంబరు 11 వ తేది శ్రీ స్వామీజీ వారి **ఆశ్రమ స్వీకార విజయం.**

శ్రీ క్రోధి ఆశ్వయుజ కృష్ణ తృతీయ చవితి 1985 నవంబరు 14 వ తేది స్వామీజీ వారు స్థాపించిన ఆధ్యాత్మిక మాసపత్రిక ***గిరిధారి* ప్రసార విజయం.**

శ్రీ ప్రజాపతి మార్గశీర్ష శుక్ల షష్ఠి 1991 డిసెంబరు 12 వ తేది శ్రీ స్వామీజీ వారి **జ్ఞాన శతక్రతు విజయం.**

శ్రీ ఈశ్వర మార్గశీర్ష శుక్ల సప్తమి 1997 డిసెంబరు 6 వ తేది శ్రీ స్వామీజీ వారి **భాగ్యనగర - ఆశ్రమ ప్రవేశ విజయం.**

శ్రీ చిత్రభాను జ్యేష్ఠ శుక్ల నవమి 2002 జూన్ 19 వ తేది శ్రీ స్వామీజీ వారి **విశాఖ సాగర తీరాశ్రమ స్థాపన విజయం.**



శ్రీ విక్రృతి నామ చైత్ర శుక్ల అష్టమి 2010 మార్చి 23 వ తేది శ్రీ స్వామీజీ వారి **చైతన్య భగవద్గీతా గ్రంథావిష్కరణ విజయం.**

ఇంకా
ఆయుత పత్ర (10,000) **రచనాపూర్తి విజయం.**
పంచ సహస్ర (5,000) **ప్రవచనా పూర్తి విజయం.**
ద్విశతతమ (200) **జ్ఞానయజ్ఞ విజయం.**
ఇది శ్రీ సుందర చైతన్యానంద స్వామి **విజయానుభూతి.**

## అవతార విశేషం

1947 వ సంవత్సరం డిసెంబరు 25 వ తేదిన నెల్లూరు జిల్లా లోని కట్టుబడిపాళెం అనే గ్రామంలో బ్రహ్మముహూర్తమున వైష్ణవ కుటుంబంలో **శ్రీశ్రీశ్రీ స్వామి సుందర చైతన్యానందుల** వారు జన్మించారు. అది పరమాత్మ స్వరూపమైన మార్గశీర్ష మాసం. ఆ రోజే వైకుంఠ ఏకాదశి, గీతా జయంతి కలిసి రావడం విశేషం కాదు, వైభవం. సనాతన ధర్మ పునర్వైభవ ప్రాప్తికి సంకేతం.

శ్రీ పెరుంబుదూరు వేంకట శేషాచార్యులు, రంగనాయకమ్మ అను పుణ్య దంపతులకి శ్రీ స్వామీజీ అష్టమ గర్భ సంజాతులుగా జన్మించారు. స్వామీజీ పూర్వాశ్రమం పేరు శ్రీ సుందర రాజన్. స్వామీజీ పూర్వీకులు ద్రవిడ దేశము వారు. వీరి తాత గారు బాల్య దశలో ఆంధ్రదేశానికి వచ్చారు. చంగల్పట్టు జిల్లా లోని రామానుజాచార్యుల వారి జన్మస్థల మైన శ్రీ పెరుంబుదూరు వీరి స్వగ్రామము. స్వామి వారి తాతలు విద్వత్తు గల వారై గ్రంథ రచనలు చేశారు. దేవాలయార్చకులుగా, తోమాల సేవకులుగా, గాయకులుగా, భక్తి ప్రబంధ రచయితలుగా వన్నె కెక్కారు. కవిబ్రహ్మ తిక్కన, కవయిత్రి మొల్ల, జ్ఞానబ్రహ్మ సుందర చైతన్యులు-ఈ ముగ్గురు సింహపురి సీమలో విరబూసిన జ్ఞాన మందారా లని స్తుతిస్తూ నెల్లూరు పట్టణంలో 15-6-94 నుండి 24-6-94 వరకు పూజ్య స్వామీజీ నిర్వహించిన 118 వ జ్ఞానయజ్ఞంలో పూజ్య స్వామీజీకి కనకాభిషేకం చేసిన సందర్భంలో సింహపురీయులు సమర్పించిన పద్య మందారాలు.

కం॥ భారత సంహితఁ దెన్గున
సారమతుల్ పొగడ నుడివి జగతికి మేలున్
గూరిచిన, యజ్వతిక్కన
పొరుండీ సింహపురికి బ్రహ్మయు కవితన్॥



కం॥ మొల్లల జాజుల తావులు
వల్లవ మృదుశోభలొప్పఁ బల్కెను కావ్యం
బుల్లములు పల్లవింపగ
మొల్ల యనఘ సింహపురికి ముద్దుల పడుచై॥



కం॥ సుందరుడౌ చైతన్యా
నందుండాంధ్రమ్మునందు నాణ్యత మీరన్
పొందించి భాగవత సుధ
నందించెను సింహపురికి యశముం గూర్చెన్॥



శ్రీ స్వామీజీ బి.ఎ.లిట్ పట్టమును పొందారు. పూప వయస్సు నందే వేదాంత గ్రంథాలను రాత్రింబవళ్ళు అధ్యయనం చేశారు. చేతిలో వేదాంత గ్రంథం లేకుండా బాల్యంలో వారు ఎవ్వరికీ కనిపించి ఉండరు. నిత్యము నియమంతో ధ్యానం చేసే వారు. భక్తుల కోర్కె మేరకు యజ్ఞాలు ప్రారంభించారు. ప్రతి యజ్ఞంలో వేలాది సంఖ్యలో వచ్చి భక్తులు వారి ఉపన్యాసాలను ఆలకించే వారు, ఆలకిస్తూ ఉన్నారు. స్వామి వారిది అద్వైత మార్గము. ఆ విషయంలో రాజీ పడకుండా బోధిస్తారు. జ్ఞానమునకు భక్తిని సమన్వయం చేసి బోధించడం వారి ప్రత్యేకత.



సనాతన ధర్మ మహాసాగరంలో ఉత్తుంగ తరంగాలై ఎగసిన భక్తుల, మహాత్ముల గాథలు చదువుతూ 'ఇవి నిజాలా!' అని సందేహించే ఆధునిక యువతరానికి చక్కని సమాధానం చెబుతుంది స్వామి వారి సున్నిత హృదయం, అద్భుత జీవన విధానం.

## ఆధ్యాత్మిక స్ఫూర్తి - అఖండ కీర్తి

నలభై అయిదు సంవత్సరాల క్రితం మాట . . .

సత్య సందేశా లందించే సద్గ్రంథాలు అక్కడక్కడ లభించేవి. కాని అవి ఎక్కువ శాతం పండితుల బరువు పెంచడానికి మాత్రమే ఉపయోగ పడేవి. సమాజానికి వాటిని అందిద్దా మనే పుణ్యాత్ములు ఉన్నా, సామాన్యుని స్థాయిని గ్రహించ లేని కారణంగా అట్టి ఎందరివో ప్రయత్నాలు వ్యర్థంగా మిగిలి పోయాయి. అభివృద్ధి చెందిన విజ్ఞాన శాస్త్రం నూతన తరాన్ని వినూత్న సంశయాలలో ముంచెత్తింది. అర్థం లేని భౌతిక వాదం, జనులలో పెరిగిన అలసత్వం - అన్నీ కలిసి జీవితాన్ని శోభింప చేసే విజ్ఞాన మణులను వెదజల్లే వేదాంత శాస్త్రాన్ని కాలక్షేపం స్థాయికి దించాయి.



ఇవన్నీ పరిశీలించిన శ్రీ స్వామీజీ యువ హృదయం తీవ్రంగా స్పందించింది. జ్ఞాన ప్రకాశంలో రమించ వలసిన భారతదేశం 'దరిద్రులున్న సంపన్న దేశం'గా మిగలడం ఆ చిన్ని హృదయం భరించ లేక పోయింది. కుదురుగా, మెళకువతో, అద్వితీయ సామాజిక స్ఫూర్తితో, అవగాహనతో అక్కడ ఓ బృహద్యత్నానికి అంకురార్పణ జరిగింది. సామాన్యునికి, సత్యానికి మధ్య నున్న



అగాధాన్ని పూడ్చడానికి ఆ చిన్నారి చేతులు నడుం బిగించాయి. నేటి ఈ సుందర చైతన్య మహోద్యమాన్ని మన ముందుంచాయి. ఈ రోజు సమాజానికి ఏమి అందించాలి అన్న విషయంతో పాటు ఎలా అందించాలి అన్న విషయంలో సుస్పష్టమైన, సశాస్త్రీయ మైన అవగాహనతో ప్రారంభమై, అందుకు భగవత్కృపను తోడు చేసుకొని రేయింబవళ్ళు శ్రీ స్వామీజీ శ్రమించారు. ఇంతింతై ఎదిగి ఎదిగి గుండె గుండెను మీటుతూ, గడప గడపను తాకుతూ మహా ప్రవాహమై - దరి చేరిన వారిని పావనులను గావించే పుణ్యసలిలగా, మహోన్నత జ్ఞానగంగా ప్రవాహంగా నేడు **సుందర చైతన్యోద్యమం** రూపు దాల్చింది.

శ్రీ స్వామీజీ మాటల మధ్య మానవ జీవితానికి అర్థం చెబుతూ, పాటలలో తియ్యగా పరమార్థాన్ని విప్పి చూపుతూ, నిర్జీవ మవుతున్న సమాజానికి జీవిత పాఠాలను సహనంతో నేర్పుతూ 200 కు పైగా జ్ఞాన యజ్ఞాలను నిర్వహించి, తెలుగు లోను, ఆంగ్లం లోను 150 గ్రంథాలను రచించి, 200 సత్సంగ శాఖలను రాష్ట్ర మంతటా నెలకొల్పి, 22 మురళీ కృష్ణాలయాలను, ధ్యానమందిరాలను నిర్మించి, 'గిరిధారి' మాసపత్రిక ద్వారా, టి.వి. ద్వారా, ఆడియో, వీడియో సి.డి.ల ద్వారా ఆర్షవిద్యా వాణిని జనావళికి వినిపిస్తూ ఉన్నారు.

## ఆశ్రమ స్వీకారం

గత నలభై ఐదు సంవత్సరాలుగా పూజ్య స్వామీజీ ఆంధ్రావనికి అందించిన ఆధ్యాత్మిక సేవలు అనితర సాధ్యాలు. ఈ మహత్తర కార్యక్రమానికి కార్యక్షేత్రంగా 1984, మే 11 వ తేది ప్రథమంగా ధవళేశ్వరం సుందర చైతన్యాశ్రమం రూపు దిద్దుకుంది. తపోవనంలా, సుందర నందనోద్యాన వనంలా శోభించే ఆశ్రమం వేలాది సత్సంగీయులకు, భక్తులకు స్ఫూర్తి కేంద్రంగా దినదినాభివృద్ధి చెందింది. అద్భుత కళాఖండమైన ఈ ఆశ్రమం ప్రస్తుతం వానప్రస్థాశ్రమంగా అలరారుతోంది.

1997 డిసెంబరు 25 వ తేది అభినవ ఆనంద బృందావనంగా హైదరాబాద్ సుందర చైతన్యాశ్రమం



మహర్షి శ్రీ శుద్ధానంద భారతి, మాజీ రాష్ట్రపతి శ్రీ శంకర దయాళ శర్మ దంపతులతో పూజ్య స్వామీజీ

వెలసింది. దేశ విదేశాలలో ఆధ్యాత్మిక సేవ లందించేందుకు శ్రీ స్వామీజీ వారికి ఆశ్రమం ఒక పనిముట్టు అయింది. పచ్చని పొలాల మధ్య పదమూడు ఎకరాల స్థలంలో నిర్మింపబడిన ఈ సువిశాలమైన ఆశ్రమం భక్తుల పాలిటి కల్పవృక్షం. భక్తి భావ పరంపరలలో ముంచెత్తే 76 అడుగుల ఎత్తు గల మురళీకృష్ణ భగవానుని ఆలయం, నిరంతరం గురుదేవుల జ్ఞాన ప్రబోధాలతో ప్రతిధ్వనించే శ్రుతి మందిరం - ఈ రెండూ భక్తి జ్ఞాన సమ్మేళన మైన సుందర చైతన్య మహోద్యమానికి సంకేతాలు.

2002 జూన్ 19 వ తేదిన విశాఖ సాగర తీరంలో మూడవది అయిన సుందర చైతన్య ఆశ్రమం నెలకొల్ప బడింది.

## చైతన్య శంఖారావం

ఒక యుద్ధం రణరంగంలో ముగిసి ఉండ వచ్చు. కాని, అది పుట్టింది మాత్రం ఒక వ్యక్తి మనస్సు లోనే. మార్పు అనేది సంభవ మైతే అది సమాజంలో కాదు. వ్యక్తిలో. వ్యక్తి ఆలోచనా సరళి మారితే వ్యక్తి ప్రవర్తనలో పరివర్తన వస్తుంది. మనసు మారితేనే మనుగడ మారుతుంది. మనిషి మారితేనే సమాజం మారుతుంది.

**సుందర సత్సంగాలు :**

మాది గొప్ప అంటే మాది గొప్ప అంటూ అందించ బడే పలు రకాల సిద్ధాంతాలు, సందేశాలు, మాయలు, మహిమలు మనిషిని చుట్టు ముట్టి మభ్య పెడుతున్న ఈ గందరగోళ పరిస్థితులలో, 'అసలు ఇన్ని రకాల ఆలోచనల వెనుక ఉన్న ఆంతర్య మేమిటి? అది పుట్టిన దెక్కడి నుంచి? పయనిస్తున్నదే తీరానికి? ఇంతకీ మోక్ష మంటే ఏమిటి? దానికి మార్గ మేది? - ఇటువంటి సహజ, అనివార్య సంశయాలకు సహేతుకమైన సశాస్త్రీయ మైన సమాధానాలను అందిస్తూ, **విచారము - అనుభవము - ప్రచారము** - ఈ మూడింటిని లక్ష్యంగా కలిగిన సుందర సత్సంగాలను శ్రీ స్వామీజీ నలభై సంవత్సరాల క్రితమే రాష్ట్ర మంతటా నెలకొల్పారు. కుల తత్త్వాల నధిగమించి, 'నా కులం ఒక్కటే - సానుకూలం' అనే గురుదేవుని అడుగుజాడల్లో ఏకాత్మ భావంతో సత్సంగీయు లందరూ జీవిస్తున్నారు.

**చైతన్య మాతృమండలి :**

గృహలక్ష్మి గృహానికి మూల స్తంభం వంటిది. ఆ కల్పవల్లి నీడ లోనే గృహం సుఖశాంతులతో వర్ధిల్లు తుంది. బిడ్డలకు అమ్మ ఒడి ప్రథమ బడి. అవగాహన గల తల్లులు ఇంటిని శాంతి నిలయం చేయగలరన్న మహోన్నత ఆశయంతో ముందు మాతృమూర్తులను తీర్చి దిద్దే ప్రయత్నంలో శ్రీ స్వామీజీ అన్ని గ్రామాలలో, పట్టణాలలో 'చైతన్య మాతృమండలి' స్థాపించారు. నిత్యము స్వాధ్యాయంతో, సేవా కార్యక్రమాలతో చైతన్య మాతృమండలి ఆదర్శవంతంగా సమాజంలో శోభిస్తూ ఉంది.

**చైతన్య యువత :**

గోడ యొక్క గట్టిదనం ఇటుకల మీద ఆధారపడి ఉన్నట్లు, దేశం యొక్క స్థిరత, ఐక్యత, పురోగతి యువత మీద ఆధారపడి ఉంది అన్న ఉద్దేశ్యంతో 'చైతన్య యువత' విభాగాన్ని శ్రీ స్వామీజీ నెలకొల్పి యువతను క్రమశిక్షణతో, సంయమనముతో, ఆధ్యాత్మిక స్ఫూర్తితో ప్రగతి మార్గంలో నడుపుతూ ఉన్నారు. ప్రేమతో, సేవా భావంతో చరిస్తూ, వారు నమ్ముకున్న విలువల వైశిష్ట్యాన్ని, ఈ



మార్గంలో వారికి కలిగిన సంతృప్తిని అందరికీ అందించాలని పూర్ణ హృదయంతో ప్రయత్నించడమే కర్తవ్యంగా పెట్టుకొని, భావి తరాలకు ఆశాజ్యోతులుగా చైతన్య యువత వెల్గొందుతూ ఉంది.

**గిరిధారి :**

సర్వ వేదాంత సారంగా, సర్వ సమస్యలకు ఏకైక పరిష్కారంగా, అనుభవామృతాన్ని చక్కటి వ్యాసాల రూపంలో, కథల రూపంలో కవితల రూపంలో, ప్రశ్నోత్తర రూపంలో నింపి శ్రీ స్వామీజీ గత 25 సంవత్సరాలుగా ఆంధ్రావనికి మాసం మాసం అంది స్తున్న అమృత కలశమే గిరిధారి. 20,000 మంది జీవిత సభ్యులను కలిగిన గిరిధారి ఆధ్యాత్మిక మాస పత్రిక పాఠకులను నిత్యము చైతన్య వంతం చేస్తూ, ఆనంద తీరాలకు తరలిస్తూ ఉంది.



1985 లో 'గిరిధారి' మాసపత్రిక ప్రథమ సంచికను ఆవిష్కరిస్తున్న శ్రీ రంగనాథానంద స్వామి

## పశ్చిమంలో యతి పాదం

అమెరికా లోని భక్తుల ఆహ్వానాన్ని మన్నించి పూజ్య స్వామీజీ 1998 సెప్టెంబరులో ప్రథమంగా అమెరికా దేశం పర్యటించారు. సనాతన ధర్మ వైభవ కేతనాన్ని అమెరికాలో రెపరెప లాడించారు. చికాగో, డెట్రాయిట్, క్లీవ్‌లాండ్, ఓర్లాండో మొదలైన నగరాలలో జ్ఞానయజ్ఞాలను నిర్వహించి జనులను అమితంగా స్పందింప చేశారు. 'Chicago Audience get another Vivekananda-like saint to expound Advaita Vedanta.' 'Saint thrills Chicago Audience with mesmerizing philosophical discourses.' 'Advaita Vedanta delivered to the common man in simple, palatable terms' - అనే శీర్షికలతో దిన పత్రికలు పూజ్య స్వామీజీని శ్లాఘించాయి.

## అపురూప విజ్ఞాన వేది - అసమాన కవితా పయోనిధి

శ్రీ స్వామి వారు తమ దివ్య బోధలతో అలసిపోయిన జీవితాలలో ఆశాలతలను పూయిస్తున్నారు. అలుపెరుగని కంఠంతో మానవాళి అశాంతి తలుపులను మూయిస్తున్నారు. వారికున్న శ్రావ్యమైన గాత్రం, గాన గంధర్వ వైదుష్యం అసమానము, అనితర సాధ్యము. మైదానాలనే తరగతి గదులుగా మార్చి లోతైన ఉపనిషత్ రహస్యాలను శ్రోతల హృదయాలలో నిక్షిప్తం చేసిన ఖ్యాతి శ్రీ స్వామీజీది. వారి భాష, బాణి అద్భుతం. వారి గళం, కలం ఒక దానితో మరొకటి పోటీ పడుతూ ఉంటాయి. ఒక దాని నొకటి మించి పోవాలనుకుంటాయి.

వేదాంత సాహితీ ప్రపంచంలో, తాత్త్విక భావనా జగత్తులో పూజ్య స్వామీజీ అపురూప విజ్ఞాన వేది. అసమాన కవితా పయోనిధి. గహనమైన వేదాంత విషయాలను సాధారణ మానవులకు కూడా

అవలీలగా, అలవోకగా అందించే వారి అసాధారణ వైదుష్యం అనుపమానము, అద్భుతము. అసామాన్య పాండిత్యంతో, అద్భుత రచనా పటిమతో శతాధిక గ్రంథాలతో పాటు **చైతన్య భాగవతం, చైతన్య రామాయణం, చైతన్య మహాభారత** గ్రంథాలను ప్రసాదించిన శ్రీ సుందర చైతన్యానందుల వారు ఎప్పుడెప్పుడా అని ఆంధ్ర ప్రజానీకం ఎదురు చూసిన **చైతన్యభగవద్గీత** గ్రంథాన్ని వాసుదేవుని ప్రసాదంగా సహృదయ లోకానికి సమర్పించి సంతర్పణం చేశారు. వేదమాతకు నీరాజనాలు అర్పించారు.

## చైతన్య దీప్తి

జ్ఞానబ్రహ్మ, ఆర్షవిద్యా వాచస్పతి, సత్సంగ ప్రచారమణి, సనాతన ధర్మ దీపికాధారి అను పలు బిరుదములతో యోగి పుంగవులు పూజ్య స్వామీజీని సత్కరించగా, సువర్ణ కంఠాభరణాలతో, హస్త కంకణాలతో, సువర్ణ కిరీటాలతో, గండపెండేర పురస్కారాలతో, గజారోహణలతో, కనకాభిషేకాలతో వివిధ ప్రాంతాల లోని భక్తులు, అనేక సాంస్కృతిక, ఆధ్యాత్మిక సంస్థలు వీరిని సన్మానించాయి.

శ్రీ స్వామి వారిది ప్రచారోద్యమం. జన జాగరణోద్యమం. సమాజాన్ని చైతన్యవంతం చేసే సుందర సముద్యమం. ఆయన భారతీయ విజ్ఞాన సర్వస్వం. సనాతన ధర్మ పరిమళం. ఆర్ష సంస్కృతీ సభ్యతల భాండాగారం. ఇది ఆంధ్రుల భాగ్యం. శ్రీ స్వామి సుందర చైతన్యానందుల వారికి మనం సమకాలీనులం కావడం మన పురాకృత పుణ్యఫల విశేషం. శ్రీ స్వామి వారి అవిరళ కృషికి, త్యాగ జీవనానికి, జనులపై వారి కున్న అపార కృపకి ఆంధ్రావని భక్తి భావంతో, కృతజ్ఞతా భారంతో శిరమొడ్చి, కరములు జోడించి స్వామి వారి పాదపద్మాలకు నమస్కరిస్తూ ఉంది.



**కురుక్షేత్రంలో గీతాచార్యుడు బోధ చేసిన పవిత్ర పుణ్యస్థలిలో 'చైతన్య భగవద్గీత' రచనకు శ్రీకారం చుడుతున్న పూజ్య స్వామీజీ**

